# సాహిత్య వనములో తులసీ దళాలు

(మొదటి మాల)

సేకరణ :

ఎ. వి. సత్యనారాయణరాజు

# SAAHITYA VANAMLO TULASI DALAALU

Compiled by

A. V. SATYANARAYANA RAJU

1st Edition — 1974

Price Rs. 15-00

Printed by
A. NAGESWARA RAO
Saraswathi Power Press
Râjahmundry
Branch : Visakhapatnam

Associates: Vivekananda Printers
Hyderabad-



*Copies can be had from :*

PATAMSETTY RAJU
1st Cross Road, Prakasamnagar
Rajahmundry-3

# ఈ పుస్తకాన్ని గురించి

నేనొక సామాన్యుడను. కవినీ, పండితుడనీ, రచయితనూ కూడాకాను. ద్యోగము చేసుకుంటూ జీవించేవాణ్ని. సాహిత్యపఠనమంటే అభిలాష ఎక్కువ. హిందూ, క్రైస్తవ, మహమ్మదీయ గ్రంథాలనుంచి, పత్రికలనుంచి, శాస్త్రాల నుంచి, వ్యాసాలనుంచి నీతివాక్యాలు, విజ్ఞానవికాసములు కలిగించే వాక్యాలు, అందరికీ ఉపయోగించే యితరవిషయాలను సేకరణచేయడం జరిగింది. ఈవాక్యా లను అన్నింటిని పుస్తకరూపములో ప్రచురిద్దామని 1969 లో కోరిక కలిగింది. ఇది కేవలం భగవత్ప్రేరితమేనని నమ్ముచున్నాను. సేకరణ యింకాకొనసాగుతూనేవుంది. ముందుముందు వీలునుబట్టి అనేకభాగములుగా ప్రచురింప చేద్దామని ఉద్దేశ్యము.

నీతిదాయకమగు, విజ్ఞాన వికాసపూరితమగు ఈవాక్యాలను రచించిన మహా కవులకు, పండితులకు, రచయితలకు, అనువాదకులకు, ప్రచురణాధికారులకు, ఆ వాక్యాలను సేకరించి యిట్లు ఉపయోగించినందుకు వారికిక్షమాపణలుచెప్పుతూ వారికి నామనః పూర్వకమైన నమస్కారములు యిందుమూలముగా తెలుపుకుంటున్నాను.

ఈ నాకృషిలో ఏకారణము వల్లనైనా అనేకపొరపాట్లు దొర్లియుండవచ్చును. వాటినన్నిటిని పాఠకులు సహృదయముతో మన్నించుతారని ఆశించుచున్నాను. వ్రాతప్రతులను అక్కడక్కడా చదివిన మిత్రులు, హితైభిలాషులు, చాలచక్కగా వుందని, ఎంతోశ్రమపడి కృషిచేస్తేగాని యిటువంటి పనిజరగదని అభిప్రాయ పడ్డారు. కొంతమంది వాక్యాలను విషయంవారీగా సర్దివుంచితే బాగుండునని, ఆ వాక్యాలను రచించినవారి పేర్లనుకూడా వ్రాసినట్లయితే బావుండేదని అభిప్రాయము తెలిపిచ్చారు. ఈభాగాన్ని, ముందుముందు ప్రచురణ అయ్యేభాగాలను పూర్తిగా చదివినయెడల పైవిధంగా చేయడం, యిబ్బందికరమని, కష్టమని, పాఠకులు గ్రహించ గలుగుతారు. ఈవిధమైన రచన, అనగా "సేకరణ - కూర్పు" ఒకనూతన విధాలో వుండాలనికూడా నా ఆశయము.

వేరువేరు రూపములలో వున్ననూ, మానవులకు మోక్షమిప్పించి, భగవం తునిలో ఐక్యమగుటకై అనేకవిధాల మార్గములు చూపించిన, చూపించుతూవున్న, శ్రీకృష్ణపరమాత్మ, శ్రీజీసస్‌క్రీస్తు, శ్రీమొహమ్మద్‌రసూల్'' వారి పాదపద్మము లకు యీ నా కృషిని భక్తిపూర్వకముగా అంకితముగా సమర్పించుచున్నాను.

కాకినాడ

ఎ. వి. సత్యనారాయణరాజు

సాహిత్య వనములో తులసీదళాలు. ఇది అత్యంత శ్రద్ధాసక్తులతో చేయ బడిన గొప్ప ప్రయత్నములో తొలి ఘట్టము.

బహు మతములకు, బహు విజ్ఞానములకు, వైదిక లౌకికములకు, ప్రాచీ నాధు నాతనములకు చెందిన వేలకొలంది సూక్తి మ్ముక్తామణులకు ఈగ్రంథము మనోహరమైన మంజూష. ఈసూక్తి మధుబిందువులు ఒక చోటివికావు. ఒక పూవు లోనివి కావు. ఎక్క డెక్కడ నుండియో యేరితెచ్చి ప్రోవుచేసి పట్టుపెట్టి సుబోధ మగు భాషలో పదిమంది కందుబాటునకు వచ్చునటులు చేసిన సుకృతము సామాన్యముకాదు.

ఈ బృహత్సంకలన కార్యముతో వేలకొలంది చదువరుల కృతజ్ఞతలకు అర్హులగుచున్న శ్రీ ఎ. వి. సత్యనారాయణరాజుగారు చిత్తవృత్తిచే నిరాడంబరులు. వలసినంత భక్తిశక్తులకు నోంచినవారు. ఉద్యోగవృత్తిలో నుండి, యీపని యింత సంతనగా నిర్వహించుట అసాధ్యము.

విషయానుసారము విభాగము చేసి ప్రత్యేక శీర్షికలుంచి యీ సూక్తులు వెలువరించినచో పాఠకున కింతకంటె వైశద్యము గోచరించుననని యొక దశలో అనిపించునుగాని, నిస్సందేహముగా ఈగ్రంథము ఒక సూక్ష్మసూత్రముతో సందా నితమై గుణప్రవణమై రాజిల్లుచున్నది.

ఏపుట మొదలిడినను చదివించి తీరును. విసువు పుట్టింపదు. అవకాశము చాలనిచో ఒందు రెండు సూక్తులు చదివి తన్పు చెందవచ్చును. సూక్తి కొక పేరా. భాష వ్యవహార సుందరము. ఇట్టి గ్రంథములు జాతి సాధారణ్యమునకు చేతో వికాస హేతువులు.

గవర్నమెంటు ఉద్యోగస్థులకు సలహాలు, భారతదేశ రాజ్యాంగపు ముఖ్యా శయములు, దేశభక్తి, మున్నగాం గొన్నివిషయములు సూక్తులుగా గ్రంథాదియం దున్నవి. ఇది మొదటిమాల. మఱికొన్ని మాలలు రావలసి యున్నవి. శ్రమ సాధ్య మైన యీ పెద్ద సంకలనము చేసిన శ్రీసత్యనారాయణరాజుగారి దీక్ష సుకృతములు శ్లాఘాపాత్రములు. ఈగ్రంథము 377 పుటలో ఒక సూక్తి.

"రచన గొప్పదైతే వికాసం జాతికి. తత్కర్తకుకాదు.
రచన చెడ్డదైతే నష్టం జాతికే. అది కర్తకుకాదు."

రాజమండ్రి
10-2-74

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

"సాహిత్యవనములో తులసీదళాలు" అక్కడక్కడ చదివిచూచాను. ఆసక్తికరమైన మంచి సంకలన గ్రంథం. ఏరినసూక్తులన్నీ వాడుకభాషలో సుగమంగా హృదయరంజకంగా ఉండడంవల్ల ఈ గ్రంథం బహుళప్రచారానికి వస్తుందని ఆశిస్తున్నాను.

ఈ దళాలు ఎక్కడెక్కణ్ణుంచో సంపాదించి చేర్చడంలో శ్రీ ఎ. వి. సత్యనారాయణరాజుగారు చేసిన కృషి ఎంతో ప్రశంసార్హమై ఉంది. ఇది మొదటి మాల. ఇంకా ఇట్టిమాలలు వెలువడాలనీ, తెలుగుతల్లి మెడలో అవన్నీ వాడని పూల మాలలుగా రాణించి పరిమళించాలని కాంక్షిస్తున్నాను.

అద్దేపల్లి వివేకానందదేవి

ధన్యమైన పుణ్యభూమి అనిపించుకునే
అర్హత ఏ భూమికైనా ఉంటే,
కర్మాను భవానికి ఈ ప్రపంచమందలి
ఆత్మలు అవతరించ వలసిన భూమి అంటూ ఏదైనా ఉంటే,
దైవోన్ముఖమై వెళుతున్న ప్రతి ఆత్మకు
అంతి మాశ్రయమగు భూమి అనేది ఒకటి ఉంటే,
మహోన్నతమైన సౌజన్యం, ఔదార్యం,
పావనత, ప్రశాంతత – అన్నిటికిమించి
ఆధ్యాత్మిక, అంతర్వీక్షణాలను
మానవాళికి అందించిన మహత్తర
మైన భూమి అనేది ఈ విశ్వంలో ఒకటి ఉంటే,
అది భారత భూమి యని గుర్తించండి.

ఏ వాతా వరణంలో చిత్తము భయరహిత మౌవుతుందో,
ఎచ్చట తలఎత్తి తిరగడానికి సంకోచము ఉండదో
ఏస్థానంలో జ్ఞాన సంపాదనా మార్గంలో అవరోధాలుండవో,
ఎక్కడ సంకుచిత ప్రవర్తన మందున కైనలేదో,
ఎక్కడ శుద్ధ సత్యము తప్ప, యితర శబ్దము నోటినుంచి వెలువడదో,
ఎక్కడ పరిపూర్ణతను పొందడానికి విశ్రాంతి యెరుగని
క్రియాశక్తి ఎల్లప్పుడు మన చేతులను ముందుకు చాచునట్లు చేస్తుందో,
ఎక్కడ నిర్మల విచక్షణా స్రవంతి, పాడుపడిన ఆచారాల
భయంకర మరు భూమిలో ఇంకిపోదో,
ఎక్కడ నివసించే ప్రజల మనస్సులు ఎల్లప్పుడు
విస్తరించే భావాలవైపుకు, ప్రయత్నాల వెనకు మొగ్గుతాయో
అటువంటి స్వతంత్ర దివ్యలోకములోనికి మనప్రియ
భారతదేశము పయనించాలి.

హిందువులు వారి మతగ్రంథములో రూపొందించిన ఈ క్రింది ప్రధాన సూత్రములను పాటించవలెను.

1. మనో వాక్కాయల కర్మలచే నితరులకు హాని కలిగించకూడదు - అహింస.
2. మనోవాక్కాయ కర్మలయందు ఒక విధముగనే వర్తింప వలయును - సత్యము.
3. ఇతరుల వస్తువుల నపహరింపకూడదు, కోరకూడదు - అస్తేయము.
4. ఆలోచనమున, మాటలయందు, చేష్టలయందు పవిత్రతను పాటించవలెను - బ్రహ్మచర్యము.
5. శరీరధారణమునకు అత్యంత మావశ్యకమయిన దానిని తప్ప మరి దేనిని ఇతరుల వలన స్వీకరింప కూడదు - అపరిగ్రహము.
6. పరిశుద్ధి, పరిశుభ్రత పాటింపవలయును - శౌచము.
7. సంతృప్తి, లోభము లేకుండుట, ఆహ్లాద పరత్వము-సంతోషము.
8. సేవాభావమున వాక్కును, మనస్సును నిగ్రహించ వలయును - తపస్సు.
9. పవిత్ర గ్రంథములను పఠించుట, మంత్రజపము, ప్రార్థన చేయ వలెను - స్వాధ్యాయము.
10. కర్మఫలములను తన సర్వస్వమును సహితము పరమేశ్వరార్పణము గావించ వలయును. — ఈశ్వర ప్రణిధానము.

ఏసుక్రీస్తు బోధించిన ఈ క్రింది పురస్కరించిన పది యాజ్ఞలను ప్రతి క్రైస్తవుడు పాటించవలెను.

1. నేను తప్ప వేరొక దేవుడు నీ కుండకూడదు.

2. పైనున్న ఆకాశమందేగాని క్రిందనున్న భూమి యందేగాని భూమి క్రిందనున్న నీళ్ళయందేగాని యుండు దేని పోలిక గలిగిన విగ్రహమునైనను చేసికొన కూడదు. వాటికి నమస్కరించ కూడదు. వాటినిపూజింప కూడదు.

3. నీ దేవుడైన యెహోవా నామమును వ్యర్థముగా ఉచ్చరించ కూడదు. యెహోవా తన నామమును వ్యర్థముగా ఉచ్చరించు వానిని నిర్దోషిగా యెంచడు.

4. నీదేవుడైన యెహోవా నీకాజ్ఞాపించినట్లు విశ్రాంతి దినమున పరి శుద్ధ దినముగా ఆచరించుము. ఆరు దినములు నీవు కష్టపడి నీపనియంతయు చేయవలెను. ఏడవ దినమున నీదేవుడైన యెహోవాకు విశ్రాంతి దినము.

5. నీదేవుడైన యెహోవా నీ కనుగ్రహించు దేశములో నీవు దీర్ఘాయు ష్మంతుడవై నీకు క్షేమ మగునట్లు నీదేవుడైన యెహోవా నీ కాజ్ఞాపించినలాగున నీ తండ్రిని, నీతల్లిని సన్మానింపుము.

6. నరహత్య చేయకూడదు.

7. వ్యభిచరింపకూడదు.

8. దొంగిలించకూడదు.

9. నీ పొరుగువాని మీద అబద్ధ సాక్ష్యము పలుక కూడదు.

10. నీ పొరుగువాని భార్యను ఆశించకూడదు. నీ పొరుగువాని యింటినైనను, వాని పొలమునైనను, వాని దాసుని నైనను, వాని దాసినినైనను, వానియెద్దునైనను గాని, గాడిదనైనను నీపొరుగు వాని దగు మరిదేనినైనను ఆశింపకూడదు.

మహమ్మదీయుల మత గ్రంథము ఖురాను ప్రకారము ఈ అయిదు ధర్మములు పునాదివంటివి.

మహమ్మదీయులు ఆచరించవలసినవి.

1. విశ్వాసము. దానినే ఈమాన్ అందురు. అది కలిమా అను వాక్యమును మనఃపూర్వకముగా విశ్వసించిదాని భావమును గ్రహించి దానిని వాక్కులో నుచ్చరించి ఖరారు చేయుట.

2. ప్రతిదినము అయిదు పూటలు నమాజు (ప్రార్థన) చేయుట.

3. జకాతు (విధి విధానము) నొసంగుట.

4. రమజాను నెల పూర్తిగా పుపవాసములు (రోజా) వుండుట.

5. కాబామసీదు యాత్ర (హజ్) చేయుట.

"మనము ఒకరిలో చేరవలయుననిన ఎట్లు వారు చేయు పనులలో పాలుగొని వాని కనుగుణ్యముగా సంచరించెదమో, యారీతినే భగవంతునిలో చేరదలచిన మనము భగవంతుడు చేయుపనులలో పాలుగొని అది భగవంతుని కార్యముగాను, దాని ఫలితము భగవంతునిదిగాను తలచి చేయవలయును. దానికి ఒక మార్గముకాదు. అనేక మార్గములు. భిన్న భిన్నమతము లన్నియు యిందు కొరకే యేర్పడినవి. అన్ని మతముల యొక్క యుద్దేశము భగవంతునిలో చేరుటయే."

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచు మన్నా
వొట్టిమాటలు కట్టి పెట్టోయ్
గట్టిమేల్ తల పెట్టవోయ్.

యీసురోమని మనుష్యులుంటే
దేశమేగతి బాగుపడునోయ్
జల్దు కొని కళ వెల్ల నేర్చుకు
దేశి సరుకులు నించవోయ్.

దేశాభిమానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని ఏదైనాను ఒక మేల్
కూర్చి జనులకు చూపవోయ్.

స్వంత లాభం కొంతమానుకు
పొరుగువారికి తోడు పడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుష్యులోయ్.

చెట్టా పట్టాల్ పట్టుకొని దే
శస్థులంతా నడువ వలెనోయ్
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్.

దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూవెత్త వలెనోయ్
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండ వలెనోయ్.

ఏ దేశ మేగినా ఎందుగాలిడిన
ఏ పీఠ మెక్కినా ఎవరెదు రయిన

పొగడరా నీతల్లి భారతిని
నిలుపరా నీ జాతి నిందుగర్వమ్ము
లేదురా యిటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి ధీరులింకెందు.

ఏ పూర్వ పుణ్యమో యోగబలమొ
జనియించినాడ యీ స్వర్గలోకమున
ఏమంచి పూవులన్ ప్రేమించినావో
నిను మోచె నీ తల్లి కనక గర్భమున.

సూర్యుని వెలుతురు సోకునందాక
ఓడల జెండాలు ఆడునందాక
నరుడు ప్రాణాలతో నడుచు నందాక
అందాక గల యీ అనంత భూతలిని
మన భూమి వంటి కమ్మని భూమి లేదు.

పొగడరా! నీతల్లి భారతిని
నిలుపరా! నీ జాతి నిందు గర్వమ్ము.

మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది
పదండి ముందుకు
పదండి త్రోసుకు
పోదాం పోదాం పైపైకి.

కదం త్రొక్కుతూ
పదం పాడుతూ
హృదాంతరాళం గర్జిస్తూ
పదండి పోదాం వినబడలేదా
మరో ప్రపంచపు జలపాతం

నదీ నదాలూ అడవులు కొండలు
ఎడారులా మన కడ్డంకి
పదండి ముందుకు పదండి త్రోసుకు
పోదాం పోదాం పైపైకి.

## గవర్నమెంటు ఉద్యోగస్థులకు సలహాలు

1. మనకిచ్చిన పది నిముషముల వ్యవధిని వుపయోగింపకుండగనె, ఖచ్చితముగ సకాలమున ఉదయం 10-30 గం.లకు పని మొదలు పెట్టవలెను.

2. ఒక గంట ఆలశ్యముగ వచ్చుటకు నెలకు రెండు సార్లు అను మతులకు అర్హత వున్నా వాటి దరి కెన్నడూ పోవద్దు !

3. నియమిత భోజన విశ్రాంతి సమయమును అధిగమించకుండా పాటింప వలయును.

4. నిర్ణీతపు ఆఫీసు పనివేళలయందు కార్యాలయమున కాలము వృధాచేయుట మానవలెను.

5. మన పనిని అతిత్వరితముగా నిర్వర్తించుటకు అత్యంతాశక్తితో మన శక్తిని అర్పింపవలయును.

6. అందరూ కలసి కష్టించి విజయము సాధించెడు సంఘీభావమును ఒకరి కొకరము చెందెద మనెడు పరస్పర సాన్నిహిత్యము కార్యాలయములలో కలదనెడు భావమును కలుగ జేయుటకు తీవ్ర కృషిని చేయవలయును.

# భారత దేశ రాజ్యాంగపు ముఖ్యాశయములు

## న్యాయము

భారత పౌరులందరకును, సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయము కలిగించుట.

## స్వేచ్ఛ

భావ ప్రకటనలోను, మత విశ్వాసములలోను, మతాచరణలోను ప్రతి పౌరునకు స్వేచ్ఛ కలిగించుట.

## సమత్వము

జీవితమునందు, ప్రతి ప్రవృత్తిలోను, అవకాశములలోను, భారత పౌరులందరకును సమానత్వము కలిగించుట.

## సౌభ్రాత్రము

ప్రతి వ్యక్తియు తగిన గౌరవము ననుభవించుచు, జాతి మర్యాద కాపాడుటకై పౌరులతో సౌభ్రాతృత్వము (సోదర భావము) వృద్ధి చేయుట.

# ప్రాథమిక హక్కులు

## సమానత్వము

శాసన దృష్ట్యా పౌరులందరును సమానులేగాన, చట్టములు అమలు జరుపుటలోను, బీదసాద, గొప్ప కొద్ది అను భేదము పాటింపరాదు. వర్ణ, కుల, జాతి, స్త్రీ పురుష భేదములను

బట్టి ఏ విషయములోను, పౌరులయెడల విచక్షణ చూపరాదు. ఉద్యోగము లిచ్చుటలో పైన చెప్పిన భేదములు పాటింపరాదు. బహిరంగస్థలములు వాడుకొనుటలో ఎవరికిని, ఎట్టి ఆటంకము లుండరాదు. అస్పృశ్యతను పాటింపరాదు. బిరుదులు ఇచ్చు పద్ధతి రద్దుగావలెను. వయోజను లందరకును వోటునిచ్చు హక్కు ఉండును. ఇందువలన పౌరులందరును ప్రభుత్వ నిర్వహణమున పాల్గొనుట కవకాశము గలదు.

## స్వేచ్ఛ హక్కు

ప్రతి పౌరునకును తన అభిప్రాయము ప్రకటించుటకును, సమావేశములు జరుపుటకును, రాజ్యములో సంచరించుటకును, తమ ఆస్తిని వినియోగించుటకును ఏ వృత్తినైనను, వ్యాపారమునైనను అవలంబించుటలోను స్వాతంత్ర్యముగలదు. కాని యీ హక్కు నిరాటంకమైనది కాదు. ప్రజాశాంతికి అవసరమని తోచినచో ప్రభుత్వము, ఈ హక్కు విషయమై జోక్యము కలిగించుకొనవచ్చును.

## అక్రమలాభ నిషేధపు హక్కు

వెట్టిచాకిరీ, పదునాలుగేండ్లలోపు పిల్లలను ఫ్యాక్టరీలలో పని చేయించుట మున్నగు పనులు ఎవరును చేయకుండ ప్రభు సంరక్షణ బొందుటకు హక్కుగలదు.

## మత స్వేచ్ఛ హక్కు

ఎవరి యిష్టాను సారము వారు మతాచరణ అవలంబించుటకు హక్కుగలదు. ప్రభుత్వపాఠశాలలో మత విద్య బోధింపరాదు.

మత విషయమైన పన్ను విధింపరాదు. హిందూ దేవాలయములో హిందువు లెల్లరు నిరాటంకముగా ప్రవేశింప వచ్చును.

## విద్యా స్వేచ్ఛ

ప్రభుత్వ కళాశాలలో ప్రవేశించుటకు జాతి, మత, కుల, స్త్రీ పురుష భేదములు పాటింపరాదు. అల్ప సంఖ్యాకుల సంస్కృతి రక్షణ అవకాశముండవలెను.

## రాజ్యాంగపు హామీల హక్కు

పైన పేర్కొన బడిన హక్కులకు భంగము కలిగినచో ఏ పౌరుడైనను న్యాయస్థానము ద్వారా తన హక్కులు సంరక్షించు కొనుటకు హక్కుగలదు.

భారతీయత అంటే - సమరసత్వం, సహనసం.

భారతీయత అంటే - న్యాయం, ధర్మం.

భారతీయత అంటే - శక్తి, సచ్ఛీలం.

యావద్దేశానికి విస్తరించిన దృష్టి భారతీయత.

ప్రాంత, వర్ణ, వర్గ, భావాలకు అతీతమైనది భారతీయత.

ఈ దేశపు కణకణాన్ని పరమ పవిత్రంగా భావించడం భారతీయత.

అణువణువును రక్షించుకొనడానికి సర్వస్వాన్ని అర్పించేందుకు సిద్ధపడడం భారతీయత.

ఈ దేశము సమగ్రతకు, ఈ జాతి సంక్షేమానికి క్షణక్షణము వినియోగించడం భారతీయత. కణకణము అంకితం చేయడం భారతీయత.

నాజీవనము, నామరణము అన్నీ ఈ దేశానికి, ఈ దేశ సమగ్రతకు,

సుఖశాంతులకు అని మనసార భావించడం భారతీయత.

విద్యనేర్చినా - విద్యనేర్పినా

శ్రమచేసినా, శ్రమచేయించినా

రాజకీయం నెరపినా, నెరపించినా

ఆర్థిక యోజనాలు వేసినా, వేయించినా

ఉత్పత్తి చేసినా, వినియోగించినా

అన్నింటా ఆ సమసత్వం, ఆ సహనం, ఆ న్యాయం

ఆ ధర్మం, ఆ శక్తి, ఆ సచ్ఛీలం ప్రతిబింబించడం భారతీయత.

దానిని సాధించడం భారతీయ కరణం
ఏమిటిందులో ఘోరం ? ఏమిటిందులో నేరం ?
ఏమిటి ఈసమరం ? ఎవరిపైన ఈ సమరం ?
అర్థంలేని దీసమరం. అయినా సాగుతోంది. ఈ సమరంలో
లొంగిపోయి సర్వనాశనానికి తావీయాలా ? లేక కృష్ణ
పరమాత్మలా నిలిచి శాంతిని, సుఖాన్ని కాపాడుకోవాలా ?
మనం వెలిగించే అఖండ దీపమే మనకు సమాధానం.

# దేశభక్తి అంటే

మనం ఏ భూమిలో, ఏ సమాజంలో జన్మించామో, ఆ భూమి యెడ, ఆ సమాజం యెడగల ఆత్మీయత మమత.

దేశభక్తి అంటే - మనం యే సమాజంలో జన్మించామో ఆ సమాజంయొక్క సంస్కృతియెడ సంప్రదాయములయెడ ప్రేమాభిమానములు పెల్లుబకడం.

దేశభక్తి అంటే - మన సమాజంయొక్క అభ్యున్నతికై, వికాసానికై, సర్వస్వార్పణకు స్ఫూర్తినిచ్చే ప్రేరణాశక్తి.

దేశభక్తి అంటే - మనం వికసింప జేసుకున్న జీవనమూల్యముల యెడ ఏకాగ్ర నిష్ఠ.

దేశభక్తి అంటే - వ్యక్తి నిరపేక్షము, సమిష్టి నిష్ఠము నయిన జీవనంయొక్క గంగా ప్రవాహం.

దేశభక్తి అంటే - భోగలాలసలన్నింటినీ ఛేదించి మాతృవాత్సల్యంతో సమాజాన్ని చూచే జీవనదృష్టి.

దేశభక్తి అంటే - వ్యక్తిగతమైన ఆశలను, ఆకాంక్షలనూ, అన్నింటినీ సమాజంయొక్క చరణాలపై సమర్పించి, తన యావచ్ఛక్తినీ కేవలం సమాజసేవకు అంకితంచేసే కర్తవ్య కఠోరత.

దేశభక్తి అంటే - మాతృభూమి చరణములపై సమర్పితమైన అనన్యము, నిస్వార్థము, కఠోరము నయిన జీవన కుసుమముల సుగంధం.

దేశభక్తి అంటే - సమాజ బ్రహ్మయొక్క నాభినుండి వెలువడిన కమలం.

దేశభక్తి అంటే - సంపూర్ణ సమాజంలోని ఏకోదర భావనల యొక్క ఆవిష్కరణ.

---

మనుగడకు ప్రధాన ధ్యేయమే సుఖం.

వంట అభివృద్ధి చెందినప్పటినుంచి, మానవజాతి తనకు సహజంగా అవసరమయినదానికంటె రెట్టింపు ఆహారం తీసుకుంటున్నది.

సుందరము, సుగంధయుక్తము అయిన పుష్పము ప్రయోజనకారి అయినట్లుగా త్రికరణ సుద్ధిగలవారి సుభాషితము సఫలీకృతమగును.

జీవితం నీటిలో చపలంగా మెరిసే చంద్రబింబము వంటిది. అది తెలుసుకుని ఎల్లప్పుడూ శుభప్రదమైన కార్యాలే ఆచరించాలి.

బంధువులు అన్నవారు తమవారి అవసరాలకు ఆదుకుంటూ వుండాలి.

నిద్ర, సంపద, ఆరోగ్యంవంటి సుఖాలకు అంతరాయాలు కలిగిన తరువాతగాని వాటిని పూర్తిగా, నిజంగా అనుభవించటం అసాధ్యం.

సాహసకృత్యముల సుగంధ పరిమళమే యశస్సు.

భగవంతునిపట్ల, స్త్రీ పట్ల నమ్మకం కోల్పోవడమే ఆత్మకు సంభవించే విషాదాంశం.

సత్కవియొక్క శబ్ద సౌభాగ్యమును సత్కవియే ఎరుంగును. ఇతరు లెరుగరు. ఉత్కృష్టమయిన చూలాలి తనంపు సౌభాగ్యమును గొడ్రాలు ఎరుంగదు. ప్రజలభాష ముడిసరుకు లాంటిది. సాహిత్యపు భాష పండితులు పదును పట్టినభాష.

ప్రపంచమంతటిలోను వేలకొలది మంది బైబిలు చదువుటద్వారా, వినుట ద్వారా మార్పునొందిరి. ఘోరపాపులు మిక్కిలి పరిశుద్ధులుగా మార్చబడిరి. అంధకార మయమయిన జీవితములు ఆనందదాయక మైనవిగా మారిపోయినవి.

నీయర్థములను దొంగిలించువాడు దొంగ. కాని నీయర్థమందలి స్వార్థాభిమానమును దొంగిలించునాతడు గురువు.

మనం ఎవరినిచూచి చిరునవ్వు నవ్వలేమో వారిని ప్రేమించనూ లేము.

వధూవరుల ఎన్నికలలో ఆధ్యాత్మిక సంపదకు ప్రథమస్థానం యివ్వాలి. తరువాత సేవాశక్తికి రెండవస్థానం. కుటుంబ వ్యవహారాలు, సాంఘిక శ్రేయస్సులకు మూడవస్థానం. పరస్పరాకర్షణ 'ప్రేమ' లకు చతుర్థ స్థానం యివ్వాలి.

తనదాకా వస్తేనేకాని తెలియదు.

చెడ్డవాడు తన మిత్రులకు చూపే దయకంటె ఎక్కువజాలిని మంచివాడు తన శత్రువు పట్ల చూపుతాడు.

మనుష్యుల కష్టాల్ని మరపింపచేసే అమృతం కన్నీరు. దేవుడు మహానుభావుడు. కనుక అతనిని తెలుసుకుందుకు ప్రయత్నిస్తారు. దేవుడు మంచివాడు. కనుక కనిపిస్తాడు.

కొందరు మనుష్యులు ఎన్నివున్నా సుఖపడటానికి ఎంత అవకాశమువున్నా ఎప్పుడూ కారిపోతూవుంటారు. మరికొందరు ఏమి

లేకపోయినా, ఎటుచూసినా కష్టాలే గూడు కట్టి కనిపించినా ఎప్పుడూ మహోల్లాసంగా తేలిపోతూ వుంటారు.

క్షమ, యింద్రియ నిగ్రహం, ప్రేమ, సత్యవచనాలు, ఋజువర్తనం, వినయం, సేవ వీటిచేతనే సమస్తలోకం వశ మవుతున్నది.

మృత్యువు గురించి నేను తరుచుగా ఆలోచించినా మనిషికి జరుగగల అన్ని అరిష్టాలకన్న అది మంచిదని భావించాను.

తన ఆకలి తనను బాధించుగాని యితరులను బాధించదు. అదేవిధముగా ఎవరుచేసిన పాపములకు వారు తగిన బాధలు పొందక తప్పదు.

స్త్రీ ఆత్మ ప్రేమతో జీవిస్తుంది.

భగవద్గీతా శాస్త్రము వలననే భారత ధర్మము వివిధ దేశములందు నుగ్గడింపబడుచున్నది.

తను మాట్లాడే విషయంగురించి ఏమీ తెలియనివాడే మహా స్వేచ్ఛగా మాట్లాడగలడు.

మనగృహాల్ని అందంగా, అత్యాధునికంగా వుంచుకోవాలంటే కేవలం ఖరీదైన ఫర్నిచరే ఎక్కువగా కొనక్కరలేదు. మామూలుగానే అలంకరణలో రెండు:రకాలున్నాయి. ఒకటి: క్లుప్తంగాను, నిరాడంబరముగానూ, రెండు: ఆడంబరముగానూ, ఏవిధముగానైనా అలంకరించుకోవచ్చు గృహాల్ని. అయితే శుభ్రత, ఒబ్బిడితనం ముఖ్యం.

ఈ దయాపరుల్లో ఎంత క్రూరత్వం దాక్కుని వుందంటారు ? మృగాల బదులు మనుష్యుల్ని, ధనాన్ని, పదవుల్ని వేటాడు తున్నారు.

సకలసుగుణ సంపన్నుడంటారే ఆ వింతమృగం సృష్టిలో వుండ డానికి వీలులేదు.

విమర్శనలేనిది వివేకోదయ ముండదు.

డబ్బువున్న రోజున పొదుపుచేసి లేనిరోజున దానినే జాగ్రత్తగా వాడుకోవడం యింటికి, వంటికీ, దేశానికీ చాలా లాభదాయకము.

. రాజు దుష్టుడయినా పరివారం యోగ్యులైతే సేవించవచ్చు. రాజు ఎంత మంచివాడైనా చుట్టూవున్నవారు దుష్టులైతే విష సర్పాలు చుట్టుకున్న చందన వృక్షంలా రాజు సమీపించరాని వాడై వుంటాడు.

ఎంత గొప్పకారణమున్నా మానవులు ఒండొరులను ద్వేషించు కోవడం మహాపాపం.

చెలిమి కలిమి అమూల్యమైనది. పొందగోరినట్లయితే వేగిర పడకు. కాని పొందుచూ వున్నట్లయితే నిబ్బరంగానూ నిశ్చలంగానూ వుండు.

వయసును గురించి కంగారుపడటం తెలివితక్కువ. నావయ స్సొక ఏడాది పెరిగిందంటే - నాతోపాటు అందరి వయస్సూ ఏడాది పెరిగిందిగదా !

మోయారానంత బరువు మోస్తున్నపుడో, పడరానంత కష్టం పడుతున్నపుడో కొద్దికాలం అయినా ఎక్కువకాలంవలె తోస్తుంది.

మంచి మానవులు యిద్దరే యిద్దరు. ఒకడు గిట్టినవాడు. మరొకడు పుట్టనివాడు.

పూర్తిగా పతనమయిన వాళ్ళలోనే దేముడు కాపురం చేస్తాడు.

భూమిలో ఏబీజములు నాటెదమో ఆబీజముల ఫలములనే పొందు చున్నాము. అదేవిధముగ మనస్సనే భూమిలో దుష్టకృత్యములనే బీజములు నాటిన బాధలనే ఫలములను పొందుట ఖాయము. ఉపకారము లనే బీజములు నాటిన సౌఖ్యములనే ఫలములను అనుభవించుట ఖాయము.

సత్యం అనేది కల్తీలేకుండా అసలు లభించదు.

చాలామంది ఈ ప్రపంచములో ఏదైనా సంఘటన జరిగినపుడు తత్ఫలితముగా తెలియని ఆవేదనా ఆవేశంలో మునిగి, కొంతకాలానికి మామూలుస్థితికి దిగజారి, తమ మనోభావాలను మళ్ళీ ప్రపంచపు నడకతో సరి చేసుకుంటారు. రైలు పట్టాలుమీద బండిలా నడిచి పోతారు. కాని కొందరు ఆలోచనలకు ఆచారాలకి ఓరూపాన్నిచ్చి మానవజాతి పురోగమనానికి ఓ సందేశం అందించి ప్రపంచాన్ని మరమ్మత్తు చేయ గలుగుతారు. వాళ్ళు ఈ అనంత విశ్వంలో ప్రకాశిస్తూ కీర్తి శేషులై వుంటారు.

తిండిదాసు లెవరూ సాధారణంగా భగవంతుని కొలవరు.

ఒకవ్యక్తిపై మనకు వుండవలసిన అపేక్షకు హద్దు మనము మనస్సులో నియమించుకున్నదే ! నిజానికి అపేక్షకు హద్దులేదు. కాని అపేక్ష ప్రకటించడానికి మాత్రం హద్దువుంది. కావలసినంతహద్దు, లోకాచారము, సంఘ మర్యాద, సంస్కారపు కట్టుబాట్లు, ఈ హద్దును నియమించుతాయి. మన అపేక్ష పెద్ద కెరటంలా విరుచుకుపడకుండా చెలియలి కట్టులా కాపాడుతాయి. అపేక్షకుహద్దులేదు. ఆ అపేక్షను పైకి చూపటానికి మాత్రం ప్రస్ఫుటమైన హద్దువున్నది. ఆ హద్దు మీరితే తలనొప్పికడుతుంది.

తగిన పారితోషికము దొరకని పనిని చేయడంకంటె ఆ పనిని చేయకుండా వుండడమే మంచిది.

ప్రారబ్ధము ననుభవించు వాడైనను, భగవద్గీతా శాస్త్రమును నిరంతరము నభ్యాసము గావించెడివాడు ముక్తుండును, సుఖియుడై లోకములో కర్మబద్ధుడుగాక యుండును.

ప్రేమకు త్యాగమే ఆలంబనమైనట్టు హాస్యానికి ఆవేదన అవసర మవుతుంది.

చందనము, అగరు, కమలము మొదలయిన సుగంధములన్నిటికంటె సదాచార సుగంధము మిక్కిలి శ్రేష్టము.

తీసిన వస్తువు మరల పెట్టేటపుడు ఎక్కడనుంచి తీసామో అక్కడే పెట్టాలి. వస్తువులను ఒకేపద్ధతిలో పెట్టుకోవాలి. దాని వలన సమయం కలిసి వస్తుంది. పని సులభంగా, చిరాకులేకుండా అవుతుంది.

భగవంతునికి శత్రువులైననాడు, ఎవరూ మనిషికి నిజమైన మిత్రుడు కాడు.

ప్రకృతిపట్ల సానుభూతి చూపడం సత్పురుషుల మతంలో ఒక అంశం.

నిజమైన ఆత్మతత్వమే భగవంతుడు.

దుఃఖపూరితునకు ఆశ కంటె దివ్యౌషధంలేదు.

జీవితంలో దెబ్బలాడి సాధించలేనిది మైకంలో సాధించవచ్చునంటారు.

జీవిత వ్యాపారంలో దయార్ద్రహృదయాలు కావడం ఒక అమూల్యాంశం.

సామెతలు, నానుడులు, గ్రామీణ ప్రజలు సాంఘికంగా, చారిత్రకంగా పొందిన అనుభవాల క్రోడీకరిస్తోంది.

పాచికలతో వేసే పందాలన్నింటిలో పరమోత్కృష్టమైనది పాచికలను పారవేయడం.

మనిషి అవసరానికి గడ్డితింటాడు. కడుపునిండి ఆకలి తీరిన తరువాత ఆగడ్డినే అసహ్యించుకొంటాడు.

సత్యము నెరుగనిదే ప్రేమలేదు. సత్య సాక్షాత్కారమునకు ప్రేమ, మంత్రి రెండూ ఒకటే.

క్రిందటి జన్మలో చేసిన పాప పుణ్యములకు తగిన కష్టసుఖములు యీజన్మలో అనుభవించు చున్నాము. ఈ జన్మలోచేయు అపకార ఉపకారములకు తగిన ఫలము రాబోవు జన్మలో అనుభవింపగలము.

మానవత్వం, ప్రేమ, త్యాగం, ఆత్మార్పణలతోకూడి యున్నదే దేశభక్తి. అది ద్వేషరహితం కావాలి.

మూసికొన్ననోటిలోకి ఈగైన దూరబడదు.

బుద్ధుని వాక్యము : ఏనాడు మానవులు జంతుహింస, మాంస భక్షణాది క్రూర కృత్యములను వర్జించునో ఆరోజునుంచే నరులు మానవ జాతికి చెందినవారుగా ఎంచబడుదురు.

పాముకు పాలు పోస్తే విషము నిస్తుంది.

మహా పాపాది పాపములు చేసిన వాడైనను భగవద్గీతా శాస్త్రమును పారాయణ, చేసినచో పద్మపత్రమును నీళ్ళంటని విధముగా వాడొకప్పుడును పాపములచే స్పృశింప బడక యుండును.

ఒక విధంగా శరీరసౌందర్యము కాని, బుద్ధిసూక్ష్మతగాని లేని వారికి జీవితాలు మంచివే. వారు ఒకమూల కూర్చుని ఈ లోకనాటకాన్ని నోళ్ళు తెరుచుకుని చూడవచ్చు. విజయం అనేది ఏలావుంటుందో మాత్రం ఏలా తెలుస్తుంది. ఏగొడవలూ లేకుండా హాయిగా, అశాంతి - ఆందోళన లేకుండా బ్రతుకుతారు. ఒకరికి హానిచేయరు. ఒకరివల్లహాని పొందరు.

క్రైస్తవ మతం అంతరార్థం గౌరవ భరితమయిన భక్తిభావమే.

గరిట అన్నరసాన్ని గ్రహింప జాలనట్లు అవివేకి జీవితమంతా పండితుల్ని సేవించినప్పటికి ధర్మాన్ని గ్రహింపజాలడు.

తమ సంబంధములేని వస్తువుల్ని ఎవరో అనుభవిస్తున్నారని కూడా మగవారు కత్తులు నూరుతుంటారు.

ఏ వొక్కడు తానేర్వనిదే ఏ వ్యవహారాన్ని చేపట్టడు. అది స్వల్పాతి స్వల్పమయిన దయినప్పటికి అన్ని వ్యవహారాలలోను కఠినాతి కఠినమైనది రాచరికము. అయినప్పటికి అది చేపట్టటానికి అల్పాతి అల్పుడుకూడా సముచిత సమర్థుడననే తలుస్తాడు. ఆశ్చర్యము కదూ !

భగవద్గితా శాస్త్ర శ్రీకోశము ఎక్కడెక్కడ ప్రవర్తించి యుండునో అచ్చటచ్చట ప్రయాగాది పుణ్యతీర్థములు ప్రవర్తించి ఉండును.

వృద్ధాప్యములో తిరిగి యవ్వనాన్ని మననం చేసుకోవడంకంటె ఘోరమైన బాధమరేమిలేదు.

పిలవని పేరంటంగా సలహాచెప్తే అతనికి నీసలహా అవసర మన్నమాట.

మనిషి నైతికంగా పెరగాలి. కనీసం పతనోన్ముఖుడు కారాదు.

సౌందర్యాలన్నిటిలోకి సుందరమయినది జీవితం. దానికి సూత్రం సుందరమయిన ఆత్మ.

తన విధుల్ని సక్రమంగా నిర్వహించే ప్రతివానికి ఆశయాలు తమంతటతామే ఉద్భవిస్తాయి. నిజానికి ఒకరివిధుల్ని నిర్వహించే హక్కే జీవిత ధ్యేయం, మరణధ్యేయంకూడా కావాలి. అదే న్యాయమైన హక్కులన్నిటికి మకుటమవుతుంది.

అది చిన్న సమస్యకానివ్వండి, పెద్దది కానివ్వండి. దానిని పరిష్కరించాలంటే అందుకు వలసిన వాతావరణాన్ని ముమ్ముందుగా కల్పించాలి. ఇది జరగనంతవరకు ఏమిచేసినా అది వృథా ప్రయత్నముగానే పరిణమిస్తుంది.

సత్యమనగా చేసినది చెప్పడం, చెప్పినది చేయడం, సత్యమంటే చేతకు, మాటకు సంబంధం.

పిరికివాడు ఎన్నటికి నీతివంతుడు కాజాలడు.

గాలిమేడలు కట్టినందువల్ల నీ పనిచెడిపోదు. ఆదర్శాల మేడల గోపురాలు గాలిలోనే ఉండాలి. వాటికి పునాదులు మాత్రం నేలమీద నిర్మించుట మరచిపోరాదు.

వత్తి సరిగ్గా చూడకపోతే దేవుడు దగ్గర పెట్టిన దీపమైనా ఆరి పోతుంది. వంశాను గతమైన సద్గుణాలు ఒకపట్టాన వదలవు. కష్టపడి వాటిని నిలబెట్టుకొనకపోతే అవి విడిచిపెట్టి వెళ్ళిపోతాయి.

ఎచ్చట భగవద్గీతా శాస్త్రముయొక్క అర్థ విచారమును, పారాయణమును, ఉపదేశమును, శ్రవణమును, చేయుచుందురో అచట భగవంతుడు సదానివశించు చుండును.

మోవి తియ్యదనమును, చనుగవ గట్టితనమును, చూపులవాడిమిని కవనముయొక్క పరిపాకము అనుభవించే, రసజ్ఞుడైనవాడే ఎరుగును. చెరకుయొక్క ద్రవ్యములు, కవుల అభిప్రాయము, ముగుదకోమలుల కడగంటి చూపుల చలనములు యీమూడును లోకములో హృదయంగమములు.

తెలివైన మనుష్యుడు కళ్ళతో మాట్లాడుతాడు, తెలివి హీనుడు ఆపని చెవితో చేస్తాడు.

మరణము బైబిలునందు మూడురకములుగా చెప్పబడెను. (1) మనుష్యుని ఆత్మ. మనసు వాని శరీరమునుండి వేరగుటచేత ఒక మరణము. (2) శాశ్వతముగా దేవునినుండి వేరగుట రెండవ మరణము. (3) మనుష్యుని ఆత్మనుండి దేవుడు తన ఆత్మను తీసివేసికొన్నప్పుడు కలుగునది ఆత్మీయ మరణము.

తుచ్ఛులు మిమ్ముగూర్చి పలుకు నిందావాక్యముల నేమాత్రము సరకు చేయకుడు. వారియెడ ఉదాసీనత చూపుడు. ముమ్మాటికిని ఉదాసీనతయే ! కన్నులురెండు, చెవులురెండు, కాని, నోరు మాత్రం ఒకటే అని జ్ఞప్తియందుంచుకొనుడు. మహాకార్యములు. మహావిఘ్నముల నడుమనే మహావిఘ్నముల నెదుర్కొనియే నిర్వహింపబడును. మీపురుషా

కారమును, పురుష ప్రయత్నమును ప్రదర్శింపుడు. కామకాంచన పరాధీనులగు నిర్భాగ్యులను లక్ష్యపెట్టబనిలేదు.

సమస్యలు లేకపోతే జీవితములో మాధుర్యములేదు.

పుట్టిననాటిబుద్ధి పుటకలతోగానిపోదు.

ఏసలహాయిచ్చినా వీలైనంత చిన్నదిగా ఉండాలి.

పండితుల్ని ఒకముహూర్తమే సేవించినప్పటికీ నాలుక అన్నరసాన్ని గ్రహించునట్లు విజ్ఞుడు ధర్మాన్ని గ్రహిస్తాడు.

వాక్కుచేత, క్రియలచేత సదా దుష్టకృత్యములు వర్జించుటయే త్రికరణ శుద్ధియనబడును.

ఏమంచిపని అయినా చేయవలసిన సమయములో చేసినప్పుడే ప్రయోజనం ఉంటుంది.

భగవద్గీతా శాస్త్రమే భగవంతునికి ఆశ్రమము, ఉత్తమగృహము. దానిని ఆశ్రయించి భగవంతుడు ముల్లోకములను బరిపాలించుచున్నాడు.

దేవునివైపు వేసే ముందడుగే ఒక సత్కార్యం.

ప్రపంచములో ఏ యిద్దరు వ్యక్తులు ఒకరి ఆత్మలను ఒకరు తెలుసుకోవడం అసాధ్యం.

అన్నిప్రాణుల ప్రవృత్తులన్ని సుఖంకోసమే. అయితే ధర్మం లేకుండా సుఖంలేదు. అందుచేత ముందు ధర్మపరుడవుకా.

నీదేశంకోసం నీప్రాణమర్పించమనే ఈ బోధనలే ఈ లోక సంగ్రామాన్ని కల్పించాయి.

ఆపద రాగలదని ఆత్రపడే వాడెప్పుడూ దానిని రెండురెట్లు ఎక్కువగా అనుభవిస్తున్నాడు.

సత్యంలేనిచోట సిసలైన జ్ఞానంకూడావుండదు.

అల్పులతోనూ, హీనులతోనూ సంధిచేసుకుంటే వారు నమ్మించి మోసంచేస్తారు. అట్టివారితో సంధిచేసుకోకుండా జాగ్రత్తగా వుండాలి.

తప్పు ఒకేపక్షంవైపు ఉంటె కీచులాటలు తక్కువకాలం కొనసాగవు.

ఏదేని ధర్మమును మాత్రము బట్టి మనుష్యుల చరిత్ర గణింప బూనుట పరమ మౌఢ్యం.

ప్రతిభావంతుడు ఎంతటి మహత్తర కార్యమైనా సాధించగలడని అంటారు. కాని అతగాడు తన బ్రతుకు తెరువుమాత్రం చూసుకోలేడు.

నాభావాలకి, రచనలకి పూర్తిసామ్యం వుండేటట్లు చూచుకోవడమే తప్ప ఎవరేమి అనుకుంటారో అన్నబాధనాకులేదు. భావాన్ని మాటల్లో పెట్టగలిగితే నాకు చాలు.

పనిపాటలులేక తినికూర్చునే వాడొక్కడే సోమరికాడు. రాచకార్యాలు చక్కపరిచే సామర్థ్యం కలవాడు రాళ్ళుకొట్టుతూ కాలం గడప వలసివస్తే అతనుకూడా సోమరిక్రిందలెక్ఖే.

ఒకజాతి ముసలిదైపోయినపుడు తన ఆత్మబలాన్ని, విశ్వాసాన్ని, తనయావజ్జీవితాశయ సమరమున సుఖలాలసతకు బలిచేస్తుంది.

విషయప్రీతివలన ఆశ, ఆశవలన తానాశించిన వస్తువు మరియొకడాశించగా కోపము, కోపంవలన అవివేకం, అవివేకమువలన

సన్మార్గమునకు మరుపు, మరుపువలన తెలివిలేకపోవుట, తెలివిలేక పోవుటవలన మానవుడు నశించుచున్నాడు. అందుచే విషయప్రీతి జయించుటవలన మానవుడు సర్వమును జయించగలడు.

జీవితాన్ని మోసం చెయ్యటం సాధ్యంకాదు. ఎందువల్ల నంటే జీవిత సమస్యలకు జవాబులు (లెక్కల పుస్తకంలో) జీవితగ్రంథం చివర లేవు.

ఒక సిరాచుక్క లక్షలకొలది మానవులలో ఆలోచనరేకెత్తించ వచ్చు.

పరాను సరణ వాంఛ, అధికారుల అనుగ్రహ సంపాదన కాంక్ష, మూర్ఖ జనశ్రేణినుండి గౌరవము నార్జించుకోరిక, మానవునితో నంతర్భూతములై యున్న ధీరత్వమును, ప్రతిభను కొరికివేయును.

మీకు అవసరంలేనిది కొంటే అచిరకాలంలోనే మీకుఅవసర మున్నవి అమ్మివేయవలసి వస్తుంది.

అర్థమాత్రారూపమును, అక్షరంబును బ్రహ్మ స్వరూపమును, నిత్యమునైన భగవద్గీతా శాస్త్రము, ఉత్తమమైన బ్రహ్మ విద్యయనుటకు సందియములేదు.

అదృష్టం నిరంతర పరిశ్రమ అడుగుజాడలలో నడిచివస్తుంది.

హృదయాన్ని ఆవహించిన పిచ్చిపేరే ద్వేషం.

ఘనమయిన పర్వతము వాయువుచే చలించనట్లు వివేకులు నిందాస్తుతులచే ఏమియు చలింపరు.

చిన్న అబద్ధం కలిస్తే ఏ వృత్తాంత మయినా వినసొంపుగా వుంటుంది.

ఏదేశపు సాహిత్యం పున్నత శిఖరాలను అందుకుంటుందో ఆదేశపు సమాజంలో ఉన్నతి కలుగుతూంది.

భగవద్గీతా శాస్త్రము పదునెనిమిది అధ్యాయములు గలది. దాని నెవరు నిశ్చలమనసుడై, నిత్యమును పారాయణము చేయునో అతడు జ్ఞానసిద్ధిని పొందిన వాడై పిదప మోక్షమును చెందగలడు.

నిరుపేదల నీతి వర్తనం చెడుటకన్నా కలవారిలో కనబడుతున్న నైతిక పతనం బలవత్తరమైనది.

యుద్ధం యుద్ధాలను సృష్టిస్తుంది. హింసనుంచి హింస పుడు తుంది. వీటిని ఎదుర్కొనగలిగింది ఒక్కటే - అహింస.

లోకాన్ని వదులుకో దలచుకొన్నవాడు లోకంనుంచి సాను భూతినిగానీ, సౌఖ్యాన్నిగానీ అపేక్షింపకూడదు.

శ్రమజీవుల మానవతా వాదం వుందే అది మానవజాతికి పటా టోపాలతో, వాచాలత్వంతో కూడిన తీపిమాటల్లో ప్రేమను అందివ్వదు. దానిలక్ష్యం అల్లా - ప్రపంచ కష్టజీవులందర్నీ సిగ్గుమాలిన, క్రూర మయిన, వున్మాద పూరితమైన పెట్టుబడిదారీ విధానపు ఉచ్చులనుంచి విముక్తి చేయడం, తద్వారా మానవులు తమక్రయ విక్రయాలకు లోనయ్యే వస్తువులు కాదనిగుర్తింప చేసేట్లు పాఠాలు చెప్పడమూ, శ్రమజీవుల మానవత్వం లక్ష్యం - ప్రేమనుగూర్చిన భావకవిత్వం ప్రకటనలుకాదు. తమజీవితాన్ని తామే మార్చుకోగల అధికారాన్ని సాధించే హక్కును ఆచారిత్రక కర్తవ్యాన్ని ప్రతికార్మికుడూ గుర్తించాలని శ్రామిక మానవత్వం డిమాండు చేస్తుంది. బాధల్ని సృష్టించే కారణాలనన్నిటినీ ద్వేషించాలనీ, కోట్లాదిప్రజల కష్టంమీద వారిశ్రమ ఫలితంమీద జీవించేవారిని ద్వేషించాలనీ శ్రామిక మానవత్వంకోరుతుంది.

భగవంతుని సంచలాత్మకమూ, సజీవమూ అయిన అచ్ఛాదానమే ప్రకృతి.

ఆయువుంటే మనం ఏమిచేసినా చావం. ఆయువుతీరితే మనం ఏమిచేసినా చస్తాం.

ప్రేమ తరువాత మానవహృదయంలోని దైవాంశ - సానుభూతి.

పురుషులుకూడా బాలురే - తలనెరసినప్పటికీ వాళ్ల ఆకృతిలోనే పెద్దవాళ్లు.

తమతప్పులకు, విచారాలకు మానవులు పెట్టేపేరే అనుభవం.

ఇది మృతుల భూమి. జీవించేవారినేవే మరో ప్రపంచం.

సత్యహీనమైనపూజ, జపం, తపం, అన్నీ ఈసర క్షేత్రంలో చల్లినవిత్తనాలవలె నిరుపయోగములు.

సమస్త దేశాల మహాకవుల అత్యుత్తమ కావ్యాలు ప్రజల సమిష్టి సృజనాత్మక రచనల బాండాగారము నుండి లాభము పొందినవే. ఈ మూలాధారమునుండి సమస్త రాజకీయ, నైతికసూత్రీకరణలు చేయబడ్డాయి.

ఋజువుగానూ, సజావుగానూ ఎవరన్నా వ్యవహరిస్తే అది లౌక్యమో, నేర్పరితనమో నిర్ణయించడం చాలాకష్టం.

పెద్దపెద్ద తప్పులనేవి గొప్పవాళ్ళు మాత్రమే చెయ్యగలుగుతారు.

నీజీవితం ఎంత హీనంగా కనిపించినప్పటికీ దాన్ని ఎన్నడూ నిరసించవద్దు. దాన్నిధైర్యంగా ఎదుర్కొని జీవించు. నీజీవితం దీనంగా తోచినప్పటికీ దాన్ని ప్రేమించటం నేర్చుకో.

దారిద్ర్యము యొక్క ప్రథమ స్వరూపము యాచన.

యువతి బాల్య సుగుణ్తలన్నిటినీ కుదిర్చే ప్లాస్టరు పట్టీభర్త

భగవద్గీతా శాస్త్రమును పూర్తిగా గాని, కొంతగా గాని, నిత్యము మానవులు పారాయణము చేసినచో అనేకరకములుగా పుణ్యములుకలిగి మరణముతరువాత వుత్తమలోకమునకు చేరును.

వివేకంకలవాడెప్పుడూ క్షమార్పణకోరడు.

మనిషికీ మనిషికీగల బంధాన్ని అందునా స్త్రీ పురుషుల అను బంధాన్ని తెగకొట్టడం మరీకష్టం.

సంఘములో విచ్చలవిడిగా చలామణీ అవుతున్న బలహీనతలను, అమానుషత్వాన్నీ వ్రేలుపెట్టి చూపించ డానికి రచయిత కృషిచేయాలి.

ఎంత సామాన్యమైన విషయమైనా దాచినపుడు ఎంతో అందంగా కనిపిస్తుంది. ఇలాంటి అలవాటు ఎంచాతనో జీవితానికి గొప్ప వైచిత్రాన్నిస్తుంది.

సుఖాన్ని వెదుకుంటే దొరకదు. మనం విషాదంలో గూడా సుఖం వున్నదను కున్ననాడే సుఖం లభ్యమవుతుంది.

సామ, దాన, భేదాలు ప్రయోగించి విఫలుడైనరాజు ధర్మం కాపాడడంకోసం దండపాణిని అవశ్యం ప్రయోగించాలి.

మనిషి మనిషి కావడంలో విశేషమేముంది అనుకుంటాం. రూపంలో మనిషిగా వుండి చర్యలలో రాక్షసుడుగా కనపడువాడు మనిషికాడు. సంపూర్ణ మానవత్వము కలిగిన మనుష్యులు అరుదు.

అసూయ, ద్వేషం, యితరుల్ని గాయపర్చడం యిటువంటి గుణాలు యితరులకన్న స్వంతవారినే ఎక్కువ బాధిస్తాయని వివేకవంతులు వాటిని వదులుకుంటారు.

న్యాయాధీశునకుండవలసిన నాలుగు లక్షణాలు - సౌమ్యంగా వినుట, సత్యంగా మాట్లాడుట, నిబ్బరంగాశోధించుట, నిష్పక్షపాతంగా నిర్ణయించుట.

భగవద్గీతా శాస్త్రమును పారాయణచేయుచు మరణము నొందిన వారికి దేవత్వము లభించును.

తెలివికి సిసలైన కొలబద్దకాదు గడ్డం.

బాల్యంలో క్రీడాశక్తితోనూ, యవ్వనంలో వనితా సక్తితోను, వృద్ధాప్యంలో చింతాసక్తితోనూ వుంటే, నీవు బ్రహ్మసక్తితో ఎప్పుడుంటావు ?

నరజన్మలో చేసిన పాపకృత్యములకు తగినబాధలు పొందుటకే క్రిమికీటకాది జన్మలు కలుగుచున్నవి. దుష్టకృత్యములకు తగిన బాధలు అనుభవించిన వెంటనే నీచ జన్మలనుండి విడువ బడి మానవ జన్మకు వచ్చుచున్నవి.

బీదరికం, భాగ్యరికం, పోల్చదగిన పాపాలు.

స్త్రీకి కూడా ప్రాణముతో కూడుకున్న శరీరమున్నది. ఆ స్త్రీ అనేవ్యక్తి హృదయమునకు సంతోషానందములు, ఆవేశావేదనలు, తామశాంతములు, ఆశనిరాశలు, దుఃఖోద్వేగములు, రాగద్వేషములు, ఓర్మి దయాదిగుణ గుణములు యున్నవి. ఆమెఆనందము నోలలాడును. జాలితో కరుగును. దయతో ద్రవించును. తామసమున నుగ్రరూపము దాల్చును. అనురాగమున ఆనందింప చేయును.

ఏ సమాజంలో అయితే పనికి విలువ వుండదో అది సమాజానికి పతనావస్తే కాని అభివృద్ధి క్షేమం మాత్రంకాదు.

ఒకరినొకరు ప్రేమించుట, ఒకరునొకరు దీవించుట నేర్చుకున్న జాతికెప్పుడూ నవ్వుల పువ్వులు దొరుకును.

రక్షించుటకు శక్తి లేనిచో సృష్టించుట మహాపాతకం.

ఆలోచనఅంటే ఆత్మతనలో తాను మాట్లాడుకోవడమే.

అసలు అందం అంటే ఏమిటి? ఏది ఉపయోగమైనదో అదే అందమైనది.

ఒకరి పరిపాలనకు కట్టుబడి వుండటం తేలిక అనిమానవులు గ్రహించారు. కానీ తమ్ము తాము పరిపాలించు కోవడమే వారికి కష్ట సాధ్యమయినపని.

ఈరోజుఅనేది లేకుంటే రేపు అనేదిలేదు.

మగవానికీ ఆడదానికీ సృష్టిలో ఒక తేడావుంది. అదే పిల్లలు పుట్టడం, అదేస్త్రీత్వం. గర్భం ధరించేశక్తి ఒక్కటే శారీరకమైన స్త్రీత్వం. పసిపిల్లల్ని పెంచేప్రేమా - వాళ్ళచేష్టల్ని భరించే సహనమూ మాత్రమే మానసికమైన స్త్రీత్వం. బిడ్డల్ని కని - పాలిచ్చి ప్రేమతో పెంచటమే ప్రకృతి సిద్ధమైన స్త్రీత్వం. పిల్లల్ని కని పెంచిన ప్రభావం వల్లనే స్త్రీమనసు కోమలంగానూ, ప్రేమపూరితము గానూ వుంటుంది. ఈస్త్రీత్వం అన్ని దేశాలలోనూ - అన్నిమతాలలోను - ప్రపంచమంతా ఒక్కలాగే ఉంటుంది. ఇక ఆపైన మనం చెప్పుకునే స్త్రీత్వపు లక్షణా లన్నీ కృత్రిమంగా మనుష్యులు కల్పించుకున్నవే. పురుషుడికి వున్న అన్నిభావాలు స్త్రీకీవున్నవి. కోపంవుంది. ద్వేషంవుంది. ఆత్మాభిమానం వుంది. స్వతంత్రంగా- సంతోషంగా బ్రతకాలనే తపనావుంది.

మంచితనం వున్నమనిషి పశ్చాత్తాపం నిజంగా విలువయినది.

భగవానుని ప్రేమించుట కన్న తోడిమానవులను ప్రేమించటం పరమోత్తమం.

ధర్మమనే వస్తువును అమాంతము గుప్పెట్లో పెట్టుకునేందుకు మానవులు ఆత్రతపడతారు. కాని అదంత తేలికగా లభించదు. అంత్య దశలో దుఃఖాలన్నీ మునిగివచ్చినపుడు వేదనా పూరితమైన హృదయం మీద ఆదర్శదేవత ఒంటరిగా వచ్చినిలుస్తుంది.

భూమిని త్రవ్వే మనిషిని సైతం భూమి భరించడంలేదా? అప కారం చేసిన వారిని సహించడం అలవర్చుకో. అదిమంచిది.

సహజంగా వుండటమే అసలు అభినయం. అంత కంటే అసహ్యకరమైన నటన ఉండదు.

సృష్టిలో ఉద్భవించిన ఈ అనంత ప్రాణకోటి అంతరాంతరాళా లలో ఎట్టి అనుభూతులు, ఎట్టిఉద్వేగ పరంపరలు, ఆశలు, కాంక్షలు దాగివున్నవో, ఎన్నివిషాదనీరదాలు, ఎన్ని సంతోష స్రవంతులు అంతర్వాహినులై అజ్ఞాతంగా ప్రవహిస్తున్నవో ఏఅతీతవ్యక్తి అంచనా కట్టగలడు? ఏఅపూర్వ శక్తి బోధించగలదు.

అధికారి అన్నవాడు మృదు మధురంగా మాట్లాడడం నేర్చు కోవాలి.

ఒకరి అభిరుచులను యింకొకరిమీద రుద్దటం మంచిదికాదు.

దేన్నైనా నయం చెయ్యగలది వుప్పునీరే! అది స్వేదంకావచ్చు! కన్నీరు కావచ్చు! సముద్రజలం కావచ్చు.

ఇతరులు చేసిన తప్పులు ఆధారంగా తెలివైనవాడు తనతప్పు లను దిద్దుకుంటాడు.

చదువు లేకపోయినా అద్భుతమైన సంస్కారం కలవాళ్ళు లోకంలో అక్కడక్కడ కనిపిస్తారు.

పండ్లతో నిండిన చెట్టు నమ్రతగా వంగివుంటుంది. సంపదలందు సత్పురుషులు, వినమ్రులయి వుంటారు. పరోపకారులు స్వభావంచేత కలిగి వుంటారు.

మానవుడు తనప్రయత్నం తానుచేయాలి. మిగిలిన భారాన్ని దైవంపైవుంచాలి.

ప్రేమ వెనువెంట ఎప్పుడూ విశ్వాసం, ఆశవుంటాయి.

ఆడవాళ్లతో వచ్చిన చిక్కేమిటంటే అందరూ వాళ్ల తల్లుల గుణాన్ని పుణికిపుచ్చుకుంటారు. ఏమొగాడూ వాళ్ళమ్మగుణాలు పుణికి పుచ్చుకోడు. అదిమొగాళ్ళతో వచ్చేచిక్కు.

క్రూరకృత్యములకు తగిన రక్షణగా మరలనీచమైన జన్మలు రాకుండ మనుష్యజన్మగాని, దేవతా జన్మగాని, జన్మ రాహిత్యముగాని పొందుటకు తగిన కృషిచేయుట జన్మఎత్తినందుకు తగినఫలము.

ఒక కళాఖండాన్ని గురించి తీర్పు చెప్పేటపుడు దాని లోపాల వైపుకు చూడకు.

ఉద్రేకాలు పెరిగినప్పుడు విచక్షణాశక్తి లోపించి పోవడం సహజం. ఉద్రేకం మానవ సహజలక్షణ మయినా విచక్షణ విజ్ఞతలేని

ప్రదేకం అనాగరికుల లక్షణమవుతుంది. ఏసమస్యనయినా ప్రదేకంతో కాక హేతువాద దృష్ట్యానూ, దూరదృష్టితోనూ పరిశీలించాలి.

ఆలోచన పెంచుకుని అడుగులు ముందుకువెయ్యి.

సహజప్రకృతివల్లగాక చదువు వల్లనే, అలవాట్లవల్లనే ముఖ్యంగా మనలో కోరికలు పుట్టుచున్నవి.

ఏమీమాట్లాడని వానివద్ద నీహృదయమును విప్పవద్దు. అతిగా మాట్లాడు వానివద్ద నీహృదయమును జాగ్రత్త పరచుకొనుము.

అనర్థ పదయుక్తమగు వేయిగాథలకంటె శ్రవణ మాత్రమున శాంతిని కలుగచేయుగాథ ఒక్కటైనా శ్రేష్టమే.

చిత్తడినేలలో బ్రహ్మాండమైన ఓక్ వృక్షాలు పెరుగవు. చిన్న చిన్న చెట్లు, పొదలు మాత్రమే అక్కడ పెరుగుతాయి. ఆవిధంగానే క్షీణదశలోవున్న వాతావరణములో బ్రహ్మాండమైన ప్రతిభ వ్యక్తంకాదు.

ఎప్పుడూ పతనం లేకపోవడంలో వైభవమేమీ లేదు. కాని, పతనం చెందినపుడల్లా తిరిగి లేచి నిలబడడంలోనే మనవైభవంవుంది.

నోటినుండి బయటపడిన అబద్ధము గురించి బాధపడకు. హృదయములో ప్రవేశించి అక్కడ స్థిరపడిపోయినది, యింకా ఎక్కువ ప్రమాదంకాదా!

చూడగానే తన సుఖదుఃఖములు అద్దమునందు ప్రతిబింబము తగిలినట్లు ఎవనియందు తగులునో వాడే స్నేహితుడు.

విద్యయనగా అక్షరాస్యతకాదు. వివేకము, విజ్ఞానము కలిగి వర్తించుట.

దేహముకంటె ప్రేమా, సంఘంకంటె వ్యక్తి కల్యాణం అధికము.

పవిత్రగ్రంథము బైబిలువాక్యం. "నాయందు విశ్వాసముంచు. ప్రతివాడు మరణములోనుండి (నరకం) జీవనములోకి (స్వర్గం) దాటి యున్నాడని నిశ్చయముగా మీతోచెప్పుచున్నాను."

అర్జునుని వలె వీరయుద్ధమొనర్పుము. కాని రథసారథ్యము శ్రీకృష్ణుని చేతిలో పెట్టుటమాత్రము మరువకుము.

చదివిన పుస్తకం ప్రపంచాన్ని మరింత తెలియ పరుస్తుంది.

మనం అనుకున్నవన్నీ ఎలాజరగవో అనుకోనిదికూడా కొన్ని ఆలాగే జరుగుతాయి.

సాయం సంధ్యా సౌందర్యం దరిద్రుల కొంపల కిటికీలలోనూ, ధనవంతుల సౌధాల గవాక్షాలలోను సమానంగా గోచరిస్తుంది.

గొప్పవ్యక్తుల గొప్పతనం అన్నివిషయాల యెడలకూడా వారు వహించే జాగ్రత్తలోనే కనిపిస్తుంది. చిన్న చిన్న విషయాలే నిత్య జీవితాన్ని ఆక్రమిస్తాయి కనుక చిన్నవిషయాలలో జాగ్రత్త చూపలేని వాడు పెద్ద విషయాలలోనూ నవరించలేడు.

ఇవ్వడానికి ఏమీలేకుండా చేసుకొనడానికి మార్గంఏమీ యివ్వక పోవడం.

పాపమనే వృక్షశాఖలను మాత్రం త్రుంచాలని చూసేవాళ్ళు వెయ్యిమంది వుంటారు. ఆ వృక్షమూలాన్ని ధ్వంసం చెయ్యడానికి యత్నించేవాడు ఒక్కడే వుంటాడు.

కీర్తిఅనేది ఎండమావిలాంటిది. తరచు విలువ లేకనే సంక్రమిస్తుంది. అనవసరంగానే నశిస్తుంది.

నేను తెలిసికొన్నదానివల్ల నాకు తెలిసిందేమంటే నాకు అసలు ఏమీ తెలియదు అని.

కష్టాలను పిరికి వాళ్ళయినా ఓర్చుకోగలరు. కానీ సందిగ్ధ స్థితిని ధీరులు మాత్రమే ఓర్చగలరు.

పురుషునికి ఆత్మచూపించేది స్త్రీ ఒక్కటే. మనుష్యుల అలవాట్లు, ఆచారాలు మార్చడం సులభం. స్వభావాల్ని యుగాలు మార్చవలసిందే.

అవసాన కాలమందు భగవద్గీతా శాస్త్రమును స్మరించిన వారికి వుత్తమగతి లభించును.

పదవిలోవుండే ఘనతను బట్టి పదిమంది చుట్టూ చేరితే అధిరిపాటు వుండకూడదు. ఆపదవివల్ల వచ్చే ఘనత పదవితోనే పోతుంది.

నవ్వుతో స్నేహం ప్రారంభంకావడం చెరుపేమీలేదు. స్నేహం అంతమయ్యే సమయంలో కూడా నవ్వు మరీమంచిది.

రోగి ఔషధం సేవించకుండా దాని పేరు విన్నంత మాత్రాన్నే వాని రోగం ఎట్లుకుదరదో అట్లే బ్రహ్మసాక్షాత్కారం కలగందే "అహం బ్రహ్మస్మి" అన్నంత మాత్రాన మోక్షం లభించదు.

అనుమాన ద్వేషాల్ని బరిమార్చగలిగినది మన నిజాయితీ ప్రవర్తనే.

దేహికి కోరకయే దుఃఖములు వచ్చునట్లు కోరకయే సుఖములు వచ్చును. కాని దుఃఖములు వచ్చినప్పుడు తెలివిలేక దిగులుపడుటయే భేదము.

సూర్యుడు పద్మాలను చంద్రుడు కలువలను ఎవరూ ప్రార్థించ నవసరము లేకుండగనే వికసింపచేస్తున్నారు. అడగకుండానే మేఘుడు జలధారలను కురిపిస్తున్నాడు. సత్పురుషులు తమంతట తామే పర హితార్థం కలుగచేస్తారు.

మనం చూడవలసినది మనకంటె పైన ఉన్నవాళ్ళనుకాదు క్రిందవాళ్ళను. మనకంటె బీదస్థితిలో ఉన్నవాళ్ళను చూస్తూ వాళ్ళతో కలిసిపోవటానికి ప్రయత్నించాలి.

మన దుర్గుణాలు మనల్ని వదలి నప్పుడు వాటిని మనమే వదలి నట్లు గొప్పలు చెప్పుకుంటాము.

ఎంతమంది దుష్టబుద్ధులకు మీరు దయ చూపించారో రోజూ ప్రశ్నించుకుంటూ ఉండాలి.

కొందరికి కాలం గబగబా గంతులువేస్తూ నడుస్తుంది. మరి కొందరికేమో యెంతకూ నడవదు.

పొగవున్నచోట తప్పక నిప్పు ఉంటుంది.

జీవితవ్యాపారంలో దయార్ద్ర హృదయులు కావడం ఒక అమూల్యాంశం.

వ్యవహారాలకి, సంసారం నడవాలంటేను ధనంముఖ్యం. అందుచేత డబ్బు సంపాదించడానికి మంచిమార్గాలను ఎన్నుకొని మానవుడు సాహసం చేయాలి.

చేతకానివాళ్ళు అదృష్టంమీద ఆధార పడతారు. విజ్ఞులు, ధీరులు కార్యకారణభావమే గమనిస్తారు.

కలతలని, కలయికలని నిర్ణయించేది కాలమే.

కళాఖండాలను పురుషుడు సృష్టిస్తాడు. కాని, పురుషులనే స్త్రీలు సృష్టిస్తారు.

ప్రకాశవంతమైన అగ్ని పొగచేతను, అద్దము మాలిన్యము చేతను, గర్భమందుండెడి శిశువు మావిచేతను ఏవిధంగా కప్పబడి యుండునో ఆవిధముగానే మానవుని జ్ఞానము కామము వలన కప్పబడి యున్నది. సత్పురుషుల స్నేహముచే కామమును జయించగలము.

భగవద్గీతా శాస్త్రముయొక్క మహాత్యమును పఠింపకయే గీతను మాత్రం పఠించెడివారు వృధాపారాయణము చేయువారగుదురు. వారికి శాస్త్రోక్తఫలము లభించదు. ప్రయాసమాత్రమే శేషించునుగాని వేరేమియు లభ్యము కాదు.

ఆత్మ శరీరాల సమన్వయం ! మన వెర్రితనంవల్ల మనం వాటిని విడదీసి ఒకవైపున జుగుప్సాకరమయిన వాస్తవికతను మరోవైపున శూన్య తుల్యమైన అధర్మాన్ని ఏర్పరుచు కున్నాము. కాని రెంటినీ కలిపి చూస్తే ?

**తప్పుడు పనికోసం చెప్పేనిజం - నిజంకాదు.**

నీముఖమే పుస్తకం. దానిలోనుంచి పైవారెన్నో విషయాలు పసి కట్ట గలరు.

ప్రభువు హితవు కోరేవాడు అడక్క పోయినా సుభద్రప్రథమైన మాటలు చెప్పాలి. ధర్మ సమ్మతమైన, సత్యమైన మాటలు చెప్పి సదా ప్రభు హితము కోరుతూ వుండాలి.

చిన్నపిల్లలు చీకటి అంటేనూ, పెద్దవాళ్ళు మృత్యువంటేనూ, భయపడతారు. వాటిని గురించి ఎక్కువ వింటున్న కొద్దీ భయంకూడా ఎక్కువ అవుతుంది.

స్త్రీ అహింస అవతారం. అహింస అంటే అపారమైన ప్రేమ అని అర్థం. అపారమైన ప్రేమ అంటే అధిక బాధలు భరించే శక్తి అని అర్థము.

బుద్ధితెలిసిన ప్రతి మానవుడులోను ఆశ రకరకాల చరిత్రను సృష్టిస్తుంది. దీనిబారినుండి తప్పించుకొన్న వాళ్ళు నిష్కాములైన ఏ మహర్షులో ఉంటారు అదురుగ.

మృతిచెందిన తరువాత సుఖపడుటకు కావలసిన సమస్తవసతులు బ్రతికియున్నపుడే తనచేతిమీదుగా సంపాదించుకోవలసి యున్నది.

దూరాన సుఖంకోరుతాడు మూర్ఖుడు. తన పాదాల దిగువనే సుఖంపెంచుకుంటాడు తెలివైనవాడు.

కవి పేద అయితేనేమి. ధనికుడయితేనేమి? కవిత్వం రస వంతంగా ఉంటే చాలు. బిచ్చగానిచంకలో నున్న చెరుకు గడైనా తీపి తరగదుగదా!

ఏసుక్రీస్తును తలపై ముండ్లకిరీటమును గ్రుచ్చి, భూమ్యాకాశ ములకు మధ్యగా నిలువబెట్టబడిన ఒక శిలువకు ఆయన శరీరమును మేకులతో కొట్టు సమయమున అక్కడ చేరిన జన సమూహములు ఆయనను హేళన చేయుచు అపహసించిరి. ఆసమయమందు సహితము ఏసుక్రీస్తు "తండ్రీ! వీరేమిచేయుచున్నారో వీరెరుగరు. కనుక వీరిని క్షమించుము." అని ప్రార్థించెను.

అరాజకము మానవజాతి అధికారముపై తిరుగుబాటు; నాస్తి క్యతం పరమేశ్వరుని అధికారంపై తిరుగుబాటు. ఇవి ఒకే కారణానికి రెండువైపులు.

కులనాశము కలుగునప్పుడు పరంపరంగా వచ్చిన అనాదియైన శాశ్వతకులధర్మములు నశించును. కులధర్మములు నశించుటవలన ఆకులమునందు అధర్మము వ్యాపించును.

డబ్బేకాని మాట్లాడితే నిజంనాశనమవుతుంది.

నీతి, ధర్మానికీ, ఆచారానికీ భిన్నమైనది. సత్యం, అహింస మొదలుగా గల నినాదాలు నీతిగా పరిగణింప బడుతున్నాయి. ధర్మాలు, ఆచారాలు కాలాన్నిబట్టి, దేశాన్నిబట్టి మారతాయి. నీతి అన్ని దేశాలకూ అన్నికాలాలకూ ఒక్కటే. అందుకే సాంప్రదాయం అంటే ధర్మం, ఆచారం, నీతియొక్క సమ్యత్స్వరూపంగా భావించవచ్చు. ఒకనాడు స్థిరంగా నమ్మిన ధర్మాలూ - ఆచారాలు మరోనాటికి అస్థిరమై వాటి స్వరూప స్వభావాలు మాసిపోతున్నపుడు వాటితోపాటు సాంప్రదాయంకూడా మారకతప్పదు,

నిరాడంబరజీవితం పురుషునికి ఎంత అవసరమో స్త్రీకీ అంతే అవసరం.

మంచి పనులుచేసి తలిదండ్రులకు ప్రీతి కలుగ చేయువాడే పుత్రుడు. భర్తహితాన్నికోరి చేసేదే భార్య. కష్టసుఖాలలో ఏకరీతిని ఉన్నవాడే మిత్రుడు. ఇటువంటివారు పుణ్యవశముచేతనే లభిస్తారు.

సాహిత్యవేత్త కృషి ఒక విధంగా విజ్ఞానవేత్త కృషి వంటిది.

నాగరికతకు సరియయిన కొలబద్ద మంచి స్త్రీల ప్రభావమే.

గొప్పవారికి వ్రతమే సుఖము. తుచ్ఛులకు సుఖమే వ్రతము.

మనం ఎంత తక్కువగా కోరికలు కలిగివుంటామో దేవతలకు అంత దగ్గరగా పోలివుంటాము.

మనకు వున్న దానితోనూ లేని దానితోనూ కూడా పూర్తిగా సంతృప్తి చెందడంలోనే మన ఆనందం యిమిడి ఉంది.

మనిషిలో మార్దవం యెంతతక్కువగావుంటే అంత ఎక్కువగా దానిని యితరులవల్ల ఆశిస్తాడు.

స్వజాతి హృదయముతో నేకీభావము. నాప్రతిరక్తనాళమున నృత్యమొనర్చిన గాని పరమేశ్వరునితో నేకీభావమెన్నడునూ లభించదు.

కేవలం బాహ్యసంఘటనలు మాత్రమే పురస్కరించుకొని అందరి హృదయ స్వరూపాలను నిర్ణయించరాదు.

కొత్తవస్తువుల కోసము, కొత్తమిత్రుల కోసము వెంపరలాడవద్దు. పాతవాటిలో కొత్తఅందాలు దర్శించగలశక్తి అలవరచుకో. కొత్త అందాలు మనంచూచే కోణంలో వుంటాయి. వస్తువుల్లోకాదు.

కులమును నాశముచేసి కులధర్మమును పాడుచేయకూడదు.

మేధస్సు సన్నగిల్లినవాళ్ళే వాదనలోకి దిగుతారు.

అన్నిమోసాలలో ఆత్మవంచనే అధమాధమం,

యుద్ధమునందు వేయిమంది శత్రువులను జయించుటకంటె తన్ను తాను జయించినవాడే శ్రేష్ఠుడు.

మనుష్యులంటే మానవులు. కాని ఒక్కొక్కప్పుడు గొప్ప గొప్ప వాళ్ళే దానిని మరచిపోతూ వుంటారు.

మౌనం, ఆశారాహిత్యం; ఏకాంతవాసం; ఈషణత్రయశూన్యత్వం; అపరిగ్రహం యివన్ని మానవులకు చిత్తనిగ్రహానికి ప్రథమ సాధనాలు.

అధర్మము హెచ్చుటచేత కులస్త్రీలు చెడుదురు. స్త్రీలు చెడుట వలన వర్ణసంకరము కలుగును. అనగా అధర్మము హెచ్చిన కుల నాశనము కలుగటం బట్టి మహాపాతకులయిన పురుషుల సాంగత్యము వలన కులస్త్రీలుగూడ వ్యభిచారాది దుష్కార్యములందు ప్రవర్తించి చెడిపోవుదురు.

నువ్వొక ప్రమాదకరవ్యక్తితో స్నేహము చెయ్యదలచుకుంటే అతన్ని నీకొక ఉపకారం చెయ్యనివ్వాలి.

బుద్ధుని వాక్యము - పశుపక్ష్యాదులకు పాపపుణ్యమను జ్ఞానము లేకపోవుటచేతనే వాటితల్లులతోనే అవి రతిసల్పుచున్నవి. ఈవిధముగా మానవులలో ఎట్టి నీచుడైననూ ఆచరించలేడు. ఇందుచేతనే పాప పుణ్యములు మానవజాతికి మాత్రమే విధింపబడినవనియు, న్యాయముతో జ్ఞానముతో, నరులు సంచరించవలెననియు నిర్ధారణయగు చున్నది. కనుక మానవజన్మ యెత్తినవారు కనీసము తన చేతులారా ఏజీవిని చంపక, చంపించక, మాంసము తినక యుండునట్లు దీక్షవహించుట ముఖ్యకర్తవ్యము.

సంపదలు కలిగిన వేళలలో మీరు చాలామంది స్నేహితుల్ని లెక్కపెట్టవచ్చు. కాని బీభత్సం ఎదురైనప్పుడు మీరు ఏకాకిగా వదలి వేయబడుతారు.

నీవిజయమునుగూర్చి అపజయం పొందినవారివద్ద మాట్లాడకు. నీయపజయములను విజయోత్సాహములో పడి మర్చిపోకు.

నాదృష్టిలో హిందూమతం సంకుచితమైనదికాదు. అదికాల మంతటి పురాతనమైనది. జొరాష్టరు, మోజస్, క్రీస్తు, మహమ్మదు, నానక్ వంటి మహోన్నత ప్రవక్తల బోధలన్నీ అది ఆకళింపుచేసు కున్నది:

అప్పుచేసి పప్పుకూడు తినకూడదు.

గర్వం తోడులేకుండా సద్గుణం చాలాదూరం వెళ్ళలేదు.

సాధారణముగా మన ప్రార్థనలన్నీ శుభాన్ని ప్రసాదించమనే. మనకేది శుభమో మనల సృజించిన ఆపరమేశ్వరునకు మరింతబాగా తెలుసునుగదా.

వేదనా హృదయానికి జలతారు అంచు హాస్యం.

ప్రొద్దున మనం ఎవరికైనా బాధ కలిగిస్తే మధ్యాహ్నానికి ఆబాధ తిరిగివచ్చి మనకేచుట్టు కుంటుంది.

పొట్టివానిని, పొడవువానిని నమ్మరాదు.

ఆడదాని సహనాన్ని అసమర్థతగా అర్థం చేసుకుంటాడు మగవాడు.

ప్రేమపట్ల విశ్వాసంగల వాళ్లకు దాని లోతుపాతులు తెలియవు. దాని పైమెరుపులే తెలుస్తాయి. విశ్వాసంలేని వారికే ప్రేమయొక్క వైఫల్యాలూ, విషాదాంతాలూ తెలుస్తాయి.

కులమునకు వర్ణసాంకర్యము కలిగిన యెడల అట్టి కులనాశకులకు నరకము కలుగును. మరియును ఆకులనాశకులయొక్క పితృదేవతలు పిండోదక క్రియలను చేయువారు లేకుండుట వలన అధోగతి పొందుదురు.

మానవత్వము అనే ముఖ్యగుణం వున్నవాడు మానవత్వం ఎక్కడున్నా సానుభూతి చూపగలడు.

కాలం మారినా మనుష్యులు మారడం లేదు. మనసులు అంతకంటె మారడంలేదు.

అదృష్టం మానవుల్లో మార్పు తీసుకురాదు. వారి అసలు రంగులను వెలికి తెస్తుంది.

స్త్రీ పురుషునివలె వ్యవహరించెనేని ఆ యిల్లు నాశనమగును.

పూలువున్న తావు అంతా తావితోనే నిండి వుంటుంది. రాగం నిండిన చోట ద్వేషానికి తావులేదు.

తల్లిదండ్రులు సంతుష్టులై, స్నేహితులు అనురక్తులై లోకం ఎవరికీర్తిని చెప్పుకుంటుందో అట్టివ్యక్తి ముల్లోకాలను జయించినట్లే.

సత్యసంధత గొప్పదేకాని దానిమూలంగా దుర్వార్త చెప్పవలసి రావడం అంతమంచిది కాదు.

విద్యాధికులు, సంస్కారవంతులైన స్త్రీలు యుక్తితో వరకట్న పిశాచాన్ని రూపుమాపితే ఆడపిల్లలుగల తండ్రుల జీవితాలు స్వర్గ మయమవుతాయి.

స్వార్థం జీవనశక్తి. అదినశిస్తే మనుష్యశక్తినశించిందన్న మాటే.

వర్ణసంకరము చేయుచున్నట్టికుల పాంసకులు యొక్క పాపము చేత పరంపరా ప్రాప్తములైన వర్ణాచారములును, కులాచారములును పోగొట్టు బడుచున్నవి.

రాయిరప్పలకు ఆకారమిచ్చి దేవుణ్ణి సృష్టించింది మనిషి. మానవునిచే నిర్మించబడిన దేవుడు పూజింపబడుతున్నాడు. దేవుణ్ణి సృష్టించిన మనిషి ప్రక్కమనిషిచేత మోసగింపబడుతున్నాడు. అంటే దేవునిమైకంలో మూతపడిన మానవుని నేత్రాలు ఎదురుగా వున్నమనిషిని చూడడం మానేసాయి.

నీవంటిమీద దుస్తులన్నీ విక్రయించి అయినానరే నువ్వు నీ భావాలను నిలబెట్టుకో. నీభావ ప్రపంచములో నువ్వువిహరించగలిగి నప్పుడు నీకు ఒంటరితనము వుండదు. గోడమూలల్లో తనలోంచి వెలువ దారాలతో సుతారంగా గూడుఅల్లుతూవున్న సాలీడులాగా నాలోంచి పొంగి వచ్చేభావాలతో నాప్రపంచాన్ని నేను చెరసాలలోవున్నాసృష్టించు కోగలను. నాసామ్రాజ్యానికి నేనే సార్వభౌముణ్ణికానా!

ఆగతం అనే అస్పష్టాన్ని గతంవంటి స్పష్టంగా దర్శించ టానికి మీరు యోచిస్తారు. నేను నీటిబాతులకన్న పరమ నికృష్టుడను. అవి మృత్యువును ముందుగా పసిగట్టుతాయి. పసిగట్టిన తదుపరి క్రితం కన్నా హృదయోల్లాసంగా మరణించేముందు గానం చేస్తాయి. ఏలనన పరమేశ్వర సేవకొరకు వెళ్తున్నామనే ఆనందాన్ని అవి పొందుతాయి.

కన్నీటితో నిండితే ప్రేమ సౌందర్యం పెంపొందుతుంది.

అనుమానం పెనుభూతం లాంటిది.

శ్రమలోవున్న గొప్పతనాన్నిగురించి సోమరిపోతులు వుపన్యాసా లిస్తారు.

ధనము చేతనున్న వ్యాపారి భయప్రదమగు మార్గమును వదలి వెళ్లునట్లు మనుజుడు వినాశకరమైన పాపకార్యములను త్యజింపవలెను.

జీవితము కృషిఅని, సృజనత అని సామ్యవాద వాస్తవికత అంటుంది. ఒకే కుటుంబములో ఐక్యమైవున్న మానవాళికి యీ భూమిని స్వర్గంగా చేయడానికి అత్యంత విలువయిన వ్యక్తిగత ప్రతి భను అభివృద్ధి చేయడమే దాని మహదాశయము.

అత్యున్నత స్థాయికి చెందిన కార్యాలు, సిద్ధాంతాలు పిల్లలు లేని వాళ్లనుంచే రావడం గమనార్హం.

నేను మానవుడిని. మానవత్వం యెవరిలో కనిపిస్తుందో వాళ్ళనే నేను గౌరవిస్తాను.

పేదవాని కోపము ఎప్పుడూ పెదవికి చేటు.

కులధర్మములు నశించిన మనుష్యులకు నరకమునందు ఎల్లప్పుడు నూ నివాసముకలుగు చున్నది.

ఒకప్రాణి మరియొక ప్రాణికి ఋణపడితే తీర్చవలసిందే. తీర్చే అవకాశం లేకపోతే అంతకంటె మహాపాపంలేదు.

మానవుల మరణానికి కాదు నేను విచారించేది; మానవత్వ మరణానికి.

రచనయెల్లపుడూ పాఠకుల మనస్సులను ఆకట్టి భావోద్రేకాల్ని కలిగించేదిగా ఉండాలిగాని చదివేవాళ్ళకు నీరసాన్ని పుట్టించ కూడదు.

అణకువగా ఉన్నపుడే ఆడదానిమీద అధికారం చెలాయించి అదుపులో పెడతాడు మగవాడు. అదే ఆడది బరితెగించి ఆడ సింహంలాగర్జిస్తే ఆమడదూరం పరుగెత్తుతాడు.

మనకు ఎంతఉన్నది అన్నదానిమీద కాక మనం ఎంతఅనుభవిస్తూ ఉన్నాము అన్న దానిలో మన ఆనందము ఆధారపడి ఉంది.

జనాభాపెరుగుదలా, పెద్దపెద్ద నగరాలూ, పాడిపంటలూ యివే నాగరికతకు చిహ్నాం కావు. దేశం ఎటువంటి మనుష్యులను తయారు చేసింది అనేదే నాగరికతకు సరియయిన నిదర్శనము.

మాటలకంటె చేతలకు ప్రాధాన్య మివ్వడం ఉదారహృదయత, నిరాడంబరత, నిశ్చల లక్ష్యశుద్ధి, నిర్మల ప్రవర్తనము ప్రతీవారి లక్షణాలు అయివుండాలి.

రూపసౌందర్యమునుచూచి ప్రేమించు ప్రేమ ప్రేమకాదు. అట్టి ప్రేమరూపాంతర్వర్తియై యున్న సౌందర్యనిధియగు పరమాత్మునికి ఘోర దూషణమగును.

జీవితంనుంచి ప్రేరేపణరానిదే ఏసామాజిక కార్యము జరగదు.

భోగాలకు రోగాలభయము. కులంఉంటే అది పోతుందని భయం. ధనం ఉంటే రాజు లాక్కుంటాడేమోనని భయం. అభిమానధనుడికి దైన్యభయం. బలవంతునికి శత్రుభయం. రూపవంతునికి జరాభయం. పండితులకు వాదభయం. గుణవంతునికి దుష్టుని వలన భయం. శరీరానికి మరణభయం. ఈవిధంగా లోకంలోని సర్వమూ భయాన్వితమై వున్నది. అయితే వాంఛా - త్యాగము అనగా వైరాగ్యము కలిగితే ఏభయమూ ఉండదు.

తెలుసుకో; తెలుసుకో; నిజాయితీగా, ఋజువుగా వుండడం ఎన్నటికీ మంచిదికాదు.

అనుభవంద్వారా విచారాన్ని కొనితెచ్చుకోవడంకంటె మూర్ఖుడితో స్నేహంచేసి ఆనందం పొందడం నాకిష్టం.

అధికాధికమైన సహనం, క్రమశిక్షణ నిరంతరకృషి, అహింసకు అవసరం.

పండితుల వాక్చాతుర్యం; శబ్దప్రవాహగరిమ; పాండిత్యము యివన్ని భక్తికొరకేకాని ముక్తికొరకుకావు.

ఒకకుటుంబము సంతోషంగా వుండాలంటే ఎవరి పరిధులలో వారుండాలి. భర్త ఔన్నత్యానికి కారణం భార్య. భార్య భర్తను గౌరవించి దోహదం చేయగలిగిననాడు ప్రేమానుబంధాలను పెంపొందించుకోవచ్చును.

చెప్పులు చేయువాడు చెప్పులు లేకుండా నడుస్తాడు. దుర్బుద్ధి కలిగినవాడు తనక్రియవలననే అగ్నియందు బడినవానివలె పరితాప మొందును.

దానము చేయని యెడల దరిద్రుడగును. దరిద్రము వలన పాపము చేయును. పాపము వలన నరకము కల్గును. సుఖమును కోరే వారెల్లా దినమును వ్యర్థముగా పోనివ్వకుండా ప్రతినిత్యము తనమేలు నకై దరిద్రుడైననూ, స్వతంత్రము లేనివాడైననూ ఎవరికి ఏవస్తువు లభ్యమగునో ఆవస్తువును యోగ్యులైనవారికి దానమివ్వవలెను. యోగ్యుడైన వానినెరింగి వానియింటికి వెళ్ళి దానమిచ్చుట ఉత్తమదానం. తనయింటికి పిలిపించి యిచ్చుట మధ్యమము.

ప్రార్థనలు, సేవలు, కైంకర్యాలు, స్వాతంత్రమును గోల్పుచ్చి పురుషకారమును నశింపచేసి మానవులను బానిసలుగా చేయుటకుపక రించుగాని మరెందులకు గొరగావు.

నాకు శత్రువులు లేరు! అందరూ సోదరులే.

మనం భాగ్యవంతుల మయినపుడు బాధపడే వారికి సలహా లివ్వడం తేలిక.

విశాలాకాశంలో తళుక్కున మెరసి అదృశ్యమయ్యే ఉల్క వంటిది సౌందర్యము.

పనులు త్వరగాపూర్తి కావలెనంటె తడవ కొక్కపనే చేయాలి.

జీవిత శక్తిమహత్తర మైనది. కళాతపస్వి ఆపవిత్రజీవితశక్తిని ప్రేమిస్తూ సర్వదా దానితో సన్నిహిత సంబంధం ఏర్పరుచుకుంటూ జీవిస్తాడు.

ఎవరైనా నీకు ఘోరమైన బాధను కలిగిస్తే ఆబాధకలిగించిన వారు నీకు చేసిన ఏదైనామేలును గుర్తుకుతెచ్చుకో. అపుడు నీవు అనుభ విస్తున్న కొంతబాధ తగ్గుతుంది.

తనలో యిమిడ్చికోలేని సుఖదుఃఖాలు ఎదురైనపుడు మనిషి తన ఆలోచనాశక్తిని కోల్పోతాడు. ఆక్షణానికి ఏమితోస్తే అదిచేస్తాడు. అది ఎంతవరకు సరియైనదని, దాని పర్యవసానం ఎలాంటిదోనని కను క్కొనే శక్తి యుండదు.

భర్త లోకువచేస్తే భార్యలోకానికంతకు లోకువై పోతుంది,

మనల్ని యిపుడు రెండుశక్తులు పరిపాలించుచున్నాయి. నీతి నియమాలకు మూలమైన సంఘభయం ఒకటి, మతంలో మర్మమైన దైవ బలం ఒకటి. ఈరెండు శక్తులే మనల్ని పరిపాలిస్తున్నవి.

కోటిమంది బృహన్నలలో ఒక్క భీమసేనుడుండి మాత్రము ప్రయోజన మేమి ?

ఒకేకాలం కొందరికి బరువు భారంగా తోస్తే యింకొందరికి మరీ సులువుగా, సునాయాసముగా తోస్తుంది. కొందరకు మహా హాయిగా గడిస్తే యింకొందరకు కష్టభూయిష్టంగా నడుస్తుంది.

మానవుడు మరణించిన తరువాత తాను చేసుకొన్న పాపపుణ్య ములు మాత్రమే తనవెంటవచ్చి తనకు కష్టసుఖముల నిప్పించుచున్నది.

కళ్ళతోనే మనం చిత్రించ గలిగితే యెంత బాగుండును ! కళ్ళ ద్వారా, చేతిద్వారా, పెన్సిల్‌లోకి వచ్చేటప్పటికి జీవితం ఎంత వెయి జారిపోతుంది.

పండితులైన వారలు చచ్చినవారిని, చావనివారిని గూర్చి దుఃఖిం పరు.

మత మౌఢ్యాలకు స్వస్తిచెప్పి మానవతకు పట్టాభిషేకం చేయాలి.

స్వర్గముఖంగా చూస్తేనే క్షేత్రాలు అనేటువైనా ఎల్లప్పుడు అందముగా ఉంటాయి.

పోగొట్టుకున్న దాన్ని పొగుడుకుంటూ కూర్చుంటె జ్ఞాపకాలు బరువుగా వ్రేలాడుతాయి.

అంధకారములోనే నక్షత్రాల కాంతి మరింతగా మెరుస్తుంది. దైన్యములోనే, వినయంలోనే దివ్యశక్తి భాషిస్తుంది.

ప్రతి మనుష్యునకునూ గనబడుచున్న యీ దేహమునందు బాల్య, యవ్వన, వార్ధక్యావస్థల్లో అట్లే మరొక శరీరప్రాప్తియును కలుగుచున్నది. కనుక ధీరులైనవాడు యీజనన మరణముల గురించి శోకింపరు.

అన్యాయాన్ని ఎదిరించకపోతే, అక్రమాన్ని అడ్డగించకపోతే, అవినీతిని నిరోధించకపోతే మానవునిగా తన కర్తవ్యాన్ని విస్మరించడమవుతుంది.

కావ్యములు వ్రాసినవారు, కావ్యములందు కీర్తింపబడినవారువారే మహాత్ములు. వారి యశచ్చంద్రికలే లోకమందు స్థిరంగా వుంటాయి.

మంచి అదృష్టం మోసగించని వ్యక్తిని దురదృష్టం నేలపాలు చేయదు.

వ్యక్తిగతంగా పరామర్శించడంలోనే మనిషి ఎక్కువగా ఎదుట వారి కష్టంలో పాలు పంచుకోగలుగుతాడు.

జీవితానికి నిర్వచనం పోరాటం. జీవికి శాంతి మరణములో లభ్యం కాగలదు.

నేను స్వర్గానికి చేరుకునేముందే వాలో స్వర్గం చోటు చేసు కోవాలి.

మనం ఒకరిమీద ఒకరం విసుగు, విరామం లేకుండా అప నిందలు వేస్తూ ఉంటాము. ఎందుకో తెలుసా ! మనిషికి మనిషి ఒక దర్పణం.

దాతృత్వం ఎప్పుడూ 'అతి' అవదు.

చేలు చెట్లు వీటిలో ఏముంది నేను నేర్చుకొనేందుకు? నేను నేర్చుకొన్నదంతాను మనుష్యులనుండే.

జ్ఞానాన్ని ఆర్జించటంకంటె అజ్ఞానాన్ని దాచుకోవటం కష్టం.

మనసులో మాటను ముఖమే తెలుపుతుంది.

ఆనందంగా ఉన్నట్లు భావించని వాడు ఎవడూ ఆనందంగా ఉండలేడు.

లోకులు మనగురించి ఏమిటి అనుకుంటున్నారు. అన్నది మనకు అతిముఖ్యమైన విషయం.

ధర్మదృష్ట్యా పతియే దైవమని నమ్మలేనిస్త్రీ ఎంతస్వేచ్ఛ అనుభ విస్తున్నా బందిఖానాలో ఉన్నటువంటిదే. పరీక్షాసమయం వచ్చేసరికి అధఃపతిత అయిపోతుంది.

అందానికీ, అసహ్యానికి మధ్యగలసమానత్వమే యీప్రపంచలోని మహత్తర విశేషం.

శబ్దస్పర్శ రూపరసగంధాది విషయములో యింద్రియములకు గలిగెడు సంయోగవియోగములు శీతోష్ణాదులనుగలుగచేసి వాని మూలముగ సుఖదుఃఖములను పుట్టించును. అవి అప్పుడప్పుడువచ్చి పోవుచుండునవి.

మానవుని మేధస్సులో మనం గుర్తించగల మొదటి చిన్న సంచలనం - ఆతురత.

ప్రపంచంలోని గొప్పసంఘటనలన్నీ మన మనస్సులోనే జరుగుతాయని అంటారు కొందరు. మనమనస్సులోనే, మనసుకోమాత్రమే ప్రపంచంలోని గొప్పగొప్పపాపాలు కూడ జరుగుతూ వుంటాయి.

తల్లియనగా సత్యము, తండ్రియన జ్ఞానం, సోదరుడన్న ధర్మం, మిత్రుడన దయ, భార్య యన శాంతి, పుత్రుడన ఓరిమి. ఈ ఆరుగురు ఆత్మ బంధువులు. ఈ ఆత్మబంధువులు సహాయం లేనిది మనము ఏనాటికి సౌఖ్య మనుభవించలేము. సౌఖ్యమనుభవించ దలచుకొన్న వారు ఆత్మబంధువులను నిత్యము పరిచయము చేసుకొనవలయును.

మానవులను దాస్యములకు బంధించు వ్యక్తిని నేను తీవ్రముగా ద్వేషింతును. కాని అతనికి నేనువేయు శిక్ష ఆత్మసాధన శిక్షనేప్పతే.

మనిషి ప్రతినిమిషం చనిపోతాడు. ప్రతినిమిషము జన్మిస్తాడు.

వేదభ్యాసము, జ్ఞానసంపాదన, యింద్రియ నిగ్రహం, అహింస, గురు శుశ్రూష యివే మానవులకు శ్రేయస్కరము. అనగా పరసుఖము. ఉత్తమలోకాలను యిచ్చేవి.

తప్పు ఎప్పుడూ తన్నుతాను గుణించుకుంటుంది.

ఔషధం మృత్యువును తాత్కాలికంగా ఆపగలగొచ్చు. కాని మృత్యువుకు వైద్యుడ్నే కబళించగల శక్తివుంది కదా !

ఎవడు సర్వేశ్వరుని చరణ సన్నిధిలో మనసు నిలిపి ఆశారహితుడై యుంటాడో వాడే మహాయోగి.

విద్య అంటె ఆనందించే శక్తిని వృద్ధిచేయడం.

అవసరాలకు మించినంత ధనమున్నవాళ్ళు అవసరంలేని వస్తువుల కోసమే దాన్నివ్యర్థంగా వ్యయంచేస్తారు. ఆత్మకు అవసరమైన ఒక్కవస్తువు కూడా ధనంతో కొనడానికి దొరకదు.

స్వార్థపరుణ్ణి దూరంగాచేసుకోగాని శత్రువుగా మార్చుకోకు. పెద్దమనిషితో స్నేహంచేయి కాని అతను చెప్పిన దానికల్ల తలఒగ్గకు.

స్త్రీతల్లి అవుట కెన్నిబాధలను భరిస్తుందో పురుషుడికర్థం కాదు. ఒకజీవిని ప్రపంచంలోనికి తేవటమంటే తక్కువ కష్టంతో కూడుకొన్న కార్యంకాదు. అందుకే గాంధీ స్త్రీని అహింసామూర్తిగా అభివర్ణించారు.

ఇతరులమీద పెత్తనం చెలాయించడంకన్న మానవునికత్యంత తృప్తికరమైన దేదిలేదు.

సంఘం గురించి అమర్యాదగా మాట్లాడకు. అందులో ప్రవేశం లేనివాళ్ళే అలాచెయ్యడానికి అర్హులు.

సుఖదుఃఖములందు సంతోష వ్యసనములులేక సమబుద్ధిగల పురుషుని అవిబాధింప జాలవు. అట్టి పురుషుడు మోక్షమును బొందుటకు తగినవాడు అగును.

మానవజీవితాన్ని హేతువుకంటె అధికంగా అదృష్టమే పరిపాలిస్తుంది.

ఇళ్ళు కట్టేవారందరికీ నాదొకటే సలహా. ఇంటియజమాని గృహానికలంకారము కావాలి. అంతేగాని గృహమే అతనికలంకారము కాకూడదు.

నిన్నుచూచుకు నీవు జాలిపడడం కాక ఆజాలిని యితరులపట్ల కనబరిస్తే అదెన్నటికీ వృథాకాదు.

ఎంతో ఎక్కువగా మాట్లాడే వారెప్పుడూ చాలా తక్కువగా ఆలోచిస్తారు.

బతికున్న మనుష్యుల్ని గురించి అభిప్రాయాలు ఏర్పరచుకోవడం అవి శాశ్వితమైనవి అనుకోవడం ఎంతో తెలివితక్కువ. ప్రతిమనిషిలోను అంతర్గతంగా అజ్ఞాతంగా ఒకేఒక అతీత స్వరూపం నిక్షిప్తమై వుంటుంది. అఖండ మానవాళిని, అనంత ప్రాణకోటిని సృష్టిసర్వస్వాన్ని ఏకంచేసే మహాశక్తి అదే.

చెవులుండి వినలేనిస్థితి కన్నులుండి చూడలేనిస్థితి జీవితంలో సంభవమే.

ప్రేమకు అతిస్వల్పమైన సాకుచాలు.

ఇతరులు భుజించటానికి జీవిస్తారు. అయితే నేను జీవించటానికి భుజిస్తాను.

మన అమ్మమ్మలు అమ్మాయిలుగా వున్నప్పుడు నేటి అమ్మాయిలు మాదిరిగా చేయలేదు. అయితే మన అమ్మమ్మలు యిప్పుడు చేస్తున్నట్లే తాము అమ్మాయిలుగా వున్నప్పుడూ చేయలేదు.

ఏపనైనా ముందు తామాచరించి తరువాత చెప్పుట అత్యుత్తమ గుణం.

మించిపోయిన కార్యానికి చింతించిన ఫలములేదు.

రచయిత రచనలు చేసేటపుడు తనకు ప్రత్యక్షంగా తెలియని వాటి జోలికి పోకూడదు. లేకపోతే నిజాయితీ దెబ్బతింటుంది.

కోరికలు నశింపనివాడు దిగంబరి యయినప్పటికీ, జడలును ధరించినప్పటికీ, గట్టినేలపై పరుండి నప్పటికీ, కాషాయ వస్త్రములు కట్టుకొన్నప్పటికీ పవిత్రుడు కాలేడు.

న్యాయానికి కట్టుబడి చేసే ఏవృత్తి అయినా గౌరవ ప్రదమైనదే. హెచ్చుతగ్గులు మనం కల్పించుకునేవి. గుమస్తాను చూచి ఆఫీసరు "వాడు వట్టి గుమస్తా" అని వెక్కిరిస్తాడు. అలాగే పెద్ద ఆఫీసరు చిన్న ఆఫీసరును చూచి "వాడొక పెట్టీ ఫెలో" అంటాడు.

ఒకప్పుడటూ ఒకప్పుడిటూ తాత్కాలిక భావోద్రేకాలకు క్షణిక ఆవేశ కావేశాలకు లోనై తానెక్కిన కొమ్మనే తాను నరికి వేసుకునే వెర్రికి మనిషి పాల్పడుతున్నాడు.

ఖర్చుకన్న రాబడి ఎక్కువ వున్నవాడే కలిమి కలవాడు. సంపాదనకన్న ఖర్చు లెక్కువ చేసేవాడే లేనివాడు.

సుగుణాలకు స్వర్గమంటు ఒకటి ఉంటే, నేరాలకు నరకమంటూ ఒకటి వుండాలి.

బలంవుండికూడ యెదుటి వ్యక్తి చేసిన అవమానాన్ని సహించ డం అనేది పౌరుష రహితంకాదు. పిరికితనం అంతకన్నాకాదు. అవమానానికి, హింసకు ప్రతీకారం తలంచక సహనాన్ని ప్రదర్శించ డం అనేది మానవత్వాన్ని ఎదుటి వాడికి నేర్పించడం. ఇటువంటి మానవత్వంముందు ప్రత్యర్థి తలవంచక తప్పదు.

ప్రతిగ్రామములోను అవసరానికి డబ్బు అప్పుయివ్వగలవాడు, మందు, మాకుయిచ్చేవాడు, నీటిసదుపాయం మంచిచెడ్డ చెప్పేవాడు ఉండాలి.

కావ్యామృతఫలం అపూర్వంగా ప్రకాశిస్తూ ఉంటే ఎంత మందో రుచిచూస్తూ ఉంటారు. కాని స్వారస్యం మాత్రం బహుకొద్ది మంది సాహితీవేత్తలు మాత్రమే గ్రహింప గలుగుచున్నారు.

బుద్ధిని వాక్యము - అహింసాసిద్ధాంతములను పండిత, పామరులకు, బోధించి జంతుహింస నివారణా ప్రచారము చేయవలెను.

బ్రహ్మచర్యము అభ్యసించు వానికి ఆత్మజ్ఞానము, అమానుష ప్రజ్ఞ, బ్రహ్మతేజస్సు కలుగును.

జీవితానికి లక్ష్యం ఆనందం కాదు; శీలం.

పంచేంద్రియాల అనుభవం పొందికూడా సంతోషాన్నికానీ, దుఃఖాన్ని కానీ ఎవడు పొందడో వాడే జితేంద్రియుడు.

విద్యార్థిదశ అమూల్యమైనది. దానిలో ప్రతీనిమిషము, ప్రతీ గంట విలువైనవి. దాన్ని వృధా చేసుకోవడంకంటె తెలివితక్కువ మరొకటిలేదు. విద్యా విజ్ఞానార్జనకు వినియోగించవలసిన కాలాన్ని మరొక విధంగా ముఖ్యంగా ఆందోళనోద్యమాలకు వెచ్చించడంకంటె బాధాకరమైనది మరొకటిలేదు.

వుండుపధార్థము లేకపోవుటయు, లేనిపదార్థము వుండుటయులేదు. సత్పదార్థమైన ఆత్మస్వరూపము నాశరహితమైనదియు, అసత్పదార్థ మైన దేహస్వరూపమును నాశముగలదియనియు బ్రహ్మవేత్తలు ఎరింగి యీరెంటియొక్క నిశ్చయముల నిట్లేయని తలంచియున్నారు.

సౌభాగ్యం వుపయోగించే పనిముట్టు; పూజింపవలసిన దేవత కాదు.

మనం నిదానంగా, జాగ్రత్తగా ఏయేడు కాయేడు గతాన్ని పరిశీలించుకోవాలి.

జీవితంలో అలసిపోయినప్పుడు పురుషులు పెళ్లాడుతారు. కొత్తుకృత్యంవల్ల స్త్రీలు పెళ్లాడుతారు. ఇద్దరు ఆశలు విఫలమవుతాయి.

దొంగలు, రాజోద్యోగులు, శత్రువులు, రాజబంధువులు, ధన లోభం వీట్లనుంచి కన్నతండ్రివలె రాజు (ప్రభుత్వం) ప్రజలను కాపాడాలి.

ఈ ప్రపంచములో మానవుడు ఒక యింద్రజాలం. ప్రపంచం లోని యింద్రజాలా లన్నిటికీ యితడే సృష్టికర్త.

మూఢనమ్మకాలను తొలగించడం కూడ ఒక మూఢనమ్మకమే.

జీవితం చాలా చిన్నదే. కాని దాంట్లో నమ్రతగా ఉండటానికి చాలా సమయంఉంది.

ప్రయత్నము లేక కార్యములు నెరవేరవు.

మనమంతా జీవన యాత్రా మార్గములోని పధికులం. ప్రజాజీవన మార్గములో ఆటంకాలను నిర్మూలిస్తూ మనం సాగిపోవాలి. మనతర్వాత వచ్చే పధికులు తమ జీవయాత్ర సుఖంగా సాగించేటట్లు చేతనైన యేర్పాట్లు చేయవలసిన భాద్యత మనమీద ఉన్నది.

ఓరిమితో వహించడం మనం విధిని జయించడమే.

నాకు ప్రేమకంటె, సంపదకంటె, పేరు ప్రఖ్యాతులకంటె చిత్తశుద్ధి విలువైనదిగా కనబడుతుంది. ధనికుని యింట్లోఏర్పరచిన ఆప్యాయతలేని విందు, మింగలేని మందుగా ఉంటుంది నాకు.

ఆలోచనలు న్యాయమార్గం తప్పిన చిహ్నాలు కనబడితే దుఃఖము నీకోసం పొంచివుందని తెలుసుకో.

పిల్లల పోషణ అనే విషయం వారు పుట్టిన తర్వాత ఆలోచించడంకాదు. వారు గర్భంలో వున్నప్పటినుంచీ ఆలోచించాలి. అది ఆలోచనకు సరి అయిన సమయం.

సంఘ నిర్మాణంవలన జాతీ యాంతర్జాతీయ కార్యసాధన వలన పరమావధిని చేడుకొనుట తెప్పయని భ్రమించి మొసలి వీపుమీద నదిని దాట ప్రయత్నించుటే.

చేతనా చేతన విశిష్టంబైన ఈ ప్రపంచమంతయు చేతనంబైన ఏవస్తువుచే వ్యాపింపబడి యున్నదో, ఆ పరమ చేతనమే ఆత్మయని యెరుగదగినది. అవ్యయంబైన ఈ యాత్మను నశింపచేయుటకు శక్తి గలది ఏదియులేదు. కనుక అది నశింప పోదు.

చేసినతప్పు అదెంత పెద్దదయినా, చిన్నదయినా కొద్దిరోజులే మనసుని రగులిస్తుంది. ఆ తరువాత కాలం జ్ఞాపకాన్ని, మంటనీ చలారుసుంది.

ఒక మనిషి పులిని చంపితే అది వేట అనిపించు కుంటుంది. కాని పెద్దపులే మనిషిని చంపితే అదిభీకరత్వం అనిపించు కుంటుంది.

మంచి, చెడ్డ అని ఎక్కడా వుండదు. అంతా మనం అను కోవడంలో అలా ఏర్పడుతుంది.

మనం పుట్టేటపుడు "ఈ మహా మూర్ఖనాటిక రంగానికి పాత్ర ధారులమై వచ్చేమే" అని రోధిస్తాం.

అతులిత యశస్సును పొందే చక్కని దగ్గరదారి నీవు ఏది అపేక్షిస్తావో అందుకు ఏమి ఆలోచిస్తావో దానికి ఆటంకాలెన్ని వచ్చినా ఆచరించుకు పోవటమే.

మనకి చేతనైతే ఆటంబాంబులకన్న ఎక్కువైన అస్త్రాలేన్నో ప్రయోగించుకునేవాళ్ళం; చేతకాక యింకోళ్ళని వెక్కిరించ గలుగు తున్నాము.

భగవానుని సృష్టిలో ఉత్తమోత్కృష్టమైన జీవి స్త్రీ. అట్టి స్త్రీని కామ వాంఛతో చూచినపుడు పురుషుడు మృగప్రాయుడగును. పురుషుడు మృగప్రాయుడుగా మనుటకంటె మరణించుట మేలు.

అహింసలో నమ్మకం కలవాడు అన్యాయాలను సహించలేడు.

ప్రయత్నంచేసి యిసుకనుంచి చమురు తీయవచ్చు. ఎండమావుల లోని నీటితో దాహం తీర్చుకోవచ్చు. తిరిగి తిరిగి కుందేటికొమ్ము సాధించవచ్చు. కాని ప్రయత్నించి మూర్ఖుని మనసు రంజింప చేయ లేము.

ఏసుక్రీస్తుయొక్క బల్యర్పణగా మరణించుటద్వారా దేవుడు నేడు ప్రపంచములోని ప్రతిపాపుని నీతిమంతునిగా తీర్చుటకు అవకాశమును గలిగియున్నాడు. ఈకారణముచేత మనుష్యుడు తాను చేయుదానినిబట్టియైనను లేక చేయనిదానినిబట్టియైనను నీతిమంతునిగా తీర్చబడజాలడు. కల్వరి సిల్వలో క్రీస్తు తనకొరకు చేసినదానియందు విశ్వాసముంచుట ద్వారానే అతడు నీతిమంతునిగా తీర్చబడును.

ఎల్లపుడును ఏకరూపమునకై నాశములేనిదై ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరంబు కానిదై యుండు ఆత్మకు ఈ శరీరములు కర్మక్షయంబు కాగానే నశించును.

నిజంగా ఏమతంపైనైనా అభిమానం వున్నవాడు సహజంగా మరొక మతాన్ని తూలనాడలేడు.

బాహ్యసౌందర్యం క్షణికమైనది. అంతర్య సౌందర్యం చెక్కు చెదరినిది; మొక్కలోనిది, శాశ్వితమైనది.

ఇతరులు ఏరుకుని తీసుకుంటారనే భయంలేకపోతే మనం ఎన్నో విలువైన వస్తువులను ఎంతో చులకనగా విసిరేస్తాం.

కాలానికి అనుకూలంగా అన్నికట్టుబాట్లు మారిపోతాయి. అందులో ఆశ్చర్యపడవలసిందిగాని, భయపడవలసిందిగాని ఏమీలేదు.

నిజాలను భూస్థాపితం చేస్తే పేలుడు పదార్థాలుగా మారతాయి. ఏదో ఒకనాడు పేలి వెలుపలికి రావటం తథ్యం.

**తల్లితండ్రుల సేవచేయు వారికి దివ్యమహిమలు సిద్ధించును.**

నీభక్తి విశ్వాసములు నీలోనే యుంచుకొనుము. అవి నీవద్దకలవని చాటుకొనవద్దు. అట్లు చాటుకొందువేని నీకు మిక్కిలి నష్టం కలుగును.

ధనుర్విద్యలో నేర్పరులైనవారు ఏవిధముగా లక్ష్యమును భేదించ గలరో ఆవిధంగానే పట్టుదలతో ఏకార్యాన్నైనా సాధించగలరు.

కలవారి కలిమికి సంబరపడటం లేని వాళ్ళలేమికి జాలిపడి చేతనైన సహాయంచేసి ఆదరించటం మన ఆచారం అయివుండాలి.

మొక్కైఅయి వంగనిది మ్రానై వంగదు.

భగవంతుడు అన్నిచోట్ల ఉండలేక పోయాడు. కనకనే తల్లులను సృష్టించాడు.

స్వర్గం నివారించలేని విషాదం భూమిలోలేదు.

కొలంబస్ మాదిరిగా నీఅంతరంగములో అజ్ఞానంగావున్న అపరిచిత సీమలను అవిష్కరించడానికి పూనుకో.

దృక్పథములో మార్పురానిది కేవలం అవసరంకొలది యెంతగా మారిన ఆమార్పు సహజం కాదు, శాశ్వతంకాదు.

అతిమానం యెలాటి లలిత హృదయులనైనా కోపదగ్ధులను చేస్తుంది. బాదిద్దామని, ఏడుద్దామని, లేదా ఏడిపిద్దామనే రాక్షస సంకల్పాన్ని రేకెత్తిస్తుంది.

ప్రపంచములో ఆత్మను జంపునట్టి సాధన వస్తువు ఏదైనా ఒకటి యున్నదని తలంచువాడుగాని, ఆత్మను జంపబడు వానిగా నెంచువాడు గాని వీరిద్వరను తెలిసినవారలు కాదు, ఆత్మ నిత్యుడగుట వలన వానిని జంపునట్టిది ఏమియులేదు. కనుక చంపబడు వాడు కాడు.

ఆడది అదుపుతప్పితే ఆమెను అణచిపెట్టటం ఆమెను సృష్టించిన బ్రహ్మతరం కూడాకాదు.

దానంవలెనే అహింస కూడా స్వగృహంనుంచి ప్రారంభం కావాలి.

ఒకసమస్య దానికదె పరిష్కారం అయిపోదు. దానికి ఎవరు భాద్యులో వాళ్ళంతా పూనుకోవాలి. సంసారాలు, జీవితాలు సుఖంగా సాగాలంటే ఆడవాళ్లు మారాలి. మగవాళ్లు మారాలి. ప్రభుత్వంమారాలి. కాలానుగుణ్యంగా ఎప్పుడూ మారుతూవుండాలి. అందరి మార్పుకు సమన్వయం ఉండాలి. మార్పులు యిష్టంలేనివాళ్లను మార్చడానికి ప్రయత్నించాలి. వీలుకాకపోతే వారిని వదిలివేసి ముందుకు పోవాలి.

నేను అజ్ఞానినన్న విషయం నాకుతెలుసు. అంతకుమినహా మరింకేమి నాకు తెలియదు.

బాగా ఆలోచించు. కొద్దిగా మాట్లాడు. తక్కువగా వ్రాయి.

ఆత్మ ఒకప్పుడును జనన మరణములను బొందెడు వాడుకాడు. కల్పారంభమున బుట్టి కల్పాంతరమున నశించెడి శరీరమువలె ఒకప్పుడు పుట్టి తరువాత లేకపోవువాడునుకాదు. మరియును పూర్వములేకయుండి పిమ్మటనుండువాడునుకాదు. ఎల్లప్పుడు ఏకరీతిగా నుండువాడును, అనాదియైనవాడును, శరీరములు మారినను తాను మాత్రము మారని వాడు.

తోటిమనిషిని ప్రేమించటం చేతకాకపోతే కాకపోవచ్చుగానీ అందుకని ద్వేషించడం మాత్రంకూడనిపని.

గొర్రెకు ఎదురుగానూ, గుర్రానికి వెనుకగానూ, మనిషికి అన్ని వైపులానూ వెళ్లేటపుడు కొంచెంజాగ్రత్తగా ప్రవర్తించాలి.

అల్లుడు అత్తమామలను పీడించుకుతినకుండా మంచితనంగా వ్యవహరించాలి.

మనం సంస్కారంగురించి మాట్లాడితే తలనొప్పితో ముగుస్తుంది.

పౌరుషము గౌరవము కలది.

వేదశాస్త్రాలూ, స్మృతులూ మనకోసం ఏర్పడ్డవి. వాటికోసం మనం ఏర్పడలేదు. కనుక కాలంతోపాటు మారేందుకు మనిషి సందేహించనవసరములేదు.

మన జీవితంలో మంచికీ, చెడ్డకీ రాజీపొసగదు. మంచితనాన్ని మించిన పెట్టుబడి మరొకటి లేదు.

ముఖము ముందర పొగడ కూడదు. వెనుక తిట్టకూడదు.

మనల్ని మనం మోసంతో మన ప్రేమ ప్రారంభమవుతుంది. ఇతరులను మోసం చెయ్యడంలో అంతమవుతుంది. దీన్నే ప్రపంచం "ప్రణయం" అనే పేరుతో పిలుస్తూ వుంటుంది.

లోభంకంటె చెడుగుణం లేదు. కొండేలు చెప్పడంకంటె పాపం లేదు. సత్యవ్రతాన్ని మించిన తపస్సులేదు. మంచిమనసు వుంటే తీర్థంతో పనిలేదు. సౌజన్యాన్ని మించిన బలం, కీర్తిని మించిన

అలంకారంలేవు. విద్యకంటె ఎక్కువైన ధనంలేదు. అపకీర్తిని మించిన చావులేదు.

ఇతరుల దుఃఖాలనుచూచి బాధపడే వ్యక్తికంటె నాదృష్టిలో గొప్పవాడు ఎవడూలేడు.

ప్రపంచం జీవించడానికి అద్భుతమైనతావు కానిపిస్తుంది. నీలాకాశాం, ప్రకాశమానమైన సూర్యరశ్మి, కమ్మని పరిమళాలు గుభాయించే తృణాలు వీటితో ఏర్పడింది జీవితం. కోరినట్లయితే యేక్షణానైనా తన కోర్కెలీడేరుతాయని ఏవరైనా అనుకోవచ్చును.

న్యాయార్జితమైన సంపాదన మాత్రమే తరగక సంతానమును బాధలనుండి కాపాడుతుంది.

యెవడు ఆత్మను అంత్యభావ వికారరహితునిగాను, జననము లేనివానిగాను, క్షయరహితునిగాను ఎరుంగు చున్నాడో అతడు మరియొకని తానుగానే చంపుటకు గాని, ఒకనిచేత చంపించుటగాని, ఎట్లు సంభవించును? ఒకడుమరియొకని జంపుదుననియు, జంపింతుననియూ తలచి దుఃఖించు టంతయు నాత్మయొక్క యధార్థస్థితిని ఎరుంగమిచే గలిగినదేగాని వేరుగాదు.

అవతార పురుషుడొక్కడేగాని జీవసముద్రమునందు మునిగి ఒకానొకచోటతేలి యచ్చట కృష్ణుడనిపించు కొనును. మరల నింకొక చోట మునిగిలేచి క్రీస్తు అనిపించుకొనును.

ఒక సుప్రసిద్ధ రచయిత తన ఎనభైరెండవపేట అన్నమాటలు "అరవైయేళ్ళక్రితం నాకు అంతా తెలిసినట్లు ఉండేది. ఇపుడు నాకు తెలిసినది బహుకొద్దియని తేట తెల్లమవుతుంది. మనలోని అజ్ఞానాన్ని ఆయేటికాయేడు తెలుసుకుంటూ ఉండటమే పిసలైన విద్య."

పిరికివాళ్ళు మృత్యువుకు ముందు చాలసార్లు మరణిస్తారు. ధైర్యవంతులు చావును ఒక్కసారి చవిచూచి ఎదుర్కొంటారు.

ప్రతీకార్యాన్ని చేయాలనుకుంటే గాయాన్ని పచ్చిగా వుంచితేనే సాధ్యం.

దారంతెగిన గాలిపటం యెంతోదూరం ఎగరలేదు.

ప్రపంచాన్ని తనహృదయానికి దగ్గరగా తీసుకుంటే కవి అవుతాడు. ప్రవక్త అవుతాడు. సంస్కారికాడు.

సూర్యుని కిరణాలచే వేడెక్కిన భూమిని చంద్రుడెలా చల్లబరుస్తూంటాడో అట్లే సంసారతాపతప్తులైన వారిని మహాత్ములు శాంతిబరుస్తూ వుంటారు.

జీవితంలో నిస్సారత ఏర్పడ కూడదు. నూతనోత్సాహం అవసరం. నూతనోత్సాహం కలిగాక పోవడంగాని, కలుగుతుందనే ఆశ లేకపోవడంగాని జీవితంమీద విరక్తి హేతువవుతుంది.

మంచీ, తెలివీ — దుర్మార్గులకు దుర్మార్గంగా కనబడతాయి.

స్త్రీలు పెద్దలను సేవించాలి. సవతులను ప్రియసఖులవలె చూచుకోవాలి. భర్తకు కోపంవచ్చినా ఎదిరించి జవాబివ్వకూడదు. పరిజనాన్ని దయతో చూడాలి. ఐశ్వర్యం ఉందని గర్వించ కూడదు. ఇలా వున్నస్త్రీలే సరియైన గృహిణులు. ఈరీతిని నడుచుకోని స్త్రీలు వంశానికి వ్యధలు.

శిధిలములైన వస్త్రములను త్యజించి నూతనములైన యితర వస్త్రములను ధరించెడు వానివలె యీ ఆత్మ తాను అనుభవించి జీర్ణములైన శరీరమును త్యజించి నూతనమైన వేరొక శరీరమును పొందుచున్నారు.

తాను తనమతాన్ని ఎంత ప్రగాఢముగా విశ్వసిస్తున్నాడో ఆలాగే ఎవరి మతాన్ని వారు విశ్వసిస్తారని అలాంటి వ్యక్తి సర్వసాధారణంగా భావిస్తాడు.

జీవితానికి స్త్రీ అనేది శలవుదినంవంటిదని కొందరి అనుభవజ్ఞుల అభిప్రాయం.

పరిశుభ్రతను భగవంతుడు ప్రేమిస్తాడు.

ఇదినాది యని యహంభావము లేక, సర్వమూ దైవాధీనమే యని విశ్వసించి వైరాగ్యం పూనుటకంటె మనుష్యునికి క్షేమకరమైన మార్గము మరొకటిలేదు.

నాఅభిప్రాయంలో మానవాతీతమైన భావాలేమిలేవు. అన్నిభావాలకు సృష్టికర్త మానవుడొక్కడే. అతడే ఒక అద్భుతమైన పనివాడు. ప్రకృతి శక్తులన్నింటికీ భవిష్య యజమాని. ఈప్రపంచంలో అత్యంత సుందరమైనదంతా మానవుని శ్రమతోనూ, నిపుణమైనఅతని హస్తాలతోను సృజింపబడినవే. మన ఆలోచనలు, భావాలు అన్నీకూడా శ్రమ అనే క్రమములోనుంచి వచ్చేవే. మానవుడికి నేను నివాళులర్పిస్తాను. ఎందుకంటె ఈ ప్రపంచంలో నాకు మానవుని వివేకం, ఊహ ఉపజ్ఞల స్వరూపాలు తప్ప మరేమి కనిపించడంలేదు.

పెద్దవాడవయ్యావని మొట్టమొదటగా ఎవరన్నా అన్నపుడు మనిషి నిర్ఘాంత పోతాడు.

కౌటిల్యము లేకపోవుటయే మనః పరిశుద్ధత.

సాగరతీరంలోని మెట్టప్రదేశాన్ని, పర్వతాన్ని, సాగరాన్ని, సెలయేరునూ విడివిడిగా చూడు. అన్నింటినీ కలిపి చూడు.

జీవజాలములో మనిషి మాత్రమే దైవప్రార్థన చేస్తున్నాడు. నిజానికి అతనికా అవసరంకూడా వుంది.

స్త్రీలు ఒకరిని ఆడిపోసి తమను తాము సమర్థించుకుంటారు. ఒక్కొసారి హటాత్తుగా లొంగిపోతారు. అదికూడా వారు ఎదురు తిరగడమే.

విద్యకల్పవృక్షములా అన్నికోరికలను తీరుస్తుంది. తల్లివలె రక్షించి, తండ్రివలెహితంచెప్పి, భార్యవలెదుఃఖాన్ని పోగొట్టి ఆనందింపచేస్తుంది. దిక్కులన్నిట కీర్తిని వ్యాపింపచేసి ఐశ్వర్యాన్ని యిస్తుంది. విద్యసాధించలేనిదేదీలేదు.

సుస్వాగతం చిరునవ్వులు చిలకరిస్తుంది. వీడ్కోలు నిట్టూర్పులతో శలవు తీసుకుంటుంది.

విత్తనము ఒకటివేశిన మొక్కవేరొకటి మొలవదు.

అంతరాయములు, కష్టములు - దీనితోగూడిన సాగరమునబడి బ్రహ్మజ్ఞాని యెన్నడునూమునుగడు. సూర్యుడు ఎన్నడూ అంధకారమ్ముగున్నడుకాడు,

మనిషన్న తరువాత తప్పులు చెయ్యడంసహజం. కావాలని కొందరూ, పరిస్థితులప్రభావమువలన కొందరూ, మోసగించబడికొందరూ కాలుజారడం జరుగుతుంది.

కొన్నిసంవత్సరాలక్రిందట నేనొక కూలీననిచెప్పుకోవడానికి నాకు బిడియంలేదు. మానవసౌకర్యాలన్నిటికీ శ్రమేమూలాధారము.

స్త్రీపవిత్రతకు, స్వార్థత్యాగానికి పుట్టిల్లు.

స్త్రీలు మనల్ని గొప్పకళాఖండాలు సృష్టించడానికి ప్రేరేపిస్తారు. కాని అవిపూర్తికాకుండా మనకు అవరోధాలు అవుతారు.

మానవుడు బలిసినంతమాత్రాన అతని విజ్ఞానము వృద్ధిచెందదు.

నిలకడలేక అనుదినం పరిధి స్వరూపాల్ని మార్చే చంద్రుని ఉపమతో ఏ ప్రేమను సరిపోల్చకు.

మానవుని ఆత్మను శస్త్రాదులు ఛేదించి చంపజాలవు. వృక్షాదుల వంటివాడు కాకుండుటచే అగ్నిహోత్రుడు దహించి చంపజాలడు. పరిదృశ్యంబైనయొక అవయవి కాకుండుటచే నుదకములు తడుపజాలవు. తైల విశిష్టుడైనవాడు కాకుండుటచే వాయువు ఎండించి నాశముచేయజాలడు.

ఆలోచించేందుకు కొందరు చదువుతారు. ఇలాంటివారు చాలా అరుదు. వ్రాయడానికని చదువుతారు కొందరు. వీరు సర్వసాధారణంగా కానవస్తారు. కొందరు మాట్లాడడానికే చదువుతారు. విస్తారంగా కనిపించేది వీరే.

విద్యాధనమదోన్మత్తుడై తండ్రిని హేళనచేసినకళ్ళు కనపడని పొగరుపోతు ధర్మచ్యుతుడై నరకములో పడిపోతాడు.

క్షమించటములోనే శిక్షించటం కూడా యిమిడి ఉంది.

ప్రాణంపోయేలోగా పిరికవాడు చాలసార్లు చస్తాడు. ధైర్యవంతుడు ఒక్కసారే చస్తాడు.

లోకంలో పసివాళ్ళందరిదీ ఒకటేమతం. కల్లాకపటం ఎరుగక స్ఫటికంవలె స్వచ్ఛంగా ఉండేవాళ్ళ మనస్సులకు మతభేదాలంటూలేవు. అంతలో కళ్ళవెంటనీళ్ళు పెట్టుకుంటూ, అంతలోనే కిలకిలానవ్వుతూ ఉండటమేగాని వాళ్ళమనసులకు యింకా సుఖ, దుఃఖాల మాలిన్యము అంటుకోలేదు కనుకనే వాళ్ళు ఈశ్వర స్వరూపాలు.

భగవంతుడు స్వర్గమనే ఊర్ధ్వలోకంలోగాని, పాతాళములోగాని, లేడని ప్రతివ్యక్తిలోను ఉన్నాడని నాకుతెలిసినందు వల్లనే మానవసేవ ద్వారా భగవంతుని దర్శించటానికి కృషిచేస్తున్నాను.

భగవంతుడు ప్రపంచములోని కష్టమైన పనులన్నిటిని స్త్రీ నెత్తి పైనే వేశాడు. అయినా అందరికంటె స్త్రీలే యెక్కువగా భగవంతుని మాయలోపడి కొట్టుకుంటున్నారు.

తాను ప్రగతిపదంలో ముందుకుపోతూ వెనుకకే తిరిగిచూస్తే మనిషిగతి అధోగతే. అలాటివారు అడుగడుకూ ఎదురుదెబ్బలుతిని పడిపోక తప్పదు.

మంద బుద్ధులున్నస్థాయికి సాహిత్యం దిగిరాకూడదు. వాళ్ళకి ఉన్నత ప్రమాణాల పట్ల అభినివేశనం కలిగించాలి.

స్త్రీ పురుషుడ్ని సంస్కరించేవిధం ఒకటేఉంది. అది అతనిని జీవితంలో పూర్తిగా అసక్తి నశించేవరకూ అతన్ని విసుగెత్తించడం.

వాంఛారహితుడయిన మానవుడు దైవం అని నానమ్మకం.

పుస్తకాలవల్ల సంపాదించిన విజ్ఞానం మనం చేతలలో ఉపయోగించకపోతే అది వట్టి చెత్తకాగితాలన్నమాట.

మానవుడు ఆత్మను భేదింపదగనివాడును, దహింపదగని వాడును, ఎండింపదగనివాడునై ఆకారరహితుండును, సర్వవ్యాపకుండును, స్థిర స్వభావుండును, అచలుండును, అనాదియునైన వాడని యెరుగవలెను.

ప్రతి ఒక్కరు చేతనైనంత వరకూ తమ పనులు తాము స్వయంగా చేసుకోవడం ఉత్తమం.

కోరిక మొదటిద్వారం సెక్స్. హృదయమూ, మనసూ అనంతంగా తతిమ్మాద్వారాల్ని తెరుస్తాయి.

ఎటువంటి వ్యక్తయినా ఒకతప్పు చేయడం సంభవమే కాని మూర్ఖుడు మాత్రమే తప్పులు చేస్తుంటాడు.

సన్యాసికి అడవికి పోవడం వలన కలిగేఫలం గృహస్తునికి ధర్మ మార్గము వలన కలుగుతుంది. నైతిక విలువలే సంస్కారానికి పునాదిరాళ్లు.

ద్వేషం, భయం, ఎరుగని ప్రేమ ఒక్కటే మానవునిలో దుష్టత్వాన్ని జయించగలదు. రాక్షస ప్రవృత్తిని మార్చగలదు.

సువర్ణమంటే సాధువుల్నికూడా చెరిచేది.

నిజభర్తృశుశ్రూష యందు నిత్యాశక్తయైన పతివ్రతకు అఖిల యజ్ఞ దాన తపం ఫలములు, దైవశక్తులు ప్రాప్తించును.

గాఢమైనప్రేమ ఉందా, దానిప్రక్కనద్వేషం ఉండనే ఉంటుంది.

ఆగ్రహోద్రేకాలు అగ్నివంటివి. యెన్నోవేల రీతుల్లో ఉపయోగకరమైనవి. మోతాదు మించితే ఉపద్రవకరమైనవి.

నిజంగా ధైర్యం ఉన్న మనుష్యులెవరూ ఆత్మహత్యకు ప్రయత్నించరు. శక్తి సామర్థ్యాలతోను, బుద్ధిబలంతో పోరాడుతారు. జీవితంలో ఏవొక్క వ్యామోహం తమకు ఆనందాన్ని యివ్వలేదని తెలిసి కూడా ఒకవిధమైన అభిప్రాయంతో జీవితాన్ని పరికిస్తూ బ్రతకటానికి తగిన సాధన చేస్తారు.

మనవ్యక్తిగత సామర్థ్యాన్ని నిరాడంబరముగా వృద్ధిచేసుకుంటే మనకి అంతసంతృప్తి ఉండదు. మనశక్తి సామర్థ్యాలచేత యితరులకు

ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ, చేకూర్చి వారిని మనకు లోను చేసుకొనలె ననే ఎక్కువగా అభిలాషిస్తాము.

కొండగుహల్లో, కారడవుల్లో ఉన్నంతమాత్రాన, కాషాయ వస్త్రములు ధరించినంతమాత్రాన, ఆశాపాశ బద్ధుడు యోగికాలేడు.

మానవుని ఆత్మ చక్షురాది యింద్రియములకు అగోచరుండును, మనస్సునకు నచింత్యుడునగుటచే ఛేదనాది కార్యసాధన పదార్థముల యొక్క స్వభావములతో సంబంధింపనివాడై, విజాతీయుడై, వికార్య శూన్యుడై యుండును. కనుక ఆత్మవిషయకమైన శోకము తగదు.

దురాలోచనలు చేసే మనసుతో మనం సహకరించని పక్షంలో అంతిమంలో విజయం మనకే సిద్ధిస్తుంది.

స్వర్గంలో స్పష్టంగా గంటలా మ్రోగేవే సత్కార్యాలు.

విరక్తుడు ఒక్క మాటతో అధైర్య పరచగలడు.

కేవలం చట్టాలతో వాటితో ఏకంకాదు జనం. అనురాగంతో, ఆదరముతో, అభిమానంతో, పరస్పర అవగాహనతో ఏకమవుతుంది.

మనిషికి మానసిక సౌందర్యం ఉండాలి.

ఒకరికి నారచీరలతో తృప్తిఅయితే ఒకరికి పట్టుబట్టలుకావాలి. సంతృప్తి యిద్దరికీ సమానమే. యెవరి ఆశకైతే అంతములేదో వాడే దరిద్రుడు. మనస్సంతుష్టి కలిగాక ధనికుడెవరు ? దరిద్రుడెవరు ?

వేదాంత ప్రశంసలకన్న ఆర్థిక పరిస్థితులు నడవడి తీర్పుటలో శ్రేష్టమైనవి.

తత్వవేత్త దేన్నిచూచి అయినా ఆశ్చర్యభావం వెలిబుచ్చుతాడు. కాని తత్వచింతనకు ఓనమాలు ఆశ్చర్య భావమునుండే వెలువడినవి.

నేను నిదానంగా నడుస్తాను. కాని యెన్నడూ వెనక్కు నడవను.

భార్యయందు భర్తకు గాని భర్తయందు భార్యకుగాని మోహం అతిశయించుట లోకమందు సహజముగాని ఆలుమగలు యిద్దరికిని సమానమైన మోహం కలిగి ఉండుట సహజంకాదు. అట్లుగాక ఉభయులకునూ వలపు సరిగా నుండుట పూర్వజన్మమునందు చేసిన పుణ్య ఫలమేకాని యితరముకాదు.

ఆత్మహత్య జీవిత సమస్యను పరిష్కరింప జాలదు. తను పరిష్కరింపజాలని గణిత సమస్యను విద్యార్థి పలకమీద లేకుండా చెరపివైచినచో సమస్యా పరిష్కారమగునా ?

బాధలలోనూ, ఆవేదనలోనూ మమతా హృదయం కలవాడే హాయిగా నవ్వగలడు; నవ్వించగలడు.

యెవరైనా అపకారము చేసినపుడు వెంటనే తిరిగి దెబ్బతీయాలనే సంకల్పము సర్వసాధారణముగా మానవ నైజములోని ఒక విలక్షణ లక్షణం.

ఆత్మ గౌరము సుగుణాలకన్నింటికి పునాదిరాయి.

ఒకవేళ నిత్యముగా బుట్టుచు చచ్చుచునుండెడి మానవదేహమునే యాత్మస్వరూపముగా దలచినను వికారస్వభావముతోగూడిన ఈదేహమునకు ఉత్పత్తినాశములు అనివార్యములుగనుక వానిగురించి దుఃఖింపదగదు.

యెవరిపట్ల ద్వేషం లేకుండా అందరిపట్ల దాక్షిణ్యంతో భగవంతుడు మనకిచ్చిన వివేకంతో సక్రమైనదని మనంతేల్చుకున్న దానిపట్ల దృఢంగా ఉంటూ మనంపూనుకొన్న కార్యాలను పూర్తి చేయాలి.

భగవంతుడు మనల్ని నిజంగా ఆత్మీయులనబడే వారితో యెక్కడ, యెప్పుడు, ఎలా కలుపుతాడో చెప్పలేము.

చివరనుండి మొదలువరకూ చెరకురసం విశేషంగా ఉన్నట్లు సజ్జనులతోటి మైత్రివృద్ధిగావుంటుంది. దుష్టులతోటి స్నేహం దీనికి విపరీతంగా ఉంటుంది.

ధర్మాన్ని మించిన మంచిలేదు. దాన్నివిస్మరించడంకన్న చెడుగు లేదు.

ఉత్పత్తియగు పదార్థమునకు నాశము సిద్ధము. అట్లే నాశము నొందిన వస్తువునకు ఉత్పత్తియు సిద్ధము. కాబట్టి పరిహరింపశక్యము కాకుండెడి జనన మరణముల విషయమై శోకింపదగదు.

జంతువులు నిజంగా మనకు ఆదర్శమైన స్నేహితులు. ఏమీ ప్రశ్నలు వేయవు. విమర్శించవు.

తన క్రింది వారిని సమంగా చూడగలగటం వ్యక్తిలోని సంస్కారాన్ని చాటుతుంది.

ఒకస్త్రీ మళ్ళీపెళ్లాడిందంటే మొదటిభర్తను అసహ్యించుకొన్న దన్నమాట. అదే ఒకపురుషుడు మళ్లీ పెళ్లి చేసుకున్నాడంటే మొదటి భార్యను మిక్కుటంగా ప్రేమించేవాడన్న మాట.

స్త్రీలు తమ అదృష్టముతో ఆటలాడుతారు. కాని పురుషులు దుస్సాహసాలు చేస్తారు.

నాగరికతను సంపాదించడం అంతసులభమయిన పనికాదు. దాన్ని పొందడానికి రెండేమార్గాలు. ఒకటి: సంస్కారం. రెండోది: భ్రష్టత.

తల్లి దండ్రులు తమ పిల్లల పనులపట్ల సంతోషం విచారం కూడా ప్రకటించలేరు.

ప్రపంచంలో ఎవర్ని ఎందరు ప్రేమిస్తారో వాళ్ళకంటె అదృష్ట వంతులు ఎవరూ వుండరు. ప్రేమముందు ప్రపంచంలోని అన్ని వస్తువులూ వ్యర్థంగా కనిపిస్తాయి.

మరణించిన సింహంకంటె సజీవంగావున్న గ్రామసింహమే నయం.

విధి ఎక్కడకు వెళ్ళినా వెనకనే నడిచి వస్తుంది.

భగవంతుడు బయట ఎక్కడోవుండి జగత్తును శాసించే నియంత కాదు. బుద్ధికూడా భగవదత్తమే సంఘాభ్యుదయానికీ, వ్యక్తివికాసానికీ బుద్ధిని వినియోగించడం మనకర్తవ్యం అవుతుంది. ఇంద్రియ నిగ్రహం కూడా ప్రకృతి శాసనాన్ని వుల్లంఘించడమే అవుతుంది. మామూలుగా పుట్టవలసిన పిల్లలు మన నిగ్రహంవల్ల పుట్టటం లేదన్నమాట. ఈవాదన పరిమిత కుటుంబ పద్ధతికి కూడా వర్తిస్తుంది. ఈపద్ధతి ఏరూపంలో అవలంబించ బడినా అది ప్రకృతితో పోరాటం జరిపినట్టే అవుతుంది.

కలీ! నీవు ఏంచేసినా చేయకపోయినా ప్రాచీనత మోహాన్ని పటాపంచలుచెయ్యి. ఇది మానవాళికి ప్రబల శత్రువు.

కోరినలక్ష్యం దురదృష్టవశాత్తూ సాధించలేకపోయినా చేసేకృషి మాత్రం సత్ఫలితాన్ని యిచ్చితీరుతుంది.

పెళ్ళయ్యాక మగవాళ్లు కొందరు కీర్తిశేషుల్లో లెక్క.

భవుతిక సుఖసంపదలను వదలి ఈశ్వర సేవకై ఏకాంత జీవితాన్ని గడపడం సూఫీవాదం.

పెళ్ళి అనే దాంట్లో ఒక పెద్ద యిబ్బందేమిటంటే - దానివల్ల మనిషికి స్వార్థత్యాగం అలవాటయి పోతుంది. స్వార్థత్యాగి బ్రతుకు చప్పబడి పోతుందిగదా.

వస్తువులన్నిటికి నాద్యంతావస్థలు తెలియవు. మధ్యమావస్థ మాత్రము తెలియును. గనుక శరీరములన్నియు మొదట ప్రకృతిని కారణంబుగా గలిగియుండి పిమ్మట దేవ మనుష్యాది శరీర రూపములై యంత్యమున గుణసామ్యత చెందిన మూలప్రకృతియందు లయించు చున్నవి. కనుక ఉండగల పదార్థములయొక్క యవస్థాభేదములే వుత్పత్తి నాశములు. కాబట్టి శరీరమును గురించి వ్యసనమేల ?

ఈశ్వరారాధనమంటే స్వామి గుళ్లో దీపధూపాదులు సమర్పించుటే కాదు. స్వధర్మాన్ని ఆచరిస్తూ దానిఫలాన్ని ఈశ్వరుని కర్పించడమే నిజమైన ఆరాధన.

జీవితం ఏదిక్కున వెళ్లినా మనిషికి దానితో ప్రమేయం వుండకూడదనీ, దారిలోకలిగే కష్టనష్టాలకు ఏ మాత్రము చలించకుండా వున్నపుడే పరమార్థాన్ని సాధించే మార్గం సులభతర మవుతుంది.

మనిషి విలువలు నీటిమీద రాతల్లా నశించిపోతాయి. కాని దోషాలు పోతపోసిన యిత్తడిలా నిలిచిపోతాయి.

సర్వలోక పాపముల నిమిత్తము మరణించుటకై యేసు సిలువపై ఎత్తబడెను. ఆయన మన స్థానములో మరణించెనని తెలుసుకుని, ఆ విశ్వాసముతో ఆయనవైపు చూచునపుడు మనము దేవుని కుటుంబములో జన్మించుదము. మనము విశ్వాసముద్వారా యేసుక్రీస్తును మన హృదయములలో చేర్చుకున్నపుడు మనము క్రొత్తగా జన్మించుదుము.

ఒక మహనీయుని నేత్రమే అతనిరెండు చేతులకన్న ఎక్కువ పని చేస్తుంది.

క్షేమంగా వున్నంతసేపు పిరికివాడు ఎదిరిస్తాడు.

భార్యా, భర్తను ఏవిధముగానైనా కించపరిచిందంటే భర్త ఒక

విధంగా మానసికంగా బాధపడడం. ఎక్కడ శాంతి దొరుకుతుందో అక్కడకు చేరుకుంటాడు. అటువంటప్పుడు చెడు అలవాట్లు అబ్బుతాయి. దాంతో సంసారం విషవలయంలో చిక్కుకుంటుంది.

ధన, జన, యవ్వన గర్వాన్ని పొందకు. మనం స్థిరమని భావించి ప్రతీవస్తువును కాలం అనేది హరిస్తూవుంటుంది.

ఏజాతివారైనను ఏమరుపాటులేకుండా సత్ప్రవర్తనతో మెలగవలెను.

ఆత్మానాత్మల యొక్క నిత్యత్వానిత్యత్వములను గురించి చింతింప నవసరములేదు.

స్వమతాభి మానము, పరమత విద్వేషానికి దారితీయ కూడదు.

జీవితములో అనేక విషాదాల్ని జయించి అనేక లోట్లను భర్తీ చేసే శక్తి యవ్వానానికుంది.

నిర్భయత్వం, మానవప్రేమ ఈ రెండూ ప్రతి ఒక్కరికీ ధృవతారలు కావాలి.

దేశాన్ని ప్రస్తుతం పీడుస్తున్నది పని పాటాలేని నిరుద్యోగులు ఎక్కువవడం మాత్రమేకాదు, పనిపాటలులేని ఉద్యోగులుకూడా ఎక్కువవు తున్నారు.

సంఘర్షణే జీవితం. సంఘర్షణ లేకుండా జీవితం ఎలా వుంటుంది.

అమితానందం కలగాలంటే ఎవరికీ తెలియకుండా ఏదైనా మంచిపని చేయాలి. అనుకోకుండా అది బైటపడినపుడుకూడా అంత తృప్తికలుగుతుంది.

నీకు చెడు సంభవించకుండా పుంకాలంటే నువ్వుచేసిన ప్రతీ అప్పు దేవుని బాకీగా భావించి తీర్చేయ్.

వర్తమానము భూతంబునకు ఫలంబును, భవిష్యత్తునకు బీజంబునై యుండును.

ఎవరిమాట శాసనమో అట్టివారి ఘనతనే శాస్త్రములు ప్రపంచానికి చాటుతాయి.

మనదోషాల నెత్తిచూపినవారిపై మనకు సామాన్యంగా కోపం వస్తుంది. నిజానికి మన దోషాలన్నింటినీ వారెరుగరు. ఎరిగివుంటే మరీ నిందిస్తారు. ఎవరి దోషాలు వారికే బాగా తెలుస్తవి. కనుక ఎవరిని వారేనిందించుకొని, వారే సరిదిద్దుకోవలసి వుంటుంది.

శాంతముచేత క్రోధాన్ని, సాధుత్వముచేత దుర్మార్గాన్ని, దానము చేత లోభత్వాన్ని, సత్యముచేత అసత్యమును జయించాలి.

విజయం పొందటములోని రహస్య మేమంటే ఒకపని చేయటానికి ఎప్పుడూ సిద్ధంగా ఉండడమే.

యుద్ధానికెప్పుడూ సంసిద్ధంగా ఉండడమే శాంతిని సంరక్షించు కునే పద్ధతులలో బలీయమైనది.

ప్రేమ కళ్ళతో చూడదు. హృదయంతో గమనిస్తుంది.

ఒక్క రాజ్యమునకైనను నువ్వు పట్టాభిషిక్తుడవు కమ్ము. మన స్వాతంత్ర్యాధిపత్యము వహించి అందేవిషయమున కాలుపెట్టనర్హమో, కాదో చూసి శాసింపుము.

కామ భావన దూరమైనప్పుడే దంపతుల మధ్య పవిత్రమైన సంబంధం ఏర్పడుతుంది.

అందంగాని, అలంకారంగాని ఒక దానికి ఒకటి మితంగా, అనుకూలంగా వున్నప్పుడే రాణింపు వుంటుంది. లేకపోతే ఎబ్బెట్టుగా వుంటుంది.

క్షత్రియునకు స్వధర్మంబైన యుద్ధమునకంటె వేరు శ్రేయస్సు లేదు.

ఆరోగ్యం యొక్క ప్రాముఖ్యం రోగం వచ్చినపుడు తెలుస్తుంది. అశాంతి కలిగినప్పుడు శాంతి యొక్క ప్రయోజకత్వం గోచరిస్తుంది.

ముస్లిం, హిందువు, క్రైస్తవులు ఎవరైనా కానీ ప్రతిమనిషినీ నాసోదరునిగా భావిస్తాను.

మనిషి పదికాలాలపాటు బతకటం ప్రధానంకాదు. ఆబ్రతుకు పురుషార్థపరంగావుండాలి.

తనరాజు, తనదేశం, తనకులం, తనబంధువులు, తనధర్మం— వీటిని ఎన్నడూ దూషించరాదు. శక్తివున్నప్పటికీ లౌకికాచారాన్ని, మర్యాదలను ఉల్లంఘించక పోవడం సాధారణ ధర్మం.

మంచి మాటచెప్పడం మంచిపనే, కాని ఎన్నిమంచి మాటలైనా ఒక మంచిపనికి సాటిరావు.

బాగుగా ఎండినకర్రలను అగ్ని ఏరీతిగా భస్మముచేయు చున్నదో, జ్ఞానము అదేరీతిగా ప్రారబ్ధ కర్మమును తప్ప యితరకర్మలను సంపూర్ణంగా నాశనము చేయును.

ఇతరులను బాధించడానికి స్త్రీకి బలంలేదు. ఇతరులు పెట్టే బాధలు భరించేందుకు ఆమెకు బలం కలదు. అందుచేతనే స్త్రీ అహింసా స్వరూపమవుతుంది. స్వార్థరహిత సేవకు ఆమెకు సమానులులేరు.

తిరిగి అటువంటి చెడుపని చెయ్యక పోవడమే నిజమయిన పశ్చాత్తాపం.

"ఆ! పోనిద్దురూ! మేం బ్రతకడంలేదూ! మేము అందరికంటె బాగానే బ్రతుకుతున్నాము. మాకు కొత్తావద్దు! ఏమీ వద్దు! ఏదో మమ్మల్ని యీలా బ్రతక నిద్దురూ" అనే యీ బాపతు మానవులే యీలోకంలో చాలా మంది! ఈతత్వాన్ని నిర్మూలించనిదే కొత్తదనాన్ని దేన్నినిర్మించడం కష్టమే.

సమస్తయోగ్యతలు నిండి యుండెడివాడు వ్యర్థముగా నపకీర్తి నొందుటకన్న మరణము నొందుటమేలు.

భగవంతుడీ ప్రపంచమును యుద్ధోన్మత్తుల పద ఘట్టనములచే మృత్యువు వికృతారూపములచే, ఘర్షణచే నిండిన రణక్షోణిగ సృష్టించెను. ఈ జీవితసమరమున విధిగా పాల్గొనక దొంగవలె నీవెట్లుఆత్మ శాంతిని పొందగలవు ?

సలహా చెయ్యని మనిషికి ఎవరూ సాయపడరు.

దాంపత్యం అన్యోన్యంగా సాగటంకంటె జీవితంలో అదృష్ట మరోటి లేదు.

మన నైతిక దృక్పథాన్ని మార్చుకుని తద్వారా ఆర్థిక, కుల, మత విభేదాలను రూపుమాపి - ప్రజాస్వామిక మూలాధారం అయిన సమన్వయాన్ని ప్రయత్నించి అలవరచుకుంటేనేగాని మనల్ని ఎదుర్కొనే పరిస్థితుల్ని జయించలేము. చరిత్రలో యింతవరకూ పదిలపరుపబడి వచ్చిన నాగరికతను క్షణంలో నశింపచేసే ఆయుధాన్ని కనిపెట్టేకంటే - మానవాభ్యుదయంకోసం వాటిని సరిగ్గా వుపయోగించే శక్తిని కలిగిన మనుష్యుల్ని సృష్టించాలి.

నేను పవిత్రమైనదిగా ఎంచే ఒకే విషయం మానవునికి తన మీాద తనకువున్న అసంతృప్తి యిప్పుడు తానున్నస్థితికంటె వుత్తమమైన స్థితికి పోవడానికి అతడు చేసే కృషి.

ఉన్నత వంశములో జన్మించడం అంటే కృషివల్ల కొంతవైముఖ్యమే.

మానవుడు దుఃఖానుభవాన్ని సుస్పష్టంగా ప్రకటించుకోగల భాష యింతవరకూ కనిపెట్టబడలేదు.

శబ్దాశ్రయ హాస్యం చెవిని గురిపెట్టి వదలిన పిస్తోలు వంటిది. అది మేధస్సును స్పృశించి గిలిగింతలు పెట్టే హంసతూలికము కాదు.

పగ, ద్వేషం అగ్గి రవ్వల్లాంటివి. అవి ఎవరిని ఆవహిస్తే వారినే దహించి వేస్తాయి.

తప్పుడు త్రోవలో దొరికిన ఆనందం తప్పక వెంటనే బాధకలిగిస్తుంది. మంచి మారము తెలివైన మార్గం.

హృదయానికి ముఖం కవాటము. ఎంత దాచుకున్నా మనసులోని భావం ముఖంలో స్పష్టంగా కనిపించక మానదు.

ఇహపరలోకములనెడి రెండు లోకములందును మేలుకోరువారు మనస్సు, వాక్కు, కర్మము అనెడి త్రికరణములచేతను ప్రాణులకు ద్రోహము చేయరాదు.

రాగలది రాక పోదు. పోగలది పోక పోదు.

యుద్ధసన్నద్ధుడై యుద్ధరంగమునకు వచ్చి నిలిచిన శూరుడు యుద్ధము చెయ్యకపోయెనేని శత్రువులకు భయపడి పారిపోయెనేగాని

స్నేహసౌరుఖ్యాది కారణములవలన గాదని చెప్పకొనుట లోక ప్రసిద్ధము.

నిరంతరంగా పరంపరగా వచ్చేకష్టాలలో జీవితం గడుస్తూ వుంటే క్షణం ఒకయుగంలా వుంటుంది. భోగాలలో, విలాసాలలో జీవితం నిండివుంటే యుగం ఒకక్షణంలా వుంటుంది.

ఫలాపేక్ష లేక యుద్ధము చేసిన, నది మోక్ష సాధన మగును.

కాంక్ష అనేది కఠిన హృదయానికే వుంటుంది.

ఆగ్రహావేశం ముగియగానే తిరిగి ఆలోచించుకున్న వ్యక్తి మళ్ళీ తనమీద తానే కోప పడతాడు.

లోకము మృగతృష్ణ వంటిది. కనుక క్షణభంగురమైన దానిని చూచి భ్రమచెందక ధర్మంకోసం, సుఖంకోసం సత్పురుషులతోటి సహవాసం చేయాలి.

బుద్ధిమంతుడు ఏదైనా ఒకపని చేసేముందు ఉచితంకాని, అను చితం కాని, ఫలితాలు బాగాఆలోచించి చేయాలి. త్వరపడిచేస్తే దానిఫలి తము మరణ పర్యంతం బాధే.

శరీరంలో ప్రాణమున్నంతవరకూ, ధనం, సంపాదిస్తున్నంత వరకూ యింట్లోవాళ్ళందరూ ఆదరిస్తారు. కాని ప్రాణం పోయిన తరు వాత తనను ప్రాణపదంగా ప్రేమించే భార్యసైతము శవాన్ని చూడ డానికి భయపడుతుంది.

అన్నిరకాల మనుష్యులు కలిస్తేనే ప్రపంచం.

సుఖంగాని, కష్టంగాని నాలుగుగోడలుమధ్యనూ దాగే రహస్యాలు. గోడలకు వినడానికి చెవులుంటాయి. కాని చెప్పటానికి నాలుకలుండవు.

కర్మయోగమునందు నిశ్చయరూపమైన బుద్ధియొక్కటే ముఖ్యం బగుచున్నది. నిశ్చయములేని కర్మాధికారులయొక్క బుద్ధులు ఫలాపేక్షచే పలుశాఖలు గలవిగాను అనేకములుగాను వుండును.

నీవు చేసేదంతా మేలయినదిగా వుండేటట్లు చెయ్యాలి. ఎన్ని విధాల దాన్ని చెయ్యడానికి సాధ్యమవుతుందో అన్ని విధాలుగానూ చెయ్యాలి. అలా మేలుచేయడానికి యీచోటూ ఆచోటూ అనే విచక్షణ లేదు. అన్నిచోట్ల చేయవలసిందే! మేలు చేయడానికి యిప్పుడూ, అప్పుడూ అనే కాలనియమమూ లేదు. అహర్నిశనకుండా ఎప్పుడూ చేయవలసిందే! ఎవరికిచేయడమూ? అనే ప్రశ్నకూడాలేదు. ఎంత మందికి మేలుచేయడం సాధ్యమవుతుందో అంతమందికీ చెయ్యవలసిందే. ఎంతకాలం ఈవిధంగా యితరులకు ఉపకరించమంటారా? ఎంతకాలం ఆచరణకు సాధ్యమవుతుందో అంతకాలం చెయ్యాలి.

మీకు స్నేహితుడు లేకపోతే ఎవరితోనైనా స్నేహం చెయ్యండి. స్నేహితుడు దొరికినతర్వాత యింక ఆమిత్రుని విడిచిపెట్టవద్దు.

అబద్ధపు తగాదాలలో నిజమైన శౌర్యానికి చోటులేదు.

డబ్బువున్నవాడే కులీనుడు. వాడే పండితుడు. వాడికే వేదాలు, ధర్మశాస్త్రాలు అన్నీతెలుసు. మంచి మాటకారి. రూపవంతుడు, గుణవంతుడు — సర్వగుణాలు బంగారంగల వ్యక్తిని ఆశ్రయించుతాయి.

ఎప్పుడూ జీవితావసరాలు కూడా తీరక అసంతృప్తితో అలమటించే రచయితలు సజీవ సాహిత్యాన్ని ఎలాసృష్టించగలడు?

స్త్రీలు పురుషులను విడివిడిగా చాలా ఎక్కువగానూ, అందరిని కలిసి చాలా తక్కువగానూ నమ్ముతారు.

ధర్మమునకు నాశ్రయము సంఘము, దేశీయ శోభనకు పరమ పుణ్యము: సంఘధర్మము ఎల్ల ధర్మములలో శ్రేష్ఠమయినది.

ఈవిశాల ప్రపంచం జలధి పరివేష్టితమైనా వర్షమే లేకపోతే క్షామం తాండవ మాడుతుంది.

ఒక పురుషునికి పలువురు స్త్రీలయందు, పలువురుస్త్రీలకు ఒక పురుషునియందు వలపు పుట్టుట అరుదు. ఒక పురుషునికి ఒక స్త్రీ యందును, ఒక స్త్రీకి ఒక పురుషునియందు వలపు గలదనవచ్చు గాని పలువురు స్త్రీలయందొక పురుషునికి వలపు కలదనుట సత్యంకాదు.

బాధపడనిదే మనిషి పరిపూర్ణుడు కాలేడు. ఎందువల్లనంటే మానవుడు తానే శిల, తానే శిల్పి కనుక.

గృహ జీవితంలో భర్త ఆనందాన్ని చూచి భార్య తను సుఖ పడటం తెలుసుకోగలగాలి. సమయస్ఫూర్తి తెలుసుకుని భర్త అభీష్టాలను నెరవేర్చుతూ తనుకూడా చక్కగా నవ్వుతూ చెప్పితే ఏభర్తయినా ఆదరిస్తాడు.

ధ్యానమూ, చింతనా — వీటిలో కూడిన జీవితము చాలా గొప్ప జీవితము.

కోరికలు నిజమవుతాయి. అయితే అంత సునాయాసంగా, తొందరగా కాకపోవచ్చు. ఎంచేతనంటే యింతకూ జీవితం జీవితమే. ప్రేమేకాకుండా పని, చదువు, చికాకులు, సృజనాత్మక కృషి వుంటాయి కాని ఏ వొక్కటీ ప్రేమ మార్గంలో నిరోధంకాదు. సకల వాంఛలు నెరవేరడం తథ్యం.

శివుని ఆజ్ఞలేనిదే చీమ అయినా కుట్టదు.

నాస్తికత్వం ఆశకు మృత్యువు. మానవాత్మకు ఆత్మహత్య.

కష్టాలు యిద్దరు పంచుకుంటే భారం సగానికి తగ్గుతుంది. సంతోషం యిద్దరు పంచుకుంటే ద్విగుణీకృతం అవుతుంది.

క్లుప్తతే తెలివికి ప్రాణం.

గతించిన వారికి వున్న తాదర్శా లుండేవి. ఆధునికులమైన మనకు వున్నవి అభిప్రాయాలు మాత్రమే.

అనుక్షణమూ ఆత్మరక్షణంకోసం మనంచేసే పనులు, యితర పనులన్నింటికంటె అతిముఖ్యమైనవి. ఏవిషయంలో అజ్ఞాని అయినా పరవాలేదు. కాని ఆత్మరక్షణ విషయంలో అజ్ఞాని కాకూడదు. ఆత్మ రక్షణ, అవసరమయిన జ్ఞానం అతిముఖ్యమైనది.

ఏరు లోతుగావుంటే ప్రవాహం నెమ్మదిగా వుంటుంది.

ఏసుక్రీస్తువాక్యాలు :- ఆత్మవిషయమై దీనులైనవారు ధన్యులు. పరలోక రాజ్యమువారిది. వారు భూలోకమును స్వతంత్రించు కొందురు. నీతికొరకు ఆకలి, దప్పులు గలవారు ధన్యులు. వారు తృప్తిపరచ బడు దురు. కనికరము గలవారు ధన్యులు. వారు కనికరము పొందుదురు. హృదయశుద్ధి గలవారు ధన్యులు. వారు దేవుని చూచెదరు. సమాధాన పరచువారు ధన్యులు. వారుదేవుని కుమారు లనబడుదురు. నీతి నిమిత్తము హింసింపబడువారు ధన్యులు. పరలోకరాజ్యము వారిది. నా నిమిత్తం జనులు మిమ్మును నిందించి, హింసించి మీమీద అబద్ధముగా చెడ్డ మాట లెల్ల పలుకునపుడు మీరు ధన్యులు.

అహింసతో వర్తించుట సన్మార్గము. హింసతో ప్రవర్తించుట దుర్మార్గము.

ఎదటివాడు తనకేంచేస్తే వాడికి తానూ అదే చేయ్యాలి. తనను వాడు హింసిస్తాడూ ? తానూ వాణ్ణి హింసించెయ్యాలి. దోషంలేశమూ లేదందులో. దుష్టుడికి దేష్టమే చూపించాలి.

క్షమవలన లోకమంతా వశమవుతుంది. క్షమవలన సాధ్యంకానిది లేదు. శాంతిఖడ్గం ధరించినవానిని దుర్జనుడేం చేస్తాడు.

కర్మలయందు ప్రవృత్తిని గలుగచేయుటకు ప్రతిపాదించునవి యును, పువ్వులగుత్తులతో నిండి చూపునకు మాత్రము రమణీయమై, ఆ యందమునకు తగినఫలములు లేనివై యుండెడి విషలతల బోలె రమణీయముగా నుండునవియునైన వేదవాక్యములను నమ్మి స్వర్గాది ఫలములకన్న వేరుఫలములు లేవని తలచి నిశ్చయబుద్ధి లేనివాడై జ్యోతిష్టోమాది కర్మల నాదించు చుందురు.

స్వర్గాన్ని నరకములో పారవెయ్యండి. అప్పుడే నిజమైన దైవ భక్తులు మిగులుతారు.

శక్తిలేనివాడు సాధువు అవుతాడు. డబ్బులేనివాడు బ్రహ్మచారి అవుతాడు. రోగి భగవద్భక్తుడవుతాడు. వృద్ధస్త్రీ పతివ్రత అయిపో తుంది.

దురాశ దుఃఖమునకు మూలం. దుఃఖము పోవాలంటే దురాశను వదులుకోవాలి.

నేను పవిత్ర మయినదిగా చూచే విషయమేమంటే ఈర్ష్యను, దురాశను, క్రౌర్యాన్ని, వ్యాధిని, యుద్ధాలను ప్రపంచ ప్రజలమధ్య నున్న యుద్ధ జ్వాలలను అంతమొందించాలనే అతని కోరిక. నేను పవిత్రమైనదిగా ఎంచే ఇంకొకవిషయం. మానవునిశ్రమ.

ఏమిజరుగుతుందో - అనేఉత్సుకతను గొప్పగా ప్రేరేపించే వార్తాపత్రికను చదివాక నిరాసపడకుండా ఎవరూ వుండరు.

మనస్సుకు సౌఖ్యమనేది ఎన్నడోకాని లభించదు. గాఢ సుషుప్తియందు మాత్రమే మనసు చీకూ చింత లేకుండా సుఖిస్తుంది.

మళ్ళీ మెలకువ కలిగిన వెంటనే సంసార తాపత్రయాలన్నీ మనస్సు నావరిస్తాయి. శరీరాన్ని గురించి. మనసునుగూర్చి, సంఘాన్ని గూర్చి, ప్రభుత్వం ప్రజలను గూర్చి ఏదో వ్యాకులత బాధిస్తూనే వుంటుంది. నిద్రయందువలెనే మెలకువయందుకూడా మనస్సు చింతా చీకూ రహితంగా వుంచుకోగలగడమే.

వర్షం నాశనం చేస్తుంది. వర్షమే తిరిగి తను నాశనం చేసిన వారిని రక్షించుతుంది.

అయోగ్యులు తప్పకుండా ఆనందంగా వుంటారు. యోగ్యులకు వున్నన్ని బాధలు, ఆతురత వారికి ఎక్కడ వుంటుంది?

తోడివారిని చీమలుగా, దోమలుగా, పురుగులుగా చూడగలవాడెన్నడూ పెరిగిన మనిషికాలేడు. పరిణత చిత్తుడు కాలేడు. సాంఘికంగా వారు ఎలాంటి స్థానంలో వున్నవారైనా సరే.

అతిబలవంతునికీ, అతిబలహీనునికీ సమానావకాశాలు సమకూర్చ గలిగేదే ప్రజాసామ్యం. అహింసద్వారా తప్ప యితర మార్గాల ద్వారా అవి సాధ్య పడదు.

స్వర్గాది తుచ్ఛసుఖము కోరువారు, జ్యోతిష్టోమాది కర్మముల యందు నిచ్ఛగలవారు, వారికే ముఖ్యములని తలంచుచు, భోగైశ్వర్యములను గురించి కొన్ని క్రియావిశేషములయొక్క మహిమలను ప్రస్తుతించుచు నుందురు.

చాలామంది పురుషులు తమ స్వభావాలకు విరుద్ధమయిన వాటినే స్త్రీలలో ప్రేమిస్తుంటారు.

నా ఆత్మగౌరవానికి అపకీర్తికన్న పదివేల మృత్యువులైనా మేలే.

స్త్రీగానీ – పురుషుడుగానీ - బయట ఎంతగొప్ప హోదాలో వుండనీ – ఎన్ని గౌరవ మర్యాదలు పొందనీ - వాళ్ళసంసార జీవితంలో పొందే ఆనందమే ఆనందం. భర్తకి భార్యచేతుల్లోనూ, భార్యకు భర్తచేతుల్లోనూ లభించే శాంతే శాంతి.

ఆత్మలేక దేహం ఒక్కటే వున్నవారికి ఎట్టి ఆవేదనా లేదు. కోరికలు పూర్తిగా చావని దేహం, పనిచెయ్యగలిగిన ఆత్మవున్నవారి బాధ వర్ణనాతీతం.

మతం, న్యాయం, మంత్రిప్రతిభ, ధనము - యివి ఏప్రభుత్వానికైనా నాలుగు స్థంభాలు.

స్వార్థమొక్కటియే పాపము. నీచత్వమొక్కటియే దుర్గుణము. అసూయ ఒక్కటియే నేరము. మిగిలినదంతయు సులభముగా మార్చ వచ్చు కాని యివియే దేవతను సైతం కఠినముగా ప్రతిఘటించునవి.

ముసలివాడు ప్రేమించినంత హెచ్చుగా జీవితాన్ని ఎవరూ ప్రేమించరు.

జనన మరణాలు కలిగే ఈ సంసారంలో చనిపోయిన వాడెవడూ తిరిగి పుట్టలేదు. ఎవని జన్మవలన వంశంకీర్తిని పొందుతుందో వాడి జన్మయే సార్థకం.

సత్త్వరజస్తమోగుణముల విశిష్టమైన పురుషులకు ఆయాగుణములకు హితంబగునట్లు స్వర్గాది తుచ్ఛఫలములను వేదములు విధించుచున్నవి. అట్టివారికి ఫలములను ఉపాయములుగా విధింపని యెడల ఉపాయములు గాని వానిని ఉపాయములుగా నమ్మి చెడిపోవుదురు. కనుక వేదములు త్రిగుణ విషయంబులై యుండును. మానవుడు సత్త్వము నవలంబించి యెల్లప్పుడును కోర్కెలు లేనివాడై యోగక్షేమ రహితుండై ఆత్మజ్ఞానము కలవాడై యుండవలెను.

నిజమైన, సహజమైన స్వమతాభిరుచి యితరులకు చెడు తలపెట్ట నివ్వదు.

దరిద్రుని కష్టాలు చూచిగాని, సుఖాలు చూచిగాని అవహేళన చెయ్యడం న్యాయంకాదు.

వేడిమిగాయున్న కొలిమిలో కాల్చియున్న ఎర్రగా కాలినటు వంటి యినుపముక్కమీద ఎన్నినీళ్ళు పోసిననూ పీల్చునట్లు మీదమీద పుట్టుచున్న కోరికలచేత మరియు, మరియు వుద్రేకరించివున్న మనస్సు, భోగములనుభవించ చూచునుగాని యీ భోగములనుంచి విరమించు టకు సమ్మతించదు.

చెడ్డతలంపు చెప్పిరాదు. మనసులో ప్రవేశించి పొంచి వుంటుంది.

పరిశుద్ధ గ్రంథము బైబిలు వాక్యం. "ఆకాశపక్షులను చూడండి. అవి విత్తవు. కాయవు. కొట్లలో కూర్చుకొనవు. అయినా మీస్వర్గలోకపు తండ్రి వాటిని పోషిస్తున్నాడు. మీరు వాటికంటె శ్రేష్టులుకదా! కనుక ఎప్పుడూ ఏమితింటాం, ఏమిత్రాగుతాం ! ఏమి ధరించుకుంటాం అని చింత పడకండి. ఇవన్నీ మీకవసరమనీ మీ స్వర్గలోకపు తండ్రికి తెలుసును. ఆయన రాజ్యాన్ని, నీతిని వెదకండి. అప్పుడవన్నీ మీకివ్వబడుతాయి."

మానవ సమూహాన్నే సమాజం అంటాం. సమాజంలో సంభ వించే లాభనష్టాలు, సుఖదుఃఖాల ప్రభావం మానవులమీదనే పడుతుంది.

పాఠశాలలోనూ, కళాశాలలోనూ నేర్పబడేది విద్యకాదు. విద్య నేర్చుకునేందుకు విధానాలు మాత్రమే.

మనుష్యుని కిశోరావస్థతో సమానమయిన అవస్థ మరొకటిలేదు ఈప్రపంచంలో.

కాలగతిని వెనుకకు త్రిప్పవలెనని యత్నించేవారు ఎలాగూ వెల్లకిల బడకపోరు.

పిచ్చలవిడిగా ఖర్చుపెట్టడానికి కొరగాకుండా పోయేవారు, తన వారసులకు అన్యాయం చేస్తున్నాడు. కృపణుడు తనకు తానే అన్యాయం చేసుకుంటున్నాడు.

ఇతరుల మనోవీధులలో విహరిస్తూ నన్ను నేను మర్చిపోవడం నాకెంతో ప్రీతి. విడవకుండా వున్నంతసేపూ నేను చదువుతూ వుంటాను. కూర్చుని ఆలోచించడం నాకు చేతకాదు. పుస్తకాలు నాఆలోచనలను రేపుతాయి.

ఈదునపుడు నీటిని వెనుకకు దోసినచో ముందునకు బోవుదుము. సంసారసాగరము నీదునపుడు త్యాగముచే వాసనలను వెనుకకు వెనుకకు దొలగించిన ముందుకు పోగలము.

మానవత్వమొక మహాసముద్రం. దానిలో కొన్ని మలిన బిందువులు వుండవచ్చు. అంతమాత్రాన్నే సముద్రం మలినంకాదు. కనుక మానవత్వాన్ని విడనాడకూడదు.

జీవితాంతం నిలిచే సౌందర్యాస్వాదన తన్నుతాను ప్రేమించటంతోనే మొదలవుతుంది.

కాలీకడుపుతో వున్నవాడు విజ్ఞుడుకాలేడు. శరీరానికి ఆరోగ్యం ఎలాంటిదో మనస్సుకు విజ్ఞత అలాంటిది.

వాగ్దానం చేసేవారు ఋణగ్రస్తులవుతారు.

స్వల్పవిషయాలవల్ల గర్వపడేది అల్పులే.

సత్సంగము, వివేకము ఈరెండును దోషములేని నేత్రములు. ఇవిలేనివారు అంధులు.

మాయామయ మయినటువంటి ఈదృశ్యప్రపంచముతో సంబంధం లేకుండ దానిని వదలిపెట్టి బ్రహ్మపదాన్ని తెలుసుకునే మార్గం ఆలోచించు.

రుచికరమైన ఆహారం మానవునకు వర్షం ప్రసాదించిన వరం. చివరకు వర్షంకూడ ఒక రకమైన ఆహారమే.

మీ శత్రువుల్ని పరికించి చూడండి. మీ తప్పులను ముందుగా ఎంచేవాళ్లువాళ్ళే.

శిల్పి ఒకానొక కట్టుకథతో పసిపిల్లవాడి వంటివాడు. అతవి ప్రతి కన్నీటి బిందువు ఒక ముత్యమే. కాని పాపం ప్రపంచం అతని సవితి తల్లి! ఇంకా ఎన్నో ముత్యాలు రాల్చమని మాటిమాటికి చావ గొడుతూ వుంటుంది.

లోకంలో వివేకం లేక కాదు. సృష్టి ఆదినుంచీ వివేకం దాని దారిని అది వృద్ధి చెందుతూనే వుంది. కాని ఏవ్యక్తి కావ్యక్తి అన్ని పరీక్షలకు లోనుగాక తప్పదు.

దాహం వేసిన వానికి నొకబావిలో నెంత వుదకము గావలయునో అంత వుదకమే జలసమృద్ధిగా నుండెడి తటాకమందు గూడా వానికి కావలయును. అట్లే వేదోక్తములైన సమస్త కర్మములలోను మోక్ష కామునకు కావలసినట్టి మోక్షము తప్ప మరియొకటి వానికి కావలసి యుండదు.

పిసినిగొట్టువాడు పేదవాడుగా కనిపిస్తూ ధనాఢ్యుడు అవుతాడు. విలాస పురుషుడు ధనస్వామిగా కనిపిస్తూ పేదవాడు అవుతాడు.

మనకు రెండు చెవులూ, ఒకనోరూ వుండటంలోని ఆంతర్యం ఏమిటంటే మనం మాట్లాడ్డం తగ్గించి, వినడం ఎక్కువ చేయాలి.

ఉత్తములైనవారికోసం క్షణం సేపు వుండి తగ్గిపోతుంది. మధ్యములైన వారికో రెండు ఘడియలుండి తగ్గిపోతుంది. అధములలో రోజంతా వుంటే వుండవచ్చు. పాపిష్టి వాళ్ళకు ఆకోపం అమరణాంతమూ వుంటుంది.

నిష్కామంగా తనశక్తి సంపద యితరులకు పంచిపెట్టి తద్వారా మరింత బలపడటం మహాత్ముల లక్షణం. తనపరిసరాల లోని గొప్పవాటిని గ్రహించి వాటికి మరింత మహత్తరతను చేకూర్చడం లోనే సగం గొప్పదనం యిమిడివుంది.

ఆరోగ్యమే వుత్తమ భాగ్యం. సంతుష్టియే వుత్తమ ధనం. విశ్వాసమే వుత్తమ బంధువు. నిర్వాణమే సుఖం.

తమ గొడవల్లో మునిగిపోయి వుండేవాళ్ళు యితరుల రహస్యాలను సులువుగా తెలుసుకోలేరు. అది అనుమానపు మనుషులకే సాధ్యం.

మనిషి అంతరంగాన్ని పెంచడానికి జబ్బుపడటం సహాయం చేస్తుంది. తన్ను తాను తెలుసుకునేలా చేస్తుంది వచ్చిన రోగం.

మనమెదడులో పుట్టిన ఆలోచనను మంచిస్థితికి తేవాలంటే - వెంటనే ఆ ఆలోచనను మరొక మెదడులో నాటాలి.

ఆత్మవంచన చేసుకున్నవారు అందరిలోకీ అధికంగా మోస పోతారు.

పడగమీద మణి వున్నప్పటికీ పామునుచూస్తే భయంకదా ! విద్యావంతుడైనా దుర్జనునికి దూరంగానే వుండాలి.

మంచిపనులుచేస్తే శుభాలు కలుగుతాయి. దానధర్మాలు చేయడం వలన సహాయాలు చేయడంవలన మేలుకలుగుతుంది. వెంటనే ఆఫలితం

కలిపించకున్నా మరొకప్పుడైనా మంచిపనికి మంచిఫలితమే కలసి వస్తుంది.

శత్రువుల బారినుంచి తప్పించుకొనవచ్చు. చేసిన దుర్మార్గం నిన్ను నిరంతరం వెంటాడుతూనే వుంటుంది. దానినుంచి తప్పించుకోలేవు.

మగాడికోసం బాధపడేవ్యక్తులు యిద్దరే. తల్లి, మనసిచ్చిన ఆడది.

వేదోక్త కర్మములలో నేదైన ఒకటిని చేయుటకు మానవుడు అధికారి గాని జ్ఞాననిష్టకు అధికారికాడు. కాబట్టి మానవుడు కర్మమును చేసి తత్కర్తృత్వబుద్ధియును దానిఫలమందపేక్షయును సహింపక కర్మము నాచరించు చుండవలయును. కాని విడిచిపెట్టకూడదు.

పరిస్థితులు బలహీనులను శాసిస్తాయి. విజ్ఞులకు అవి కేవలం సాధనాలు మాత్రమే.

మానవుడు తన్నుగూర్చి తాను తెలుసుకోవాలి.

వార్ధక్యంలో వున్నవారికి శరీరానికి సమకూర్చే సుఖాలకంటె మనస్సుకు చేకూర్చే ఉల్లాసం, శాంతి ముఖ్యమైనవి.

ఎంత మేధావంతుడైనా మనస్సుకి తాత్కాలికంగా యివ్వగల వ్యామోహాన్ని జయించుకుంటూ రావాలి.

జీవిత మధుబాండాన్ని కావాలని ముక్కలు చేసుకుని, జీవన మకరందాన్ని క్రిందపారబోసే శక్తి పరమ మూర్ఖులకూ, మహాయోగులకు మాత్రమే వుంటుంది.

ప్రాణులకు బాధలు కల్గించే పనులు పాప కృత్యములనబడును.

హృదయ పూర్వకముగా మనః పూర్వకముగా యితరుల శ్రేయస్సును అచంచలముగ కోరుటయే ఒకరు చేయగల గొప్ప సహాయము.

క్రీస్తు పాపులను రక్షించుటకే ఈలోకములోనికి వచ్చెను. కనుక మనుష్యులు వారి పాపముల విషయమై పశ్చాత్తాపపడి క్రీస్తునందు విశ్వాసముంచిన యెడల వారు కూడా రక్షింపబడగలరు.

వేదనాసారమే అనుభవం.

సుఖవంతుడు తన ప్రజ్ఞను, శక్తిని తానే చెప్పుకొనరాదు. తన వద్ద దాచిన రహస్యం బయటపెట్ట రాదు. తను యితరులకు చేసిన మేలును గూర్చి డాబుగ చెప్పుకోకూడదు.

జయాప జయములందు సమత్వబుద్ధి గలిగి యుండుటయే యోగ మనంబడును.

డబ్బువిలువ తెలుసుకోవాలంటే వెళ్ళి కొంత అప్పు చేయడానికి ప్రయత్నించు. అప్పుచేసేవాడు దుఃఖాన్ని ఆశ్రయిస్తాడు.

విద్యలేనివాడు వింతపశువు. విద్య పురుషునకెంత అవసరమో స్త్రీలకూ అంతే అవసరము. స్త్రీలు సక్రమమైన విద్య నభ్యసించాలి. స్త్రీ తాను అబలఅనీ, నిస్సహాయురాలననీ ఒకరిమీద ఆధారపడివుండాలనీ భావించనక్కర లేదు. యదార్థమైన పవిత్రవంతురాలు ఎన్నటికీ నిస్సహాయురాలు కాలేదు. ఆమె పవిత్రతయే ఆమెబలానికి ప్రధాన కారణమవుతుంది. స్త్రీని అణచటం అహింసా దేవతను అణచటమే.

ప్రతి మానవునిలో అంతర్గతంగా మానవ సౌభ్రాతృత్వం ప్రవహిస్తూ వుంటుంది.

ఉత్తమ మయిన ఆర్ద్రత కలిగిన రచనలు, వ్యక్తిని, సమాజాన్ని ఉత్తేజితం చేసి వున్నతమయిన ఆశయాల్తో నడిపింప గలిగే రచనలు కావాలి.

నీళ్లతాగుతున్న గుర్రాన్ని, మదించిన ఏనుగును, ఆబోతును, అంతగా యింగిత జ్ఞానము లేనివాడిని కదిలించకూడదు.

సత్యం, వివేకం క్రిందనుంచే అంటే ప్రజానీకంనుంచే వుద్భవిస్తాయి. జీవితపు పైఅంతస్తులు క్రిందనుంచి వచ్చే విశ్వాసాలను మాత్రమే పీలుస్తాయి.

సాహిత్యం మానవ మస్తిష్కాన్ని వికసింప చేస్తుంది. ఈ సాహిత్యమే మానవుల్లో మంచిభావాలను, చెడ్డభావాలను కూడా కల్గిస్తుంది. ఈభావాలకు అనుకూలంగానే మానవుడు జీవించడానికే ప్రయత్నిస్తాడు.

ఎంత పుణ్యకార్యమైనా, ఎంత పాపకార్యమైనా ఒంటరిగా చేసిందానికన్న పదిమందితో కలసి చెయ్యటంలో ఏదో ఆనందంవుంది. అందుచేతనే అవి సామాన్యప్రజలు ఏకమై విప్లవాలు సాధించగలుగుతారు. మామూలు హత్యలకన్నా అనేకవేలరెట్లుండే హత్యాకాండ యుద్ధంలో సాధ్యమవుతుంది.

ధనమును సంపాదించునట్లు విజ్ఞానాన్ని సంపాదించు. అధికార గౌరవాన్ని కోరినట్లు నైతిక గుణాల్ని వాంఛించుము. భార్యా బిడ్డలను ప్రేమించునట్లు తల్లిదండ్రులను ప్రేమించుము. నీఅధికారాన్ని కాపాడుకొన్నట్లు నీ గౌరవాన్ని రక్షించుకో.

యధార్థాలను సూటిగా చెప్పవచ్చును గాని చందోబంధాలలో యిమిడ్చి కవిత్వంగా వ్రాయడం ఎలా ?

ఉత్సాహం, పట్టుదల లేకుండా ఔన్నత్యాన్ని సాధించడం ఎప్పుడూ, ఎక్కడా సాధ్యపడలేదు.

స్త్రీని పరదాలలో దాచడం వలన ఏమి ప్రయోజనం? తన బ్రహ్మచర్య నిష్ఠయే స్త్రీ పవిత్రతను కాపాడే ఉత్తమ రక్షణసాధనము.

ఉరిశిక్ష, వివాహం విధి విధానాలు.

ప్రతిబిడ్డ ఓ ప్రత్యేకమైనవ్యక్తి. ఒక తల్లికి పుట్టిన యిద్దరు బిడ్డల మనస్తత్వాలు ఒకటిగా ఉండవు. ఎవరికివారే ప్రత్యేకంగా ఉంటారు. తెలివితేటల విషయంలోనూ అంతే. కనుక బిడ్డలందరూ ఒకేలా ఉండాలని అనుకోటం శుద్ధ పొరపాటు.

స్వేచ్ఛా ప్రవృత్తిగల పురుషుడు గాలిపటంలాంటివాడు. కుటుంబమనే ఆలంబనం లేకపోతే స్త్రీపురుషుల జీవితాలు గాలిపటాలేఅవుతాయి.

బిడ్డకోరగానే తల్లి యివ్వరాదు. దాన్ని జీర్ణం చేసుకోగల శక్తి బిడ్డకుందో లేదో తల్లి తర్కించి చూచి మరీ యివ్వాలి.

ఫలాభిలాషతో కర్మములను చేయువారు సంసార బద్ధులగు నీచులగుదురు.

మానవుని ప్రేమించడమన్నది అతిసాధారణమైన జీవితసూత్రం. ఇతరులను ప్రేమించడంవల్ల మానవునికి నిరవధికానందం సిద్ధిస్తుంది. మనం మూర్తీభవింప చేయవలసిన ప్రేమ విశ్వమానవప్రేమ. తోడి మానవుడ్ని హృదయమిచ్చి ప్రేమించు.

స్వర్గలోకంలోనే కాక, మర్త్యలోకంలోకూడా నీఊహలు, కలలు, సిద్ధాంతాలు చేరుకోలేనన్ని గొప్ప విషయాలున్నాయి.

తామరాకుపై నీటిబొట్టు ఎట్లు తరళంగా ఉంటుందో అట్లే జీవితం చంచలమైందని గుర్తించు.

భర్త ఆజ్ఞలేకుండా ఆపడి వ్రతాలు చేస్తుందా! ఆమెతనభర్త ఆయువు క్రుంగదీసేస్తుంది. తనూ నరకానికి పోతుంది చివరకు.

అనాది కాలమునుండియు నపరిమితముగా నంపాదించిన సంసార హేతువులైన పుణ్యాపాపములను సమత్వబుద్ధితో గూడినవాడే నివర్తింప దగినవాడు. బుద్ధియోగము నందుండుటకు మానవుడు సిద్ధ పడవలెను.

ఏసత్యమైన మనకి మన అనుభవం ద్వారా వ్యక్తమవుతూ వుండాలి. అప్పుడుగాని అది పట్టు యివ్వదు.

ఎవరైతే సహృదయులు, మిత్రులు, శత్రువులు, ఉదాసీనులు, మధ్యస్థులు, ద్వేషులు, బంధువులు, సాధువులు, పాపులు మొదలగు భేద భావములు లేకుండా వీరందరియందు ఎవరు సమదృష్టి కలిగి వుంటారో వారు శ్రేష్ఠులని, వుత్తములని చెప్పబడ్డారు.

ప్రయత్నం చేయని మానవునికి భగవంతుడు గూడా సాయం చెయ్యడు.

నమ్మకము, కార్యకలాపాలు కొవ్వొత్తి వెలుగు వేడుకలవంటివి. అవి విడతీయరానిది.

గాఢమయిన స్నేహం ఏర్పడనంతవరకే మర్యాదలు. ఆతరవాత కూడా మర్యాదలుసాగిస్తే అదికపట నాటకమవుతుంది.

బీదచుట్టము ప్రకృతిలోని అసందర్భానికి మచ్చుతునకగా నిలిచి పోతాడు.

పుణ్యాత్ము లెవరో, కాని వారెవరో వారిసంతతినిబట్టితెలుస్తుంది.

ఇబ్బందులు ఒంటరిగారావు.

ఉన్నతుడైనవాడు నిదానంగా మాట్లాడుతాడు. శ్రద్ధతో వ్యవహరిసాడు.

సమత్వబుద్ధితో గూడి ఫలాశక్తి లేకయే కర్మంబు మాత్రము చేయు పురుషులు జన్మబంధమునుండి విముక్తులై ఆరోగ్యమయిన విష్ణుపదము నొందుదురు.

తల్లికి బిడ్డలందరియెడల ఒకేవిధమైన ప్రేమ వుంటుంది. కాని ఆప్రేమలో "భేదం" చూడకలుగుతుంది పసిబిడ్డ.

పరుల కలిమికి పొరలిఏడ్చే ఓర్వలేని మానవులను భాగ్యలక్ష్మి సహించదు. అట్టివారిని ఆమె తన పెద్దఅప్పగారికి అప్పచెప్పుతుంది.

ఆకస్మికంగా పరిస్థితుల మార్పువల్ల కలిగే అత్యానందం మౌనంగా పొంద దగినదే. అది నాలుకమీదకంటె హృదయములోనే నివసిస్తుంది.

విద్యనేర్చుకోవడం స్వార్థసంసిద్ధి కొరకుకాదు. అదిమానవుణ్ణి మానవుడిలా నిలబెట్టటం కొరకు.

విశ్వాస రహితమైన కార్యాలు రెక్కలులేని పక్షివంటివి. రెక్కలులేనిపక్షి భూమిమీద గెంతగలిగి నప్పటికీ స్వర్గానికి ఎగురలేదు.

లోకంచెప్పేది వింటే లోకం అర్థంకాదు. లోకంచేసేది తెలియాలి. నీతి, నిజాయితీ, ప్రేమ, ధర్మము, కళ, సంస్కారము, శీలము, దేశభక్తి, అభ్యుదయము, పుణ్యము, పాపము మొదలైనవాటిని గురించి తెగమాట్లాడుతారు. దెబ్బలాడుకుంటారు. కాని ఆచరణలో డబ్బు వీటినన్నింటిని జయిస్తుంది. సుభాపేక్షకన్న బలవత్తరమైన దేదీలేదు.

తాబేలు యేవిధముగా తన కర చరణాద్య నయనములను అన్ని వైపుల నుండి లోనికి ముడుచుకొనునో అదే విధముగా మానవుడు విషయ వాంఛలనుండి యింద్రియములను మరలించుకొనవలెను.

డబ్బు ఎంత విలువైనదో పిల్లలకు నేర్పాలంటే వాళ్ళ దగ్గర నుంచే డబ్బులు అప్పు అడిగి తీసుకోవాలి.

మానవునిలో దైవస్వభావం, రాక్షస స్వభావం - రెండూ ఉంటాయి.

దేవాలయానికి వెళ్లే వాళ్ళంతా భక్తులు కారు.

దృఢమైన శరీరము, మానసికోత్సాహము జీవితానందానికి మూలాధారాలు.

తక్కువ మాట్లాడేవారు గొప్పవారు.

ప్రమాదానికి తీసుకువెళ్ళే త్రోవ ఎప్పుడూ సుగమంగావుంటుంది.

చేసినట్టి పాపములకు శిక్షయున్నయెడల పాపములను చేయకుండా యున్నందుకు రక్షకూడా కావలయును.

స్త్రీలులేనిదే కార్యక్రమములు చురుగ్గాసాగవు. ప్రతిపనియందు స్త్రీలుంటేనే శక్తి, ఆకర్షణ.

జ్ఞానప్రాప్తికి కర్మములు బహిరంగ సాధనములనియు, వివేకాది సాధన చతుష్టయము అంతరంగ సాధన మనియు చెప్పబడును. వివేకాది సాధన చతుష్టయము సిద్ధించువరకే బహిరంగ సాధనములను ష్టియములగును. గాని తరవాత పరిత్యజించ వలెను.

నిత్యం దుఃఖిస్తూ యితరులను దుఃఖ పెట్టేవారిని కాలక్రమేణ అందరూ విడిచిపెట్టేస్తారు.

స్వల్పంతో సంతృప్తి చెందేవాడు భాగ్యవంతులలో కెల్ల భాగ్యవంతుడు. ఏమంటే సంతృప్తి ప్రకృతి ప్రసాదించిన గొప్ప సంపద.

ఎప్పుడు మానవుని బుద్ధి ఆత్మ వస్తువు సకల పదార్థముల యందునూ వేరై నిత్యనిరతిశయమై సూక్ష్మమై యున్నదని యెరింగి యేకరీతిగా నిలుచునో అపుడే మానవునకు యోగఫలము సిద్ధించును.

పుత్రులు, పౌత్రులు, బంధువులు తోబుట్టువులు, శిష్యులు ఐశ్వర్య హీనుని వెంటచేరరు.

మీకొక స్నేహితుడువుంటే తరచూ కలుసుకుంటూ వుండటం మంచిది. లేకపోతే దారిలో కలుపు మొక్కలు మొలుస్తాయి.

మానవుడు మిధ్యతో రాజీపడి జీవితంలో ఎంతో సంపదను పోగొట్టు కొంటున్నాడు.

తల్లిదండ్రులతోనే పడనివాడికి ప్రపంచంలో ఎవరితోనూ పడదు. తల్లిదండ్రులను ప్రేమించ లేనివాడు ప్రపంచంలో యింకెవరిని ప్రేమించలేడు.

ఎన్నో కష్టాలను, దుఃఖాలను సహించితేనే గాని మనిషిని భగవంతుడు జ్ఞానిగా చేయడు.

తల్లి దండ్రి మధ్య యెడతెగని పోరువున్నపుడు యిద్దరి భావాలు ఏకీభవించక వాదుకొన్నపుడు బిడ్డ పరిస్థితి నడిసముద్రంలో చిక్కిన నావలా వుంటుందట.

మనసుకి శాంతినిచ్చేది మనం నమ్మిన పని, ఆ పనిలో నిమగ్నులం కావడం.

కష్టాలు, పేదరికం మనిషిలోని ధైర్యాన్ని, ఆశల్ని సాన బెట్టి పెంచుతాయి.

నిశ్చలత నీచేష్టలలో చూపు. కాని హృదయం మంచిదిగా వుంచుకో.

మానవుని చరిత్రకంటె అతని శ్రమ స్వజన చరిత్రయే ఎక్కువ ఆశక్తిదాయకమైనది. మానవుడు నూరేళ్ళునిండకుండానే మరణిస్తాడు. కాని అతడు చేసిన నిర్మాణాలు మాత్రం శతాబ్దాలు తరబడి జీవించే వుంటాయి.

భార్య సుగుణవంతురాలైతే యిక దారిద్రం యెక్కడ వుంటుంది. ఆమెలో గుణం లేకపోతే ఐశ్వర్యం ఉండిమట్టుకు ఏమి ప్రయోజనం?

స్వతహాగా మనిషి కోరేది తనమంచికాదు. తోటివాడి కీడు.

అనంతమైన దారిద్రం కాని, అమితమైన సంపదకాని హేతు వాదాన్ని ఆలకించదు.

సూర్యుని వేడినంతటిని వృక్షం భరించి మనకు చల్లని నీడ నిస్తూంది.

నిన్నటికన్న రేపు బాగుంటుందన్న నమ్మకంతోనే మనిషి బ్రతుకుతున్నాడు.

ఎప్పుడు తన ప్రత్యాగాత్మ స్వరూపమందే నిలిచియుండి సంతో షించుచు మనస్సు నందలి సకలమైన కోరికలను బొత్తిగా విడుచునో అప్పుడు మానవుడు స్థితప్రజ్ఞుడనం బడును.

మరణించిన వారినిగురించి చెబితే మంచి మాటలు చెప్పాలి. లేకుంటే వూరు కోవాలి.

పుట్టుకవల్ల గొప్పరానేరాదు. గుణయోగ్యతల వల్లనే గొప్పవస్తుంది. పెద్దస్థితిలోవుండు దుర్జనునికన్న తక్కువ స్థితిలోవుండు సజ్జనుడు నిజమైన గొప్పవాడుకాడా!

మూర్ఖుడు తన దుస్తులను జరీతో అలంకరించుకోవచ్చు. కాని అవి మూర్ఖుని దుస్తులే.

నీకు సుఖాన్ని యిచ్చేశక్తి యితరుల్లోగాక నీతో వుంటేనే నీకు శాంతి! లేదా బాధతప్పదు.

దుర్జనులతోడి పొందు గ్రీష్మతాపసంతప్తమైన మరుస్థలంవలె వుంటుంది. కనుక త్యజించాలి.

మనిషికి చదువువల్ల పరిపూర్ణత, సమాలోచనవల్ల ప్రాప్తకాల జ్ఞత అలవడుతాయి.

కళల గాజు బుడ్డిలో దాచిన అహంకారము మిడతలకు దీపం వంటిది.

స్వజనంతో, బలవంతులతో విరోధం పెట్టుకోకు. స్త్రీ, బాల, వృద్ధులతో, మూర్ఖులతో తగవు లాడకు.

జీవితమున నిత్యనూతనత్వమును విఫలము కాని మాధుర్యమును నిరంతర ఆత్మవికాసము చేతనే ఎవరైనను కనుగొన గలరు.

నారీకుచ, చీర, నాభి ప్రదేశమును చూచి మోహావేశమును పొందకుము. అవన్నీ మాంసం, క్రొవ్వు మొదలయిన వాని వికారములే.

జీవిత పరిమాణం తక్కువే అయినా దయచూపుటకు ఎప్పుడూ కాలం ఎక్కువే.

ఆధ్యాత్మికాది దుఃఖములు కలిగినచో మనఃక్షోభము లేకయునూ, సుఖము కలిగినపుడు సంతోషింపకయునూ, రాగభయ క్రోధములను విడిచి ఆత్మధ్యాన పరుడగు మునివరుండు స్థితప్రజ్ఞు డనంబరగును.

తండ్రి నిధి, తమ్ముడు సౌఖ్యం, మిత్రుడు రెండూనూ.

మౌనం పామరులకు స్వతసిద్ధమైనది. మంచిదీనూ, బ్రహ్మచారి అజ్ఞతను కప్పుకోవడానికి దీనినిచేసి వుండ వుండవచ్చు.

దారిద్రమను మహామకరంచేత బట్టుపడినవారికి విమోచనం లేదు. అందును దారాపుత్రాదుల బాహుళ్యము మరింత దుఃఖహేతువు.

ప్రజ్ఞకలవాడి చుట్టూ పదిమంది బలాభళీ అనేవాళ్లు చేరడం లోకంలో సామాన్యమే.

ధనం సంపాదించినా దానిని అనుభవించ డానికి భయపడేవాని ధనం కన్యపుట్టినిల్లు వదలి మరొకయిల్లు చేరినట్లు అవుతుంది. అంటే శ్రమ ఒకరిదైతే అనుభవం మరొకరిది.

తెలివిగలవాడు తనకు కలిగిన అవకాశాన్ని గుణీకృతం చేసు కుంటాడు.

తన రహస్యాలనే కాకుండే యితరుల రహస్యాలను కూడా వెల్లడిచేసి యిబ్బందులకు గురిఅవుతాడు వాచాలుడు.

ఒంటరి తనాన్ని ఆస్వాదించే అసాధారణమైన గుణం వున్న వ్యక్తి కల్లోల ప్రపంచంలో మందకొడిగా వుండడంకద్దు.

స్త్రీ ఆటవికంగా అనుత్పాదకమైన అల్పమైన వేసట కలిగించే వివేకం పోగొట్టచేసే, అణచిపారవేసే పనిభారంతో తన శ్రమను వృధాచేస్తూవుంది.

మానవ నైజము బాగా తెలిసినవాడు తాను విన్నదానిని చూచుట ద్వారా సరిదిద్దుకొనును. అజ్ఞానము లేనివాడు తాను చూసినదానిని విన్న వానిద్వారా చెడుపు కొనును.

ఏపనంటే భయపడతావో ఆపని చేయడానికే ప్రయత్నించు.

కోపం ఒక ఘనత అనుకొని, లాభం అనుకొని లొంగిపోయిన వాడు దానివలన కలిగే కీడును అనుభవింపక తప్పదు.

ధర్మంమీద ప్రతిష్ఠింపబడు కర్మమాత్రమే చేయదగినది. జ్ఞానులు గర్హించు కార్యములు పరిత్యజించాలి.

ఆలోచనలకు మాటలెంతటివో మంచితనానికి వస్త్రమత అంతటిది.

జంతు, వృక్ష, మనుష్యాది సమస్తరూపములతో చేయబడిన గాజుసీసాలు నాబల్లపై నున్నవి. కాని ఎన్నిటిలో నీరు పోసిననూ నీరు నీరే.

కేవలము దుర్మార్గులయితేనూ, తెచ్చిపెట్టుకున్న దుర్లక్షణాలు కలవారయితేను పరిచయం పెరుగుతున్న కొద్దీ అసహ్యం పుట్టిస్తారు గానీ ఆసంస్కారంగల మనిషిలో చూస్తున్న కొద్దీ మంచి లక్షణాలు కనిపించటమేకాక సంస్కారం లేక పోవటమే ఒక ఆకర్షణగా కూడా కనిపించడం జరుగుతుంది.

మర్యాదవల్ల ఖర్చేమీకాదు. కాని అందువల్ల ఎంత విలువైన వస్తువు నయినా కొనుక్కోవచ్చు.

చివరి ఫలితం దుఃఖంగా పరిణమించిన దాన్ని ఆరంభంలో ఎంత ఆనందంగా వుండనీ గాక యధార్థమయిన ఆనందానుభూతి అనడానికి వీల్లేదు.

భగవంతుడు మానవునికి పరిమితిశక్తి నిచ్చికూడా అంతులేని ఆశల్ని పురిగొల్పాడు.

కొద్దిపరిచయాలకే మనుష్యలమీద అభిప్రాయాలు ఏర్పరుచు కోవడం సరికాదు.

జ్ఞానవృద్ధులైన వారికి నమస్కరించి సేవిస్తే ఎల్లప్పుడూ ఆయుష్షు, విద్య, కీర్తి, బలమూ వృద్ధి చెందుతాయి.

మనస్సులోని నరకాన్ని మార్చే మంత్రజలం కన్నీరు.

గర్వపడటానికి పేదలంత అర్హు లెవరూలేరు.

అనంతమైన ప్రకృతి గ్రంథంలో నేను చదవగలిగేది బహు కొద్ది మాత్రమే.

మృత్యువుఅంటే తెలియని ఒకదేవత కన్నా నలుగురికి మేలు చేయు మానవుడు మిన్న.

క్రీస్తుదేవుని అత్యధిక దీవెనలు నీకు కలుగునుగాక ! క్రీస్తునందు జయమునుండి విజయమునకు ఆయన నిన్ను నడిపించునుగాక.

స్త్రీ అహింసామూర్తి, దేవత, పార్వతీదేవి పవిత్రరూపం, స్వార్థత్యాగి, పుణ్యమూర్తి.

దానాలెన్ని చెయ్యనీ- నిత్యము ఉపవాసము చెయ్యనీ- తీర్థస్నానాలు యెన్ని చెయ్యనీ- ఆడది పవిత్రురాలు కాలేదు. భర్తపాదాలుకడిగి శిరస్సున చల్లుకుంటేనే పవిత్రురాలవుతుందెప్పటికైనా.

అర్థసిద్ధికంటె ధర్మసిద్ధివలన సకల సిద్ధులు ప్రాప్తించును.

సహాయం పొందేటప్పుడున్న శ్రద్ధ సహాయం చేయటంలో వుండదు.

యెదుటవ్యక్తి ఆచారంపట్ల గౌరవం చూపకపోవడం ఆత్మగౌరవోచితమగు స్నేహానికి గొడ్డలిపెట్టు.

ఎవడు సర్వస్థలముల యందును అభిమానంలేక, కర్మానుకూలంగా దనకులభించిన శుభాశుభములందు సంతోష వ్యసనములను పొందక వాడ్ని తృణప్రాయముగాయెంచి యుపేక్షించునో అతనిప్రజ్ఞ స్థిరమై యుండును.

స్వాతంత్రంకోసం, సత్యంకోసం పోరాడటానికి రణరంగంలో దుమికేవాడు మంచిదుస్తులు వేసుకుని వెళ్ళకూడదు.

నోరుమంచిదయితే ఊరుమంచిదే అవుతుంది. పెద్దలయెడ గౌరవం కనక చూపితే వారే తల్లిదండ్రులవుతారు. సాటివారితో స్నేహంగా ప్రవర్తిస్తే వారే సోదరులు.

ఒకరిని అసహ్యించుకొనే వ్యక్తి యితరుల అసహ్య భావాన్ని సులువుగా కనిపెట్టగలడు.

మనకు అపకారం చేసిన వాడినికూడా మనం ఉపకారంచేసి ఆకట్టుకోవాలి.

పిల్లలు నేర్చుకోవలసినది చదవడం, వ్రాయడం, లెక్క పెట్టటం, కొలతలు కొలవడం మాత్రమే కాదు. ఊహించడం, భవిష్యత్తును గూర్చి ఆలోచించడం నేర్చుకోవాలి.

క్షణికావేశాలు మానవుని కూడా పశువుగా చేస్తాయి.

నాగరికతనేది సులువుగా సంపాదించే అవకాశం లేదు. సంస్కృతిని అవలర్చుకోవాలి. అవినీతిలోనైనాపడాలి. పల్లెటూరు వాళ్ళు యీ రెండూ చెయ్యలేరు. కనుక నాగరికత ఎప్పుడూ వాళ్ళకి దూరంగా ఉంటుంది.

భార్య పుత్రాదులను, వస్త్రాన్న భూషణాదులచేత, మృదు భాషణలచేత దగ్గర తీసుకొని పోషించి రక్షిస్తూ వుండాలి.

ఇతరులను సంతోషపెట్టడానికి వ్రాసేవాడు రచయిత యేలా అవుతాడు ? ఇతర్లకు భయపడి వారిని సంతోషపెట్టడం కోసం వ్రాయడంకంటె వ్రాయడం మానుకోవడం ఉత్తమం.

పుష్పముబు ఏలా వికసించి వాడిపోవునో గమనించుము. ఒక మనిషి బుద్ధిమంతుడు, యింకొకడు కాడు. అని ప్రకటించకు.

కాలమన్నా, అవకాశమన్నా నాకు గొప్ప గాబరా. వాటినిగురించి నేనెన్నడూ అలోచించను. అయినా తిప్పలు తప్పవు.

క్రౌర్యము, భయము ఒండొంటితో చేతులు కలుపుతాయి.

మనం భోగభాగ్యాలతో తులతూగు తున్నపుడు మనమిత్రులు మనల్ని గుర్తిస్తారు. మనం కష్టాలలో వున్నపుడు మనం మనమిత్రు లెవరో గుర్తించగలుగుతాము.

ధర్మసర్వస్వమంతా హృదయాన్ని పవిత్రంగా వుంచుకోవ డంలో వుంది. తక్కిన విషయ ప్రపంచమంతా శుష్కతతంగమే.

సంసారంలో సుఖంగావుంటే భర్త తన సంపాదనతో ఉద్యో గంలో మనస్సును కేంద్రీకృతంచేసి యింకాపైకి రావటానికి వీలు యేర్పడుతుంది. భార్యాభర్తలు పరస్పరం సానుభూతితో అర్ధంచేసు కోవాలి. అడుగడుగునా సహకరిస్తూ పయినించాలి. మాటమంచితనంతో మనసులో మంచిని పెంచుకుంటూ, ఆనందంగా వుండేలా సంసా రాన్ని భార్యాభర్తలు చక్కదిద్దుకోవాలి. ఇంటినిమించిన విశ్వవిద్యా లయం ఎక్కడాలేదు.

శ్రమజీవులు సాధారణముగా నిజాయతీ పరులు. పరిశ్రమ వారిని లోభానికి అతీతంగా వుంచుతుంది.

ధర్మం చెయ్యడం ద్రవ్యాన్ని పెంచడమవుతుంది.

ఉత్తముడు జనించుట దుర్లభము. అట్లు జనించిన అతడు జనిం చిన దేశము ఉన్నతిని పొందును.

పువ్వుల యెడ అమితాదరముకల మనిషి వాటి ఎత్తుబంగారము యిచ్చినా ఆపువ్వుల్ని విడిచి పెట్టలేడు.

రాజనీతి వారాంగనవలె పరస్పర విరుద్ధ గుణాలు కలిగి సమ యానుకూలంగా అనేక రీతులుగా వుంటుంది. సత్యాసత్యాలు, పరు షాలు, ప్రియాభాషణములు, హింస, దయాళువు, లోభి దానశీల బాగా

ఆర్జించడం విచ్చలవిడిగా ఖర్చుచేయడం- యీలక్షణాలన్నీ కలిగి వుంటుంది. నృపనీతి.

ధనార్జనాతృష్ణను విడిచిపెట్టి నిరంతరము ఆశారహితమైన సద్బుద్ధిని గలిగివుండు. స్వయం కృషితో సంపాదించిన ధనముతో మనసును తృప్తిపరచుకో.

ఎంతో ఉత్సాహపడుచు కష్టపడతాము. జీవితములో మరణం లేకున్న రుచియేలేదు.

తమ్ముడూ ! నీనోటిని అదుపులో పెట్టుకో. నీమిత్రులను దూరంచేసుకోకు.

ఏమానవుడు మనస్సునందుగల సమస్త కోరికలను జయించునో అతడే జ్ఞాని. అతడే మోక్షార్హుడు.

విజ్ఞాన సముపార్జనకు మూడు మూలాధారమైన సూత్రాలు – క్షుణ్ణంగా పరిశీలించడం, అధికంగా శ్రమకోర్చుకోవడం, విరివిగా అధ్యాయనం చేయడం.

తాబేలు ఎవడైన తనకెదురుపడినచో భయముచే దన యవయవములను లోనికి యిమిడ్చి కొనెడి రీతిగా ఎవడు తన యింద్రియములు విషయములందు ప్రవేశించినపుడు జ్ఞానసిద్ధికి హాని కలుగునని భయము చెంది వానిని ఆకర్షించి లోపలనే యిమిడ్చి కొనునో వాడు అప్పుడే స్థితప్రజ్ఞుడగు చున్నాడు.

మంచి మనస్సే నిత్యకళ్యాణం.

దారిద్ర్యము, దుఃఖము అందును ఆశ మరియు దుఃఖము. ఆశకు దాసులయినవారు సకల లోక దాసులు కావలయును. ఆశను దాసినిగా గైకొన్నవారికి సకల లోకము దాస్యం చేయును.

చెప్పులు కుట్టే వ్యక్తి చాలా మంచిచెప్పులు తయారు చేస్తాడు. ఏమంటే ఆవ్యక్తి కేవలం చెప్పులు మాత్రమే తయారు చేస్తాడు కనుక.

కుటుంబములో సంతోషానికి మూలం భార్యాభర్తలు. ఆర్థికస్తోమతును కుటుంబ సంస్కృతిని తెలుసుకుని జీవించడం - స్తోమతు తెలుసుకో లేని వారి దాంపత్యం ఫలింపదు.

ఈప్రపంచంలో ఏ ఆడదానికి ఏమగాణ్ణి పెళ్ళి చేసినా జీవితం ఒకటిగానే వుంటుంది. తేడాలన్నీ డబ్బునుబట్టి వస్తాయిగానీ మనిషిని బట్టిరావు. అసలు దాంపత్యంలో దంపతుల స్వభావమే నూటికి తొంభై పాళ్ళురిఫ్లెక్టవుతుంది. ఒక మొగుడితో దెబ్బలాడే పెళ్ళాం యింకే మొగుడితోనైనా దెబ్బలాడుతుంది. ఒక పెళ్లాన్ని నెత్తినెత్తుకొని మోసే మొగాడు యింకే పెళ్ళానైనా నెత్తినెత్తుకుని మోస్తాడు.

ఎముకలేని క్రిమిని సూర్యుడు కాల్చివేయునట్లు ప్రేమలేని వానిని ధర్మం దహించి వేస్తుంది.

దుర్భరమైన ఏకాకి తత్వం ఏదంటే నిజమైన మిత్రులు లేక పోవటయే.

అహింస వినాసత్యసాధన అసంభవం. అందువల్లనే అహింస పరమోధర్మ మైనది.

జీవితమంటే ఏమిటో మనం తెలుసుకునేటప్పటికి దానిలోసగం భాగాన్ని ఖర్చు చేస్తాము.

జల్లెడవలె దుఃఖము - బతకాలనుకునే మానవుల్ని ఒకవేపూ చావాలనుకునే మానవుల నొకవేపూ - చేసివేరు పరుస్తుంది.

ఇంద్రియములకు విషయము లాహారమగుట వలన నాయాహార ములను వానికి నొసపక వస్తువేసిన యెడల అనగా ఇంద్రియముల

చేత శబ్దాది విషయములను గ్రహింపక నిరాహారంబైన మౌనమును ధరించిన యెడల వానికి విషయానుభవము మాత్రమే లేకపోవును. కాని విషయాభిలాష మాత్రము వదలదు. విషయములకన్న పరంబై యుండెడి యాత్మవస్తువులు సాక్షాత్కరించిన యెడల అదినివర్తి యగును.

జీవించటం కూడా ఒకకళే. బాల్యములో ఆటపాటలతో ఆనందిం చాలి. యవ్వనాన్ని సాహసోపేతంగా, మర్యాద సంపన్నంగా శ్రమ జీవనం గడపాలి. వార్ధక్యంలో ప్రశాంత చిత్తంతో వుండాలి. ఈరకం జీవితం మనకేకాక మన పొరుగువారికి కూడా సుఖకరంగా వుంటుంది.

జీవితంలో మనం సాధించగలిగే చాలాపనులు ప్రమాదవశాత్తు జరుగుతున్నవే కాని మనశక్తి సామర్థ్యాలవల్ల మాత్రం కాదు. అందాకా ఎందుకు ! మనపుట్టుకే ప్రమాదవశాత్తు జరిగివుంటుంది. కామం తీర్చు కున్నపుడల్లా మానవజాతి అభివృద్ధిచెందే బీజాలు పడటంలేదు. ఎప్పుడో హఠాత్తుగా అది జరుగుతూవుంటుంది. మనం కావాలన్నపుడు జరగని పనులూ, మనశక్తి వంచన లేకుండా వున్నపుడు అసలు మనకు ఆశేమీ లేకుండా వున్నపుడు ఒకక్షణంలో జరిగేపనులూ- యివి అన్ని యీజాతికి చెందినవే. చివరకు మనచావు- తుది ప్రమాదం. పుట్టునపుడు మనకు ఎవరూ- చివరకు కనిపెంచిన మనతలిదండ్రులకు కూడా తెలి యదు. క్రమంగా అనేక సందర్భాలలో ప్రమాద వశాత్తు ఎంతోమంది స్నేహితులు, బంధువులు, ప్రియులు, ముఖ్యులు, విరోధులు యింకా యెందరో పరిచయులవు తుంటారు. ఇదంతా మనం కావాలని కోరు కున్నది మాత్రంకాదు. దానంతటదే జరిగిపొయ్యే సంఘటనలు.

ప్రేమను వెదుక్కొని సంపాదించవచ్చు. కాని వెతక్కుండా లభించేది వుత్కృష్టమయినది.

మనకు లభించిన సౌఖ్యాన్ని యితరుల దృష్టితో చూడడం ఎంత చేదు అనుభవం!

ఇష్టంగా వుండడం నాకు ఎంతోయిష్టం. ఇష్టంగా వున్నానిపించు కోవడం కోసం యేదైన చేయడం నాకిష్టమే.

యజ్ఞములలో జపయజ్ఞమును, వ్రతములందు అహింసయు శ్రేష్టములు.

కర్తవ్యం అంటూలేని క్షణం ఒక్కటికూడా వుండదు.

సౌందర్యము. ఆనందము విడదీయరాని శక్తులు.

ఆత్మ సాక్షాత్కారమును, విషయాభిలాషయును కార్యకారణ ములై యుండుటంబట్టి విషయాభిలాష వదలక ధ్యానమునందు యత్నము చేసినచో ఎంతటి విద్వాంసుడైనను ఆ బలీయములైన యింద్రియములు వివేకముగల వాని మనస్సునుగూడ బలాత్కారముగా హరించును.

మానవులు కష్టాలలో వున్నపుడు యితరులు తనను ఆదుకోవాలని ప్రతీవారు కోరుకుంటారు.

మనం నిర్వహించకుండా వుంటే విధ్యుక్త ధర్మాలలో ప్రతీ ఒక్కటి మనం తెలుసుకుని తీరవలసిన ఒక సత్యాన్ని మరుగుపరుస్తుంది.

గతాన్నిగూర్చి విచారించకు. భవితవ్యాన్ని గురించి భయపడకు.

పరోక్షమయిన గుణవృత్తులు సర్వత్రా వారి వారి కర్మలనుబట్టి వుంటాయి. అంటే యెవరి మనోభావాలనైనా వారు చేసేపనులను బటి నిర్ణయించాలి.

అనేక శతాబ్దాలుగా మగవాడు ఆడదాన్ని హీనప్రాణినిచేసి, అడ్డమయిన కట్టుబాట్లలోను ఉంచి, దాదాపు ఏ హక్కు లేకుండా చేసినందుకు ఆడది తీసుకోగల ప్రతీకారచర్య ఒకటేవుంది. మగవాడికి ప్రతీక్షణమూ వాడి భాద్యతలు జ్ఞాపకము చెయ్యడమూ, వాని భాద్యతలు వీలైనంత బరువు వెయ్యడమునూ, ఈపనిచేసే నేర్పు మధ్య తరగతి స్త్రీలలో బహుకొద్ది మందికే వుంటుంది. ధనికవర్గానికి చెందిన మగవాళ్ళు పెళ్ళాలుచేసే భారాన్ని సులువుగా మొయ్యగలరు. తమస్త్రీలకు ఏ హక్కులూ లేవన్న సంగతి జ్ఞాపకం రాకుండా చెయ్యగలరు. పేదవాళ్లలో స్త్రీలకు కొంత స్వేచ్ఛ వుంది. వాళ్లు, తమ బరువులను చాలా వరకు తామే మోస్తారు. అవసరమైతే అప్పుడప్పుడు మొగుడి బరువు కూడా మోస్తారు. మధ్యతరగతి కుచేలుడికే భార్యలు రంపపు కోత భరించే దుస్థితి ఏర్పడుతుంది.

ఆత్మ శుభ్రంగా వుంటే ఎవరికీ నీవు భయపడాల్సిన పనిలేదు.

చేతిలో డబ్బున్నవాడినీ శరీరంలో బలమున్నవాడినీ సంఘం ఏమీ చేయలేదు.

సత్యసోధన, అహింసా పాలన, బ్రహ్మచర్యం అసాధ్యాలు. అదేవిధంగా అపరిగ్రహోభయాలు, అస్పృస్యతా నివారణ, సర్వధర్మ సమానత్వమనే సత్కార్యాచరణలు కూడా అసాధ్యాలు.

తనవిద్యుక్తధర్మం నిర్వహించడానికి సిద్ధంగా ఉండే వాడివి భగవంతుని సహాయము ఎల్లప్పుడు వుంటుంది.

విషయములమీద పోవుచున్న యింద్రియములను నిగ్రహించి, స్వాధీనపరచుకొని భగవంతునియందు మనస్సును నిలుప వలయును. ఎవనికి యింద్రియములు స్వాధీనము నందుండునో వానికి ప్రజ్ఞచలింప కుండును.

అనుమానించడం అంటే మోసాన్ని ఆహ్వానించడ మన్న మాటే.

భగవంతుని చేతులనుండి సృష్టించబడిన ప్రతీదీ పవిత్రమైనదే. కాని లోకం, సంఘం దానిని నీచంగా, ఘోరంగా తయారు చేస్తుంది.

బీదరికం అవమానంకాదు. కోరికలేని బీదతనం అవమానం అవుతుంది. స్వార్థబుద్ధి అసహ్యంకాదు. శక్తిలేనిస్వార్థం అసహ్యం. చావు దుఃఖముకాదు. ప్రపంచానికి ఉపయోగము లేక చనిపోతే దుఃఖం.

కులటలతో తిరుగువారల కులము నూరుతరముల పర్యంతము పాపభూయిష్టంకాగలదు.

మీవిశ్వాసాల ప్రకారం మీరు జీవించిననాడు చుట్టూగల అభిప్రాయభేదం మొదట్లో కొంచెము బాధించినా మీలోగల సౌజన్యం వల్ల మిమ్ములను గౌరవనీయులుగా చేస్తుంది.

ఇచ్చి పుచ్చుకోవడాలు, పనిపాట్లు సకాలములో శీఘ్రంగా పూర్తి చేయాలి. కాలయాపన జరిగితే వుపయోగం వుండదు.

తనలోవున్న లోపాలను తెలుసుకొనుట చాలాగొప్పవిద్య. తనలోని లోపాలను తెలిసినవాడే పరిపూర్ణుడైన మానవుడు.

భార్యకు వుండవలసిన పవిత్ర పత్నిధర్మం ఆమెలో లేనినాడు యికయెన్ని సంపదలున్నా అవి బూడిదలో పోసిన పన్నీరు వంటిదే.

నీఅంత్యకాలం సమీపించు సమయములో నిన్ను నీపాండిత్యమెంతమాత్రం కాపాడదు. కాని నీవు భగవంతుణ్ణి నమ్మివుండు.

స్నేహమప్పుడు స్నేహం. పని అప్పుడు పనే. చిత్తమునకు ప్రశాంతమనెడి నైర్మల్యము కలిగిన అది నానావిధములైన దుఃఖములను

నశింపచేయును. అట్టివానికి స్వరూప విషయమైన ప్రజ్ఞసులభముగా స్థిరపడును.

మనసు చెదరకుండగా ఓటమి నంగీకరిస్తే అంతకంటె ధైర్యానికి పెద్ద పందెం లేదు.

సుఖం తరువాత దుఃఖము. దుఃఖము తరువాత సుఖము- చక్రం తిరిగి వచ్చినట్లు సుఖదుఃఖాలు మానవులకు కలుగుతాయి.

పురుష ప్రయత్న బలమున మనస్సును శ్రేయః ప్రదమగు మార్గమునందే చేర్పవలెను. తమ పుత్రుడు చెడుత్రోవకు పోకుండా సన్మార్గమునందే చరించు చుండుటకై తల్లిదండ్రు లేవిధముగా శ్రమపడి ప్రయత్నించుదురో అదేవిధముగా నీవు ప్రయత్న పూర్వకముగా మనస్సనే బాలుని అశుభకర్మలవైపునకు పోనీయక సత్కర్మలవైపునకే మరలు నటుల చేయవలెను. తల్లిదండ్రులు తమ పుత్రుని చాంచల్యమును పోగొట్టి, మెల్లమెల్లగా సామ దాన దండోపాయముల నవలంభించి మంచి త్రోవను త్రిప్పునటుల శమదమాది గుణాభ్యాసము చేతను, గురు శుశ్రూషా శాస్త్ర శ్రవణములచేతను, మనస్సును శుభవాసనలనుండి తొలగకుండునట్లు చేయుటే పురుషయత్నము.

తక్షణం నిర్వర్తించ వలసిన కర్తవ్యాన్ని నిర్వహించండి. తరువాత కర్తవ్యం ఏమిటో అప్పుడే స్పష్టం అవుతుంది.

ప్రతివస్తువూ కొత్తగా వున్నపుడు బాగుంటుంది. కాని స్నేహం పాతపడ్డ కొలదీ బాగుంటుంది.

రచయిత దగ్గర పంచిపెట్టడానికి ఏముంటుంది? అతని దగ్గర ఉండేదల్లా ఒక్క తపస్సే. దాన్నే అందరిముందూ వుంచుతాడు. కాని తనకోసం ఏమీ మిగుల్చుకోడు. సాధారణ మానవుడు తనకోసమే

తపస్సు చేసుకుంటాడు. రచయిత విశ్వమానవ కల్యాణం కొరకు తపస్సు చేస్తాడు.

శాశ్వతంగా నిలిచేది గ్రంథం ఒక్కటే.

విద్వేషాగ్ని బయలుదేర రాదేకాని ఒకసారి ప్రజ్వరిల్లితే చల్లారడం సులభంకాదు. తన్నుతాను ఆకాశాని కెత్తివేసు కోవడము; అధఃపాతాళానికి తొక్కివేసు కోవడము- రెండు దొనగులే.

ఆకలిబాధ ఎంతో దారుణమైనది. దానిముందు ఏబాధలూ గుర్తుకురావు. మానావమానాలు, న్యాయ - ధర్మాలూ అన్నీ తేలిగ్గా ఆ ఆకలిజ్వాలల అడుగున పడిపోతాయి.

పరోపకారం చెయ్యాలన్న సంగతి క్షణక్షణమూ జ్ఞాపకంవుండే వాడికి ఆపదలు తొలంగిపోతాయి. క్షణక్షణానికీసంపద వృద్ధి అవుతుంది.

మధ్యలో మధిమధిరేక్షణ లుండబట్టి కాని లేకపోతే సంసారపు టావలి అంచుల్ని చేరడం అంత దుస్తరం కాదు.

బానిసలుగా వుంటూ వెనుకబడిన వారిలో మరీ వెనుకబడివున్న మహిళలు మేల్కొన్నట్లయితే విప్లవం విజయప్రద మవుతుంది.

పైకి పుణ్యాత్ముని వలెను, అంతరంగమందు ధర్మవ్యతిరేకిగాను వ్యవహరిస్తే బాధలలోపడి అంతులేని దుఃఖములో పడిపోతావు.

మానస్సును నిలుపకయే స్వప్రయత్నముచే యింద్రియ జయంబు కోరి యత్నముచేయు వారికి శుద్ధాత్మ స్వరూపజ్ఞానమును, నిరంతర ధ్యాన విశేషమును కలుగవు. అదిలేకున్నచో ఆశనివర్తికాదు. ఆశ నివర్తి లేనిచో పరమానందమైన మోక్షసుఖము కలుగదు.

అసలు పరిస్థితి విషమించకుండా చూచుకోవడంఉత్తమం. విషమించిన పరిస్థితిని సర్దుకుని చక్కబరచేందుకు వెనువెంటనే పమా

యత్తం కావడం మధ్యమం. పరిస్థితి విషమించినా విషమించ లేదను కొని కళ్లు మూసుకొని కలలు కనడం అధమం.

మహాభక్తుల యాపదలను పరమేశ్వరుడు సహింపనేరడు. నిత్యమూ తులసీదళములతో నైననూ పరమేశ్వరుని పూజించు నాతని యాపదలను సహితం దేవుడు సహింపజాలడు.

క్షుద్రమయిన మనస్సుకి దురాలోచన కలిగినప్పుడు తప్ప సర్వ సామాన్యంగా మానవస్వభావం పాపంజోలికి పోవడమన్నది సత్యమే. అయినా మననాగరికతలో రకరకాల కోరికలు, దురభ్యాసాలు అసహజ మైన వాంఛలూ బయలుదేరాయి. అవి మానవుల సహజ ప్రకృతి లక్షణాలను మాపుచేసి పెడదారులు పట్టిస్తాయి. అందువల్ల పైనత్యాన్ని యిప్పటికీ విశ్వసింప వచ్చును.

నిజాయితీ అంత ఉత్తమ సాంప్రదాయం మరోటిలేదు.

నేను స్త్రీని, నేను అనుకున్నానంటే అవవలసిందే.

ప్రస్తుతం చలామణీలోవున్న మతాలు మోజస్, క్రీస్తు, మహ మ్మదు మొదలయిన వారందరి మతాల్ని నేను నిరాకరిస్తాను. అవి మాన వుల్లో పరస్పర ద్వేషాన్ని పెంపొందించి, అసహనాన్ని అభివృద్ధి పరచడమేగాక బయట ఎక్కడో వున్నాయనుకొనే ఏవో శక్తులకు మాన వుల్ని బానిసగా చేస్తున్నాయి. ఈ భ్రాంతులు నాశనం కావాలి. అప్పుడే పరస్పర వైరుధ్యాలు లేకుండా సామరస్యంతో సర్వశక్తులను అభివృద్ధి పరచుకుంటూ తోటిమానవుల అభివృద్ధి చెందడానికి తోడ్పడే నూతన మానవుడు జన్మిస్తాడు.

చేసినమేలు మరచిపోవడం నీచం. కాని తనకు కలిగిన అప కారాన్ని ఆ నిమిషములోనే మర్చిపోవడం ఉదారత అనిపించు కుంటుంది.

ఏదోవిధమైన భ్రమలేని మనిషి ఆనందంగా ఉండలేడు. మన ఆనందానికి వాస్తవ్యం ఎంత అవసరమో భ్రమకూడా అంతే అవసరము.

అన్యోన్యప్రేమ, పవిత్రస్వభావం, నిష్కళంక హృదయం భారతీయ సాంప్రదాయ బద్ధములు.

జీవితమున నిత్యనూతనత్వము, నిత్య అభిరుచిని ఎవరైనను నిరంతర ఆత్మ వికాసము చేతనే కనుగొనగలరు.

పవిత్ర జీవనం అంటే ఊహల్లో, మాటల్లో, పనులలో అనగా త్రికరణ శుద్ధిగా సత్యము, ప్రేమ, నిజాయితీ, నిస్వార్థసేవ, సరళ భావాలు ఆధారంగా నిత్యజీవితాన్ని గడపడమే.

ఇంద్రియ విషయముల మీదకు పోవునపుడు మనస్సుకూడా వాని ననుసరించి పోవునేని అట్టి మనస్సు సముద్రములో పోవుచున్న ఓడను వాయువు సరియైన మార్గములో పోనీయక వేరొకమార్గమునం గొని పోయి నాశనముచేయు రీతిగా ఆత్మాభి ముఖంబై యుండెడి జ్ఞానమును బలత్కారముగా త్రిప్పి శబ్దాది విషయాసక్తము గావించి నశింపచేయును.

మనుష్యుడు తానుచేసిన మంచి కార్యాలకు మంచి ఫలితం, చెడ్డ పనులకు చెడ్డఫలము అనుభవించును. మనుష్యుని సుఖ; దుఃఖములు తానుచేసిన శుభాశుభ కార్యములను బట్టివుండును.

ఎక్కువ కాలము ప్రేమను చూపవలసిన వారిపై సబలైన ప్రేమనే చూపవలయును. ఆవేశంతో కూడిన ప్రేమను చూపరాదు.

కీర్తి నదిలాంటిది. తేలికైనవాటిని బైటికిచూపిస్తూ ఘనమైన వాటిని లోపల దాస్తుంది.

ఎవరు మనసును నిల్పి యింద్రియములను విషయములందు బోనీయక బొత్తిగా నిగ్రహించునో అతనికే ప్రజ్ఞ స్థిరం యుండును.

ఆశానిరాశల దోబూచులాటే బ్రతుకు బాట.

జీవితాన్ని ఏదో బ్రహ్మాండ మనుకుని తలబ్రద్దలు కొట్టుకొని జీవితానికి అర్థంలేని విలువలు అంటకట్టి సుఖశాంతుల్ని దూరం చేసుకునే కంటె అది ఎలా నడిస్తే అలాగేనడిచి ప్రవాహంలో సాగిపోవడం సుఖమేమో !

జనసామాన్యానికి వుపకరించే ఆర్టుని ప్రచారమని బూర్జువా జీవి ఎప్పుడూ ఏడుస్తుంది.

కర్షకుడు తన జీవితాన్ని ప్రకృతితో సమన్వయ పరచుకుంటాడు. అందుకే అతనికి ఓర్పు. జీవితాంతం ప్రకృతి సిద్ధంగా వుంటుంది.

మానవుడు ఒక రోజున నెత్తిని రుద్దుకున్న శిక్షనే మరో రోజున దూరంగా త్రోసివేశినిట్టూర్పు విడుస్తాడు.

సత్యము సంపూర్ణమైనది. దాని నెవరూ మార్చలేరు. సత్యాన్ని నమ్మి జీవించు.

మనిషి ఆటలాడే మనస్తత్వంకల జంతువు. ప్రతిదాంట్లోను ఉత్తమ విభాగం తనకే చెందాలని ప్రయత్నిస్తూ వుంటాడు.

ప్రపంచం అంతా యిస్తానన్నా నీవొక నిజాయితీ పరుని వోటు

ఇతరుల వ్యవహారాల్లో యెక్కువగానూ, స్వంత విషయాల్లో తక్కువశ్రద్ధ చూపడమే ఆతురత.

పూర్తిగా నీటితో నిండిన సముద్రము లోనికి యితర కాలువల, నదుల నీరు చేరి నప్పటికీ అందు కలిసి పోయిన తీరున అణిగిపోవు

చున్నదో అదే తీరున పూర్ణనిష్ఠాగరిష్ఠుని సమస్త కోర్కెలుచేరి అణిగి పోవును; కాని అతనిని జయించజాలవు.

కష్టాలు, మానవుడు పుట్టుకనుంచి కవలపిల్లలు.

స్వాతంత్ర్యము కోసం పోరాటమే దేవునికోసం పోరాటం.

ఆదర్శాలు ఆచరణ యోగ్యమైనవిగా వుండాలి. లేనిచో వాటికి శక్తి వుండదు.

బహుపుణ్యములచే మానవులు పుత్రులను బడయుదురు. లోకములో సుపుత్రులు గలవారు భాగ్యశాలురు, ధన్యులు.

మహాత్ముల మనసులు సంపదలందు సుమ కోమలంగా, ఆపదలందు మహాశైల శిలా సంఘాత కర్కశంగాను వుంటాయి.

బుద్ధిమంతుడు మానావమానాలను లెక్కచేయక తనపనులు తాను నెరవేర్చుకోవాలి. తనపనులు తాను చెడకొట్టుకోవడమే కదా ! మూర్ఖత్వమంటే.

జ్ఞానసంపదచేత పుత్రుడు తనను జయింపవలెననియే ప్రతితండ్రి కోరుకుంటాడు.

అతిచిన్న ప్రాణిలో పెద్ద ఆశ యిరికించలేవు.

ఎక్కువ అధికారము చలాయించడం, తన హోదాను యితరుల మీద చూపడంవలన మానవుల్లో ముందడుగు వేసేశక్తి నశిస్తుంది.

నోటజారిన మాట, విల్లువిడిచిన బాణం ఒక్కటే.

ఏ ఆత్మజ్ఞానం సకల ప్రాణములకు చీకటియై యింద్రియ జయశీలునకు పట్టపగటివలె ప్రకాశముగా నుండునో అందు యోగియగువాడు నిద్రలేకయే మేలుకొని యుండును. ఏవిషయ జ్ఞానమునందు

ప్రాణులు జాగ్రత్తకలవారై యుందురో అది ఆత్మజ్ఞానికి రాత్రియై యుండును.

మీపిల్లలు గౌరవనీయులైన వ్యక్తులుగా తయారవాలంటే ప్రప్రథమంలో మీరుచెప్పేవన్నీ మీరు ఆచరణలో పెట్టడం నేర్చుకోవాలి. పిల్లలను బాల్యంనుంచీ తమ మేధని పెంచుకోగల అవకాశం యివ్వడం, యింట్లో పెద్దవాళ్ళు మాట్లాడుచున్నపుడు అన్నివేళలా కాకపోయినా కొన్నిసందర్భాలలోనైనా వాళ్ళనికూడా విననివ్వాలి. వాళ్ళకీ కొంత వ్యక్తిత్వమిచ్చి వాళ్ళ అభిప్రాయం తెలుసుకుంటూ వుండాలి.

ఏదోఒకటి పొందడంలో లేదు మానవుని ఆనందం. తనస్వార్థం కంటె విలువైన దానికోసం. తనజీవితానికంటె వున్నతమైన భావాల కోసం, తనదేశంకోసం, మానవాళి కోసం తన జీవితాన్నే అర్పించడం లోనే మానవునికి ఆనందంవుంది.

సామర్థ్యాన్ని కప్పిపుచ్చుకోవడం ఎలాగో తెలుసుకొనడం గొప్ప నేర్పుతో కూడినది.

కొడుకుచేత కుటుంబగౌరవం, పేరుప్రతిష్టలు పాటింపచేయడం తండ్రిభాద్యత. కూతురుచేత అవిపాటింపచేసే భాద్యత తల్లిది. ఈ కుటుంబ గౌరవము పాటించడములోనూ, పేరుప్రతిష్టలు విషయం లోనూ కాస్తతండ్రి సహించడు. "ఛా ! వాడు నాకొడుకు కాడు" అనేస్తాడు తండ్రి. అమ్మ మాత్రం అలాకాదు. ఎలావున్నా సరే బిడ్డ తనబిడ్డే. లోకమంతా నిరసించినాసరే ! అమ్మ కడుపులోపెట్టుకుని రక్షిస్తుంది. తప్పుచేసిన కొడుకును గాని, కూతుర్నిగాని – అంత మహత్తరమైనది అమ్మ ఆపేక్ష.

సముద్రములో సమస్తనదులును పూర్ణ ప్రవాహములో ప్రవేశించు నప్పుడు అది హద్దుమీరక వృద్ధిక్షయాది వికారములు లేక ఏకరీతిగా సదా నిండి యుండెడి విధముగా జితేంద్రియుడు శబ్దాది విషయములు ప్రాప్తములైనప్పుడు దానిని లక్ష్యముచేయక ఆత్మతృప్తుండై యుండునో వాడే చిత్తశాంతిని పొందును. విషయాశక్తికలవాడు చిత్తశాంతిని పొంద లేడు.

మనం అనుకున్నవి జరగనప్పుడు జీవితంలో దిగులు నిరాశ ఆవరిస్తాయి. జీవితంపై విరక్తిపుడుతుంది.

సమాజానికి వెలుపల మనుష్యుని వ్యక్తిగత జీవితం అనూహ్య మయినది. నేలనుండి వూడబెరుకుబడి నిస్సారమైన యిసుకమీద పడ వేయబడిన ఒకమొక్క పెరుగుదల అనూహ్యమైనట్టుగానే!

సంతోషం విచారంకంటె దివ్యమైనది. సతోషం ఆహారం వంటిది. విషాదం ఔషదం వంటిది కావటమె అందుకు కారణం.

ఒకపువ్వుకై దండ కట్టడం సాధ్యంకాదు.

చెడుపని చేయాలనే ఆలోచన కలిగిన మాత్రంచేత మంచివాళ్ళు భయపడతారు. చెడ్డవారికి అందులో భయపడ వలసినదేమీ లేదు.

యోగాభ్యాసము అతిగా భుజించేవాడికి, అతి స్వల్పంగా భుజించే వాడికికాదు. ఎక్కువగా నిద్రించేవాడికి, అసలు నిద్రించని వానికికాదు. ఆహార విహారాలలో సంయమనం కలిగినవాడికి కర్మలలో నిగ్రహం కలిగినవాడికి పరిమితంగా నిద్రించేవాడికి యోగాభ్యాసం ఏ దుఃఖమును దరిచేరకుండా చేస్తుంది.

అన్నార్తుడై ఒకడు వచ్చును. అతనికి అన్నము పెట్టువాడు పుణ్యము పొందును. అన్నోదకముల నీయకున్నను ఆదరముచూపి

మాటలాడియు పున్నెముపొందును. కసరికొట్టునాతడు అన్నముబెట్టియు పుణ్యం పొందజాలడు.

సృష్టిలో ప్రతివాడికీ తప్పనివి రెండేరెండు - చావు, పన్నులు.

స్త్రీ దయాగుణంతో మెప్పించనంతగా సౌందర్యంతో మెప్పించ లేదు.

సౌందర్యం సువర్ణంకంటె హెచ్చుగా మూర్ఖులలో భావోద్వే గాన్ని రేకెత్తిస్తుంది.

ఒకరంగంలో గొప్పఫలితాన్ని సాధించినప్పుడు అదే రంగంలో అంతకంటె ఎక్కువ గొప్పఫలితాన్ని సాధించాలనే మనకు కోరిక పుడుతుంది.

వ్యక్తిత్వ సాధనలో కొంత దైన్యం చూపక తప్పదు. వ్యక్తి త్వము పరిమితి చెందడంలో కొంత ఏకాంతతకి లోనుగాక తప్పదు. అందరిలో ఒకరై వుండటమా లేక మీరేమిటో మీరు నిర్ణయించు కోవడంఅన్నది, ప్రతివ్యక్తి స్వయంకృషిలో సాధించవలసిన గమ్యం.

వ్యక్తి అయినప్పుడే మీకు విలువ వుంటుంది.

స్త్రీలు భావిభారత పౌరులను తయారు చేయువలసిన వీరమాతలు. గృహ బాధ్యతలందు మెలకువగలిగి వర్తించాలి. వారు విజ్ఞానవంతు లైతేనే వారిబిడ్డలు జ్ఞానం కలవా వుతారు. వారు కర్తవ్యం నిర్వహిం చుటలో లోపం రాకూడదు.

గురువుకంటె తండ్రి పదిరెట్లు ఎక్కువ పూజ్యుడు తండ్రికంటె తల్లి పదిరెట్లు హెచ్చు పూజ్యురాలు.

దుర్మార్గులతో సహవాసము చేసి తిరుగుటకంటె ఒంటరిగా అడ వుల యందు తిరుగుట మంచిది.

ప్రేమ జీవితానికి మూలం. అదిలేని మనిషి చర్మాన్ని కవచంగా ధరించిన ఎముకలగూడు.

కళ కళాకారుని వృత్తి. జీవనంకూడాఅయివుండాలి. ఆరోగ్య వంతమయిన ఆచరణతో కలిసి వుండాలి. ఆరోగ్యవంతమయిన ఆదరణతో కలిసివుండాలి. దినభత్యం సంపాదించుకునే అవసరం తెలి యని కళ తనలోని ముఖ్యభాగమయిన ఆవేశాన్ని, వాస్తవికతనూ కోల్పోతుంది. విలాసవంతమయిన పువ్వులా తయారవుతుంది.

చేతలకంటె మాటలు గాయాలుచేస్తాయి సంసారంలో. దానిపై ఎవరు ఏమనుకుంటున్నది తెలియదు. పర్యవసానం భార్యాభర్తలిద్దరికీ అనర్థకాన్ని తెస్తుంది. ఎవరైనా ఒకరు తొందరమనిషైతే మరొకరు కొంచెం ఓర్పు వహించాలి. సరిపెట్టుకు పోవడం అనేది చాలామంచి పని. ఇద్దరిమధ్యా అనురాగబంధాలను పెంచుకుంటే సంసారం స్వర్గ తుల్య మవుతుంది.

అతిమధురమైన ఆనందాన్నికూడా అందిస్తుంది విషాదం.

చెడ్డవారితో చెలిమి మొదటలో హుషారుగానే వుంటుంది. గాని పోనుపోను విషప్రాయంగా తయారవుతుంది.

బ్రతకడం జ్ఞాన సముపార్జనకోం; అంతేకాని జ్ఞానసముపార్జన బ్రతకడంకోసం కాదు.

సంఘంలో అశాంతికి ఒకే ఒక కారణం-దోపిడి. అదేలేనినాడు ఏ ప్రచారము అశాంతిని వ్యాప్తి చేయలేదు.

స్త్రీలను స్త్రీలు తొందరగా గుర్తిస్తారు.

రాజు, వేశ్య, యముడు, అగ్గి, దొంగ, పిల్లలు, యాచకుడు, గ్రామాధికారి- వీరికి పరుల దుఃఖములు బోధపడవు.

భయం ఎప్పుడూ అజ్ఞానంనుంచే ఉద్భవిస్తుంది.

ఒకపనిచేసేముందు అది ఇతరుల కంటికి ఎలా అనుతుందో ఆలోచించు.

మగపిల్లలు తమ ఈడువారిలో ప్రముఖులుగా ఏదో ఒకరకంగా చలామణి అవుతారు. అస మగ్రమైన వ్యక్తిత్వంతో వారు ఎదిగిన మనుష్యులకు స్నేహితులు కాలేరు.

ఆకాశము మేఘావృతమై వున్నపుడు కూడా పొద్దు తిరుగుడు పువ్వు తనపేరు సార్థకం చేసుకుంటుంది.

పురుషుడు జీవితాంతము అనుభవించే బాధలన్నీ ఒకఎత్తు. స్త్రీ ఒక్క ప్రసవసమయంలో అనుభవించే బాధ (అది ఎంతటి తియ్యనిదైనాసరే) ఒకఎత్తు.

దయ వినయాదులలో నడవడికలదే సదాచార మనబడును. దయ, వినయము లేనివారు ధర్మము నాచరించు చున్నను వ్యర్థమగును.

నిజాయితీవున్న మనిషి సాధారణంగా న్యాయంగా ఆలోచిస్తాడు,

దీపంపని వెలుగును యివ్వడమే. ఆవెలుతురువల్ల ఎవరికైనా లాభం కలుగుతుందో, నష్టం కలుగుతున్నదో దీపాని కనవసరం, వత్తి ఉన్నంతసేపూ, నూనెవున్నంత వరకూ వెలగడమే దానికితెలుసు. అది అయిపోగానే ఆజ్యోతి కాస్తా ఆరిపోతుంది. ఆరిపోయిన దీపాన్ని నువ్వు వెతకబోవూ, అదీ నీమంచి చెడ్డల్ని గురించి కనుక్కోవాలని అనుకోదు.

యితరులను మీరు ఏభావంలో చూచెదరో ఆభావంతోనే యితరులు కూడా మిమ్మలను చూచెదరు.

నిరాశ చెందవద్దు. ఒకవేళ ఎప్పుడైనా వైరాగ్యానికి గురియైనా నిరాశతో కూడా పరిశ్రమ కొనసాగించు.

స్త్రీ పురుషుల కుండే స్నేహము పవిత్రమై యుండుట సహజం. కాని ఆసహజమగు మన బ్రతుకులచే దానిని పాప పంకిల మొనర్చు చున్నాము. కావున నేడు స్త్రీ పురుషుల స్నేహము పవిత్రముగావుండు టకు వీలులేకుండా వుంది.

మనసు ఎగిరిందని మనమూ ఎగిరితే నెత్తురు కక్కుకుంటూ రాలి నశించి పోతాము.

శబ్దాది విషయములన్నిటిని త్యజించి ఆసక్తిని విడిచి అహం కార మమకార రహితుండగువాడు శాంతిని పొందుచున్నాడు.

కన్యలు భర్తలను తప్ప మరిదేనినీ కోరరు! భర్తలు లభించిన తరువాత సమస్తాన్నీ కోరుతారు.

శాశ్వత సత్యమును కళ వ్యక్తము చేయగలదు. బాహ్యరూప మునకు ఆకృతి - ప్రకటనమునకు కట్టుబడిలేదు.

ఇతరుల కష్టాలను ఆదుకోకపోగా తనకు సాయంచేసినవారే కష్టాలలో చిక్కుకున్నా వారికి రవంత సాయం చేయలేకపోవడం క్షమా ర్హంకాదు.

విశ్వాసం లేకుండా ఏ తెగ, ఏవర్గం, ఏమతం అభివృద్ధిచెంద జాలదు.

ఈ విశ్వంలోని ఏఒక్కరైనా సరే తనను తన ఆత్మచేతనే ఉద్ధ రించుకోవలయును. కాని అధోగతిపాలు చేసుకోకూడదు. ఆత్మయే తనకు బంధువు. శత్రువున్నూ, ఎవరు ఆత్మనిగ్రహం కలిగివుందురో

వారికి వారి ఆత్మబంధువు. ఆత్మనిగ్రహము కోల్పోయిన వారికి విషమ దశయందు వారి ఆత్మయే వారికి శత్రువై నాశనహేతువగును.

ఉన్నత మనస్కుడు ఒకరిని అవమానించడు. అవమానాన్ని సహించడు.

సాహిత్యం మానవుణ్ణి ఉన్నతుడిగా చేస్తుంది. తన్నుతాను తెలుసుకుని ఆత్మవిశ్వాసం పెంచుకుని సత్యం, న్యాయంకోసం పోరాడేట్లు చేయగలిగి వుండాలి. మానవుల్లో హెచ్చుమాలిన్యాన్ని నిర్మూలించడానికి వుత్తమ గుణాల్ని ఉత్తేజపరచడానికి సమర్థమైనదే సాహిత్యం. అనిచెప్పితీరాలి. అధర్మంమీద క్రోధం, దౌర్జన్యానికి సిగ్గుపడడం, న్యాయరక్షణకి ధైర్యం అంటే పవిత్రప్రేమ - వీటన్నింటినీ మానవుల్లో విజృంభింప చేసేదే; వుద్దీపనం చేసేదే నిజమయిన సాహిత్యం.

గాలిలో మేడఊకట్టి నవ్వులపాలుగాకు.

పేదలు మినహా పేదలకోసం బాధపడే వాళ్లు తక్కువ.

నన్ను తిట్టెను, నన్ను బాధించెను, నన్ను ఓడించెను, నావస్తువులను దొంగిలించెను అని చింతించుచుండు వాని వైరమెన్నటికినీ శమింపదు.

తల్లిదండ్రులు యెడ చేసిన స్వల్పదోషముల కైనను తగినఫలము అనుభవించక తప్పదు. వీటికి ప్రాయశ్చిత్తములేదు.

ఏప్రాణినైనను బాధించుట సులభముగాని తిరిగిదాని బాధ బాప ఎవ్వరి శక్యము కాదు.

అజాగ్రత్తవల్ల నయినా యితరులను బాధకలిగించేపని తలపెట్టకు. నీవు దుర్మార్గానికి తలపెడితే ధర్మం నీకు నాశనం కలుగచేస్తుంది.

నిష్కామకర్మ నిష్ఠజ్ఞాన యోగరూపమైన స్థితప్రజ్ఞకు సాధనంబై యుండునది. ఇదియే బ్రహ్మప్రాప్తిని కలుగచేయునది. దీనిని పొందిన వాడు మోహమును చెందడు. అంత్యకాలమందు యీ నిష్ఠయందుండిన తప్పక మోక్షము సిద్ధించును.

నిజమైన కృషిచేస్తే ఏది అసాధ్యం కాదు.

ఓర్పుకంటె గొప్పతపస్సులేదు. తృప్తికి మించిన సౌఖ్యంలేదు. ఆశకంటె అధికమైన కీడులేదు. దయకంటె గొప్పసుగుణం లేదు. క్షమకంటె బలవత్తరమైన ఆయుధం లేదు.

దేవునిపేర్లు అసంఖ్యాకాలు. కాని ఒకేఒక పేరు పెట్టాలంటే అదే సత్యం. సత్యమే దేవునిపేరు. సత్యమే దైవము.

విశ్రాంతి, ఉపవాసము మందులన్నింటిలోకి మంచిమందులు.

తప్పులు చేయడం మానవుల లక్షణం. క్షమించడం.దైవలక్షణం.

ఆదాయాన్ని మించి ఖర్చువున్నవాడు పేద.

అతిథి నీయింటిలో వున్నపుడు అమృతమైనా నీవు ఒంటరిగా అనుభవించ గూడదు.

అత్యధికంగా ఆత్మనిగ్రహ శక్తిగల వారందరూ తమకార్య క్రమాల్లో గాఢంగా నిమగ్నులై ఉంటారు. మాటలు వేరుగా చేతలు వేరుగా ఉండవు. ప్రకృతిని పరిశీలించి - నిరంతరం, నిర్విరామంగా తన పని తాను చేసుకుంటూంటుంది- నిశ్శబ్దంగా.

ఈలోకం తనుబ్రతుకదు. ఒకరిని బ్రతకనివ్వదు. పచ్చగావున్న జీవితాలలో కాసిని నిప్పులు జల్లి భగ్గుమని మండించటం దానికోసం తృప్తి. ఒకళ్ళ మనుగడలో గోతులుత్రవ్వి కూలదోయట మంటె దానికో సరదా.

సాధువు ఆరంభంనుండి ఏదిక ఆశ్రమంలో ప్రవేశించును. సన్యాసి తనజీవిత కాలమందెప్పుడైననూ, అంతమందుకూడా ఈవేషం ధరింప వచ్చును.

భగవంతుడు మనుష్యుల కేమియు అన్యాయం చేయుటలేదు. మనుష్యులే వారికి వారన్యాయము చేసుకొను చున్నారు.

కొయ్యముక్క, మట్టిగడ్డ పారవేశినట్లు మృతదేహాన్ని పారవేశి విముఖులై వెళ్ళిపోతారు చుట్టాలు. ధర్మం ఒక్కటే వస్తుందికూడా.

మూర్ఖుడు తాను తెలివైన వాడననీ, జ్ఞాని తాను మూర్ఖుణ్ణి కాబో లనీ అనుకోవడం పరిపాటి.

ఋణం తన్నుతాను పోగొట్టు కోవడమే గాక తన దాతనుకూడా పోగొట్ట గలది. కనుక ఋణదాతగానూ, ఋణగ్రస్తుడగానూ కూడా వుండడం నుంచి తప్పించుకో.

నిరాశపుట్టినట్లే అంతలోనే ఆశచిగురుస్తుంది.

ఎదుటివారి మనస్సును నొప్పించి వారిని అనామకులుగా భావింపబడే మాటలు సరదాకు కూడా మాట్లాడకూడదు. సముచితజ్ఞానం గల మానవులు యితరుల మనస్సును నొప్పించకుండా తేలికగా ఎటు వంటి పనులనైనా వారిచేత చేయించుకోగలుగుతారు.

కొందరు మనుష్యులు నిష్కారణంగా తప్పుచేస్తారు. కొందరు నిష్కారణంగా పాపంచేస్తారు. మరికొందరు నిష్కారణంగా ఎదటి వారికి అపకారం చేస్తారు.

పరమాత్మయొక్క ఆరాధనా రూపమైన శాస్త్రీయ కర్మములను చేయుటకు ఆరంభింపక యుండుట వలనగాని, ఆరంభించి మధ్యవిడిచి పెట్టుట వలనగాని, జ్ఞాన నిష్టసిద్ధించునని తలంచవద్దు.

మీకుమీరు నిజాయితీగా వుంటూ ఆ నిజాయితీ చుట్టుప్రక్కల వారి విషయంలో కూడా కనపరచడం, వ్యక్తిగత జీవితంలోనూ, కార్యాచరణలోనూ శక్తివంచన లేకుండా కృషిచేసామనే తృప్తివుండటం, యితరులను ప్రేమించగల స్వభావం అలవరచుకోడం - ఈమూడు మానవ సౌభాగ్యానికి మూడుసూత్రాలు.

మతాలు వేర్వేరుగా వున్నప్పటికీ వాటివాటి లక్ష్యంలో అంతగా భేదం కానరాదు.

సంఖ్యాబలాన్ని చూచుకుని భీరువులు మాత్రమే ఆనందిస్తారు. ఆత్మలో ధీరత్వం కలవారికి ఏకాకిగా పోవడమే ఆనందము. మీరు ఒక్కరైనా, పెక్కుమందైనా కావలసింది యిట్టి ధీరత్వమే.

ఒకప్పుడు కొందరిపై మనకు అకారణంగా అపేక్ష కలుగుతుంది. ఎందువల్ల యింత అపేక్ష అంటే చెప్పలేము. ఆ అపేక్ష ఒక్కొక్కప్పుడు ఎంతవరకు దారితీస్తుందంటే - మనము ప్రేమించిన వ్యక్తిలోవున్న లోపాలను కూడా సరకు చెయ్యము.

ముసలితనం ఆడపులివలె బెదిరిస్తూ మీదపడుతున్నది. శరీరం మీద శత్రువులవలె వ్యాధులు దెబ్బతీస్తున్నాయి. ఆయువు పగిలిన కుండలోని నీటివలె తరిగిపోతున్నది. అయినా లోకం అహితాన్నే ఆచరిస్తూ పోతున్నది. చిత్రం!

జ్ఞానం శక్తికి మించినది. జ్ఞాన చిహ్నాలుశక్తి చిహ్నాలను అధిగమించి శాశ్వతంగా నిలుస్తాయి.

కొందరికి అక్కరలేని విషయం, అక్కరకురాని వస్తువూ వుండదు.

మహానుభావులందరూ మధ్యతరగతి వాళ్ళే.

సామ్యవాదం సూచించే ఐక్యతను, వర్గరాహిత్యాన్నీ అర్థంచేసు కున్నవాడికి ఐక్యత ఎప్పుడు పోట్లాడి సాధించాలో. ఎప్పుడు సౌమ్యంగా సాధించాలో బోధపడుతుంధి.

బాహ్యసంస్కరణల కంటె అంతరంగిక సంస్కరణలు ఎక్కువ అవసరం. అంతరంగికంగా దుస్థితియుండి దానిపై ఏర్పడిన శాసనం ఎంత అందమైన దప్పటికీ అది కూలిపోయే గోడమీద కొట్టిన వెల్లచందగానే వుంటుంది.

పాపులు కనబడితే వారి పాపములమీద దాడి చెయ్యి కానిఆవ్యక్తి మీదకాదు.

ధనధాన్యాదులు కలిగినా తీర్థవాసులు వచ్చినపుడు వారిని సత్క రింపని వాడే నిజమైనదరిద్రుడు, మూర్ఖుడు.

పుష్పాలకు సువాసన అబ్బినట్లే సున్నిత హృదయులకు నమ్రత అలవడుతుంది.

విజ్ఞానికి పరిధులు వున్నాయి. మూర్ఖత్వమే అవధులు లేనిది.

అతిదాక్షిణ్య స్వభావులను, శంకితులను, పరాపవాద భీరువులను సంపదపై దొలగివుంటాయి. ఎవరేమనుకున్నా ఏపనిచేయడానికి సంకో చించని వారినే సంపదలు వరిస్తాయి.

లోకములో ఒక్కొక్కడునూ ఏదో ఒక కర్మమును చేయుచునే యుండును. గాని యూరక ఉండడు. మాయవలన గలిగిన సత్వరజస్తమో గుణములు పూర్వకర్మాను సారముగా వృద్ధినిచెంది వానికి తెలియకయే కొన్ని కార్యములను చేయించు చుండును.

ఒకపనినిబట్టి మనిషిగుణం తెలియదు. సాయంచేసిన వాడల్లా కరుణా సముద్రుడు కాకపోవచ్చు.

ప్రారబ్ధాను సారము భగవంతుడు నడిపించును. ఎంత తల క్రిందులైనను కానివికావు జరుగవలసినవి జరుగక మానవు. దీనికి తిరుగులేదు. కాన వుదాసీనముగా వుండుటే ఉత్తమ జ్ఞానం.

భర్త భుజించగా మిగిలిన వస్తువులన్నీ అసహ్యించు కోకుండా ఆరగించాలి భార్య.

జీవించుటయే జీవితోద్దేశము. ఏదియు నశింపదు. అంతయు తిరిగి నవ్యత్వమును పొందును.

మౌనంఅంటే నోటిద్వారా ప్రాణశక్తి ఖర్చుపడకుండా ఆపు చేసి, ఆత్మశక్తిని బలపరచడం అని అర్ధం. మౌనంవల్ల వాక్పటిమ బలపడుతుంది. ఆత్మశక్తి బలవత్తరమై, యితరుల ప్రాణశక్తులను నిగ్రహించ డానికి, యితరులను ఉద్ధరించడానికి ఎంతయో సహాయ పడుతుంది.

గర్వంచేతగాని, కోపంచేతగాని దేహమెరుగక అరచువానికంటె ఓండ్రపెట్టు గాడిదయే మేలు.

విషయాభిలాష గలిగిన పురుషుడు ఆత్మజ్ఞాన సంపాదనార్థము యత్నించెనేని మనస్సు ఆత్మాభిముఖంబై ప్రవేశింపక విషయములనే తలంచుచుండును. ఇట్లు ఒకటి చేయుటకు మరియొకటి చేయుటవలన వాడు మిథ్యాచారము కలవాడగు చున్నాడు.

మన ఔన్నత్యం పెరిగే కొలదీ మనం యితరులకు దూరమవు తాము. వున్నతస్థానాలన్నీ, హిమ శీతలాలు.

స్వాతంత్ర్యము నశిస్తే ఏది వర్థిల్లుతుంది.

లోకంలోని సత్పురుషులంతా నిన్ను నలిపి వేయడానికి, బురదలో తొక్కి నామరూపాల్లేకుండా చేయడానికి నిరంతరం కృషి చేస్తూనే

వుంటారు. అంచేత ఒకక్షణమైనా ఏమరివుండకు. వాళ్ళఆశయాల్ని ఫలించకుండా చేయడంలో అప్రమత్తుడవై పనిచేయి. నీకు తప్పక జయం లభిస్తుంది.

భగవంతుడు స్వర్గములోగాని నరకంలోగాని లేడు. మీ ఆత్మ లోనే వున్నాడు. ఈభావాన్ని దర్శించడంలో మీకు పరిపూర్ణస్వేచ్ఛ కలుగుతుంది.

రక్తసంబంధి, బాల్యస్నేహితుడు, వంశ క్రమానుగతంగా పరిచయస్తుడు, ఆపదలనుండి రక్షించి సన్నిహితుడైనవాడు అని మిత్రులు నాలుగు రకాలు.

వేటగాడు బాణాన్ని ఎక్కుపెట్టాడు. కాని లేడి తనపిల్లలతో చర్లాట ఆడుకోవడం చూచి ముగ్ధుడై బాణాన్ని విడువడం మరచిపోయాడు.

నాకు తట్టిన వుత్తమ సిద్ధాంత రీత్యామానవజాతి - యిచ్చేవారూ, పుచ్చుకునేవారూ అని రెండు తెగలుగా విభజించవచ్చు.

పగతీర్చుకుంటే ఆరోజుమాత్రమే ఆనందం కలుగుతుంది. ఓర్పు చిరకాలం నిలబడేకీర్తిని యిస్తుంది. ఒకరోజు ఆనందంకోసం చిరకాలం కలిగే ఆనందాన్ని బలిపెట్టరాదు.

తీయని పలుకులు ప్రయోగింపక కఠినమైన పదాలను ప్రయోగించే వ్యక్తి సాధుఫలములను విడిచి పుల్లనికాయలను ఏరుకొనువానితో సమానం.

పట్టుదల విడవనివాడ్ని విజయలక్ష్మి వరిస్తుంది.

సర్వప్రాణుల్లోనూ తానే నివశిస్తున్నానని భగవంతుడు చెబుతుంటె మనం ఎవరిపట్ల ద్వేషం పెంచుకోవాలి?

ఇతరులకు హాని కలిగించే పనులు మనం చేసినప్పుడు వాటిని మనం సమర్ధించు కుంటాము. మనకుహానికలిగించే పనులు యితరులు చేసినపుడు వాటిని మనం ఖండిస్తాము.

మనిషి సహజంగా నిటారుగా నిలబడాలి. అంతేగాని యితరులు అతన్ని నిటారుగా నిలబడేటట్లు చెయ్యకూడదు.

భగవంతుడు ప్రసాదించిన మహాభాగ్యాలన్నిటిలోనూ తలమానిక మైనది పరస్పర ప్రేమ.

పగసాధించడం పౌరుషంకాదు. ఒకరి తప్పిదం ఓరిమితో భరించడమే పౌరుషం.

శాస్త్రీయ కర్మలను ఆసక్తమైన తనమనస్సుతో పలాపేక్షలేకయే చేయుటకు ఆరంభించునాడు ఎట్టి ప్రమాదమును పొందనివాడై చిత్తశుద్ధి కలిగి ఉత్తముడగును.

అడిగే వాడికి చెప్పేవాడు లోకువ.

జరుగబోయేది తెలుసుకోవటం మానవునికి సాధ్యం కాదు. ఆజ్ఞానం సంపాదించినవాడు మానవుడు భగవంతుడే అవుతాడు.

పదహారేళ్ళు దాటిన కొడుకులను, పన్నెండేళ్ళు దాటిన పుత్రికలను, కోడళ్ళను తిట్టరాదు, కొట్టరాదు. బాధ పెట్టరాదు.

అత్యున్నతమైన శక్తి మలినంలోకివెళ్ళినా చెక్కు చెదరదు సూర్యుడు మబ్బులగుండా ప్రయాణంచేసి మర్నాడే సరికొత్త కాంతుల్ని విరజిమ్మగలడు.

అల్లరిపిల్లలు కీటకాలతో ఆడినట్లు విధి మన జీవితాలతో చెలగాటమాడి తన వినోదంకోసం మనల్ని హింసిస్తుంది.

ధర్మంగా నడవలేనపుడు అధర్మంగా నడచుకోక పోవడంమేలు

కర్మములను చేయకుండుటకన్న చేయుట యుక్తము కనుక శాస్త్రీయ కర్మములను నీవుచేయుము. చేయకపోతివేని నీకుదేహయాత్ర కూడా సిద్ధించదు.

తమ అధికారము చిరకాలము ఉండగోరువారు న్యాయదండ మును చురుకుగా నుపయోగింప వలయును. కాని దానిని మృదువుగా ప్రయోగింప వలెను.

మరణం పల్కరించేదాకా తటస్తమయే ప్రతీదీ జీవితమేకదా!

చేతనైనంతవరకూ ఒకరికి సహాయంచేయడం, మనవల్ల మరొక రికి అపకారం జరగకుండా చూడటం, కష్టాలను ధైర్యంగా ఎదుర్కొనడం మనం అలవర్చుకోవాలి.

మనకెల్లరకును భగవంతుణ్ణి 'తండ్రీ' యని మన ప్రార్థనలో అంగీకరించుచూ, నిత్యజీవితంలో సర్వజనులను మన సోదరులుగా చూడకున్నచో ఏమి ప్రయోజనం ?

ఏదైనాపొందే దానికంటె దానికి ఎదురు చూడటంలోనూ, ఆ నిరీక్షణలోని బాధనూ, ఉత్కంఠనూ అనుభవించటం లోనే ఆనందం వుందేమో !

రూపమనే సమిధలచే ప్రజ్వరిల్లుతున్న మన్మదాగ్ని వేశ్య. తమ యౌవ్వనాన్ని, సంపదలను కాముకులీఅగ్నియందు హోమంచేస్తు న్నారు.

కళవున్నచోట యింకేమి లోపించినా - సంస్కారం లోపించినా- ఆరాధన జరుగుతుంది.

ఆడవాళ్ల అస్త్రాలలో అన్నిటికంటె పెద్ద బ్రహ్మాస్త్రం యితరుల మాటలు వినడం.

జీవితంలోని శబ్దాలు అంటే పట్టణాలలోనూ, పల్లెలలోనూ కలిసి వినవచ్చే వాట్లన్నింటిలోనూ తలుపుతట్టిన చప్పుడంత ఆసక్తి కరమైనది లేదు.

ఆశకంతములేదు. నిరాస కాదిలేదు.

విజ్ఞానం వున్నదని గర్వించడం అంతటి అజ్ఞానం మరొకటి లేదు.

పిచ్చివాడికంటె సుఖపడేవాడెవడు ? పసిపాపలా నవ్వుతూ, ఏడుస్తూ, కేరింతాలు కొడుతూ, పాపపుణ్యాలకు దూరంగా నిర్మల జీవితము గడిపేవాడు పిచ్చివాడు.

భగవత్ప్రీతికరమైన శాస్త్రీయ కర్మములు తప్ప తక్కిన కర్మములన్నియు బంధహేతువులు. కనుక శాస్త్రీయ కర్మములను భగవత్ప్రీతి కొరకు ఆచరింప వలయును.

మహనీయమైన ప్రార్థన ఓరిమి.
వ్యక్తిపొడుగైన నాడే సంస్థ.

నీవు పొందులాభం చిన్న జొన్నగింజంత వున్నప్పటికీ రసజ్ఞుల దృష్టిలో అది తాళవృక్ష ప్రమాణం.

జాతికి నీతిముఖ్యం. నైతికంగా పతనమయిపోతున్న జాతికి భవిష్యత్తును గూర్చి బంగారు కలలు కనగల అధికారములేదు.

అత్యధికమయిన స్వాతంత్ర్యం వున్నపుడే మానవజాతి ఉత్తమోత్తమ స్థితిలో వున్నదన్నమాట. మమతలోపుట్టి. మమతలో పెరిగి, మమతే ఆలంబనంగా పెరుగుతున్నాడు మనిషి. జీవితానికి జీవిక మమత. అది లేనిరోజు మనుగడ వ్యర్థ్యం; జీవితం అర్థహీనం; జగత్తు శూన్యం.

చేసుకున్న భార్య చెడునడత ప్రారంభించడమూ, స్నేహితుడైన వాడు దగాకోరు కావడమూ, భృత్యుడు మాటికిమాట అందించడమూ, పామున్న యింట్లో నివసించవలసిన అగత్యం ఏర్పడ్డమూ - చావంటే యింతకంటే వేరేలేదు.

అప్పులున్న వారితోనూ, చెప్పులున్న వారితోనూ నడవరాదు.

మనం భయపడినచో కుక్కలుకూడా మనలను చీల్చివేస్తాయి. నిర్భయులమైతే సింహములను, పులులను కూడా మనము మేకలనుచేయ వచ్చు.

యోగ్యుడైనవాని యింటికివెళ్ళి దానమివ్వడం వుత్తమము. మంచి వానిని తనయింటికి పిల్చియివ్వడం మధ్యమం. తనంతటవచ్చి యాచించిన వానికివ్వడం అధమం. తనను సేవించినవారికి యిచ్చిన దానం నిష్ఫలం.

ఎదుట వారి మనస్సులోని వుద్దేశాలను గ్రహించడం, గ్రహించి అన్ని పరిస్థితులలోనూ వాటికి అనుగుణంగా మాట్లాడాన్ని, ప్రవర్తించడాన్ని సముచిత జ్ఞానం అనవచ్చును.

నిజమైన ఆధ్యాత్మిక తత్వమునకు సత్యమాధారము. ధైర్యము ఆత్మ.

కొత్తగా పెళ్ళయిన దంపతుల మొహాల్లో కనిపించే మర్యాదతో కూడిన సంతృప్తి అంటే నాకు బొత్తిగా గిట్టదు.

సంతోషంగల హృదయం ముఖమునకు తేటనిచ్చును. దుఃఖము వలన ఆత్మనలిగి పోవును. కడుపునిండినవాడు తేనెనైన నూత్రోసి వేయును. ఆకలిగొనిన వానికి చేదువస్తువు అయినను తియ్యగాఉండును.

ఇంద్రవరుణాది దేవతలను యజ్ఞములందలి హవిర్భాగముచే తృప్తిని పొందింపుడు. వారలు వర్షము మొదలగు వానిచే అన్నము మొదలగు వానిని మీకు ఒసంగి మీకు సంతోషము కలిగింతురు. ఇట్లు పరస్పర తృప్తిని పోషించుచున్నవారై మీరు పరమ పురుషార్థమైన మోక్షమును పొందగలరు.

పాతస్నేహితుణ్ణి నిలబెట్టుకోవడం ఎంత ముఖ్యమో కొత్త పరిచియాలు కలిగించుకోవడం కూడా అంతే ముఖ్యం.

పెద్దమనుష్యులలో వుండే స్వార్థం, సంకుచితత్వం, అసూయ, నైచ్యం ద్రోహబుద్ధి నికృష్ట మానవులనబడే వాళ్ళలో కనిపించవు.

కరుణాది రసాలచే మానవ జీవరక్షాళన మొనరింపక ప్రేమ ప్రేమ యని వెర్రి వ్రాతలు వ్రాయుట హృదయ దౌర్భల్యమే! తిండిలేక మల మల మాడు బీదలను, బానిసలకన్న హీనముగా చూడబడు కూలివాళ్ళను గూర్చి మనసు కరిగేటట్లు కవిత్వం వ్రాయుట మంచిది. మానవ లోకాన్ని ఈశ్వరాభిముఖము చేసేదే కవిత్వం.

హృదయమిచ్చి మాట్లాడే మిత్రునితో కల్మషంతో మాట్లాడకు. హృదయం తెరచి, నోరువిప్పి, మనసారా మాట్లాడు.

సంపదలు కుప్పతెప్పలుగా వున్నపుడు అందరూ బంధువుల మని చుట్టూ చేరుతారు. అప్పుడు ఖర్చుచేయడంలో సంయమనం చూపించాలి.

రోగం అంకురించగానే కుదుర్చుకోవాలి. శత్రువును ఆదిలోనే వుపేక్షింపక నిర్మూలనం చేయాలి. రోగాన్ని, శత్రువును ముదరనిస్తే ఎంతటి బలవంతుడైనా హింసల పాలవుతాడు, తప్పదు.

ఏపనిచేస్తే తమ పరపతి పెరుగుతుందను కుంటారో ఆపనిచేయడానికి సాధారణంగా వ్యక్తులు తొందరపడతారు.

బాటప్రక్కన పడివున్న ప్రతిచిత్తు కాగితము టర్కీదేశస్తులెంతో శ్రద్ధలతో జాగ్రత్తచేస్తారు. ఒకవేళ దానిమీద భగవంతుని నామధేయం వ్రాసి వున్నదేమోనని వారి ఆత్రత.

జీవితాన్ని ఆదర్శం అణగార్చి వేయడానికి ప్రయత్నిస్తుంది. ఆదర్శవంతులు జీవితంలో జరిగే నిత్య సంఘర్షణయిది.

పుణ్య పురుషుల స్నేహం మరువకు. నిన్నాపదలో కాపాడిన వారి నెన్నడూ విడనాడకు.

మానవులు యజ్ఞములచేత ఆరాధించినచో దేవతలు మానవుల అభీష్టమును తీర్చుదురు. వారికి హవిర్భాగముల నీయక వారిచ్చిన పదార్థములను మాత్రము అనుభవించు మానవులు చోరులు అగుదురు.

చేసిన నేరానికి ప్రతిఫలంగా ఆత్మ చెల్లించే సుంకమే భయం.

అగ్ని ఏరీతిని ఎన్నికట్టెలు వేయుచున్నను తృప్తిపొందదో ఆరీతినే మానవునికిగల ఆశకు అంతులేదు.

ఏదైనా రచనలో చెడును చూపినపుడు మంచినికూడా చూపాలి. జరుగుతున్న అన్యాయాలను చూచినపుడే వాటిని పరిష్కరించుకునే మార్గాలు కూడా చూపాలి.

ఇతరుల దోషాలను చూసినట్లు తమ దోషాలను చూడగలిగితే యీ ప్రపంచంలోనుండి దుర్మార్గం తొలగి పోవడం తథ్యం.

ప్రజా జీవితానికి సంబంధించిన వివిధ కార్యకలాపాలను విపులంగా విశదంచేసి అనువైన కేంద్రీకృతమైన, జ్ఞానదాయకమైన విద్యావిధానాన్ని రూపొందించుకోవాలి.

భోజన సమృద్ధి, భోజనపుష్టి - సంభోగశక్తి, చక్కనిస్త్రీయు రాలూ - ధాతృత్వమూ, ఐశ్వర్యమూ - ఈజంటలు ఎంతో తపస్సుచేసు కున్న వాడికే అబ్బుతాయి.

దేవునిపూజకు తులసిపత్రం, జలం చాలును. నైవేద్యములకు ఖర్చుచేయు ధనమును పేదల కుపయోగింపుము. ఈశ్వరసంతానం తిండిలేక మలమల మాడుచుండగా వుత్సవములకు వృధావ్యయము చేయుట పాపము.

ఆటవికుని ప్రేమ తక్కువ స్థితిలో వుంటుంది. నాగరికతతో పాటు ప్రేమభావం పెంపొందుతూ వుంటుంది.

సరియైన నిర్ణయాలను తీసుకునే శక్తివుంటే నిజానిజాలను, వుద్దేశ్యాలను, పరిస్థితులను వాటి సంబంధాలను పోల్చి చూడటం, అవసర మైన వాటినుంచి అనవసరమైన వాటిని గుర్తించడం, రాబోయే ఫలితాలను, ప్రమాదాలను వూహించడం. మంచైనా, చెడ్డైనా మానవుడు త్వరగా నిర్ణయం తీసుకోవడం చాలా అవసరం.

సజ్జనులకు స్నేహితుడు; విజ్ఞులకు మార్గదర్శకుడు; మూర్ఖుల పాలిటి యముడు; దుర్జనులకు శత్రువు - అదృష్టం.

సత్యం, తపస్సు, యింద్రియనిగ్రహం, భూతదయ యివి నాలుగూ శౌచాలే. జలశౌచం అంటే నీటితో కడగడం అనేది పైనా ల్గింటి తరువాతే.

సులభంగా నమ్మేసే స్వభావం మనిషికి బలహీనత. కాని పిల్ల లకు అదే జవంబలం.

తల్లిదండ్రులను ప్రతిదినము, ప్రతి నిముషమునను సంతసించు నట్లుగా చేయవలెను. వారు ప్రీతి బొందుటయే తాను సకల వ్రతంబు

లను చేసి ముగించినట్లగును. వారికినుపచారము చేయుటే తపస్సు. వారిని ఆదర్శతో చూచినవాడు అన్నిధర్మములు చేయకున్నను చేసి నట్టే యగును. అనాదరణచేసిన వాడు అన్ని ధర్మములు చేసినను వ్యర్థమే యగును. తల్లిదండ్రులు జీవించి యున్నంతకాలము, యితర ధర్మము నాచరించరాదు.

సమస్తజీవులను తనవలె చూడవలెను.

డబ్బు నశించిపోవడమూ, తనకి మనస్తాపం కలగడమూ, తన భార్య దుర్నడతలు నడుస్తూవుండటం, తనవిషయమై ఎవరయినా నీచముగా మాట్లాడటమూ, తనకవమానం జరగడమూ - బుద్ధివుండినవా డెవడూ యివి చెప్పుకోకూడదు ఎవరుతోనూ.

యజ్ఞముచేత పరమ పురుషుల నారాధించి శేషించిన వానిని భుజించుచున్న సత్పురుషులు సకల పాపములనుండి విముక్తులగుదురు. తమకే పాకంచేసి భుజించెడి మానవులు పాపమునే భుజించు చున్నారు.

దుర్జనులు తమలోపాలను సమర్థించుకుంటారు. సజ్జనులువాటిని విమర్శిస్తారు.

ఈప్రపంచమున వైరముతో వైర మెన్నటికీ సమసిపోదు. ప్రేమ చేతనే అది శాంతినొందును. యిదేమన పూర్వుల ధర్మము.

ప్రేమకూ, అనురాగానికీ కారణం ధనం. అందం, వయస్సూ, అనుకుంటారు. కాని అదివట్టిభ్రమ. ప్రేమకూ, అనురాగానికీ కారణాలు ప్రేమా, అనురాగాలే.

సంఘంలోవుండి సంఘానికి అపకారం చెయ్యటం, ఆత్మహత్య చేసుకోవడం ఒకటే.

భర్త అనుమతిలేనిదే ఏపదార్థాన్నీ ఎంత ఆప్తబంధుకైనా పెట్టరాదు,

మూర్ఖత్వం చాలా కష్టాలు కలిగిస్తుంది. పడుచుదనము కష్టాలు తెచ్చిపెడుతుంది. అన్నింటికంటె యితరులయింట్లో కాపురంచెయ్యడం మరీకష్టాలు కట్టి కుడుపుతుంది.

తమంటే భయపడనివాడు వెంటవుంటే ధనికులువాణ్ణి తమతో సమంగా చూస్తారు.

జీవబలియిచ్చు పద్ధతి మానవులందరూ మానివేయాలి.

అధికారి వయితే నీవొక్కొక్కప్పుడు కళ్ళు మూసుకో. సేవకుడ వయితే అప్పుడప్పుడు చెవుడు అలవరచుకో.

ఎవరినీ ద్వేషించవద్దు. మనుషలలోవుండే దుర్గుణాలను ద్వేషించండి. మనుషులను కాదు.

ప్రాణులు అన్నము వలనను, అన్నము వర్షము వలనను, వర్షము యజ్ఞము వలనను, యజ్ఞముకర్మము వలనను కలుగుచుండును

ఎప్పుడయినా సొమ్ముచేతి కందితే మొట్టమొదటగా పుస్తకాలు కొంటాను. ఆపైన ఏమైనా మిగిలితే అది అన్నవస్త్రాలకోసం వినియోగిస్తాను.

దుర్బలులు అదృష్టంమీద ఆధారపడతారు. బలవంతులు ప్రయత్నమూ, ఫలితంమీద ఆదారపడతారు.

సమాజం అన్నది మంచిచెడ్డలు కలయిక. వెలుగువున్నచోట నీడ వున్నట్లు మంచివాడి వెలుగులో చెడ్డవారి నీడకదులుతూ వుంటుంది.

మనిషి ఒక నిరంతర శ్రామికుడు. అతడటువంటి వాడు కాకపోతే మరేమీకాడు.

మౌనం మహాత్మ్యాన్ని నిత్యమూ గమనిస్తుంటాను. అందరికీ మౌనం ఆచరణీయమైనదే అయితే కార్యదీక్షలో నిమగ్నులైన వారికి మాత్రం అది స్వర్ణతుల్యం.

దుఃఖము అలముకొనివున్న ప్రదేశం పరమపవిత్రమైనది,

శత్రువు బలవంతుడయితే అనుకూలంగా నడుచుకుని, దుర్జనుడు అయితే ఎదిరించి నిలిచీ, తనలో సమానుడయితే, వినయంతోనూ, శక్తియుక్తులతోనో మంచిమాట చేసుకుని లోబరుచుకోవాలి.

అంగవిహీనులు, వికృతాంగుళు, విద్యాహీనులు, వయోధికులు, కురూపులు, పేదవారు, కులహీనులను వృద్ధిలోకి రాదలచుకుంటే ఎన్నడూ ఆక్షేపించ వద్దు.

జ్ఞానులకు స్వల్పమైన బలహీనతలుంటే చూడడానికి తమాషాగా వుంటుంది.

ధైర్యం చాలాగొప్పది. లోకవ్యాపార వృత్తంలో మొదటినుంచి చివరవరకూ ధైర్యమే కావాలి. ఈధైర్యమనే వస్తువు ఎక్కడ వుద్భవిస్తుంది? అజ్ఞానంలోంచి, చైతన్యంలోంచి.

దేనితోనూ ఎప్పుడూ సంతృప్తి చెందనివాడు ఎవరినీ సంతృప్తి పరచడు.

ఆలస్యానికి ఎప్పుడూ విషమఫలితమే వుంటుంది.

నిజమైనప్రేమకు స్వార్థమే ఉండదు. తరతమభేదా లుండవు, అది మనసుకు అతీతమైనది. హృదయములో పుట్టేది. ఆప్రేమకు పరిమితంలేదు. అది సత్యమైనది. శాశ్వతమైనది.

ఒకకొత్త విషయం, అనుభవంలోనికిరాగానే మనం వివేకంతో ఆనూతన పరిస్థితిని అవలోకించి అందుకు వీలుగా మన ప్రవర్తనని సరిదిద్దుకోవాలి.

అల్పబుద్ధి కలవారలకు మృణ్మయాది ప్రతిమలు దైవంబులు. మునులకు హృదయమందే దైవంబు. తత్వవేత్తలకు, సమదర్శకులకు అంతట దైవమేకలడు.

సమాజము పంచుకునే దుఃఖము బాధించే శక్తిని సగానికిసగం కోల్పోతుంది.

ఆత్మను తృప్తిపరచడమే సాహిత్య ప్రయోజనం అనడం అబద్ధం. ఆత్మను మేలుగొల్పి ఉద్దీపింప చేయడమే సాహిత్యం. కనీసం చేయదగినది.

కర్మము శరీరము వలన కలిగినది. శరీరము జీవాత్మ వలన పుట్టినది. కాబట్టి సమస్త పురుషార్థములను అనుభవింప చేయుటకు సాధనమైనదియు, అందరియందు వ్యాపించి ప్రకృతి రూపమైనదియు నైన శరీశము ఎల్లప్పుడును యజ్ఞాదీనమైనదిగానే యుండును.

"మంచిపనులు చేయటమంటే మాత్రం కిట్టదు. కాని ఆపనులు చేయడంవల్ల కలిగే మేలుమాత్రం అప్పనంగా రావాలి. అలాగే చెడు పనులను పూనికతో చేయడానికి జంకులేదు. కాని ఆచెడుపనులవల్ల రానున్న అనర్థాలుమాత్రం మమ్మంట కూడదు'' విచిత్రమైన మానవ చిత్తవృత్తిమీద ఒక వ్యాఖ్యానం.

తాచుపాము ఆయువు మూడినప్పుడే కాటువేస్తుంది. దుర్జనుడు బ్రతికి వుండినంతకాలమూ ప్రాణాలు కొరికివేస్తూవుంటాడు.

యిరవై యేళ్ళు నిండిన కొడుకులను తనతో సమానంగా స్నేహితులవలె చూసుకుంటూ యింటిపనులలో నియోగించాలి.

అకారణంగా కొందరిని చూసీ చూడగానే దురభిప్రాయాలు ఏర్పడుతూవుంటాయి. అపుడు యోగ్యతనుసైతం మెచ్చుకోలేని మానసిక దౌర్బల్యం దాపరిస్తుంది.

జంతుహింసలొనర్చుట అధర్మము. మాంసభక్షణ హేయము.

ఈజగచ్చక్రమును కర్మయోగాధికారిగాని, జ్ఞానయోగాధికారిగాని అనువర్తింపని యెడల మానవుడు పాపరూపమైన ఆయుస్సు కలవాడగును, భోగములందే వానికి ఆశక్తియుండుటచేత వాని జీవమును వ్యర్థమగును.

సముద్రములో నీరు ఎంతోవుంటుంది. కాని మనపాత్రను మించి నీరు లభించదు. అలాగే మన ప్రాప్తంకొద్దీ ఫలితం.

నేరం చేసిన వాడిని నిందిస్తుంది సమాజం. అయితే ఆనేరం ఎందుకు జరిగింది, ఏలాజరిగింది, ఏపరిస్థితులలో జరిగింది - యిదేమీ — ఆలోచించదు.

మంచి, చెడు రెండులేవు, ఆభేదం ఆలోచన వల్ల ఏర్పడుతుంది.

కోరిక లేకపోవడం సంపదలలో కెల్లాగొప్పది.

దేవుడు కట్టెలోలేడు. రాతిలోలేడు. మట్టి బొమ్మలో లేడు. మనస్సులో మాత్రం వున్నాడు కనుక సర్వానికీ మనసే కారణం.

ప్రకృతి ప్రసాదించిన మహాభాగ్యం సంతృప్తి కల్పితమైన దారిద్ర్యం విలాసం.

ఒకవ్యక్తి శీలమును అప్పటికిని, యిప్పటికిని అతను సాధించిన దానినిబట్టి తారతమ్య దృష్టితో వివేచించి నిర్ధారించవలెను.

ఆత్మవిశ్వాసం ఆత్మజ్ఞానం మీద ఆధారపడి వుంటుంది.

స్వేచ్ఛగా నిష్పూచీగా సెలవుని ఆనందిస్తూ జీవించేవారిని నిరుత్సాహ పర్చడంకోసం మొదట్లో ఎవరు కల్పించారీ వృత్తుల్ని !

జీవితంలో వేగుచుక్కలవంటి కొన్ని దీపస్థంబాలు వుంటవి. ఆదీపస్థంబాల వునికిని బట్టి పోతే గోతుల్లో పడకుండా, దారితప్పకుండా ముందుకి సాగడం వీలవుతుంది.

పట్టుదల వున్నచో పడినను పరవాలేదు. తిరిగి లేచి ముందుకు సాగి పోవచ్చు.

తృప్తిలేని బ్రాహ్మడు నశించిపోతాడు. తృప్తిపడే రాజున్నూ నశించిపోతాడు. సిగ్గుబిడియాలు వుంటే వేశ్య నశించిపోతుంది. సిగ్గుబిడియాలు లేకపోతేనే కులస్త్రీ చెడిపోతుంది.

ఎవడు ఆత్మయందే ప్రీతికలవాడును, ఆత్మచేతనే తృప్తినిపొందుచున్నవాడును, ఆత్మయందే సంతోషము నొందువాడునునై యుండునో ఆయాత్మ విదునకు, చేయదగినది ఏమియులేదు. అనగా వానికి కర్మముతో పనిలేదు.

సంతృప్తి మనస్కుడు ఎప్పుడూ పేదవాడు. అసంతృప్తిమన మనస్కుడు ఎన్నడూ భాగ్యవంతుడు కాడు.

చేతిలో గొడుగువుంటే వానచినుకు లేమిచేస్తాయి ? ప్రజానురాగం కల పాలకులను ఎందరు శత్రువులు ఎత్తివచ్చినా ఏమీచేయలేరు.

మేలుకునివున్న ప్రతిక్షణమూ ఆడది తనుఆడదాన్నని మరచి పోలేకపోవడమూ, మగవాడు ఆడదాన్నిచూచినపుడల్లా అదిఆడదన్న ఆలోచనతప్ప మనిషన్న ఆలోచన లేకపోవడం ఎంతఘోరం.

మానవుడికి బాహ్యసౌందర్యమే సర్వస్వమూకాదు.

మానవుడు ఫలసంగ వర్జితుడై నిత్యముచేయదగినదియే యని కర్మము నాచరించవలయును. అట్లుచేయువాడు మోక్షమును పొందును.

సుఖసమయములో ఆనందించటం దుఃఖాన్ని కోరుకోడంవంటిదే, విషాదంనుంచి. వ్యధనుంచి నిజమైన ఆనందం వుప్పొంగుతుంది.

తండ్రియెడల భయభక్తులున్న వాడే కొడుకు. తనని చక్కగా పోషించేవాడే తండ్రి. నమ్మదగినవాడే మిత్రుడు. తనకుసుఖమూ, ఆనందము కలిగించేదే భార్య.

ఈఅనంత విశ్వములోని సజీవమైన ఒక భాగమే మానవుడు.

స్త్రీలో ఎన్నిశక్తులువున్నా చివరకు పురుషునిదగ్గర సామాన్య స్త్రీగా మిగిలిపోతుంది. అనాదినుంచీ స్త్రీ పురుషునిచేత అవమానించ బడుతూనేవుంది.

ఆశ భోగించునది. అవమానం బాధించునది. పరిస్థితులకు అనుగుణంగా సరిపెట్టుకుని జీవించడం ఒక విధమైన ఆత్మగత విప్లవం.

సిన్సియర్‌గా పనిచేయడం వేరు. అలాపనిచేస్తున్నట్లు నటించడం వేరు. షోలేని సిన్సియారిటీకి పరిగణనవుండదు.

సత్యాగ్రహినంటూ పలువురకు చెప్పుకుంటూండడంతో అతను సత్యాగ్రహి కానేరడు. నూరుపాళ్లు సత్యాన్ని అనుసరించిననాడే అతను నిజమైన సత్యాగ్రహి కాగలుగుతాడు.

ఈలోకమును ఎన్నటికైనను వాడవలసి యుండుననను సంగతి అజ్ఞానులు తెలిసికొనరు. ఎవరా విషయమును తెలిసికొందురో వారి మనో వికారములన్నియు నమసిపోవును.

మూర్ఖత్వాన్ని చూడగానే విజృంభించాలని ప్రలోభ పడడమే జ్ఞానానికి బలహీనత.

దుర్మార్గుడిగానైనా వుండడానికి యిష్టపడతాను గాని అస్వాభివికంగా వుండలేను.

తృప్తి నల్లమందు లాంటిది. మనుషుల బుర్రల్లో కుమ్మరి పురుగుల్ని పెట్టి వదలాలి, లేకపోతే తృప్తిపడి కునికిపాట్లు పడుతూ శక్తి లేనివాళ్లై మాట్లాడక అన్నిటికీ సహించి దద్దమ్మలై వూరుకుంటారు.

"విజయాన్ని సాధించి తీరుతాను" అని మనోనిబ్బరంగా వుండటం వుత్తమ మానవుని లక్షణం.

చదువుకునేవాడూ, సేవకుడూ, బాటసారి, ఆకలిగావున్నవాడు, భయపడ్డవాడూ, బొక్కసంమీద వుండేవారూ – వాళ్లనిద్రపోతూవుంటే తట్టి మేలుకొలుపవచ్చు.

ఏమిటి అంటున్నదీ గమనించకుండా గుటుక్కున మింగుతూ తిండితినే వారంటే నాకుఅసహ్యం. యితర విషయాల్లో వారి అభిరుచిని నేను శంకిస్తాను.

మహాపురుషులు, రాజర్షులు నిష్కామ కర్మములచేతనే జ్ఞానసిద్ధిని పొందిరి, మానవునకు కర్మమువలన వుపయోగము లేకాపోయినను, కర్మవశ్యులైన వారలను కర్మములయందు ప్రవర్తింప చేయుటకు దలచియైనను మానవుడు చేసినయడల ప్రయోజనము కాగలదు.

చిన్నచిన్న విషయాలే అల్పులకెంతో పెద్దవిగా కనిపిస్తాయి.

వ్యక్తిత్వం పెరిగినకొలదీ ఎదుటివారు చెప్పే తప్పొప్పులు మనని అంతగా బాధించవు.

స్త్రీ పురుష జాతి మత కులబేధములు లేకుండా ఆత్మయోగమే మహా పాపులకు సహితం తరుణోపాయము.

ఓర్పు అనేది వెగటుగా వుంటుందిగాని దాని ఫలితం అమృతం.

ఒక్కొక్క తడవ మన తప్పులవల్ల మన అనేకవిషయాలు గ్రహించగలుతాము. ప్రతీఅనుభవంనుంచీ మనం కొంత నేర్చుకుంటాము. నేర్చుకోవడం నిలిచిపోయినప్పుడు జీవితం స్థంభించిపోయి అర్ధరహిత మవుతుంది.

ఆహారంకడ, వ్యవహారంకడ మొగమాటంవలదు,

తాచుపాము, రాజు, పులి, కుక్క, పిల్లలు, పశువు, మూర్ఖుడూ వీరిని నిద్రలో వుంటే మేలుకొలుపకూడదు.

పురుషులు పరచి వున్నపుస్తకాలు ఎన్నటికీకారు. స్త్రీలు ఒక్క సారి చదివేయడానికి ఎంతో హృదయాన్నిచ్చి, విశ్వాశాన్ని కలిగిస్తే అప్పుడు స్త్రీలు ఆపుస్తకాల్లోనుంచి ఒకటి రెండు అక్షరాల్ని పెళ్ళ గించగలుగుతారు,

కష్టాన్ని ధైర్యముతో ఎదుర్కొన్నపుడు ఆనందం కలుగు తుంది.

బిచ్చగాళ్ళు చెప్పేసోది యెంతవినబుద్ధి వేస్తుందో కొందరు చదువుకునే వాళ్లుచెప్పేసోది కూడా అంతే వినబుద్దేస్తుంధి.

సనాతనభారతీయ తత్వమును పాశ్చాత్యులకు బోధించుటకు, పాశ్చాత్యుల పారిశ్రామిక విద్యల నలవరచు కొనుటకు నర్హులగు రీతి, మనయువకులకు శిక్షణ నొసగవలెను.

ఏకాంతంలో పతితో కూడివున్న సమయాన తప్ప ఏవేళలను పతిముందు అతిసౌకుమార్యము, మాటకారితనము చూపరాదు స్త్రీలు.

మనిషిని అర్థంచేసుకోవడంకష్టం. బంధాన్ని తెగగొట్టడం మరీకష్టం.

సౌశీల్యాన్ని కంటికి రెప్పలాకాపాడేది పరిశ్రమ జోకొట్టేది సుఖ జీవనం.

పాండిత్యం, రాజరికం, ఈరెండిటికిన్ని పోలికేదీలేదు. రాజు స్వదేశమందు పూజింపబడితే విద్వాంసుడు సర్వత్రా పూజింపబడుతాడు.

యిల్లేమిటి? తల్లిలేకపోయిన తర్వాత.

ఉత్తముడు ఏకర్మము నాచరించునో ఆకర్మమునే జ్ఞాన హీనుడును ఆచరించును. ఆజ్ఞానవంతుడు దేనిని ప్రమాణంగా ఒప్పు కొనునో దానిని పామరులు కూడా అనుసరింతురు.

జూదమూ, వాదమూ వేదనను కలిగిస్తాయి.

ఏమాతృత్వాన్నైతే స్త్రీ అంతగా. గాఢంగా వాంఛిస్తుందో, పరితపిస్తుందో ఆమాతృత్వాన్ని పొందబోయేముందు యెంతబాధపడాలి! అయినా కూడా అనాది నుంచీ స్త్రీ ఆమాతృత్వానికే ప్రాధాన్యతనిస్తోంది. తద్వారా ఆనందిస్తోంది.

హృదయంలో పసిపాప ఆమాయకత్వం గలవారెవ్వరూ వృద్ధులు కారు.

ఏనాడూ కలహం పనికిరాదు. కలసివున్నందువల్ల సుఖం కలుగుతుంది.

ఇంటగెలిచి రచ్చగెలువవలెను.

సంసార తాపంతో మగ్గిపోయేవారిని బిడ్డలు, భార్య, సజ్జన సహవాసము — ఈమూడే చల్లపరుస్తాయి.

సమాజంలో జరిగే సంఘటనలకు మూలకారణాన్ని మనం మనవ్యక్తులలోనే చూడగలం.

జలములచే శరీరం, సత్యం చేతమనసూ, జ్ఞానంచేతబుద్ధి, విద్య, తపస్సుచేత ఆత్మపరిశుద్ధ మవుతాయి.

ఒకవ్యక్తి అపరచితులపట్ల మర్యాదగా వుత్తమ శీలుడుగా ప్రవర్తించాడంటే అతనికి ప్రపంచ పౌరునికి ఉండవలసిన లక్షణాలు వున్నవి.

బొమ్మలు, ఆటవస్తువులు, ఆకర్షణ కలిగించే వింతలు, ఉంటే పరాయిచోట అయినా కాసేపు అక్కడ చిన్నపిల్లలకు ఉండాలని బుద్ధి వుడుతుంది.

అజ్ఞానులు కర్మమందు ఆశక్తికలవారై ఏ ప్రకార మాచరింతురో ఆదుర్మార్గ ప్రవర్తనమును నివారింప నిశ్చయించిన ఆత్మజ్ఞాని ఉచితము లైన వర్ణాశ్రమ ధర్మములందు సంఘవర్జితుండై ప్రవర్తింపవలయును.

ఈ ప్రపంచములో విశుద్ధసత్యముకంటె మించిన మహోత్కృష్ట ధర్మమేదియు లేదు. పచ్చి అబద్దాలాడడంకంటె అతిహీనమైన పాతక మేదీలేదు. కాబట్టి సత్యాన్ని దూషించినవాడు తన వినాశనాన్నితన చేచేతులా తెచ్చుకున్న వాడు అవుతాడని భావం.

అన్యాయంగా సంపాదించువాడు మహానరకమును బొంది బాధలు పడును. దారాపుత్రాదులు అన్యాయార్జిత ధనమును అనుభవించుచున్న వారైననూ వారికి పాపము వుండదు. కుటుంబ పోషకుడొక్కడే పుణ్య పాపములను అనుభవించును.

స్వధర్మ వర్తనుడే ఆత్మగౌరవంగల వ్యక్తి. ఆ ఆత్మగౌరవంతో తన వ్యక్తిత్వాన్ని వికసింప చేస్తూ మసలుకుంటాడు. ఆత్మగౌరవము అనగా ఏమిటో తెలియని మనిషి యితరులను గౌరవించలేడు.

మానవత్వమునుండి దేవత్వంనకు వెళ్లవలసినది ఆత్మ.

ఆడది తనంత తాను రెక్కలుకట్టుకుని పురుషుని వడిలో వ్రాలితే అతను దాన్ని అసహ్యించు కుంటాడు. చీదరించుకుంటాడు. విముఖుడవుతాడు ఆ ఆడదే అతన్ని చీదరించుకుని పెడముఖం పెడితే అతను పెంపుడుకుక్కలా వెళ్ళి గుంజీలు తీస్తాడు ఆమెకోసం మనుష్యుల్ని చంపుతాడు. దేశాన్ని తగులబెడతాడు. మహాపాపాలు చేస్తాడు.

ప్రపంచంలో నిద్రతో సమానమయిన సుఖమైనవస్తువు లేదు.

రాజుచేత ఆజ్ఞాపించబడు బృత్యువువలె కోరికలకు దాసుడై దుష్కర్మములను ఆచరించుచున్నాడు. విషయవాసనలను జయించుటయే మానవునికి గొప్పవిజయం.

స్త్రీకి భార్యగా భర్తపై ప్రాబల్యం ఉంటుంది. తల్లిగా తనపిల్లల మనోప్రవృత్తిని మార్చగలదు. కుమార్తెగాను, సోదరిగాను, స్నేహితురాలుగాను ఆమె తనవారిని మేరలో వుంచగలదు. ఆవిధంగా ఆమె తాను కోరినట్లయితే సంఘాన్నే ఒకసుఖమైన కుటుంబంగా తీర్చిదిద్దగలదు.

దేశాటన చేసేవాడికి చదివే మిత్రం. ఇంట్లో ఉన్నంతవరకూ భార్యే మిత్రం. జబ్బుపడ్డవానికి ఔషధమే మిత్రం. చనిపోయినవాడికి ధర్మమే మిత్రం.

సశ్శీలురైన మహాత్ములకి లోకమంతా వశీభూతం. యెక్కడా యెదురుండదు. అగ్నిమండదు. నీళ్లుకారిపోతుంది. మహాసముద్రం కూప పాయమవుతుంది. హిమాలయాలు కేళీ పర్వతాలుగాను, కాలసర్పం పూలదండగాను, విషం అమృతంగాను అయిపోతాయి.

పండితుండైనవాడు జ్ఞానంలేని కర్మాధికారులకు కర్మమునకంటె వేరు ఆత్మజ్ఞాన సాధనము కలదనీ, భోధించి వారలబుద్ధిని చెరుప కూడదు.

''నేను యింతవరకే చేయగలను. అనుభవలోపము వల్లనైతే నేమి నాకీవిషయం తెలియకపోవడం వల్లనైతేనేమి నేనిది చెయ్యలేను. నాశక్తియింతే." అని ఒప్పుకోగలగడంలో ధీరత్వముంది. కాని చాలా మంది అదిగమనించక తమ ఆత్మశాంతిని కోల్పోతారు.

భార్యాభర్తలు యిరువురు రెండుచక్రాలు. వారుసక్రమంగా పయనిస్తున్నంతసేపూ ప్రేమనేయిరుసు మధ్యలో వుంటూ క్రమంగా గమ్యం చేరుకుంటారు. అలకలు పెంపుచేసుకుంటూ మమతలను దూరంచేసు కొనడం అవివేకం. సంసారంలో చిన్నవిషయాలను గృహసంబంధ మైన వాటిని స్త్రీలే పరిష్కరించుకుంటూ భర్తకు ఆనందాన్ని యిచ్చే టట్లు చేస్తే ఆసంసారం స్వర్గమే అవుతుంది.

సామ్యవాదం స్ఫటికంవలె స్వచ్ఛమైనది. అందుచేత దాన్ని సాధించడానికి స్ఫటికంలా స్వచ్ఛమైన సాధనాలను అవలభించవలసి వున్నది. మలినమార్గావలంబనం మలినలక్ష్య సిద్ధికే దారి తీస్తుంది.

ఇంటిదీపమని తాకినా కాలకమానదు.

మనమంచి మాటలు మననుండి యితరులకు పోతాయి.

శరీరసంబంధమైన, హృదయసంబంధమైన దుఃఖాలు తమ పగిలిపోయిన బొమ్మలు వగైరాల కొరకు పిల్లలు ఏడ్చేఏడ్పులవంటివి. వాటికి నీలోనీవు నవ్వుకో. కాని ఏడ్చేపిల్లల్ని ఓదార్చు. చేతనైతే వారి ఆటలో కూడా పాల్గొను.

స్వప్రయత్నముపవలని ధీమంతుని శ్రీదేవి నీడవలె అనుస రించి వుంటుంది. అనగా స్వప్రయత్నశాలియైన బుద్ధిమంతుని విజయ లక్ష్మివరించి తిరుగుతాయనిభావం.

యుద్ధమనేది కర్ణాలంగా వుందని మనం అనుకున్నన్నాళ్ళు అది వస్తూనేవుంటుంది. యుద్ధం అసభ్యమని మనం భావించిననాడే దానిని మనం బహిష్కరించగలుగుతాము.

పరిస్థితులు తారుమారైనప్పటికి యెన్నిక్లిష్ట సమస్యల నెదు ర్కొంటున్నప్పటికి నిరుత్సాహ పడకుండా కంఠంలో ప్రాణంవున్నంత వరకు పట్టుదల విడువకుండా పనిని కొనసాగించుతూ ముందుకు పోవ డం మానవున కెంతో అవసరం.

సత్వ రజస్త మనస్సులనెడి ప్రకృతి గుణములను గురించి దేహాత్మ భ్రమచేత వివేకము చెడినవాడు తానే కర్తయని తలచు చుండును.

యజ్ఞశబ్దమే త్యాగము. త్యాగము ప్రతివానికి అవసరమే. యజ్ఞ ములో పశువధ జరగవలసి యున్నది. అయితే యీపశువేది ? మనలో ఉన్నటువంటి పశుత్వమే. యజ్ఞపశువు కావలసినది నరునిలోని పశుత్వం గాని యితర పశువులుకాదు. అపుడే మానవత్వం లభింపగలదు.

మహోన్నత సౌందర్యమును దర్శించుట భగవంతుని దర్శించుటయే. ఆ మహోన్నత సౌందర్యం ప్రకటించుట, ధరించుట, సృష్టించుట అనునవి భగవంతుని సజీవ ప్రతిబింబమును దివ్యశక్తిని మన ఆత్మయందు వ్యక్తము చేయుటయే.

కలీ! నీకాలాన్ని వృధాచేస్తున్నావు. సంఘటల్ని, చరిత్రని లిఖించడమే నీపని. చివరకు పక్వానికి తేవలసింది నీవు కానేకావు .... విప్లవమే ఆ కర్తవ్యాన్ని నెరవేరుస్తుంది.

నలభైయేండ్లు వయసు వచ్చినతరువాత ప్రతివాడు వైద్యుడైనా కావాలి. మూర్ఖుడైనా కావాలి.

స్త్రీలు స్వతంత్రార్హులుకారు.

ఏకాంతముగా ప్రసాంత చిత్తుడవై వున్నపుడే అంతర్ముఖుడవై లోనికి చొరబారి ఏకాగ్రత సాధనచెయ్యి. బయిటిశబ్ధాలు ఏకాగ్రతకు భంగం కలిగించరాదు. ఆ ఏకాగ్రతనుండి హఠాత్తుగా బహిర్ముఖుడవయ్యే యెడల కొంచెంసేపు ఒకవిధమైన గుండెదడ మొదలైనవి నీకు కలుగవచ్చు. అందుచే బహిర్ముఖుడవై కన్నులు తెరచేముందు కొలది క్షణాలు ప్రశాంతుడవై వుండడం మంచిది.

ఎవరు అనుగ్రహమున్నా ఫలితం శూన్యమో, కోపంవచ్చినా భయంకలగదో అట్టిరాజును ప్రజలు కోరరు. నపుంసకుని స్త్రీలు కోరరుగదా!

ఈదేశంలో పుట్టాము. పెరుగుతున్నాము. చివరకు చచ్చిన తరువాత యీదేశపుమట్టిలోనే కలిసిపోతాం. అలాంటప్పుడు యీదేశం కోసం యిక్కడ ప్రజలకోసం ఏకొంచెమూ చేయలేకపోతే యికమన బ్రతుకులు ఎందుకు ?

బద్ధకం మనోదౌర్బల్యానికి చిహ్నం.

మనిషి అవసరాలే కాక ధైర్యము, ఆత్మవిశ్వాసం, స్థాయి, పలుకుబడి అన్నీ డబ్బుపైన ఆధారపడతాయి.

అసత్యంద్వారా యెవరూ సత్యాన్ని దర్శించలేరు. సత్ప్రవర్తన మాత్రమే సత్యసిద్ధికి దోహదంచేస్తుంది.

వాస్తవానికి మించిన మంచి ఆదర్శములేదు.

తోడ బుట్టిన వారు మాత్రమే మేలుచేస్తారని అనుకోవద్దు. మన శరీరంలో పుట్టినవ్యాధి మనలనే చంపుతుంది. కాని ఎక్కడో అడవుల్లో పుట్టిన మూలిక మనల్ని రక్షిస్తుంది.

వినయం మాత్రమే అధికారాన్ని చలాయించడానికి అర్హత నిస్తుంది.

అహింసకు సత్యం మూలం. అలాగే సత్యానికికూడా అహింస మూలం.

పరమ సత్యాలుగురించిగాక తనచుట్టుగల వాస్తవరూపాల్ని పరిశీలనా దృష్టితో వీక్షిస్తూ, అవాస్తవాలునుంచి మంచి చెడులు తెలుసుకుంటూ, సజ్జన దుర్జనులెవరో గ్రహిస్తూ, యీలోక పరిస్థితులకు అణకువతో ఔదార్యంతో తలఒగ్గుతూ, మానవులందరకీ కావలసిన ప్రేమనీ, దయనీ తాను పొందాలనుకోవడమే కాకుండా యితరులికి పంచియివ్వగలవాడే యెదిగిన మనిషిఅని, వ్యక్తిత తెలిసిన వాడని అనవచ్చు.

సత్వాదిగుణములను వానికార్యాది విభాగములను విమర్శించి ఆయాగుణములు తమతమ కార్యములందు ప్రవర్తించు చున్నవియని

యదార్థమును తెలిసినపురుషుడు వానియందు ఆశక్తినుంచకయు తాను వానికి కర్తయని యహంకరింపకయు నుండును.

తనరాజ్యములోయున్న ప్రజలందరూ చేసినపాపం రాజు అనుభవిస్తాడు. రాజు పాపం అంతా రాజపురోహితుడు అనుభవిస్తాడు. స్త్రీ చేసినపాపం ఆమెను చేసుకున్న భర్త అనుభవిస్తాడు. శిష్యుడు చేసిన పాపం గురువు అనుభవిస్తాడు.

మానవదేహమే నిజమైన దేవాలయం. అందులో నిత్యదైవ సాన్నిధ్యం సాధ్యం.

నిద్రించువారిమధ్య జాగుగా మేల్కొన్న వానివలె ప్రమత్తుల మధ్య అప్రమత్తుడుండును, మరియు ఉత్తమబుద్ధి కలిగియున్న అతడు బలహీనమగు గుర్రంకంటె బలిష్టమును, శీఘ్రగామియు అగునని ముందుపోవునట్లు యితరులకంటె అధికోన్నతిని పొందును.

తానంటే యిష్టములేని భార్యను విసర్జించడం పురుషుడికి శ్రేయస్కరమైన పని.

పిల్లలు కనిపించక పోయేసరికి తల్లిదండ్రులు కంగారు పడతారు. దిగులుపడతారు. తీరాకనిపించేసరికి పిల్లలమీద మండిపడతారు.

ఆత్మస్వరూపజ్ఞానమునకు అనధికారులైన మందబుద్ధులు ప్రకృతి గుణమువలన భ్రమచెంది ప్రకృతికార్యములయిన కర్మములందే ఆశ గలవారలగుటచేత గుణకర్మవ్యాపారముల నెరింగిన జ్ఞాని వారిబుద్ధిని చలింప చేయగూడదు.

మానవుడు కష్టనష్టములనుండి ఆరితేరిననాడు నిజమైన మంచితనం అతనిలో ప్రకాశించును.

ప్రయాణాలు మార్పునివ్వడమేకాక మనసుని పెంచుతాయి.

నిర్మల హృదయం లేనివాడు, వుద్రేకాలను అణచుకోలేనివాడు విద్యావంతుడు కానేరడు.

భృత్యుల విశ్వాసం ఏద్దైనాపని చెప్పినప్పుడు తెలుస్తుంది. బంధువులసంగతి దుఃఖాలు వచ్చినపుడుతెలుస్తుంది. స్నేహితుల సంగతి ఆపదలు చుట్టుకున్నప్పుడు తెలుస్తుంది. భార్యసంగతి లేమి వచ్చినపుడు వెల్లడి అవుతుంది.

అత్యాశ అనర్థకము.

సకల కర్మములను ఆత్మజ్ఞాన యుక్తమయిన మనస్సుతో సర్వేశ్వరునకు అర్పణంగావించి నిష్కామములుగాను, మమ శూన్యులుగాను మానవులు ప్రవర్తించవలెను.

మనుష్యులెవరూ కావాలని తప్పుచేయరు. కొన్ని బలహీనతలకు అలా లొంగిపోతారు. అంతే.

విధికీ పురుషార్థానికీ నిరంతరసమరం సాగుతునే యుంటుంది. అందుచేత మనం కృషిసాగిస్తూ ఫలితాన్ని భగవంతుని నిర్ణయానికే విడిచిపెడదాము.

దేవాలయమునకు సన్నిహితమైన కొలది దేముడు దూరమగుచుండును.

నిన్నుశంకించేవారితో, నీచులతో కలియక దూరంగావుండు. ఎవరైనా మాట్లాడుకొంటూ ఉంటేపొంచి వినవద్దు. అది చాలాప్రమాదం.

ప్రాణం అంటే ప్రతి ఒక్కరికీ తీపే. జీవితంలో ఏదో ఒక్క గొప్పవిషయాన్ని సాధించాలన్న ఆశతో బ్రతకడమే బ్రతుకు. ఆ ఆశవల్ల కొంతమంది భౌతిక పరిస్థితులను మెరుగుపరచుకుంటారు.

కొందరు నైతిక సంతృప్తినీ పొందుతారు. మరికొందరు-కొందరేమిటి అత్యధిక సంఖ్యాకులు, రెంటిని సాధించుకొనగలుగుతారు. ఈసాధనలలో మొదటిస్థానం నైతికసంతృప్తిదా లేక భౌతికపరిస్థితులను మెరుగుపరచు కొనడమన్నదా? ఈప్రశ్నలతో బ్రతుకుమీద ప్రేమ అన్నది అందరికీ వుంటుందని స్పష్టమగుచున్నది.

విశ్వాసంతో మానవుడు సాధించలేనిదేది. దేనినైనా అతడు దానితోసాధించగలుగుతాడు. విశ్వాసంతో మానవుడుపర్వతాల్ని సైతం కదల్చగలడు..

జీవితానికి భిన్నంగావుండేది మతం కాదు. జీవితంలోభాగంగా మతం పరిఢవిల్లాలి. మతాన్ని పరిత్యజించిన జీవితం మానవజీవితం కాదు. మృగజీవనతుల్యం.

సంవత్సరాలు జరిగిపోవడంవల్ల తల్లియొక్క అందం కళలు తగ్గిపోవచ్చునుగాని ఆమెకు తనపిల్లల యందున్న ప్రేమతగ్గదు.

ఎవరికితగ్గ బాధలు వారికుంటాయి.

సమాజంలో పేదరికం వుండడమనేది ఆసమాజం అన్యాయంతో కూడుకొని అవ్యవస్థితిమైవున్నదనే విషయాన్ని నిరూపణ చేస్తుంది. బందిపోటుగాని మనస్సాక్షి కొంచెం, కొంచెంగా మేల్కొన జొచ్చిన దానిసూచనలే ప్రజోపయోగార్థమై వెలసిన మనధర్మాదాయాలు.

క్రియాహీనత, పురుషసంతతి లేకపోవటం, విద్యాశూన్యత, శరీరమంతటా వెంట్రుకలుకలిగివుండడం, క్షయ, అజీర్ణవ్యాధి, అపస్మారం, బొల్లి, కుష్ఠువ్యాధులచే పీడింపబడే వంశాలతో పెళ్ళిసంబంధాలు చేయడంకంటె పిల్లకువివాహంచేయకుండా వుంచడంమేలు.

విదూషకుడన్నా, విందుభోజనమన్నా ఒకలాంటివే.

మంచుగడ్డలాగా, స్పష్టంగా, పవిత్రంగా వున్నానరే అపనింద రాకతప్పదు.

కష్టంమీద ఫలితం ఆధారపడి వుంటుంది.

వుచితరీతిని వుపయోగించు విధానం తెలియనివారి చేతులలో విజ్ఞానము నిరర్థకము.

నీటియందు పడిన నూనెచుక్క నీటియందు ఎటుల క్రమ్ముకొనునో అదేవిధముగా పాపాత్మునితోడ కలిసి కూర్చుండుట, పరుండుట, మాట్లాడుట, భుజించుట వలన పాపము ఒకరినుంచి ఒకరికిసంక్రమించును.

బహిరంగంగా మాట్లాడు, నరాల బలహీనత నశిస్తుంది.

ఒకమనిషి విలువ అతడునేర్చిన విద్యమీదగాని, వానిస్థితిపైగాని, వానికీర్తిమీదగాని, అతడు చేయు పనిమీదగాని ఆధారపడదు. కాని అది వాని నిజస్థితిపై, వాని అంతః పరిణామముపై ఆధారపడి వుంటుంది.

భగవంతుని మాటయందు ఎవరు విశ్వాసము యుంచుదురో, ఎవరు శ్రద్ధమాత్రము కలిగియుందురో ఎవరు లేని దోషముల భగవంతుని మాటయందు ఆరోపింపక యుందురో వారందరును పుణ్యపాప కర్మలనుండి విడువ బడుదురు.

ప్రశాంత హృదయం తరువాత ముఖ్యమైనది కేంద్రీకరణశక్తి.

త్యాగం చెయ్యండని ప్రజలకు బోధించడం వట్టిదగా. సామాన్యప్రజ త్యాగం చెయ్యాల్సిందేముంది ప్రాణాలు దక్క. అందర్నీ త్యాగం చేయమని నాకాయుష్యం, నాకారోగ్యం అనుకుంటే పెద్దల్నేగాక

కిమ్మనకుండా సర్వం త్యాగంచేసే వాళ్ళనుకూడా మనంచూస్తాం. ప్రజలకు తెలుసు ఎవర్నెనుసరించాలో !

నిశ్చల భావం నిర్మలజీవితాన్ని ప్రసాదిస్తుంది.

ఆకలి కడుపున ఆలోచనలు, వాదాలు అంతమంచివి కావు.

నాశము లేని భగవంతుడు నశించే లోకాన్ని సృష్టించాడు ! రూపంలేని భగవంతుడు మానవునకు రూపానిచ్చాడు! నిత్యమైన భగవంతుడు అనిత్యాన్ని రూపొందించాడు! నిర్దేశింపనలవికాని భగవంతుడు తాను ప్రపంచాన్నే నిర్దేశించాడు.

ఆపత్కాలమందు, దారితప్పినపుడు, పనిచెడిపోయేవేళ, విపరీతంగా వున్నపుడు ప్రభువు అడక్కపోయినా భృత్యుడు హితం చెప్పాలి.

తామసం కళ్ళకు గంతలు కడుతుంది.

ఒక సంస్కారం నిర్మూలమైనపుడల్లా దాని నిర్మూలానికి సహాయపడిన సాంఘిక శక్తులను సమన్వయ పరిచి ఒక నూతన సంస్కారం వెలువడుతుంది. నిజమైన కళాభిజ్ఞులీ నూతన సంస్కారం వెంబడి అభ్యుదయ మార్గం తొక్కుతారు. కళాభిజ్ఞత కని కార్యవాదులు సంస్కారం మృతిని స్వీకరించి తాత్కాలికంగా - అంటే కొత్తసంస్కారంబలంచేకూర్చుకుని ప్రజలలో వ్యాప్తిచెందేవరకు - స్వేచ్ఛగా విహారంచేసే అరాచకమైన ఆసంస్కారాన్ని ఆశ్రయించి పనిగడుపుకు పోతారు.

దానాలు చెయ్యడము, ప్రియంగా మాట్లాడడము, ధైర్యంగా వుండడము, ఉచితానుచితాలు తెలుసుకోగలగడము - యీ నాలుగు నేర్చుకుంటే వచ్చేవి కావు. సహజంగా పుట్టవలసినవి.

కళ్లులేని వాడికి కళ్ళు ఉన్నవాడు శిక్ష విధించి ప్రయోజకుడవి పించుకుంటారు. కాని ఆకళ్లే తనకు లేకపోతే అదే గోతిలో పడేసంగతి జ్ఞాపక ముంచుకోడు.

ఎవరు భగవంతుని అభిమతంబైన సిద్ధాంతమును ఆచరించరో, తాము ఆచరింపకున్నను ఆచరించువారలను చూచి యెవరు అసూయ చెందుదురో వారందరునూ సకలవిషయము లందును వివేక శూన్యులై చెడిపోవుదురు.

విడిపోయిన అధములు పగిలిన రాయిలా మళ్ళీ కలవలేరు. మధ్యములు బంగారంలా ఋతరుల ప్రయత్నము వలన కలసిపోగలరు. ఉత్తములు నీటివలె తమంతటతామే మళ్ళీ కలుస్తారు.

చరిత్రలోని అతి మహత్తరమైన వ్యక్తి అతి బీదవాడు.

మానవుని ప్రశాంతచిత్తం సంఘంలోనే పరీక్షించాలి. నిర్మానుష్యమైన హిమాలయ శిఖరాలమీద కాదు.

ఇచ్చేవాడినిచూస్తే చచ్చేవాడైనా లేచివస్తాడు.

నిజ జీవితంలో పడే కష్టాలకన్న నిద్రమేలనిపిస్తుంది. నిజానుభవాల్లో పొందే అవస్థలకన్న కలలోపొందే సంతోషమే సుఖమనిపిసుంది.

మాటకు ప్రాణము సత్యము. అల్లే మనిషికి ప్రాణము అతని నడవడిక.

నీటియందున్న చేపను గట్టుపై పడవేసిన అది ఎలాగున గిలగిల తన్నుకొనునో అలాగున రాగద్వేషాదులలో పడిన మనసు బాధ నొందును.

పాలకులు అవివేకులై మంచిసలహాలిచ్చే మంత్రుల మాట వినక దుష్టులకు ప్రాబల్యం యిస్తే ఆదేశం, ఆసమాజంలో సజ్జనులు ఎలా వుంటారు ! ఉండలేరు ! ఉండరు.

అధికారం అంటే స్వాతంత్ర్యం పోగొట్టుకోవడమే. కాని అందరు అది కోరుతూనే వుండటం విచిత్రం.

వ్యక్తులమధ్య నిరంతరం ఆధిక్యతకోసం సంఘర్షణసాగుతుంది. అది అర్హతను సంపాదించటంకంటె పదవులను పొందడం కోసం సాగుతున్నసంఘర్షణ.

అధికమైతే అమృతం కూడా విషంగా మారుతుంది.

మనిషిలో విశ్వాసం నశించినపుడు, మనిషిలో గౌరవం నశించినపుడు ఆమనిషి జీవచ్ఛవం క్రిందనే **పరిగణింపబడుతాడు.**

సదసద్వివేకము గలవాడు జన్మాంతర సంస్కారమునకు దగినట్లు విషయములందు సంచరించు చుండును. ఆప్రకారమే సకలప్రాణులును ప్రవర్తించు చుందురు.

విపరీతకార్యభారం ఎంతవున్నప్పటికీ వుల్లాసంగా వుండడమూ, మనసుకి కొంత విశ్రాంతి నివ్వడమూ చాలా అవసరము.

విస్తారమయిన సంపదలతో తులతూగుతూ విరివిగా ఖర్చుపెట్టి ఆదర్శం కలిగిన ప్రాచీన భారతదేశం అన్నిదేశాలలోకి గొప్పదేశం లాగ విరాజిల్లింది. సన్యాసిప్రవృత్తిని జాతీయాదర్శంగా స్వీకరించే ధోరణిలోవున్న ఆధునిక భారతదేశం జీవన సమృద్ధిని కోల్పోయి, పేదపడి పతనావస్థలో వున్నది.

నీవు నశించు పాపాత్ముడవై యుండగ నీయక్కర యావత్తు క్రీస్తు యేసునందు తీర్చబడును. మరియు క్రీస్తుయొక్క పవిత్ర రక్తము

నిన్ను మంచుకంటె తెలుపుగాచేయును. నీహృదయములో క్రీస్తుయేసును రక్షకునిగాను, ప్రభువుగా నంగీకరించుము. క్రీస్తు పవిత్రసన్నిధిలో విధేయుడవై యుండుము. ఆయన నీకు వాస్తవము తెలిపి నిన్ను తన స్వంతవానిగా చేసికొనును. పరిశుద్ధాత్మ విన్నునడుపుటకు నీలోప్రవేశించును. నీవు ప్రభువైన యేసుక్రీస్తులో నూతనజీవము జీవించుటకు తాను అధికారమిచ్చును (బైబిలు).

నిస్సంగుడు కావడానికి మానవుడు ఎక్కడనోకాక అంతటా అనగా దేహ, ప్రాణ, మనఃప్రవృత్తులలో కూడా నిస్సంగుడుగానే వుండటం అవసరం.

సాంఘిక వ్యవస్తలను మానవులే ఏర్పరచు కున్నారు. మానవులే మార్చుతున్నారుకూడా. మానవ మనస్తత్వంలోనే విపరీత స్వార్థం ప్రాతిపదికగా కొందరుతోటివారిని సహజ స్వత్వాలనుండి వంచించటం జరిగింది. అలా వంచించబడ్డ వారిలో స్త్రీలుకూడా ఒకభాగం.

జ్ఞానేంద్రియములకు విషయములైన శబ్దాదుల యందుగాని, కర్మేంద్రియములకు విషయములైన వచనాదుల యందుగాని, వాసనా బలముచేత రాగద్వేషములు గలుగుచున్నవి. అవి మోక్షమును చెరుపునవి కనుక పురుషునకు శత్రువులని ఎరుగ వలయును.

కార్యరూపము ధరించిన మాటలు ఆదర్శవాదాన్ని హతమార్చేవి.

జీవితం నీటిబుగ్గలాంటిదని తెలిసికూడా మానవుడు దానికోసమే తాపత్రయ పడటంలోగల సారాంశమేమిటి ! మాయామేయ జగంబని తెలిసికూడా ఆజగత్తులోనే మనుగడ సాగించడానికి ప్రతిప్రాణి చేసే ఆరాటంలోగల ఆంతర్యమేమిటి !

మానవుడు స్వతంత్రుడుగా జన్మించాడు. కాని యెక్కడచూచినా అతడు శృంఖలానిబద్ధుడై ఉన్నాడు.

సంతోషంకోసం అన్వేషించడమంటే దానిని వదులుకోవడమే. సంతోషంగురించి స్మరించకుండా కర్తవ్యమార్గాన్ని మెల్లగా అనుస రించినట్లయితే దానిని పొందవచ్చును.

"నిన్ను నీవు తెలుసుకో!" అనే సూచన చాలా విషయాలలో అంతమంచిదికాదు. "యితరులను తెలుసుకో!" అనేది ఉత్తమ సూచన.

ఆదర్శ రహితుడైన వ్యక్తి చుక్కానిలేని నావవంటివాడు.

కామము, క్రోధము, లోభము, తీపి పదార్థాలు, శృంగారరసము, ఆటలు, అతినిద్ర, అతిసేవా — చదువుకోవలసినవాడు ఈ ఎనిమి దింటిని విడిచిపెట్టివేయాలి.

ఎంత సంపాదించగలవో అంతాసంపాదించు. ఎంతదాచగలవో అంతాదాచు. ఎంతధర్మం చేయగలవో అంతధర్మంచేయి.

చిత్రకళ శిల్పము, సంగీతము, కవిత్వము, సౌందర్యోపాసన, యివే కనుక లేకపోతే జీవితంలోని అందం చాలావరకు నశిస్తుంది.

ప్రేమ గుడ్డిది. ప్రేమికులు తాముచేసేచిన్నతప్పులనే తెలుసుకో లేరు.

నిజమైన మూర్ఖత్వం గురించి చెప్పాలంటే కొంత మూర్ఖత్వం లేందే జరిగేపనికాదు.

ప్రాచీన అవశేషాలను చూచినప్పుడు మనం వ్యాకులత పడతాము. ఆవస్తువులచుట్టూ జాలీ, ఆశక్తిగొలిపే వాతావరణం అలుముకొని వుంటుంది.

అంతిమ ఘడియవరకు నిత్యజీవితములో ఎన్నో నేర్చుకోవలసి నవి ఉన్నవి. అన్నీ తెలిసినవాడు విజయాన్ని సాధిస్తాడు.

పరిస్థితులవల్ల మనిషి మనస్సు మోడువారిన కోర్కెలు కొత్త చివుళ్ళు వేస్తాయి. వాటిని పెరగనిస్తే జీవితం ఫలభరితం కాకపోదు.

మానవుడు సమాజాన్ని ఉత్కృష్టంగా నిర్మించడానికి రెండు మార్గాలు. తనంతటతాను మంచివిషయాలను తెలుసుకోవాలి. లేక యిత రులు చెప్పినవైన తెల్సుకోవాలి. తెలిసికొని ఆచరించాలి.

అత్యున్నత శిఖరములకు మనమారోహించినను ఆధారమును మనము విస్మరింతుమేని మనది అక్రమారోహణమే.

చుట్టూ రణగొణ ధ్వనులమధ్య మనసుని ప్రశాంతముగా ఉంచుకో గలగడం ఒకవిధమైన ఆత్మస్థైర్యం.

కర్పూరం దగ్ధమవుతూకూడా దాని పరిమళాన్ని వెదజల్లడం మానదు. అలాగే మంచివారు ఆపదలలో చిక్కుకున్న సహజగుణాన్ని వదలరు.

పరధర్మమును చక్కగా నాచరించి పొందెడి ఫలముకన్న గుణ విహీనమైన స్వధర్మాచరణము శ్రేష్టము. స్వధర్మ నిరతునకు నరక పాతకము లేదు. పరధర్మావలంబనం నరకపాతకమును కలుగ జేయును.

బృహత్ప్రణాళికల్ని వూహించడంకన్న చిన్న చిన్న ప్రణాళికలు వేగంగా కార్యరూపం దాల్చగలవు.

నీభయాన్ని నీలోవుంచుకో. ధైర్యాన్ని మాత్రం యితరులతో పంచుకో.

అకారణంగా నవ్వకూడదు.

కాకిగూడులో పెరిగిన కోకిల తన సుస్వరాన్ని వీడనట్లు మంచి వారు దుర్జనుల స్నేహం చేసినను తమమంచిగుణాన్ని వదలుకోరు.

మానవులలో దాచుకోదగ్గ విషయాలు కొన్నివుంటాయి. వాటిని బైటపెడితే లాభముకన్న హానిఎక్కువ.

మానవులు ప్రియవాక్యాలు, హితవాక్యాలు, సత్యవాక్యాలు చెప్పడమే కాకుండా అదే విధంగా తమప్రవర్తనలో కూడ విశుద్ధ తను నిజాయితీని, సంయమాన్ని, ప్రశాంతమనస్కతను పాటించాలి.

సర్వరోగాలను హరించి స్వాస్థ్యం చేకూర్చేవాడు దేవుడు. కాని ముడుపుతీసుకునేవాడు వైద్యుడు.

గర్వం దేవతలనుకూడా నాశనంచేస్తుంది.

నీటిపాముకు విషంవుండదు. కనుకనే అది భయంలేకుండా విచ్చల విడిగా తిరుగుతుంది. విషపూరితమైన నాగుబాము అలా తిరగలేదు. నిష్కల్మష చిత్తులవలె వంచకులు స్వేచ్ఛగా సంచరించజాలరు.

అవసరంవంటి సద్గుణం మరొకటిలేదు.

కాలం సద్వినియోగపడేందుకు ప్రశాంత చిత్తం ప్రథమవిషయ మేగాక ప్రధాన విషయం కూడా.

జ్ఞానయోగమునందు ప్రవర్తించిన పురుషుడు ఏ వస్తువును కోరక భృత్యునివలె బలాత్కారముగా విషయానుభవ రూపమైన పాపము చేయుట రజోగుణమువలన కలిగిన కామమే. అది ఒకతూరి తనకు అభి మతంబైన విషయమును అనుభవించి మాటిమాటికి అభిలషించు చుండి నది, క్రోధరూపముగా పరిణమించునది సమస్తమును భక్షించునది. ఇది మహాపాప స్వరూపము కలది కనుక అదే జ్ఞానమునకు శత్రువు.

అత్యధికంగా ధైర్య సాహస సుగుణాలు లేనివ్యక్తి అహింసను ఆచరించలేడు.

డబ్బు ఎరచూపి స్తే లోభి వశపడతాడు. చేతులు జోడిస్తే ఎంతటి అహంకారిన్నీ స్వాధీనం అవుతాడు. వాడు చెప్పినట్లల్లా నడుచుకుంటే మూర్ఖుడు లొంగిపోతాడు. పండితుడైనవాడు మాత్రం ఒక్క సత్యానికే వశం అవుతాడు.

పిల్లలను పోగొట్టుకొనిన ఎలుగుబంటిని ఎదుర్కొన వచ్చును గాని, మూర్ఖపు పనులు చేయుచున్న మూర్ఖుని ఎదుర్కొనరాదు.

లభించని వాటికై విచారించక, లభించిన వాటిని చూసుకుని పొంగిపోక సుఖదుఃఖాతీతుడవై నిమిత్తమాత్రుడిగా జీవించు.

తామసం కళ్లకు గంతలు కడుతుంది.

మనజీవితంలో అనుభవాలవల్ల మన వివేకమూ, ఒకమెట్టు పెరిగితేనే అది బాధాపూరిత మైనప్పటికీ ఆత్మశిక్షణ అనునది కొంత అలవడుతుంది. ఆ ఆత్మశిక్షణవల్ల భీతిని జయించి సాహసికయత్నం వైపు మళ్ళించగల శక్తి వుంటేనే అనుభవసారం ఫలప్రదమై వ్యక్తి పరిణితకు సహాయకారి అవుతుంది.

ధైర్యమున్నపుడే మానవుడు కష్టాలను, ఆపదలను పట్టుదలతో జంకకుండా ఎదిరించగలుగుతాడు. ధైర్యం బలంమీద ఆధారపడి వుంటుంది. శారీరక బలమేకాకుండా నైతికబలంకూడా అవసరం. శారీరక బలంకంటె మనోబలం సంపాదించటం కష్టం. మంచినాయకత్వానికి నీతితో కూడిన ధైర్యం ప్రధానం.

ఆశయంలేని జీవితం దీపములేని గృహం.

తప్పుచేయటం సహజం. తప్పుచేసావని ఒప్పుకుంటే క్షమించటం కూడా వుత్తమ ధర్మం.

ఏనాటికయినా మానవపధికుడు చేరుకునే గొప్పవిశ్రాంతి మందిరం కవిత.

అగ్నిసహజమైన పొగచేతనూ, అద్దము మాలిన్యముచేతనూ, గర్భము జరాయువనెడి మావిచేతను కప్పబడియుండెడిరీతిగా ప్రాణి సముదాయము కామముచేత కప్పబడియుండును.

నేనీ ప్రపంచములోనికి దేనితోనూ రాజీపడడానికి రాలేదు. అన్నిటితోనూ తగవు పడ్డానికేవచ్చాను.

ధర్మశాస్త్రములు అనుసరించువాడు ధన్యుడు.

వచ్చిన కష్టానికి విరుగుడు చూసుకున్నవాడూ, రానున్న కష్టానికి ప్రతిక్రియ ఆలోచించుకునేవాడూ సుఖపడతారు. "ఏంజరుగుతుందో జరగనీ, అప్పుడు చూసుకుందాము" అని అశ్రద్ధగావున్నవాడు మాత్రం చెడిపోతాడు.

అన్నం పెట్టిన వారిల్లు కన్నంపెట్టగూడదు.

కామము విషయానుభవమునందు తృప్తిలేనిది. ఐచ్ఛారూపమైనది. జ్ఞానికి మహాశత్రువైనది. కనుక ఈ కామముచేత ఆత్మజ్ఞానము కప్పబడియున్నది.

మనసమాజం అద్దంవంటిది. అద్దం ఎదురుగా అందమైనబొమ్మ పెడితే ప్రతిబింబముకూడా అందంగానే వుంటుంది. అందవికారము అయిన బొమ్మపెడితే ఆ ప్రతిబింబముకూడా అందవికారంగానే వుంటుంది. సమాజం ఒక అద్దంలాంటిది. సమాజంలో మంచీ చెడూ రెండు రకాలున్నారు.

ఆలస్యంగా గ్రహించిన సత్యం; తగు సమయములో నిర్లక్ష్యం చేసిన బాధ్యత - యివే నరకం.

అతిసామాన్య జితానురక్తి. అధికాలోచనాశక్తి గొప్పవారి జీవితముల సూత్రము.

ప్రజ్ఞలేనివాడి చదువు, లోభివానిధనం, పిరికివాని బలం ఈ మూడు లోకానికెందుకూ పనికిరావు.

శీలం స్త్రీకే పరిమితంకాదు. పురుషుడికీ వర్తిస్తుంది. ప్రతి వ్యక్తికీ సంబంధించింది.

ఎవరికివారు తమసంగతి తాము చూసుకుంటూ దేశాన్ని గాలికి వదిలివేస్తే ఏంజరుగుతుందో వేరేచెప్పనక్కరలేదు.

ఇంటిముందర పందిరి వేసుకుంటే ఓఅందం. వేసినది తీసివేస్తే మరో అందం. క్షణక్షణానికి జరిగే మార్పులే జీవించడానికి ఆకర్షణలు.

జ్ఞాన సముపార్జనకు ప్రథమసోపానం మనం అజ్ఞానులమని తెలుసుకొనడం.

ఉన్నత మనస్కుడు ఒకరిని అవమానించడు. అవమానాన్ని సహించడు.

తమను గాయపరచే వారిని సైతం ప్రేమించడం మానవులవిధి.

దరిద్రులు కొన్నికోరుతారు, విలాసపురుషులు చాలాకోరుతారు, అత్యాశాపరులు అన్నీకోరుతారు.

చెడువార్తలు వేగంగా ప్రాకిపోతాయి. కానిమంచివార్తలు అంత వేగంగా ప్రయాణించలేవు.

ఒక్కొక్క అడుగే ముందుకువేసుకుంటూ, యిది తప్పటడుగు కాదుకదా యని మనకి మనంతెలుసుకుంటూ, మనకెదురుగా వచ్చి దారికడ్డంగా నిలిచేవాటిని నేర్పుగాతప్పించుకుంటూ, ముందుకుసాగడం లోనే మన బలసంపదలని, శక్తిసామర్థ్యాలనీ తెలుసుకో గలుగుతాము.

నొప్పిని గాలిపూదటంతోనూ, బాధను ఉపశమన వాక్యాలతో మెత్తపరచాలి.

అధికారానికి కూడా హద్దులున్నాయి. యిదిగుర్తించక పోవడం వల్లనే గొప్పగొప్ప సామ్రాజ్యాలు నాశనమయినాయి.

సిద్ధాంతాలు కర్తవ్యాలుగామారి కార్యాచరణకు పురిగొలిపి నపుడే అసలైన విప్లవాలు బయలుదేరగలవు. అక్రమశాసనాలను దిక్కరించకపోవడం పిరికితనం.

రాయిబరువు, యిసుకబరువు, - మూఢునికోపము ఆరెండింటి కంటె బరువు.

సాహసించిచేసే పనులు తాత్కాలికంగా మంచిఫలితాలనీయ వచ్చు. బాగాఆలోచించి చేసినపని నూటికికోటికి ఎన్నడోగాని విఫలం కాదు.

కవిత్వం విజ్ఞాన కూపంలోని వుదకమే కాని బాల్చీకాదు, చేంతాడు అసలేకాదు.

ఈభూమి ప్రకృతిని మార్చదలచినవారు మార్చుటకుముందు దానికి అంగీకరించి జీవితమున అనుభవింపవలెను.

సత్యంయొక్క అన్వేషణలో లోకాచారాలు అడ్డువస్తే వాటిని ఎదిరించడం సమంజసం.

జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ మనోబుద్ధులు అన్నియు కామము నకు అధిష్టానము లగుటవలన వీనితో కూడుకొని యుండెడి కామము జ్ఞానమును ఆవరించుకొని జీవుని మోహింప చేయుచున్నది.

ఆగ్రహంలో బలవంతుడు పలికిన శాపాలకంటె పదునైనవి పసిపాప హృదయంలో మెరిసే శాపాలు.

పాలు తరచగా వెన్నపుట్టును. ముక్కుపిండగా రక్తంవచ్చును. కోపంవల్ల పగ, కలహము వచ్చును.

శోకం ధైర్యమును తగ్గిస్తుంది. జ్ఞానమును నశింప చేస్తుంది. కనుక శోకం కంటె ప్రబలశత్రువు లేదు.

నూనెకు బదులు నీటితో దీపమును వెలిగించ దలచువాడు చీకటిని పారద్రోల జాలడు. కుళ్ళిన కలపతో జ్వాలను తీసుకుని రాగోరువాడు తన పనిని నెరవేర్చుకొనలేడు.

జీవితం అనే స్థితికి అంత్యం, మృత్యువు అనేదానికి ప్రారంభం మానవుడికి ఎలా ప్రాప్తిస్తాయో ఎవరూ నిర్ణయించలేరు.

నిజమైన ప్రేమకుడే కవి.

దురాలోచనలు, నరహత్యలు, వ్యభిచారములు. వేశ్యాగమనములు, దొంగతనములు, అబద్ధసాక్ష్యములు, దేవదూషణలు, హృదయములోనుండియేవచ్చును. అయితే దేవుడు మనయెడల తనప్రేమను వెల్లడిపరచుచున్నాడు. ఎట్లనగా మనమింకను పాపులమైయుండగానే క్రీస్తుమనకొరకు చనిపోయెను. ఇది బైబిలువాక్యము.

తాను కోరుకునేసుఖాలన్నీ ఎవడికీ సిద్ధించవు అంతాదైవాధీనం కనుక ఎక్కడికక్కడే సంతుష్టి పడడం మంచిదెవడికైనా.

ప్రపంచంలో అందరు తమని అర్థంచేసుకోవాలని తాపత్రయ పడే వాళ్ళువట్టిమూఢులు.

మమత, ఆశ, ప్రేమ, వాత్సల్యం, తృప్తి యివే జీవితాగమనానికి, మానవుడి మనుగడకి ఆధారాలు.

తారలు ఉదయించటంతో తెలివి తారస్థాయినందుకుంటుంది.

నదిఎండిపోయినప్పటికీ ఊటనీరుయిస్తుంది. అలాగే గొప్ప వారు లేమిలోకూడా యాచకులకు లేదనరు.

మానవుడు ముందుగా పంచేంద్రియములను నిగ్రహించి జ్ఞాన విజ్ఞానములను నాశనముచేయునది యగు పాపరూపమైన కామమును నశింపచేయవలెను.

చరిత్ర చదువుకుంటే చాలదు. అది నేర్పిన పాఠం నేర్చుకోవాలి.

బయటి పరిస్థితులపై నీ వెక్కువగా ఆధారపడరాదు. బయట పరిస్థితులు సహాయపడగలవనికాని. అవరోధాలు కల్పించవనిగానీ నేనను, కాని ఏమైనా అవి అప్రధానములు. ప్రాధాన్యతలు యివ్వవలసి వదినీ బయిటనేగాక నీలోపల వున్నది. యోగసాధనలో బయటి అవ రోధాలకూ అననుకూల పరిస్థితులకు ప్రాధాన్యమిస్తే వాటిశక్తి పెరిగి నిన్ను మరింతగా బాదిస్తాయి, ప్రాధాన్యమివ్వక సుచిత్తంతో వాటిని నెదుర్కొంటే వాటిబలం తగ్గి క్రమముగా శమించిపోతాయి.

విలాసజీవితంలో నీతులు ఉదయించటంతో తెలివి తారస్థాయి నందుకుంటుంది.

బీదవాడు కొన్నివస్తువుల్ని కోరును. కాని ఆశాపరుడు అన్ని టిని కోరును.

విమర్శనాత్మకంగా చూడలేని వాడుశూన్యుడు.

ఏసుక్రీస్తువాక్యము "ప్రయాసపడి భారము మోయుచున్న ప్రజ లారా, వాయొద్దకురండి. నేను మీకు విశ్రాంతి కలుగచేతును."

సమకాలిక నిర్ధారణలు కొన్నిఅపోహాలతో కూడుకుని వుం టాయి. కాలం గడిచినకొద్దీ వస్తువుల మూలములను గురించి మనకు ఎక్కువ ప్రామాణిక దృష్టి ఏర్పడుతుంది.

పురుషుని యొక్క జ్ఞానమును చెరుపునట్టి వానిలో దేహముల కన్న యింద్రియములను, యింద్రియములకన్న మనస్సును, మనస్సు కంటే బుద్ధియును, బుద్ధికంటె ఆత్మయును, ఉత్తమంబులై యుండును.

నాశనమునకు ముందు గర్వము నడచును. పడిపోవుటకు ముందు అహంకారమైన మనస్సు నడుచును.

ప్రతివిపత్తునుండి మీరు బయటపడ్డపుడు మీవ్యక్తిత్వం ప్రతి ఒక్కవిజయముతోనూ మరి కొంత ధృఢమవుంది.

ధర్మాలు వినేటపుడూ, స్మశానములో వున్నపుడూ, రోగాలు వచ్చినపుడూ మనిషికి పుట్టేబుద్ధి ఎప్పుడూ వుండేటట్టయితే సంసార బంధం విడిచి మోక్షం పొందని వాడెవడు?

మనిషి కష్టాలలో వున్నపుడు తోడివారినుండి సానుభూతిని ఆశిస్తారు. ఆసానుభూతి తనకష్టాలనే విధంగానూ తప్పించకపోయినా కనీసం మనః క్లేశాన్ని పోగొట్టి కష్టాలనెదుర్కొని ఆత్మస్థైర్యాన్నందిస్తుందనే భావంతో సానుభూతిని కోరుతాడు. తాను వూహించినంతగా సానుభూతిని పొందనినాడు తనకేర్పడిన కష్టాలకంటేకూడా సానుభూతి లభించనందుకు మరింత దిగజారిపోతాడు. కాని ఎదుటవారినుండి ఆశించే సానుభూతికి కూడా ఓహద్దంటూవుందని గుర్తించనినాడు మనిషికేమాత్రం శాంతి లభించదు.

బుద్ధికంటె వ్యతిరిక్తంబైన పరమాత్మను సాక్షాత్కరించుకుని, పరిశుద్ధమైనమనస్సుచేత మనస్సును నిగ్రహించి, దుఃఖముచేత పొంద దగినదియును కామమును నశింపచేయవలెను.

ఒకవ్యక్తి అదృష్టం పదిమంది దురదృష్టవంతుల్లో ఐకమత్యాన్ని పెంపొందించగలదు.

ఆశ. కోపము, మనశ్చాంచల్యము శరీరమును విడుచుటకు ముందే విడుచువాడు జీవన్ముక్తుడు.

అనుమానాస్పదమైన చర్యను అవసరం అమాయకపు క్రియగా రూపొందించవచ్చు కాని దానిని ప్రశంసా పాత్రం చేయలేదు.

ముందుగా కనిపించినంత మంచిగా ఏదీ వుండదు.

ఆత్మబలిదానంకంటే యితరులకు మానవుడు విధించ తగిన శిక్ష, దండనము మరియొకటిలేదు.

కూతుర్ని అప్పగింతలకు బావురుమని ఏడిచేతల్లి కూతుర్ని అస్తమానం ముద్దుచెయ్యలేదని, ఎప్పుడో ఒకప్పుడు ఎందుకో అందుకు పెట్టవలసిన శాపనార్థాలు పెట్టివుంటుందని మీరు వూహించవచ్చు. అలాగే భర్తపోతే ఏడిచేభార్య భర్తలోకంగా జీవించలేదని అనుకో వచ్చు. అయినా యీబాధలు దుర్భరమైనవి. ఇటువంటి బాధలు ఎరగకుండా దాటిపోయేవాళ్ళు నిజమైన అదృష్టవంతులు.

విలాసజీవితం, దురాశ - ఈచీడపురుగులు రెండూ చిరకాలంగా ప్రతిగొప్పరాజ్యాన్ని నాశనం చేస్తూ వచ్చాయి.

నిజ జీవితం గడపదలచుకున్నట్లయితే మనం మానసికంగా సోమరితనం విసర్జించి ప్రధాన సమాలోచన జరుపుకోవాలి. ఆవిధంగా మనజీవితం సరళంగా సాగుతుంది.

ఎవరు ఎంత గొప్పవారైనా గ్రుడ్డిగా వారిని అనుసరించడం మంచిది కాదు.

నేర్చుకోవడం ఎంతముఖ్యమో, ఆనేర్చుకున్న దానికి ఆలోచన ద్వారా ప్రాణం పోయడం కూడా అంతే ముఖ్యం.

మణితలమీదవున్నా మెడను, చేతులను అలంకరించినా ఎక్కడ వున్నా శోభించినట్లు గుణవంతుడు ఎక్కడవున్నా ప్రకాశిస్తాడు.

అన్యాయంగా ప్రజలను బందీలను చేసే ప్రభుత్వపాలనలో న్యాయ శీలులకు బందిఖానాయే సముచితస్థానం.

కల నిజపరచడం కాదు కవిత్వం. నిజాన్ని కలగనడమే దాని తత్వం.

భగవంతుడు పుట్టువులేనివాడు, నాశరహితుడు, బ్రహ్మాది సమస్త భూతములకు నియామకుడు, స్వకీయంబగు త్రిగుణాత్మకమైన మాయను అదిష్టించి భగవంతుడు సంకల్పముచేత అవతరించుచున్నాడు.

తాను పొగుడుకుంటే కాదు. పైవాడెవడయినా పొగిడితేనే గుణ వంతుడవుతాడు ఎవడైనా. తనకి తానే పొగుడుకున్నాడా దేవేంద్రు డంతటి వాడున్నా తేలిక అయిపోతాడు.

సంకల్పమునకు సత్కార్యారంభమునకు వ్యవధాన ముండ కూడదు.

జీవిత ముఖ్యోద్దేశము స్వార్థము కొరకు పుణ్యముల నార్జించు కొనుటయే కాదు. ఆనంద మనుభవించి పారవశ్యమునందుట.

వాక్కుగొప్పది. మౌనం అంతకన్నాగొప్పది.

గ్రంథాలు నిమ్మకి నీరెత్తినట్లుగా మనమీద పని చేస్తాయి. కాని ప్రపంచంలో వీటి ప్రభావం చాల గొప్పది. ఇవి నిశ్శబ్దంగా కోట్లకొలది జనాన్ని ప్రేరేపించి దేశాల స్వరూపాల్నే మార్చివేస్తాయి.

దీపంచుట్టూ ఎగిరే మిడతలవలె ప్రలోభానికి దాసులై కాముకులు, ప్రణయవిశారదులు, రసికులు సంచరిస్తారు. ప్రణయ తత్వకోవిదులూ,

ఆరోగ్యంవున్న బుద్ధిమంతులూ రూపానికి ముగ్ధులయినా క్రమేణా అసలు సంగతి తెలిసిన తరువాత నాయిక సంకుచిత హృదయ అనీ, స్నిగ్ధకాదని గ్రహించి భావుకులు కొందరు రాగరసంలోనుంచి కాస్త తెప్పరిల్లకపోరు. రక్తి భావుకుల హృదయాంతరాళంలో వుండి వాసనా రూపంగా వుండి అప్పుడప్పుడూ చెలరేగుతూ వుంటుంది.

ప్రేమలోవున్నప్పుడు తప్పసంభాషణలో అతిశయోక్తి ఎక్కువగా రాణింపదు.

బాటమీద అడుగు పెట్టిన తరువాత మంచిగాని, చెడుగాని పురోగమించటమే ధర్మము.

అప్పులేనిగంజి కొంచెమే అయిననూ సంతృప్తిగా వుంటుంది.

ఎప్పుడెప్పుడు శాస్త్రీయమైన ధర్మమునకు హానియును, అధర్మమునకు వృద్ధియు కలుగుచుండునో అప్పుడప్పుడు భగవంతుని సంకల్పము చేతను అవతరించుచున్నాడు.

అన్యాయానికి మోసం సైదోడు.

తనను నరికేవరకూ చెట్టు మానవుడికి నీడనూ, ఫలాల్నీ యిస్తూ వుంటుంది. గొప్పవారు తాము మరణించేవరకూ దుర్జనులకూ కూడా మేలు చేస్తూనే వుంటారు.

నిన్నకంటె రేపు బాగుంటుందన్న నమ్మకంతోనే మనిషి బ్రతుకుతున్నాడు.

శాంతిభద్రతలకు వేరుపురుగులుగానున్న మతకులవిద్వేషాలను రూపుమాపడం అత్యంత ప్రధానం.

చిన్నచిన్న సమస్యలను పరిష్కరించే నేర్పువల్లనే పెద్దవాటిని పదిలంగా ఎదుర్కోగల శక్తి అలవడుతుంది.

బైబిలువాక్యము — ప్రతిమానవుడూ పాపంచేసి దేవునిను గ్రహించే మహిమను పొందలేక పోతున్నాడు. ఇలా లాభం లేదని ఆదేవుడే మానవుడై ఏసుక్రీస్తుగా అవతరించాడు. మానవ రక్షణార్థం మరణించి మళ్ళీబ్రతికి మేఘరూఢుడై స్వర్గంచేరుకున్నాడు. తన్నెందరంగీకరించిరో వారికందరికీ దేవునిపిల్లలగుటకు ఆయన అధికారమనుగ్రహించెను.

మనం ఎప్పుడూ జీవించం. కాని జీవించాలని ఎల్లపుడూ ఆశిస్తూవుంటాము.

సంసిద్ధత, పరిశ్రమ మానవునికి ఉన్నతస్థానాన్ని సంపాదించి పెడతాయి.

మానవునకు ఉత్సాహమేబలము. ఉత్సాహమునకు మించినబలము లేదు. ఉత్సాహవంతునకు ఎట్టికష్టమైన పనులలోనూ పరాజయమనునది లేదు.

స్వార్థమును పూర్తిగా దాటి పోయినవాడే సుఖవంతుడు. శాంతిని పొందినవాడు, సత్యమును కనుగొనినవాడు సుఖవంతుడు.

నీవు క్రీస్తుయడుగుజాడలను వెంబడించుము. ఆయనతో నడువుము. నీకై గాయపర్చబడిన తనహస్తముతో ఆయన నీయొక్క తలపై జీవకిరీటము పెట్టును. ఇదే జయమైన జీవితము (బైబిలు).

అధునిక మానవుడు తనకర్మకు తానే బాధ్యుడు. జీవితాన్ని సుఖవంతంగా గాని, దుఃఖవంతంగాగాని చేసుకొనుట అతని చేతులలో, చేతలలో వుంది.

వృద్ధాప్యం మాత్రం వేగంగా కబళించగలదు. కానీ సునిశిత జ్ఞానదృష్టి మనకు వేగంగా లభించదు. పరిశ్రమ అవసరం.

సన్మార్గ ప్రవర్తకులను రక్షించుటకు, పాపాత్ములను నాశనము చేయుటకును, ధర్మమును నిలుపుటకును భగవంతుడు ప్రతి యుగము నందును అవతరించుచున్నాడు.

మననిర్ణయాలు జీవితాన్ని సచేతనంచేయడమో, స్తంభింపచేయడమో చేస్తున్నాయి. మనజీవన మార్గమెప్పుడూ చీలికదారులవద్ద చేసుకోవలసిన నిర్ణయాలపై ఆధారపడివుంటుందన్న విషయం విస్మరింపరానిది.

ఒకవంక పాతివ్రత్యము, మరొకవంక వేశ్యావృత్తి: యివిరెండూ జంటలు జంటలుగా వర్ధిల్లే పవిత్రదేశం భారతదేశము. మనపాతివ్రత్యం పావలాడబ్బులనూ, పొట్టకూటికీ నడివీధుల్లో అమ్ముడుపోతూంది. భర్త ప్రమోషనుకొరకూ, హోదాకొరకూ, ఉద్యోగంకొరకూ, ధన, కనక, వస్తు, వాహనాలకొరకూ, వృత్తిలోరాణింపుకొరకూ నిశ్చితంగా నిరాఘాటంగా స్త్రీ పాతివ్రత్యం అమ్ముడుపోతోంది.

ఇతరులనుంచి కృతజ్ఞతలు ఆశించక వారికుపయోగ పడనటువంటిదానము నిజమైనదానము.

గడ్డిపరక బాగాతేలికవస్తువు. దానికంటెను తేలిక దూది. ఆదూదికంటెనూ తేలిక యాచకుడు. అయితే "ఆయాచకుడు గాలికెందుకు కొట్టుకుపోడూ" అంటే తననుకూడా యెక్కడయాచించు పోతాడో అని వాణ్ణితాకదు గాలి.

ప్రతివారు అంతఃకలహముల నంతరింపచేసి ఐకమత్యమును కలిగింపవలయును.

ఉన్నత జీవన ప్రమాణాలసాధనకు మనం గ్రుడ్డిగా కృషిచేస్తున్న సందర్భములో ఉదాత్త భావాలను విస్మరించే అవకాశముండగా ఉన్నత జీవన ప్రమాణాలను త్వరగా సాధించడానికి వీలు కాకపోవచ్చు.

మానవులు ఎక్కడెక్కడ నివసిస్తున్నా సరే స్వేచ్ఛగావుండా లన్నదే ప్రతి వాని కోరిక అయివుండాలి.

నీ విజయాన్ని నీ అంతట నీవే చాటించుకుంటే అది కేవలం చాటింపుగా మాత్రమే అవుతుంది.

దురాలోచనలు కూడా వ్యాధిలక్షణాలు. అందుచేత మనం వాటిని నివారించుదాము.

తరుచూ జుగుప్సతో కూడిన అనుభూతిని పొందే వాడు సుఖంగా జీవించలేడు.

ఆప్రాకృతమైన భగవంతుని మాయారూప జన్మమును, సాధు సంరక్షణాది కర్మమును యదార్థముగా ఎవడు ఎరుంగునో ఆపురుషుడు శరీర త్యాగముచేసిన పిమ్మట భగవంతునే పొందుచున్నాడు.

చదువుతున్నప్పుడు ఏభావ సౌందర్యాలు, ఏభావ చిత్రణలు మనవి నిలబెట్టి ఆనందపరిచాయా అన్నది ముఖ్యం.

మహాత్ముల మనసు నవనీతముకంటె మృదువైనది. వారు తమ భక్తులనుండి యేలాభము కాంక్షింపరు. భక్తులను తమ యదార్థబంధువులుగా భావించి సన్మానింతురు. కాపాడుదురు.

పనులు సగంచేసి వదలిపెట్టడం అంటే నాకసహ్యం. సక్రమమైన పనిని ధైర్యంగా చెయ్యాలి. అక్రమం అనుకుంటే దానిని పూర్తిగా త్యజించాలి.

దీపాన్ని చూసి పండు అని భ్రమించి కీటకాలు సంతోషంతో రెక్కలు కొట్టుకుంటూ వచ్చి ప్రమిదలో వాలతాయి. దీపాకర్షణ ఎంత ప్రబలమోగాని చనిపోయినపురుగులను చూసి వ్రాలబోయే పురుగులు నిజానిజాలు గ్రహించే వివేకం లేక వుద్రేకంలోపడి భస్మమైపోతాయి.

ప్రపంచంలో ప్రతీ అంశములోనూ ఆత్మపాలనాశక్తి యిమిడి వుంది.

మంచి సలహా యివ్వగలవారుంటే తీసుకునేవారికి కొదవ వుండదు.

మూర్ఖత్వం జన్మతః వస్తుంది. కాని దుర్మార్గం అవసరంవల్ల ఏర్పడుతుంది.

దేశభాషలు వృద్ధిపొందినగాని దేశము స్థితి ఎన్నటికీ బాగుపడ నేరదు. రాజకీయభాష ఎంతఅభివృద్ధి గాంచినను అది ఎన్నటికీ దేశ భాష కాజాలదు.

మంచిరచన చదివాక బాగా భోంచేసినట్టుండాలి.

భయాందోళనలు సంకల్పానికి విపరీత రూపాలు. నీమనస్సు నందు పదేపదే భయాందోళనలు మనల జొచ్చినపుడు దేనిని గురించి నీవు భయాందోళనలు చెందుచున్నావో అది సంభవించడానికి నీవు తోడ్పడిన వాడవవుతావు. ఏలనంటే మెలకువయందలి ఉపరి తలంలోని నీసంకల్పం దానిని నివారించు గోరుతున్నా అడుగుపొర లోని నీమనస్సు విడువకుండా దానిని సంకల్పిస్తూనే వున్నది.

కామక్రోధ భయ రహితులును, భగవంతునియందే చిత్తము కలిగి భగవంతుని ఆశ్రయించినవారును నైన అనేక సత్పురుషులు, జ్ఞానమనెడి తపస్సుచేత పరిశుద్ధులై భగవానుని స్వరూపమును సాక్షా త్తుగా పొందియున్నారు.

భగవంతు డొక్కడేగాని తన ఏకత్వముచే అతడు బంధింప బడలేదు.

అననిమాట ఎప్పుడూ అపకారం చెయ్యదు.

కష్టములు కలిగినపుడు కృంగిపోవుట, సుఖములు కలిగినపుడు పొంగిపోవుట అజ్ఞాని లక్షణములు.

సత్యమే దైవం, సత్యమే తపస్సు సర్వకర్మలకూ సత్యమే మూలం. సత్యంకంటె గొప్పదేదీలేదు.

తన అజాగ్రత్తవలన చెట్టుమీదనుండి క్రిందపడి కాళ్ళుచేతులు విరగగొట్టుకొని భూమ్యాకర్షణ వల్లనే తను పడ్డానని, దానిమీదనేరం మోపితే ఎంతమూర్ఖంగా వుంటుందో ప్రేమకలిగినమన్నా ద్వేషిభూత మన్నా అంతమూర్ఖంగావుంటుంది.

అల్పుడిని బలవంతుడు కొడితే బలవంతుని భగవంతుడు కొడతాడు.

ఆడపిల్లల తండ్రికి మగబిడ్డపై ఆశ మిక్కుటంగా వుంటుంది.

ఇహలోకపు కష్టాలను చిరునవ్వుతో ఎదుర్కొనగలవాడే ధన్యుడు. నేడు అనుభవించే కష్టాలే రేపు సుఖాలు కావచ్చు.

కోరికలను అనవసరంగా పెంచుకుంటూండడము మహాపాపం.

అనుమానం అంతంకావడం శాంతినెలకొనడానికి నాంది.

ఎవరెవరు ఏయేఫలమును కోరి యజ్ఞాదికర్మలచేత భగవంతుని భజింతురో వారలకు విగ్రహగుణవిశిష్టుడైన భగవంతుడు ఆయా యభీష్టములైన ఫలములను యిచ్చుచున్నాడు. కనుక మనుష్యులు ఏయే కర్మలు చేసినను అన్నివిధములుగా భగవానుని మార్గమునే అనుస రించుచున్నారు.

మనం మంచి దృష్టితో చూస్తే అంతామంచే కనిపిస్తుంది. సమాజంలో, చెడ్డదృష్టితో చూస్తే అంతాచెడే కనిపిస్తుంది.

కష్టకాలంలో మౌనమే శ్రేష్ఠము.

మనోవాక్కర్మల్లో మలినంలేక పోవటం శీలం.

అనిశ్చితమూ, బలహీనమూ అయిన ప్రయోజనాలు పెంచుకునే ఆత్మలు సదాశయాలకు సమాధులవంటివి.

జీవితం గులాబీ పువ్వువంటిది. కారణం దానినిండా ముళ్ళుండటమే.

హృదయం తప్పుదారి త్రొక్కినపుడు మనసు సరిగావున్నా ప్రయోజనం లేదు.

జ్ఞానం మూడువిధాలుగా లభిస్తుంది. మనసులో వచ్చేది అన్నిటి కంటె శ్రేష్టమయినది. అనుకరించుటవలన వచ్చేది అన్నిటి కంటె సరళమైనది. అనుభవం వలన వచ్చేది అన్నిటికంటె చేదైనది.

ఐహిక వాంఛలందు ఆశక్తిలేని వాడికి మంచికలిగినపుడు సంతోషమును, చెడుకలిగినపుడు ద్వేషములేక యుండునో అతని జ్ఞానము స్థిరమైనది.

ఆపత్కాలం కొరకై ధనం జాగ్రత్తచేసుకోవాలి. ఆ ధనవ్యయం చేసి దారాపుత్రాదులను కాపాడుకోవాలి. ధనంచేత, కుటుంబంచేత తనను తానుఎల్లప్పుడు రక్షించుకోవాలి.

"పెళ్ళిఎపుడు చేసుకోవాలి" అనేప్రశ్నకు వచ్చినవాట్లో చాలా గొప్పసమాధానం. "యువకుడవా అప్పుడేవద్దు. పెద్దవాడివయ్యావా అసలేవద్దు."

వ్యక్తిస్వాతంత్రమే ప్రజాస్వామ్యానికి ప్రాణవాయువు.

నేర్చుకున్నది ఏమిటో జీర్ణించుకోకుండా, జీర్ణించుకున్న ఆలోచనద్వారా నేర్చుకున్న దానికి జీవంపోయకుండా వుంటే ఆనేర్చుకునేది ఏమీవుండదు.

భార్యతో వివాదపడి ఆభార్యకు కన్నీరు తెప్పించడం మంచి పనికాదు.

మామూలు మనసుకంటె అడుగున మానవునిలో నిక్షిప్తమైన నిధిశ్రేష్టతమమైన యింకొక మనసువున్నది. మనసు పైభాగంలో మన వివిధాలోచనలు తీగలు పాగుతవి. దానిక్రింద ధ్యానయోగ్యమైన స్థానమున్నది.

కన్నీటికంటె చిరునవ్వులే భాగ్యము.

దారుణకష్టాలలో సైతం నన్నురక్షించినది ప్రార్థనయే. కేవలం నిరాశసమయములో సైతము నాకు ఆశాజ్యోతిని చూపినదియు ప్రార్థనయే. నాజీవితమునకు రక్షణయే ప్రార్థన. ఈ ప్రార్థనయే లేకున్న నాకెపుడో పిచ్చిఎత్తి వుండెడిది.

అవతార్ మెహర్ బాబా ప్రపంచానికిచ్చిన ప్రేమసందేశము. మానవులు యీప్రపంచములో మళ్ళీ మళ్ళీ జన్మఎత్తకుండా మోక్షాన్ని పొంది భగవంతునిలో లీనమై, శాశ్వత ఆనందాన్ని అనుభవించడము కోసం సర్వమానవులలో సమానముగా నిండియున్న భగవంతుణ్ణి ప్రేమించాలి. జాతితోగాని, మతంతోగాని, కులంతోగాని, వర్ణంతోగాని, భాషతోగాని, ప్రదేశంతోగాని, ఏవిధమైన హెచ్చుతగ్గుభావం లేకుండా, ఏకీభావంతో, దైవస్వరూపులైన మానవులకు ఈషన్మాత్రమయిననూ స్వార్థం లేకుండా, మానవుని త్రికరణ శుద్ధిగా ప్రేమించడమే దేవుని ప్రేమించడము.

కర్మజన్యమైన ఫలము ఈలోకములో విశేషముగా కలుగు చున్నది. కనుక మనుష్యులు కర్మఫలమును కోరుచు యింద్రాది దేవతలను ఆరాధించుచున్నారు.

ఇతరులను రక్షింపనివాడూ, యితరులచేత రక్షింపబడనివాడూ ఎవడో అట్టివ్యక్తి చాలాసుఖంగా నిద్రపోతాడు.

కుతూహలము, ఆసక్తి యింకా ఎక్కువ తెలుసుకోవాలనే కోరిక, యివి జీవితాన్ని చైతన్యవంతంగా చేసి జీవన పథాలవెంట వేరు వేరు వ్యక్తులు ఏవిధంగా వెళ్తున్నదీ మనకి చూపుతాయి.

కాలం అమృతం లాంటిది! అది అందరికి కలసివస్తుంది. అంత దాకా ఆగాలిమరి.

ఫలితము లేనివి, దురంతాలు, ఆయవ్యయాలు వీటిని విచక్షణ జ్ఞానం కలవారు తలపెట్టరు.

ఆకలి రుచిఎరుదు. నిద్రసుఖ మెరుగదు.

గుణ కర్మవిభాగమువలన బ్రహ్మక్షత్రియాది వర్ణచతుష్టయంబు నకు ఆ యా వర్ణాశ్రమోచిత కర్మలను భగవంతుడు నిర్మించి యున్నాడు. పరమార్థమునందు వానికి భగవంతుడు కర్త గాదు.

మనం ఆదర్శాలను గురించి ఆలోచించేటంతవరకూ పెరిగాము. కానీ, వాటిని ఆచరించేంతవరకూ కాదు.

నువ్వెంత మూర్ఖుడవో తెలుసుకోవాలంటే "నిన్న"ని తడివి చూసుకో.

స్త్రీ ఎంతగాఢంగా ప్రేమిస్తుందో అంత తీవ్రంగా ద్వేషిస్తుంది.

స్వార్థానికి లోబడి పురుషుడు, బలహీనత మూలంగా స్త్రీలు పొరపాట్లు చేస్తూవుంటారు.

మనిషి పర్వత శిఖరాలన్నిటిలోకి వున్నతమైన దాన్ని అధిరోహించగలడు. కాని అక్కడ నివసించలేడు.

మనిషి మనసును నరకంగా రూపొందించేది అనుమానం.

స్త్రీ ప్రేమ చేజిక్కించుకోవడానికి మొట్టమొదట కావలసిందేమిటని ఒక తత్వవేత్త నడిగితే "అవకాశమే'' అని అతనన్నాడట.

మనిషి అవినీతికి పాల్పడకూడదు. ఒక్కసారి అందులోని రుచి మరిగాడా మనిషినెత్తురు రుచిమరిగిన పులిలా మారిపోతాడు. అక్రమంగా వస్తున్న అదనపుడబ్బును చూసి తృప్తిపడడు. ఇంకా యింకా సంపాదించాలనే తపన, హితులులేరు. అహితులులేరు. తనవారులేరు, పరవారు లేరు. ఎదుటవారి బాగోగులు తనకి అనవసరం. తాహతుతో తనకి పనిలేదు. జలగలా రక్తం పీల్చడమే అతనిపని.

నడవడిక అనేది స్నేహితులు, ప్రదేశములు, పుస్తకములు, వుద్దేశములు మంచి లేక చెడు ప్రేమించుట నుండి గుర్తించవచ్చును.

తప్పులెన్నడం మొదలుపెడితే చుట్టాలంటూ ఎవరూ వుండరు.

భగవంతుని కోపము ద్వేషముగాను, బీదవాని కోపము ఎగతాళిగను తయారగును.

వ్యక్తిక్షేమమే జీవితపరమార్థం అనుకునే మానవుడు వ్యక్తిక్షేమం కోసం ఎటువంటి విషయాన్నయినా త్యాగంచేస్తాడు. తన కుటుంబం కోసం, సంఘంకోసం, ప్రభుత్వముకోసం, మానవజాతికోసం ఈశ్వరేచ్ఛను నిర్వర్తించడంకోసం తనుజీవిస్తున్నానని అతను ఎంతో నటించ

డానికి ప్రయత్నించినప్పటికీ పరీక్షాసమయం వచ్చినపుడు- యిందులో ఒక్కదాన్నితనక్షేమంకోసం త్యజీకరిస్తాడు.

వర్తమానకాలం గురించి కవిత్వం చెప్పందే ప్రవర్తనలు మార్చటం అసంభవం అనక తప్పదు.

సృష్టిమొదలైన కర్మములు భగవంతుని అంటవు. ఆకర్మ ఫలములందు భోగేచ్ఛజీవునికేగాని భగవంతునికిలేదు. భగవంతుడు యిట్టివాడని యెరింగిన కర్మానుష్టాను పరునకు కర్మఫలములు బంధకములు కాకుండును.

ఇతరులకంటె ఎక్కువగా నాకు తెలిసిన విషయ మొకటి వున్నది. అదేమనగా పెద్దలయెడ విధేయత చూపుటమంచిదని ఎరుగుదును. చెడ్డపనుల కొడిగట్టుట నీచమని ఎరుగుదును. చెడ్డను నే నెపుడూ చేయను. మంచియని తెలిసి పనిచేయుటకెన్నడూ వెనుదీయను.

భయము శత్రుత్వానికి దారితీస్తుంది. భయమువలన కలిగే ఒక ఫలితమేమిటంటే నాయకులకు లొంగిపోవుట, యిట్లులొంగిపోవుటవలన మనిషిస్వతంత్రంగా ఆలోచించే శక్తిని, బాధ్యతను స్వీకరించే శక్తిని

మనతాతముత్తాతలు ఏంతెంతధనాన్ని సంపాదించినప్పటికి మన కష్టార్జితమైన ఒక్క గవ్వతో అది సమముకాదు.

మీరు మీకార్యభారము వైపుకేంద్రీకృత దృష్టిలోవున్న సందర్భంలో చుట్టూవారి అభిప్రాయాలు పరిగణించడం అవసరం. ఇంత కష్టపడి ప్రయత్నించి కూడా ఒక్కొక్కసారి అపజయం పొందుతాము. కాని నిరుత్సాహం చెందకూడదు.

ప్రతిమనిషి జీవితంలో తెలిసో, తెలియకో ఏదో తప్పుచేస్తాడు. ఆ ఒక్క సంఘటనతోనే అతని మంచి చెడ్డలను నిర్ణయించలేము.

లోక ప్రేమనినను మననిర్మలతపై ఆధారపడి యుండును. మన హృదయం కళంకితము కానంతవరకు లోకప్రేమనుకొన్ననూ జడియ వలసిన అవసరంలేదు.

నిర్మలమైన మనస్సు, త్యాగబుద్ధి, శౌర్యం, సుఖదుఃఖముల పట్ల సమానత్వం, దాక్షిణ్యం, అనురక్తి, సత్యనిష్టయివి సజ్జనుల లక్షణాలు.

లోకంలో రెండు రకాల గ్రుడ్డివాళ్ళుంటారు. కళ్ళులేనివారిని గురించి ఆలోచించ నవసరంలేదు. రెండు కళ్ళున్నా చూడలేని వాళ్ళు యితరులను మోసగించడమేకాక తమ్ముతామూ మోసగించుకుంటారు.

మనం సంకల్పించుకున్న కార్యాన్ని ఏవిధంగా నెరవేర్చాలో తెలుసుకుని దానిని జయప్రదంగా నిర్వహించడానికి తగిన శక్తిని చేకూర్చుకుని, కట్టుదిట్టమైన రక్షణ ఏర్పాటు కనిపెట్టి చేయకలిగి నప్పుడు మనపైన శత్రువులకుగల శత్రుత్వం దానంతట అదే సమసి పోతుంది.

త్యాగము, సేవలను ప్రతివారును మహోత్తమాదర్శములుగా భావించవలయును.

ముముక్షువులాచరించెడు కర్మాకర్మ విషయములలో కర్మమెట్టి దనియును, అకర్మ మెట్టిదనియును ఎరుంగజాలక విద్వాంసులు సయితము మోహితులై యున్నారు. కనుక మానవునకు అత్యంత వ్యామోహము కలుగును.

ఎవరితోనూ ఎప్పుడూ కలహించవద్దు. జీవితంలో ఏదైనా సాధించాలని కోరేవారికి ఎవరికి వ్యక్తిగతమైన కలహాలు పెట్టుకొన డానికి తగినంత వ్యవధి ఉండడం కష్టం. కుక్క ఎదురైతే పక్కకి తొలగి దారియివ్వండి. కుక్కచేత కరిపించుకొనడంకన్న దాని దారిలో నుంచి వైదొలగడం మంచిది.

శాంతంతో సమానమైన తపస్సులేదు. సంతోషంకంటె సుఖం లేదు. తృష్ణనుమించిన వ్యాధి, దయనుమించిన ధర్మం లోకంలో లేవు.

స్వాతంత్ర్యానికి కట్టుబాట్లు వున్నాయేకాని సరిహద్దులులేవు.

కొందరు నేను నాకోసం బ్రతుకుతున్నానని, కొందరు నావల్ల ప్రపంచానికి కొంతమేలువున్నది. కాబట్టి అందుకోసం బ్రతుకుతున్నా నని అంటారు. కానీ చావాలని అనుకునేవారు ఎవ్వరూలేరు. నాకోసం నేను అనేవారు బ్రతుకుతారు. కానిరెండో వర్గానికి చెందినవారు ప్రపం చానికి తమ ఉనికి ద్వారా, పనిద్వారా సహాయపడుతూ అపరిమితమైన ఆనందానుభూతిని పొందుతుంటారు. అదిగర్వించదగ్గది. మనుషులలో మూడోరకం అన్నది లేనేలేదు.

మనకెప్పుడూ తగినంతకాలం ఉండనే ఉంది. అయితే మనం అది జాగ్రత్తగా వినియోగించుకోవాలి. అంతే.

ప్రేమించనివారే భంగపడడానికి అర్హులు.

ఇతరులకు యిచ్చుసలహాలు నీవే అనుసరించుట జీవితంలో విజయవంతమగుటకు మార్గదర్శియగును.

ఒక్కనిముషము కోపాన్ని నిగ్రహించుకుంటే జీవితమంతా పశ్చాత్తాప పడవలసిన అవసరంరాదు.

ధనం సంపాదించడంలో దుఃఖము. దానిని రక్షించుకోవడంలో దుఃఖము. అదిపోతే దుఃఖము. ఖర్చయితే దుఃఖము. ఇన్నివిధాలుగా దుఃఖకారణమైన ఈడబ్బు లోకాన్ని ఎంత వ్యామోహ పరుస్తూంది.

దేహం ఆత్మకు బంటు, చెరసాలకాదు.

వేరువేరు దృక్పథాలుగల వ్యక్తులమధ్య కుర్రవాడు తన వూహాపోహలు చక్కగా పెంచుకోగలుగు తాడు.

కవి కోరేమెప్పు గండపెండేరముకాదు. సమాన ధర్మాల హృదయ స్పందనం.

శాస్త్రవిహితంబగు కర్మము యొక్క యథార్థమును, శాస్త్రనిషిద్ధ కర్మముయొక్క యదార్థమును, కర్మరహిత తూష్ణీభావమైన అకర్మము యొక్కయు యదార్థమును తెలిసికొనుట అసాధ్యంబైయున్నది.

ఒకలక్ష్యం లేని జీవితంకన్న దుఃఖ భూయిష్టమైనది ఈలోకంలో మరిలేదు.

చెడ్డపేరు వచ్చిన వ్యక్తిని అప్పుడే సగంవరకు ఉరితీసారన్న మాటే.

ఆకాంక్షింపని మానవాత్మలు ఆభగవంతుని వైఫల్యాలు.

భగవంతుడు అందరిలోనూవున్నాడు. కాని ప్రతిమనుష్యుడు భగవంతునిలో లేడు. మనుష్యులు విశేష దుఃఖమనుభవించుటకిదే కారణం.

ప్రపంచము లేక సంఘము మనల్ని దూషిస్తే మనము విసుగు చెందక దూషణకు మూలకారణం కనుగొని సత్యమును తెలుసు కొనుట మంచిది.

పండ్లతో నిండియుండిన చెట్టువంగి యుండును. కనుక నీవు గొప్ప వాడవు కాదలచుకుంటే వినయం కలిగియుండుము.

ఆకలిగొన్న జీవులకు ముందు తృప్తిగా భోజనం పెట్టి ఆతరువాత మాత్రమే నీవు భుజించుము.

ఆడుదాని బుద్ధి అపర బుద్ధి.

అవకాశం చాలా అరుదుగావస్తుంది. కనుక విజ్ఞులెవ్వరు అవకాశం చెయ్యిదాటి పోనియ్యరు.

బిచ్చమెత్తి అయినా మంచిపనులు చెయ్యి.

సూర్యచంద్రుల యందు కాంతివలె సమస్త వేదములందు ఓంకారమువలె అంతటనూ భగవంతుడు నిండియున్నాడు. నిశ్చల మనస్సుతో కూడిన నిర్మలమయిన భక్తే భగవంతునికి పూజా పుష్పము.

డబ్బు సంపాదించిన వాళ్ళనే మనం గౌరవిస్తాము. అధికారమిస్తాము. సభాపూజ్యత యిస్తాము. వారుచేసే అవినీతులను చూసీ చూడనట్లు ఊరుకుంటాము. వాళ్ళుపేలే అవాకులూ, చవాకులూ విని సంతోషించినట్లు నటిస్తాము.

చెడుఅంటే ఏమిటో తెలియనివారు దానిని ఊహించలేరు.

ధనవంతుడుమీద బీదప్రజచేసే యుద్ధమంతా ఒక దగా.

కర్మమును అకర్మముగాను, అకర్మమును కర్మముగాను చూచువాడు మనుష్యులలో జ్ఞానవంతుడును, శాస్త్రోక్తములైన సకల కర్మలను చేసినవాడును యోగియునగును.

''నేర్చుకోవలసిందంతా నేర్చుకున్నాను. నా విస్థిరమైన అభిప్రాయాలు: వాటిని మార్చుకోవలసిన అవసరంలేదు. నేను మారదలచు

కోలేదు." అని అనేటటువంటి మనిషి లోకపరివర్తనకి ఒకవిధంగా అంధుడు.

సాటిలేని సహనంగల భార్య ఎల్లపుడు విజయాన్నే సాధిస్తుంది.

ఒకమంచి పనికి అడ్డంకులు వచ్చినపుడు ధైర్యంగా ఎదురు నిలవాలి. కాని తప్పుచేస్తున్నట్లు ఒదిగిపోవడం తెలివైన పనికాదు.

నెలరోజులు గ్రంథపఠనంతో సంపాదించే జ్ఞానాన్ని పండితుడితో గంటకాలం సంభాషించడంతోనే సంపాదించవచ్చు.

అకలంకమైన హృదయం కన్నా అభేద్యమైన కవచం ఏముంది?

సజ్జనుని కోపం నీటిమీదగీచిన గీతవలె క్షణభంగురమేగాని చాలసేపు వుండదు.

సత్యము గంభీరము, మధురమైనది. సత్యము పాపమునుంచి నిన్ను బయట పడవేయగలినది. సత్యమునకు మించిన రక్షకుడు లోకమునలేనేలేడు.

దయార్ద్ర మైన హృదయము కోసం స్త్రీ కష్టాన్ని, సుఖాన్ని సమానంగా భరించగలదు.

దేనితోనో ఒకదానితో సంఘర్షణ పడుట మానవనైజం. మానవుడు తనలో తానుగాని, ప్రకృతితో గాని, సాటి మానవులతో గాని, సంఘర్షణ పడుతూ వుంటాడు.

లోకంలో కొందరెప్పుడునూ దుఃఖపడుచునే యుండవలెననియే భగవదిచ్ఛ యనియు, ధర్మమనియు బోధించువారు కేవలం వంచకు

లనియు, భగవత్సంకల్ప మాత్రప్రకారముగా నుండుట అపచారమనియు జ్ఞానలేశముగలవారందరూ తెలుసుకొనవలెను.

కొత్తకొత్త వింతవార్తలకోసం ఆరాటపడే మనుషులు వింతలలో కెల్ల వింతయై తోచే నిరంతన సత్యమేదో తెలుసుకోడానికి వీసమైనా యత్నించటంలేదు.

ఫలాపేక్షయును కర్తృత్వాభిమానంబులును లేక సమస్తకర్మలను చేయుచున్న యథోక్తదర్శియైన పురుషుడు ఆత్మజ్ఞానాగ్ని చేత సకలశుభాశుభకర్మలను దహించిన వాడని తత్వజ్ఞులు చెప్పుదురు.

యితరులెట్లు నడచుకోవలెనని నీవు కోరుకొందువో ముందుగా నీవట్లు నడుచుకొనుము.

అల్పులమనస్సు సంపద కలిగినప్పుడు కఠినంగానూ. ఆపద లందు జావకారిపోతూ వుంటుంది. ఇనుము చల్లగా వున్నపుడుకఠినము గానూ, కాలివేడిగావున్నపుడు మెత్తగాను వుండడం చూస్తున్నాముగదా.

మన ఆర్థికవ్యవస్థలో మూలమట్టమైన మార్పులు రానినాడు స్త్రీ సమస్య పరిష్కరించబడదు. ఆర్థికవ్యత్యాసాలను నశింప చేసినప్పుడీ స్త్రీ సమస్యపరిష్కారమవుతుంది.

పెద్దమనిషి తరహా దైవికమైన లక్షణం. పెద్దమనిషి తరహా అంత శక్తివంతమైనది మరొకటిలేదు. బలాన్ని మించిన నిదానంలేదు.

యవ్వనంలో విలాసాలలో మునిగి తేలినవ్యక్తి వృద్ధాప్యంలో ఉన్నతమనస్వికావడం నేనెరగను.

నానాయాతనలు పడి భగవంతుని నిర్వచించాలని పూనుకొన కుండావుంటే అతనిని మనం సులభంగా తెలుసుకొన గలుగుతాము.

అంధుడు గోతిలోపడితే లోకులు వాణ్ణిలేవదీయడానికి పరుగెత్తుతారు. కాని కామాంధుడు గోతిలో పడితే వాణ్ణి అందులోనే పూడ్చిపెడతారు.

మనసును మురిపించే శక్తిసంగీతంలో వుంది.

బిడియమూ, పిరికి తనమూ కూడా అంత ప్రమాదకరము కావు గాని ఆత్మవిశ్వాసాన్ని చెడగొట్టేందుకు మాత్రం ఎంతగానో పని చేస్తాయి.

ఎండలో తిరిగిన తరువాతనే నీడసుఖము తెలుస్తుంది.

ఏపురుషుడు కర్మఫలాపేక్ష లేనివాడునూ, ఆత్మయందే నిత్యతృప్తుడునూ, నిరాశ్రయుడునై యుండునో వాడునిత్య కర్మానుస్థానమునందు ప్రవర్తించినను ప్రవర్తింపని వాడేయగును.

ప్రవాహమును మరలింప శక్యంగానట్లే గతజీవితమును మరలింప సాధ్యంకాదు. మానవుని అభీష్టముననుసరించి భవిష్యజ్జీవితమును సుఖమయం చేసుకొనుటకు ప్రయత్నించవలెను.

ఏకాలానికి ఏదిధర్మమో అదితెలుసుకొని వ్యవహరించక తప్పదు

ధర్మానికీ, న్యాయానికీ ఎన్నటికీ చావులేదు. అధర్మాన్ని శిక్షించదలచినవాడే ధర్మాన్ని రక్షిస్తాడు.

వ్యతిరేకమైన పరిస్థితులే వ్యక్తులసంస్కారాన్ని మానవత్వాన్ని మేల్కొలుపుతాయి.

లోతుగా ఆలోచించి దుఃఖాన్ని అర్థంచేసుకున్నట్టయితే దానిని భరించి ఎదుర్కొనడంలోనే మహత్తరమైన నైతికబలం వున్నదని బోధపడుతుంది. దురదృష్టపు ఆఘాతాలను భరించువాటిని గడిచి గట్టెక్కడానికి ధైర్యాన్ని, యిచ్చేది నైతికశక్తి.

అనాసక్త కర్మ శక్తిప్రదమైనది. అదే భగవంతునిపట్ల కలిగే భక్తితో సమమైనది.

రాపిడిలేనిదే రత్నం ప్రకాశించదు. అలాగే కష్టాలను తట్టుకోలేని మానవుడు ఏనాటికీ పరిపూర్ణతను పొందలేడు.

ధర్మప్రబోధానికి ఆమడదూరం పారిపోయే మనిషి కమ్మని కవిత్వమంటే చెవికోసుకోవచ్చు.

జ్ఞానరహితమైన ప్రతిష్ఠ బలహీనమైనది. నిరుపయోగ మైనది.

శరీరానికిగాని, మనస్సుకుగాని మితిమీరి పుష్టికలిగించబూనడం నష్టదాయకము.

ప్రేమతత్వమే ముక్తిమార్గము.

తామర సమీపమునను ఁడు మండూకము తామరలోని తేనెను ఎరుగదు.

స్త్రీ అయి జన్మించడం నిజంగా భయంకరమైన విషయం. కారణం. వారెల్లపుడూ పురుషులతోనే వ్యవహరించాలి.

అనుకరణం అనవసరం. అంతేకాదు అనర్థకము.

ఆగ్రహం చాలా ఖరీదైన విలాస వస్తువు. ఎక్కువ రాబడి వున్నవాళ్ళు ఆగ్రహపూరితులు కావచ్చు.

ఫలాపేక్షారహితుడై చిత్తేంద్రియంబులను వశము గావించుకొని సకల ప్రాకృత విషయములందును అభిమానరహితుడై శరీర పోషణ మాత్రోపయుక్త కర్మను చేయువానికి సంసార బంధములంటవు.

వ్యక్తిత్వం పోగొట్టుకున్నవాడు సర్వాన్ని పోగొట్టుకుంటాడు.

గతించిన ఉషస్సులకు మనము చెందిన వారము కాదు. కాని భవిషత్ మధ్యాహ్నములకు వారసులము మనము.

ప్రతివ్యక్తికీ సిగ్గుపడవలసిన విషయం ఏదో ఒకటి ఉంటుంది.

కృషినుంచి ఆరోగ్యం, ఆరోగ్యంనుంచి సంతుష్టి వుత్పన్నమవుతాయి.

స్త్రీ ప్రేమించిన ప్రియుణ్ణిగాని, పెండ్లిచేసుకున్న భర్తనుగాని తనఅధుపాజ్ఞలలో వుంచుకోవాలని కోరుకుంటుంది. అతనెప్పుడూ తన గీసిన గీతదాటనీయకుండ నిరంకుశంగా పరిపాలించడమునే ఆమె సదాకోరుతూవుంటుంది. యిది స్త్రీహృదయములోని ప్రబలవాంఛ.

తత్వబోధకులు ప్రజలకు ముందుగా నన్నపానీయాది సౌకర్యములుకల్పించి తరువాత బోధలు చేయవలెను, ఆకలిచే నలమటించు వారికి చేసిన బోధలు బాధలగును. భారతీయ విజ్ఞాన నిక్షేపములగు వేదములను సంరక్షించెడి బ్రాహ్మణులను, పండితులను నిందింపరాదు.

ఎవరిపని వారేచేసుకొనవలెను.

భార్యాభర్తలమధ్య ఎడబాటు మమతాకారాలను పదునుపెడుతుంది.

సంతోషమనేది నీడనుసృష్టించిన అతిసన్నటి సూర్యకిరణములాంటిది. కానిదుఃఖంవరదల్ని సృష్టించే జడివాన.

జీవితంపట్ల సుఖదుఃఖాల రెండింటిని సమపాళ్ళలో స్వీకరించే సహృదయతను, సమధికోత్సాహాన్ని మనంకలిగివుండాలి,

అవధిలేని జీవితపు అవగాహనమే నిజమైన జీవితావధి.

''లేదు; కాదు'' అని చెప్పడం నేర్చుకోని మానవుడు ప్రతి క్షణమంతకాలం అసత్యవంతుడుగా కాకపోయినా బలహీనుడుగానే పరిగణింపబడుతాడు.

వరిచేనుకు పెట్టిన నీటివల్ల కలుపుకూడా బ్రతుకుతుంది. అలాగే మంచివారివల్ల చెడ్డవారుకూడా లాభం పొందుతారు.

కోరికలేక యాదృచ్ఛిక ద్రవ్యలాభముచేత తృప్తినొంది, సుఖ దుఃఖములను సహించి మాత్సర్యము లేనివాడై ఫలము సిద్ధించినను, సిద్ధింపక పోయినను మనస్సు చలింపక కర్మను చేసినవానికి కర్మ బంధము రానేరదు.

మనస్సును అదుపులో పెట్టుకోలేని వారెవ్వరూ వ్యాపారం లోనికి దిగకూడదు.

మానవజాతి తప్పుల, నేరాల, దురదృష్టాల పట్టికకంటె కొంచెం ఎక్కువ వివరాలు గలదే చరిత్ర.

తమని గౌరవించడం లేదని ధనవంతులని నోళ్ళు కొట్టుకుం టారామరి? తనకన్న బీదవాడిని వాడు గౌరవిస్తాడేమో కనుక్కోండి.

జాగ్రత్తగా మాట్లాడు. శుభప్రసంగాలు చేయి. ఎవరితోటి శుష్కవైరాలు, వ్యర్థవివాదాలు పెట్టుకోవద్దు, ఏడ్పునుచూచి సంతో షించడంకన్న సంతోషాన్ని చూచి ఏడ్వడం మెరుగు.

శాశ్వతము, సర్వోత్కృష్టమునైన పరమసత్య సందర్శనము, ఆవిష్కరణ, మానవజాతి సమైక్యము — ముఖ్యమతాల కన్నిటికీ మూలసూత్రాలు.

దేశమును మంచిదశకు తీసుకునివచ్చి లోకములో ప్రఖ్యాతి కెక్కడు దేశములలో ఒకదాన్నిగా చేయవలెనన్నచో మొట్టమొదట సామాన్యజనుల స్థితిని బాగుచేయుటకు ప్రయత్నించవలెను.

వయస్సుకు కొలబద్ద సంవత్సరాలుకాదు - స్వభావం. స్వస్తత. కొందరు ములివగ్గులు గానే వుద్భవిస్తారు. మరికొందరు మునలి వాళ్ళు కారు.

నిరాడంబరత్వము, నిరాడంబరత్వము, నిరాడంబరత్వము - యిదే ఏకైకలక్ష్యం కావాలి. తక్కువ సౌకర్యాలతో యెక్కువ ఆదర్శాలను అందుకోగలవాడే విశిష్టవ్యక్తి.

ఆత్మేతరవస్తువులందు ఆశక్తి రహితుడై ప్రకృతి సంబంధ విముక్తుడై, ఆత్మజ్ఞానమందు స్థిరబుద్ధి కలిగి, యజ్ఞాది కర్మలను చేయువానికి ప్రాచీన కర్మలన్నియు నిశ్శేషముగానశించి పోవును.

ఇతరులను కష్టపెట్టడం వలన మనకు సౌఖ్యంరాదు. ఇతరులతో సౌమ్యంగా కలసిమెలసి తిరుగుట నేర్చినపుడే మనకు సుఖము, ఆనందం లభిస్తాయి.

సమర్థుడైన ప్రతివ్యక్తి ఏదో ఒకఆశయం పెట్టుకుని కృషి చెయ్యాలి. యీ కృషి గట్టిగా జరిగితేనే ఫలిస్తుంది.

నీవొక ఘాతుక మృగాన్ని మచ్చిక చేసుకోవచ్చును. అడవి అంతా కాలిపోగానే కార్చిచ్చు క్రమంగా చల్లారిపోతుంది. కాని నీవన్న చెడ్డమాటను నిరంతరపరిణామం మాత్రం రవంతైనా అరికట్టలేవు.

తల్లి దండ్రులతో తీయని మాటలు ఆడుతూ వారికి ప్రియం కలుగజేస్తూ ప్రతిజ్ఞాపాలనచేసే కొడుకే కులపావనుడు.

గృహస్థాశ్రమంలో ఒకటీరెండబద్ధాలు ఆడవలసి వస్తుంది. కాని అవి ఎవరికీ అపకారం చేయకపోతే తప్పులేదు.

బ్రహ్మరూపసాధనంబుచేత బ్రహ్మమనెడి హవిస్సు బ్రహ్మాగ్ని యందు బ్రహ్మరూప కర్మచేత హోమము చేయబడుచున్నది. యిట్లు బ్రహ్మ స్వరూపంబుగా ధ్యానించుటచే పొందదగిన ఫలంబ్రహ్మమేను.

విందు సమయములో మూగనోముపట్టే మూర్ఖుడుండడు.

చిన్నవిషయాలలో భార్య నిర్ణయం పాటించాలి. పెద్దవిషయాలలో భర్తనిర్ణయం పాటించాలి.

చెడ్డపేరు వచ్చిన వ్యక్తిని అప్పుడే సగం ఉరితీసారన్నమాటే.

పుట్టుకనుంచి మానవుడు, కష్టాలు కవలపిల్లలు.

భగవంతుడు సర్వాంతర్యామి కాలేడు. కనుక మాతలను సృష్టించాడు.

ఆ జీవించుచున్న సత్యస్వరూపియైన క్రీస్తుతప్ప మీ జీవితమును నీయంతట నీవే జయవంతమైన దానిగా చేసుకొనజాలవు. అంతమాత్రమేకాదు. నీ సృష్టికర్తయయిన క్రీస్తుకు వ్యతిరేకముగా జీవించుచున్నావు. ఆ పాప జీవితము పోవునట్లు నీ దేవుడైన క్రీస్తుతో సమాధాన పడుము. నీవు పశ్చాత్తాప పడి మారు మనసునొంది నీ పాపము క్రీస్తు యేసు యెదుటనొప్పుకొనుము. (బైబిలు)

మానవుడికి తనకు ఆశక్తిదాయకమైన ఒక విషయాన్ని గురించి సంపూర్ణంగా తెలుసుకొనడానికి యీ జీవితకాలం నిజానికి చాలదు యవ్వనంలో కాలాన్ని దారుణంగా వృధాచేస్తాము.

మంచిచేయాలి; మంచిని పెంచాలి.

ఏ కత్తీ గాయపరచలేనంత తీవ్రంగా ఒక చెడుమాట గాయపరుస్తుంది.

ప్రతి పనికి వెనకాముందూ వుంటుంది. క్రమబద్ధములో నడిచేది జీవితమే కాదు.

ఆరోగ్యప్రదము, ఆనందకరము అయిన కుటుంబవ్యవస్థలో స్త్రీ పురుషులు పరస్పర పూరకశక్తులు. ఈ యిరువురి ఉన్నతి, అదః పతనము జంటగానే వుంటాయి.

అమాయకత్వమూ, బలమూ యెంత పెరిగితే అంత శీఘ్రంగా మనకు విజయం లభిస్తుంది.

పాపాల కుబుసం విడిచిన పాములాంటివాడు ఋషి.

క్షమవల్ల క్రోధద్వేషాల దుష్పరిణామము, అనవసరమైన శారీరక మానసికాయాసం తగ్గుతాయి.

అనృతము పలకడమే ప్రధానధ్యేయముగల వ్యక్తులు లేకపోలేదు.

కర్మయోగులు కొందరు యింద్రాది దేవతారాధనారూపమైన యజ్ఞంబును కర్మంబుగా నాచరింతురు. మరికొందరు జ్ఞానులు బ్రహ్మమనెడి యజ్ఞ విధానాగ్నియందు హవిస్సు మొదలగు సాధనములచే ఆత్మను సమర్పింతురు.

ఇంతకుముందు ముగ్గురు మిత్రులనుండి విడిపోయిన వ్యక్తికి నీవెన్నడూ నాల్గోనేస్త కావద్దు.

జ్ఞాన హీనుడికి వెలుగు చూపాలి. కాని చదువుకున్నవారికి యింకా యెక్కువ వెలుగు చూపాలి. యెందుకంటే యిప్పటి చదువుకున్న వారికి అహంకారం యెక్కువ.

ప్రతి మనిషి జీవితం భగవంతుడు స్వయంగా వ్రాసిన విచిత్ర కథ.

అజీర్ణం సృష్టించిన నిశా శిశువులే స్వప్నాలు.

కప్పలను మ్రింగే తెలివితేటలుగల పాములు ఎన్నో ఉన్నాయి. ఈ భూమినంతా మోయగల సమర్థుడగు శేషుడు ఒక్కడే వున్నాడు.

ఈనాడు వివిధ దేశాల సరిహద్దుల్ని నిర్ణయించేది ఆయాదేశాల ఆర్థిక, సైనిక బలాలుగాని నదులు, పర్వతాలు కావు.

ఏవాడ చిలుక ఆవాడ పలుకు పలుకుతుంది.

వస్తూపోతూ వుంటేనే బంధుత్వం జీవం పోసుకుంటుంది, లేకుంటే వాడిపోతుంది.

నిరుపేదతనమూ నిత్యవ్యాధులూ కాదు. భయంకరమైనవి. ఒక మనిషి తనతోడి మనిషియెడ చూపుచున్న క్రౌర్యం.

జలబిందువులన్ని చేరి సాగరమయినట్లే మైత్రితో స్నేహ సాగరం సృష్టించగలము. ప్రతిమానవుడు పరస్పర మైత్రితో వ్యవహ రించి నట్లయితే ప్రపంచమే పూర్తిగా మారిపోతుంది.

పాలను ఎంతకాచినా రుచిపోదు. శంఖాన్ని కాల్చినప్పటికి మన్నాన్నిస్తుంది. గొప్పవారు కష్టాలలోకూడా తమ గొప్పతనాన్ని కోల్పోరు.

జ్ఞానయజ్ఞము చేయువారు కొందరు శ్రోత్రాది యింద్రియములను సంయమాగ్ని యందు హోమంబుగావింతురు.కొందరు యోగులు యింద్రియ నిగ్రహాగ్నియందు శబ్దాది విషయంబును హోమము చేయుదురు.

జీవితము ముళ్లబాట.

నాలుక పొడవు మూడుఅంగుళాలే అయితేనేమి అది ఆరు అడుగుల ఎత్తుగల మనిషిని చంప గలుగుతుంది.

ఒకరియింటికి వెళ్లినపుడు మొదటిసారికాదు - రెండోసారి - వారి పిల్లలు మనయెడల ప్రవర్తించే తీరునుబట్టి మనయందు ఆయింటి పెద్దలకి ఎంత ఆదరముందో తెలుసుకోవచ్చు.

మతసారాంశాలలో భేదములేదు. దారులు వేరైనా గమ్యస్థానం ఒక్కటే.

ఒకవ్యక్తి అదృష్టం అతనుకూర్చుని ఉన్నపుడు కూర్చునే ఉంటుంది. లేచినపుడు లేస్తుంది. నిద్రించే సమయములో నిద్రించి ఉంటుంది. కదిలినపుడు కదులుతుంది.

అతిగా మాట్లాడుతూ స్వల్పంగా ఆలోచించే వ్యక్తిమాటలతో తనమనస్సును ఖాళీచేసుకుంటాడు. అలాంటివాడు పురుషుల్లో మూర్ఖుడుగా పరిగణింపబడతాడు.

త్యాగమయ జీవితంలో ఎంతో ఆనందం ఉన్నది.

సోమరితనములోనే నిస్పృహకు శాశ్వత నివాసం.

విషాదాన్ని అందరు అర్థంచేసుకోగలరు; అది ఆవరించినవారు తప్ప.

పవిత్రజీవనులు ప్రపంచ వ్యవహారములను అసలుపట్టించుకొనకపోరు. వస్తుమయ ప్రపంచాన్ని పూర్తిగా వదలి వేయరు. కేవలం భగవత్ ధ్యానంలోనే కాలం గడపరు. వారు ప్రపంచములో ఒక భాగము మాత్రమేకాక అందుకు మూలమౌతారు.

కాయపుష్టి కలిగి పాటుపడగలశక్తిగలవాడికి దానముచేసి సోమరి తనమునకు ప్రోత్సాహం కలిగించుట పాప హేతువు.

కవిత్వం మేల్కొల్పాలిగాని జోగొట్టకూడదు.

వెయ్యితుపాకి గుండ్లకంటె భయంకరమైనవి శత్రుత్వము వహించిన నాలుగు వార్తాపత్రికలు.

సులభంగా గడించేడబ్బు సులభంగా వ్యయపడినట్టే సులభంగా సంపాదించిన జ్ఞానం కూడా సులభంగానే మాయమౌతుంది.

మగవాడు సంపాదన పరుడైతేనే అందరిచేత గౌరవింప బడతాడు.

ప్రపంచంతో మనసంబంధం విజ్ఞానంద్వారా కాక అనుభవం ద్వారాకలుగుతుంది.

ఇస్లాం అర్థమునుబట్టి ముస్లిములు దేవునిఆజ్ఞలయందు విధేయత కలిగియుండవలెను. దానిచే ఇహపరములందును రక్షణ ముక్తి లభించును. ఇస్లాంలోకమునందు శాంతిని సంధిని కూర్చును,

స్వయం పంయమనశక్తి సదామంచిదికాదు. అదిమనశక్తిని సృజనాత్మక శక్తిని క్షీణింపచేస్తుంది.

సాహిత్య నిరాడంబరత సాధించుకో వలసిందేకాని సహజసిద్ధమైనదికాదు.

పొదుపుగా సుఖంగా జీవించాలనుకుంటే నీకువచ్చే ఆదాయానికి రవంతతక్కువగా ఖర్చుచేసుకో.

నేడుప్రపంచానికి కావలసినది ఏసుక్రీస్తు అనేవ్యక్తి. ఆవ్యక్తిని ప్రతిమానవుడు, సంఘము, ప్రపంచముకూడా ప్రభువుగా అంగీకరించాలి.

మహాకవుల కావ్యాలను మానవులు యింతవరకు ఆకళించుకో లేదు. వాటిని ఆధ్యయనంచేసి అవగాహన చేసుకోగలవారు సాధారణ మానవులుకారు. మహాకవులే.

మానవుల్ని నమ్మని వారికంటె నమ్మినవాడు తక్కువ తప్పులు చేస్తారు.

ఏ ప్రాణి విషయము నైనను కనికరమును చూపలేక ఎవడు హింసించుచు వానికి బాధకలుగ చేయునో అతడు బహిష్కరింపబడిన అస్పృశ్యునితో సమానము.

గ్రంథాలు నిమ్మకు నీరెత్తినట్లుగా మనసున పనిచేస్తాయి. కాని ప్రపంచములో వీటి ప్రభావం చాలగొప్పది. ఇవి నిశ్శబ్దంగా కోట్ల కొలది జనాన్ని ప్రేరేపించి దేశాల స్వరూపాల్నే మార్చివేస్తాయి.

కర్మయోగులు కొందరు ఆత్మసంయమ మనెడి యోగాగ్నియందు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ సమస్త వ్యాపారములను ప్రాణాది దశ. వాయువులు బహిర్వ్యాపారంబులను హోమంబు గావింతురు.

చిన్న విత్తే మహావృక్ష మవుతుంది.

లోకానికి శ్రేయస్సును సాధించడమే సాహిత్యానికి పరమార్థము.

అన్ని విధములుగా గొప్పవానిగా తన్నుతాను స్తోత్రము చేసు కొనుటయు, యితరులను నిందించుటయు ఏహ్యాభావముతో చూచుటయు తగదు. ఇతరుల క్షేమాన్ని తనక్షేమముగా భావించువాడే సత్పురుష డగును.

"మనకేమిలోటండీ! బోలెడుంది. మరేమి బాధ పడనక్కర్లేదు" అని ధైర్యమైన మాటలతో భర్తకి ఆసరాగా నిలబడిన మనిషే ఉత్తమ ఇల్లాలు. తేలికమాటలు మాట్లాడి భర్తను కించపరచి, కృంగదీసే భార్య తానేదో ఆధిక్యత సాధించాననే వెర్రిభ్రమలో పడుతుంది.

మనిషిని దారుణంగా లొంగతీసుకునేది పొగడ్త.

మూర్ఖుని లోపాలు లోకానికి కనిపించకుండ చేసే అడ్డు తెర వంటిదే సువర్ణం.

ప్రేమించిన యువతికి ప్రాణం యిచ్చేయెడల బావుంటుంది. కాని ఆమెతోకలసి జీవించడం చాలాకష్టం.

మనస్సు నిర్మలంగా. శరీరం ఆరోగ్యంగా ఉండాలంటే వాగుడుమాట తలపెట్టకు.

చేతనత్వం, పురోగమనమే జీవలక్ష్యం.

నోరుమంచిదైతే వూరుమంచిదౌవుతుంది.

మానవుని దారులశత్రువులు అతనుచేసిన నేరాలే అతనుత్రవ్వుకున్న గోతులోనికి నడిపించే వరకూ అవి అతన్ని నీడలా అనుసరిస్తూవుంటవి.

కొందరు పుణ్యతీర్థాదులందు ద్రవ్యదానంబును యజ్ఞముగాను, కొందరు వ్రతోపవాసములను యజ్ఞముగాను, కొందరు ప్రాణాయామాదియోగమునే యజ్ఞముగాను, కొందరు వేదపారాయణమునే యజ్ఞముగాను, కొందరుకఠినమైన దృఢవ్రతమునే యజ్ఞముగాను చేయుచుందురు.

జల్లెడవలె దుఃఖం- బ్రతకాలనుకునే మానవుల నొకవైపు, చావాలనుకునే మానవుల నొకవైపు చేసి వేరుపరుస్తుంది.

ఆవేశపరులకు బ్రతుకొక బ్రాజెడి, ఆలోచించేవారి కది కామెడి.

విశాలాకాశపు టంచులలోగానీ, విశాలసముద్రపు లోతులలోగానీ, మృత్యువుతో సైతం ముఖాముఖి పోరాడగల్గిన ఉక్కుపిడుగులే ఈనాడు మనదేశానికి కావాలి.

సోమరితనం ముష్టికి నాంది. దౌష్ట్యానికి నాంది.

బాల్యమందు విద్యాభ్యాసం చేయాలి. యవ్వనంలో పెళ్ళాడి డబ్బు సంపాదించి కుటుంబపోషణ చేయాలి. ప్రౌఢవయస్సులో ధర్మ కర్మలను ఆచరించి వార్ధక్యంలో సన్యసించాలి.

అన్నిమతాల గమ్యం చివరకు ఒక్కటే.

కోర్కెలను జయిస్తే వచ్చే శాంతితో ఆలోచనలనుంచి విముక్తుల మైనాక కళాజగత్తు కల్పించిన సౌందర్య దర్శనముతో క్షుద్రజగత్తుని తొంగదీసి కోవాలి. జరిగినవాటికి చింతించక ధైర్యంగా ఉండటమే జ్ఞానం.

అవకాశాలు వదలుకుంటే మిగిలేది పశ్చాత్తాపమే.

అస్తికుడని ప్రజలను మోసగించుటకంటె బాహాటముగా నాస్తికు డగుటయే మంచిది.

నీదేశం కోరుకునేది వీరులను మాత్రమే.

హిమాలయాలలో దృఢముగా నిలిచి సత్యశక్తితో, నవ చైతన్యంతో పోరాడేవారే తమ దేశమాతకు ముద్దుబిడ్డలు.

కనపడని దేవుని ప్రార్థించే పెదవులకంటె కనపడే తోటివారికి సహాయముచేసే చేతులు మంచివి.

తాతలనాటి పాత యిళ్లలో కునికిపాట్లు పడుతూ కూర్చోకు. ప్రపంచం ముమ్ముందుకు సాగిపోతుంది. దానితోపాటు నీవుకూడ ముందుకు అడుగువెయ్యి.

గయ్యాళి భార్యకలవాడు ఎటువంటి కష్టాన్నైనా తృణప్రాయంగా భావించ గలడు.

"కళ" లోని నిజం చూపించడానికి అబద్ధాలాడ్డం సామాన్యం.

కట్టిన యింటికి వంకలు చెప్పేవారు వెయ్యిమంది వుంటారు.

మన ఆదాయాలు పాదరక్షల వంటివి - అవి చిన్నవైతే మన పాదాల్ని కరుస్తాయి; పెద్దవైతే తప్పటడుగులు వేస్తాయి.

పెళ్లిచేసుకున్న మిత్రుడు తానేంచేసినాసరే మొదటిరకం మిత్రుడు కాలేడు. స్త్రీహృదయం అతని హృదయంతో కలిసిపోయి ఉంటుంది.

నేరాన్ని తయారుచేసేది సంఘం. చేసేది నేరస్థుడు.

కొందరు అపాన వ్యాపారమందు ప్రాణ వ్యాపారమును వ్రేల్చుచు, పూరక ప్రాణాయామ యజ్ఞమని కొందరు ప్రాణవ్యాపార మందు అపానవ్యాపారంబును వ్రేల్చుచు, రేచక ప్రాణావ్యామంబును కొందరు ప్రాణాపాన మార్గములను బంధించి ప్రాణాయామ మందు ప్రాణ వాయువులను లయింపించి వ్రేల్చుచు, కుంభక ప్రాణాయామమును చేయు చుందురు.

మంచివాడికి చేస్తేమేలు వ్యర్థంకాదు. కొబ్బరిచెట్టు వేరుకు నీరు పోస్తే తలతో ఫలితమిస్తుంది.

మానవుడు తన అజ్ఞానాన్ని తెలుసుకోగలిగినంత జ్ఞానం మాత్రమే సముపార్జిస్తాడు. తన తప్పిదాన్ని గ్రహించి పశ్చాత్తాప పడేటంతటి అనుభవం సంపాదిస్తాడు; అనంతరం చనిపోతాడు.

పాపప్రక్షాళనలకు దానం ఉపకరించినంత శక్తివంతంగా మానవుల ముందు నమ్రత ఉపయోగిస్తుంది.

పగలు, రాత్రి ఒకదాని వెంట మరొకటి ఉన్నట్లే జీవితంలో ఆనందం, విషాదం వెంటవెంటనే ఉంటాయని విజ్ఞుల సూక్తి. కాని అమావాస్యనాటి అర్ధరాత్రి కటిక చీకటిలో కూడ మనకు మార్గాన్ని చూపేందుకు భగవంతుడు నక్షత్ర కాంతిని ప్రసాదించాడు. అల్లాగే మనబ్రతుకులో – చిమ్మ చీకటులాంటి విషాదం స్వైరవిహారము చేస్తున్న పుడు నక్షత్రకాంతుల్లాంటి మానసిక ధైర్యవిశ్వాసాలు ఆచీకటిని పార ద్రోలుతాయి.

సత్యాన్ని నమ్మి ముందుకు సాగిపో ; భయపడి పారిపోకు. పిరికి వాడికీ ప్రపంచంలో చోటులేదు.

ఉత్తముడికి కోపం ఒక్క క్షణం.

ఆలోచించలేని వాడు బానిస. తనకు తోటివారికి కూడా ద్రోహి.

అసూయాపరుడు ముందు తన విందులో విషం కలుపుకుంటాడు, తర్వాత దానిని ఆరగిస్తాడు.

భౌతిక, మానసిక శక్తులను పెంపొందించడంకోసం ప్రకృతి జీవజాలములో సహజమైన కోర్కెలను ప్రోత్సహిస్తుంది.

శిక్షించ తగనివారిని శిక్షించి, శిక్షార్హులను వదిలివేసి పరిపాల కులు అపకీర్తితోపాటు నరకాన్ని పొందుచున్నారు.

శిష్టరక్షణ, దుష్టశిక్షణ రాజధర్మం.

పరబ్రహ్మ వ్యక్తిగత రూపంలో ఆవిష్కరణ పొందుతుందిగాని వ్యక్తిని పూర్తిగా కబళించివేయదు.

వేదిమిని విడిచి బొగ్గెట్లగ్నిహోత్రమని పిలువబడదో మనుష్యుడు నీతిని విడిచిన తరువాత మనుష్యుడని పిలువబడ తగడు.

ఇంకో కవి - ఎంతగొప్పవాడైనా నువ్వు వాడివి కావాలని ప్రయత్నించకు.

మనిషి మంచిగా ఉన్నంత మాత్రాన సుఖంగా ఉండలేడు. కాని సుఖంగా ఉన్నమానవుడు మంచిగా ఉండగలడు.

ఆహార నియమముగల వారలగు కొందరు వశీకృత వాయువు లందు ప్రాణవాయువులను వ్రేల్తురు. వీరందరును యజ్ఞములచేత సమస్త పాపంబులను నాశము గావించిన వారేను.

జీవితం ముళ్లపొదలాంటిది.

మనకేమీ తెలియనప్పుడు అంతాస్పష్టంగా తెలిసినట్లుఉంటుంది. విజ్ఞానం విస్తరించిన కొలది అన్నీ సందేహాలే.

నైతిక సమస్యలగురించి సమాలోచనలు, మానవునకూ, ప్రపం చానికీ గల సంబంధాన్ని గురించిన ఆలోచనలు యీప్రపంచ దృష్టి లోని బలహీనతలను బయట పెట్టకమానవు.

మనసు అనేది ఒక అగాధం లాంటిది. దానిలోతు కనుక్కొన్న వాడే మనిషి.

కాలమనే ప్రవాహంలో సత్యమనే చేపకోసం గాలంవేసిన జాల రిని నేను.

కాలం నిజమైన విలువతెలుసుకో! ప్రతిక్షణాన్ని గట్టిగా చేజిక్కించుకొని పరిపూర్ణంగా అనుభవించి ఆనందించు. బద్ధకించి కాల క్షేపం చేయకు. నేడు చేయవలసినపని రేపటికెన్నడు వాయిదావెయ్యకు.

నిజంచెప్పడానికి యెంతైనా గుండె దిటవుకావాలి. అసత్యానికి యేది అవసరంలేదు.

విశాలదృక్పథమే జీవం. సంకుచిత తత్వమే మృత్యువు. స్వార్థ పరత్వమే మృత్యువు. ప్రేమే జీవం. ఇదే జీవిత సత్యం.

దరిద్రుని కోర్కెలు కార్యరూపం దాల్చవు.

మిథ్యా కల్పనలూ భ్రాంతులూ సత్యాలనుకుంటారు. కాని వాస్తవ సత్యం కల్పన లన్నిటికన్నా విస్మయావహం.

మూడుముళ్లుకట్టి ముళ్ళకంచెలు అడ్డుపెడతారు. ఆకంచెలో బంధింపబడినన్నాళ్లూ సంఘం ఆడదాన్ని గౌరవిస్తుంది.

బురదవంటి నేటిసామాజిక జీవనంనుంచే అక్కడక్కడ బంగారు పద్మాలు ఆరవిచ్చు కుంటున్నాయి.

ధర్మదృష్టితో సత్యము, ప్రయోజనకరములైన మాటలను పలుకు. అశ్రద్ధగా, అసభ్యంగా, కటువుగా యెన్నడూ మాట్లాడవద్దు.

కన్యకు కామరసము తెలియదు.

మనోబలము లేకపోతే మనిషి యితరులకు లొంగిపోతాడు.

ఉపకారం చేసే తలంపుగల వానికి విమర్శించే హక్కువుంది.

యజ్ఞములుచేసి మిగిలిన యజ్ఞశిష్టమైన అమృతంబును భుజించు వారలు శాశ్వితమైన బ్రహ్మంబును పొందుదురు. ద్వాదశవిధములైన యజ్ఞములలో ఏదేని ఒకదానిని గూడ చేయనివానికి ఇహలోకసౌఖ్యమే లేదు. అట్టివానికి మోక్షమెక్కడిది.

మనం కోరుకున్నదానిని పొందలేము. కనుక మనకు లభించిన దానినే మెచ్చుకుందాము.

స్త్రీ కోరుకునేది ఏమిటి? స్త్రీవ్యక్తిత్వవికాసానికి గృహిణిత్వ, మాతృత్వ బాధ్యతలకు వైరుధ్యాన్ని కల్పించని సమాజం. స్త్రీ మాతృత్వాన్ని గౌరవించే సమాజం. స్త్రీని మానసిక శారీరక వ్యభిచారం నుండి దూరంచేసే సమాజం. బూటకపు పదాలనుండి, మూఢసాంప్రదాయాలనుండి ఆమెను వేరుచేసి నిత్యనూతనమైన విజ్ఞానాన్ని అందించే సమాజం. సెక్సువ్యాపారాన్ని గాక శారీరక విజ్ఞానాన్ని బోధించే సమాజం. ఇదే స్త్రీ అభిలషించే సమాజం. ఇదేమానవ ప్రగతికి ప్రతి బింబమైన సమాజం. ఈ సమాజాన్ని సోషలిష్టు ఆర్థిక వ్యవస్థ మాత్రమే సృజించగలదు. అప్పుడే స్త్రీ తనవిజ్ఞానాన్ని, వివేకాన్ని, మేధస్సును సామాజిక ప్రగతి కొరకు వినియోగించ కలదు.

ఏసుక్రీస్తును నీదైవంగా అంగీకరించి, నీపాపాలకొరకే ఆయన శిలువమీద మరణించాడని త్రికరణశుద్ధిగా విశ్వసించి, స్వీకరిస్తే నీవిక చంటిబిడ్డగా మారినట్లే. క్రీస్తును స్వీకరించి స్వీయానుభవములో ఆ అపూర్వ ఆనందానుభూతిని చవిచూడు.

మనస్సే స్వర్గాన్ని నరకంగాను, నరకాన్ని స్వర్గంగాను మార్చివేయగలదు.

ఇతరుల కుపకారం చేసుకునే తలంపు కలగడములోనే తనకు తను ఉపకారం చేసుకుంటున్నాడు.

అబద్ధం చెప్పడం చాలా సులువు కావచ్చు. కాని అబద్ధాన్ని నిజంగా కల్పించి లోకాన్ని నమ్మించిన వాడిని వాకశక్యము కలవాడని అనడం అతిశయోక్తికాదు.

ఎంతో ఎక్కువగా మాట్లాడే వారెప్పుడూ చాలా తక్కువగా ఆలోచిస్తారు.

గాడిదపిల్లైనా వయసొచ్చేసరికి అప్సరసలా వుంటుంది.

మంచితనం అందాన్ని ఎంతగొప్పగా పెంచుతుందో !

సంపదలన్నిటిలోకి విద్యగొప్పది. ఇతర సంపదలను దీనితో సాధించవచ్చు. ఇచ్చినకొద్దీ పెరిగేదేగాని తరగదు. విద్య బరువైనది కాదు. దొంగలపాలుకాదు.

అనేకవిధాలైన యజ్ఞములు వేదములందు విస్తారములుగా విధింపబడియున్నవి. అవియన్నియు కర్మయోగ రూపములు. ఇట్లు వీనిని నిత్యనైమిత్తిక కర్మమువలన బుట్టినవానిగా మానవుడు తెలిసికొనిన యెడల ప్రాకృత బంధము వదలి మోక్షమును బొందగలడు.

చావు అనే భయమే మూఢనమ్మకాలకు బలము,

విధి నా నుదుటిమీద వ్రాసినదేదో అది జరిగి తీరుతుంది.

ఒక ఆదర్శాన్ని నమ్మిన మనిషి వేయి తప్పులుచేస్తే, ఏ ఆదర్శమూలేని మనిషి యాభైవేల తప్పులు చేస్తాడు.

ముక్తి పొందుట మనుష్యునకు మాత్రమే సాధ్యం.

శరీరాన్ని బంధించవచ్చుగాని మనస్సుకి ఎప్పుడూ స్వేచ్ఛే. లోకమేదో పెద్ద బందికాణాలో బంధించబడింది. నేను స్వేచ్ఛా జీవిని. లోకాన్ని స్వేచ్ఛా జీవిని చేయాలి.

బిరుదులవల్ల వ్యక్తికి గౌరవం రాదు. వ్యక్తివల్లనే బిరుదులకు గౌరవం కలుగుతుంది.

శక్తిలో జీవనముంది. బలహీనుడు జీవన్మృతుడు. అందుకే శక్తివంతమైన ఉపయోగకరములైన ఆలోచనలు, అలవాట్లు చిన్నతనం నుంచే అలవరుచుకోవాలి.

ఒక్కబలమైన తిండి మనిషిని ఆరోగ్యంగా నుంచదు. ఆహ్లా దాన్నిచ్చే తలంపులు కూడా కావాలి.

ధనస్సుకు రెండు చివరలుంటాయి. ఈ అగ్రాలను కోట్లు అంటారు. ఈ రెండు కోట్లుగలదానికి లక్ష్యమందు ఆశ గలగడం సహజమే. అంటే ధనం కలవారికి ధనాశ ఉంటుంది అధికంగా.

తెల్లగులాబీని చూడగానే నాకు పవిత్రత స్ఫురించదంటే దానర్థం నేను పువ్వును పువ్వుగా చూడడం మానేసేనన్న మాట.

మనిషి తప్పు చేస్తున్నంతసేపు-అది తప్పేనని తనకుగల జ్ఞానాన్ని మరుగున పెడతాడు. అది మానవ ప్రకృతి. పాప పుణ్యాల రహస్యం యిందులోనే ఉన్నది.

వర్ణములలోనున్న ఉపశాఖలను రూపుమాపి అంతర్వివాహము లను జరుపుకొనవలయును. విచక్షణతో కూడిన వివాహములు జరుగుట మంచిది. అందరు వివాహితులై మరింతమంది బానిసలను సృష్టించుటవలన లాభములేదు.

మనుష్య చిత్తం అస్థిరము.

మనకు మాత్రమే తెలిసిన నేరాలను మనం అతి తేలికగా విస్మ రిస్తాం.

మానవుడు ఆకలి అయినప్పుడు అభిమానము, కులం, విద్య, జ్ఞానము, తపస్సు, హోదా, అనురాగం, అన్నిటినీ మర్చిపోతాడు.

నానావిధ బాహ్యోపకరణములైన ద్రవ్యసాధన సాధ్యమగు యజ్ఞముకంటె జ్ఞానరూపయజ్ఞమే మిక్కిలి శ్రేయము.

భగవదాజ్ఞా రూపముగా చేయబడెడి ఖర్మములన్నియు నిశ్రేయ ముగా జ్ఞానమునందే పర్యవసానమగుచున్నది.

నీకు జాలి ఉండవచ్చును. కనికరం ఉండవచ్చును. గ్రాహ్యత ఉండవచ్చును. నీవు ఒకలక్ష చావులు చచ్చి ఉండవచ్చును. కాని యితరులకు పంటినొప్పివచ్చిన ఆబాధేమిటో నీకు అర్థంకాదు. అది మానవ ప్రకృతి.

శ్రీ సాయినాథుని ప్రబోధం - అన్ని ప్రాణులలో భగవంతుని దైవత్వమును దర్శించవలసినదిగా ఉపనిషత్తు, భగవద్గీత, భాగవతము బోధించుచున్నవి. ఉపనిషత్తులలోని ప్రభోదములను ఆచరణ రూపములో ప్రదర్శించుట శ్రీ సాయినాథుని విధానము.

అందరూ తనవారే అనుకోవడం, అందరి బాధలు తనబాధలే అనుకోవడం సామాన్యులకు సాధ్యంకాదు. మహాయోగులకు అది సాధ్యం.

ఇవ్వడం ఒకరకంగా తీసుకోవడమే.

నీమనసుకు నువ్వేశాంతిని ఏర్పరుచుకోవాలి. లోకం నీకుశాంతిని కలిగిస్తుందనుకోవడం కేవలం భ్రమ.

శైలిని బట్టి వ్యక్తిని గ్రహించవచ్చును.

ఎవరో ఒకరు మంచి మాటాడాలి. ఒకరి ప్రొగడ్త వినరాలి. నలుగురిలో తను ఒకడై అందులో ఒక్కడైనా తనకష్టసుఖాల్ని పంచుకుంటేనేగాని తృప్తిరాదు.

స్వర్గానికి ప్రతిరూపం మర్త్యం. విశ్వమానవ సంఘం అస్తిక తత్వంమీద సమిష్టిక్షేమంమీద ఆధారపడి వున్నది. ఆభావ ప్రభావం విశ్వ కల్యాణానికి దోహదమిస్తుంది.

జీవితానుభవమే కావ్యవస్తువు కావాలి.

ఇతరులతో శత్రుత్వం కోరి తెచ్చుకోకు. ఒకవేళ తెచ్చుకుంటే నీశత్రువు నిన్నుచూచి భయపడేంత వరకూ పోరాడు.

ఎంత విజ్ఞానవంతుడైనప్పటికి మానవుడు సర్వశక్తిమంతుడు కాడు.

మానవులు తత్వజ్ఞులైన వారల నాశ్రయించి నమస్కారము గావించి, శుశ్రూషలుచేసి, ప్రార్థించి జ్ఞానమునుగూర్చి తెలుసుకొనవలయును.

మేలుకలుగుటకై యెల్లప్పుడును సత్యమైన వస్తువులందే - విశ్వాసముంచవలెను.

నీకర్మకు నీవేకర్తవు. కనుక నీభవితవ్యాన్ని నీవే సృజియించుకో.

లోభికి యాచకుడే శత్రువు.

జీవితంలో నీ కపకారం చేసేవారెవరో చెప్పడంకష్టం. దుశ్చింతన గల శత్రువులా ? మేలుకోరే మిత్రులా !

కవులూ, కళాస్రష్టలూ, మహావీరులూ వృషస్సుకు సుపుత్రులు. మానవ హృదయములో నైతిక ప్రభోదము కలిగిన తరుణమే నిజమైన ప్రభాతం. అజ్ఞానపు సుషుప్తిని అంతమొందించుటమే సంస్కరణోద్యమాలన్నిటికి పరమ లక్ష్యం.

జీవితం నాకు మిణుకుమిణుకుమనే చిన్న దీపకళిక కాదు. అది గొప్పకాంతి పుంజ్యాన్నిచ్చే మహత్తరజ్యోతి. అదే యిప్పుడు నాచేతిలో వుంది. దాన్నింకా ప్రకాశవంతము చేసి నాముందుతరాల వారికి అందించడమే నాలక్ష్యం.

మూఢులు బల్లగుద్ది చెప్తున్నారు. విజ్ఞానులు నోరు మూసుకు కూర్చుంటున్నారు. ఈనాటి అరిష్టాలకు యిదే కారణం.

దబ్బు దేశం ప్రాణాలతో జీవించడానికి ప్రవహించాల్సిన రక్తం వంటిది.

'అసంభవం' అన్నమాట మందబుద్ధుల నిఘంటువులోనిదే.

జరిగిపోయిన పనికి చింతిస్తూ కూర్చోకు. ప్రస్తుతకర్తవ్యం ఏమిటో ఆలోచించుకోవాలి.

కామానికి కన్నులుండవు.

సతీపతుల హృదయాలలో ప్రవహించేది ప్రేమకాదు. పరస్పర రూపయవ్వనాకర్షణల సంఘర్షణ. అయితే ప్రేమ జనించేది వారి ఆత్మలలో. ఆత్మల ప్రేమ వ్యామోహ రహితమైనది. తనలో నిబిడీకృతమైనమాతృత్వపువాంఛ తీరేవరకే స్త్రీపురుషుణ్ణి వాంఛిస్తుంది. అది తీరాక వారిలో వాంఛనశిస్తుంది. అప్పుడు ప్రేమకూడా నశిస్తుందని అనలేము. నశించదుకూడా. ఏమంటే అది దేహానికి సంబంధించినదికాదు. ఆత్మకు సంబంధించినది. కనుకనే వృద్ధాప్యంలో కూడా సతీపతుల ప్రేమ నిలుస్తుంది.

సత్యాన్ని అన్వేషించే వ్యక్తి ఏదేశానికి చెందనివాడై వుండాలి.

నీ మిత్రుడిపై నీకుగలనిజమైన అభిప్రాయం ఆమిత్రుడుదగ్గర నుండి వచ్చిన వుత్తరం అందుకున్న క్షణాన కలిగిన అనుభూతిని బట్టి వుంటుంది.

మాటవలన మానినులు మనసులిస్తారు. మహారాజులు మాన్యాలిస్తారు. మహిమగల దేవతలు కోరిన వరాలిస్తారు.

మనభవిష్యత్తుకు దిక్సూచి మనమనస్సే. అదే మన జీవిత గమ్యాన్ని నిర్ణయిస్తుంది. దాన్ని యెప్పుడూ శుచిగా, అలికి ముగ్గు పెట్టిన రీతిగా, అద్దంవలె అట్టిపెట్టుకోవాలి. దానిమీద ఏదైనా బురద

వచ్చి చిందిపడితే ఆ దోషం మనదికాదు. ఆ అద్దం శాశ్వతంగా మైలబడినట్లుగా భావించి, బ్రతుకుబాట మూసివేయబడినట్టు కుమిలి కృశించి పోరాదు. మన అంతఃకరణ పవిత్రంగా వున్నంతవరకూ మనకే పాపం అంటదు.

జీవితాంతము యెక్కువగా చూడడానికి, వినడానికి, తక్కువగా మాట్లాడడానికి మనకు ప్రకృతి రెండు కళ్ళు, రెండు చెవులు, ఒకే ఒక నాలుక ప్రసాదించింది.

నిరీక్షించే నయనాలలో సౌందర్యం కాపురం చేస్తుంది.

బ్రహ్మజ్ఞానమును మానవుడు పొందిన యెడల దేహాత్మాభిమాన రూపమైన భ్రమగలుగదు. అజ్ఞానం వలన ఆత్మస్వరూపము లన్నియు జ్ఞాన స్వరూపములే కాని వేరుగావని మానవుడి యందును, భగవంతునియందును ప్రత్యక్షముగా చూడగలము.

ఓటు తుపాకీ గుండుకన్న బలమైనది.

తాను చేస్తున్న పనివల్ల వ్యక్తికి సంతోషము కలగాలంటే ఆ పనికి అవతలవాడు అర్హుడై వుండాలి. దాన్ని అతిగా చేయరాదు. దానిలో తనవ్యక్తిత్వం ప్రతిఫలిస్తుందనే భావం కలగాలి.

అతిప్రసంగం విడు. ఎవరిని అవమానించకు, ద్వేషించకు. ఈ దేహాన్నిబట్టి యెవరితోను శత్రుత్వం పెట్టుకోకు.

కొందరు పురుషులు తండ్రులు కాలేక ప్రియులుగానే వుండి పోతారు. వారిని మనం యేమీ చేయలేము. పైగా పన్నెత్తిమాట కూడా అనలేము.

"నాశక్తి కొలది ప్రయత్నిస్తున్నా" ననటంవల్ల ప్రయోజనం లేదు. అవసరమైనది సాధించడమే కావలసింది.

మానవుడు – జంతువులకంటె, దేవతలకంటెకూడా గొప్పవాడు. దేవతలుకూడా మానవశరీరం ద్వారానే ముక్తిని సాధించాల్సి వుంది. మానవుడు మాత్రమే సృష్టిలో పరిపూర్ణత నందగలడు.

నిజాయితీ, మంచితనం లేనివాడు ఎంతపాండిత్యం వున్నా అదంతా బాధాకరమే.

ప్రాణులందరియెడ సానుభూతి కలిగియుండుటయే నిజమైన ధర్మము లేక మతము.

బుద్ధదేవుని ఉపదేశము – చేపలను తినకుండుట, మాంసమును పుచ్చుకొనకుండుట, నగ్నముగ తిరుగుట, శిరోముండనము, జడలుగా పెనవైచుకొనిన జుట్టుతోనుండుట, మొరటుగానున్న వస్త్రములనుదాల్చుట అనువానిలో నేవియు భ్రమలలో చిక్కుకొని యున్న మానవునిశుద్ధిచేయ జాలవు. కోపము, త్రాగుబోతుతనము, మూర్ఖత, మూఢవిశ్వాసము, మోసము, అసూయ, ఆత్మస్తుతి, పరనింద, గర్వము, చెడ్డఉద్దేశము అనునవి అపరిశుద్ధ లక్షణములు. అంతేకాని మాంసభక్షణకాదు. ఉపవాసము మొదలగు నియమము వలన శరీరము కృశించిపోగా అట్టి శరీరమందలి మాననమున చెడుతలపులు, గందరగోళము బయలుదేర గలవు. ఈ కాయక్లేశము లౌకిక జ్ఞానము నొసగుటకు కూడ శక్తివంతము గాదు. అట్టిచో యింద్రియములను వశపరచుకొనుట కిది ఎట్లుపకరించ గలదు.

పాపిష్టులందరిలోను ఎక్కువ పాపము చేసినవాడైననూ యాత్మజ్ఞానమనెడి నావచేత పాపసముద్రమును దాటగలడు.

శరీర ధారులకు మరణమే ప్రకృతి! జీవితమే వికృతి! ఒక్కక్షణమైనా ఊపిరి పీల్చగలిగిన ప్రాణి ఎంతటి భాగ్యశాలి.

సద్భావంతో మిత్రుని, సంభ్రమముతో బంధువులను, స్త్రీలను, సేవకులను బహుమతులతో దయాదాక్షిణ్యాలతో సుముఖులను చేసుకోవాలి.

ఓ ఉదరమా! ఒక్కరోజు ఆహారాన్ని వదలమంటే నిరాకరిస్తున్నావు. రెండురోజులు వదలమంటే దుఃఖిస్తున్నావు. నీతోకలిసి జీవించడం చాలాకష్టం.

చెట్టుకొట్టి బల్లలు చెయ్యడం నిర్మాణాత్మకమైన నిర్మూలనం.

భగవధ్యానమునకు మించిన సంపద, భక్తితత్పరతకు మించిన గుణములేదు.

క్రోధావేశాలకు లోనైన వ్యక్తి తనకుతానే అపకారం చేసుకుంటాడు. ఈసుద్దిలోని నిజం అతను నిత్య జీవితంలో తెలుసుకుంటాడు.

తానుమాట్లాడే విషయంగురించి ఏమీ తెలియనివాడే మహా స్వేచ్ఛగా మాట్లాడగలడు.

ప్రతి నియమవ్రతుడికి కొందరు శత్రువులు అనుకోకుండా ఏర్పడుతారు.

పరిహాసానికైనా స్నేహితుడి మనసుకు శూలంలా గ్రుచ్చుకునే, కష్టం కలిగించేవి, సిగ్గుపరచే మాట బుద్ధిమంతుడు పలకరాదు.

కాళ్లనుచుట్టిన పాము కరవకుండా వుండదు.

చక్కగా ప్రజ్వలించుచున్న అగ్నిహోత్రము పెద్దరాశియైన కట్టెలను భస్మము చేయునట్లు ఆత్మజ్ఞానరూపమైన అగ్నిహోత్రము సమస్తపూర్వకర్మలను భస్మము చేయును.

అందము, ఆకారము యివేప్రేమకు ఆధారమని, నైతిక సిద్ధాంతాలన్ని వట్టికబుర్లేనని ఆడవాళ్లకు బాగా తెలుసు.

ఉన్నతంగా ప్రేమించగలవాడే ఉత్తమ ప్రార్థనలకు అర్హుడు.

తమకు తాముగా ఒక కట్టుబాటుతో ప్రవర్తింపగల అలవాటు జనంలో వృద్ధి చెందాలి. అదిలేని యేజాతి స్వతంత్ర ప్రతిపత్తితో ప్రజాస్వామ్య యుగములో మనజాలదు.

అభిప్రాయములో పొరపాటును మన్నించ వచ్చు. అయితే దానిని యెదుర్కొనదగ్గ కారణాలు కన్పించకూడదు.

సృష్ట్యాదినుంచి అదుపులు పెట్టి మగవాడు ఆడదాని మనసును దోచుకోవాలనే ప్రయత్నిస్తున్నాడు. కాని అసలు స్త్రీ హృదయాన్ని అర్థం చేసుకుని అందులో నిత్యం నివశించగలిగే అదృష్టం కొందరికే సంక్రమిస్తుంది.

భౌతిక, ఆధ్యాత్మిక ఔన్నత్యానికై ప్రయత్నించిన మనిషే మనిషి.

కడగండి. కడిగితే నేను హిమాంశువు కంటె తెల్లన.

నేను సంపూర్ణ ఆశావాదిని. నిరాశ, నిస్పృహ పిరికివాని లక్షణాలు.

కథయినా, కావ్యమైనా, నవలైనా, నాటకమైనా, కళారూపకం ఏదైనా సున్నితంగా సాగించవలెను. కళాకారుడెక్కడా కనిపించ కూడదు.

మంచియుద్ధము, చెడుశాంతి అన్నది యెప్పుడూ లేవు.

ఒంటరితనంలో యెవరైనా బాధలు పడుతున్నారంటే అందుకు కారణం వారు వంతెనలు కట్టుకోవడంగాక తమ చుట్టూర గోడలు కట్టుకోవడమే.

మేధ పదార్థ స్వభావంలోకి చొచ్చుకు పోగలుగుతుంది. అటువంటి మేధలోనుంచి కాక విశ్వాసములోనుంచి ఆవిర్భవించిన ప్రపంచ దృక్పథం యెంత మహోన్నతమూ విలువైనది అయినా - మానవులపై తన ప్రభావాన్ని పోగొట్టుకుంది.

ఈ లోకమునందలి పరిశుద్ధమైన వస్తువులలో జ్ఞానముతో సమానము ఏదియులేదు. యోగసంసిద్ధి కలవాడు కాలక్రమముచేత నాజ్ఞానమును స్వయముగా పొందుచున్నాడు.

ఒకజాతి ముసలిదై పోయినపుడు తన ఆత్మబలాన్ని, విశ్వాసాన్ని మరియు యావజ్జీవితాశయ సముదాయాన్ని సుఖలాలసతకు బలిచేస్తుంది.

స్వర్గంనుంచి మలినరహితంగా భూమికి విసరబడిన ముత్యాలే, పసిపాపలు.

పారిస్ నగరంలో ఒకకోతి ఏరకమైన టోపీపెట్టుకుంటుందో చూచి యింగ్లాండులో, అమెరికాలో ఉన్న కోతులన్నీ అటువంటి టోపీ కోసమే ఎగబడతాయి. ఫాషన్ అనేవ్యసనానికి ప్రపంచం బానిస అవుతుంది.

కొంచెమైననూ వైరాగ్యం లేనివాడు పవిత్రమైన మనుష్యనామం ధరించుటకే అర్హుడుకాడు. యింద్రియ సుఖ పరిత్యాగమే వైరాగ్యమన బడును. వైరాగ్యము బొత్తిగాలేని మతము మతముగాదు. అదిలేని భక్తుడు భక్తుడు కాదు.

మన స్వాతంత్ర్యమును విడువకు.

బలహీనుడికి స్వర్గం యెప్పుడూ ఆమడదూరమే! పిరికివాడే పాపంచేస్తాడు. ధైర్యవంతుడు తాను చేయబోయే పని పాపం అనుకోడు.

అతికిచేస్తే ఖర్మఫలం కొద్దికాలంలోనే అనుభవిస్తారు.

వ్యక్తిగా మానవుడిలో మంచివుంది. సమాజంలో కాదు.

మహిళమీద, దైవం మీద నమ్మిక లేకపోవడం మానవాత్మ కత్యంత విచారకరమైన విషయం.

వ్యక్తి జీవితాన్ని, సామాజిక జీవితాన్ని సృష్టించిన శక్తులే వాఙ్మయాన్ని, యితరకళల్ని సృష్టిస్తున్నాయి.

అవేకళ్లు, అదేముక్కు, అవే అవయవాలు, అదే పేరు, అదే బుద్ధి, అదేమాటతీరు, అదేవ్యక్తి, వ్యక్తిత్వంలో సైతం ఏమీ తేడాలేక పోయినప్పటికి ధనం తొలగి పోగానే మనిషి క్షణంలో మారిపోయి మరో రకంగా కనిపిస్తున్నాడుకదా! ఇది లోకంలో చిత్రం.

బుద్ధునివాక్యం :— రోగారోగములను, చావుబ్రతుకులను తారుమారు చేయగల అధికారమును తనఖర్మకు తప్ప క్షుద్రదేవతలకు ఏమాత్రం అధికారంలేదు. తనఖర్మే తనను ఆడించుచున్నది. పూర్వ జన్మలో చేయబడిన పాపకృత్యములఫలమే యీజన్మలో వ్యాధుల రూపంగావచ్చి బాధించుచున్నది.

దైవానికి భయపడితేనే మనిషి తానుభయపడే ప్రమాదంనుంచి తొలగిపోతాడు.

కార్యం కావలిస్తే గాడిద కాళ్లైనా పట్టుకోవాలి.

సాధనతో సాధించలేనిదేదీ లేదు.

విరోధమనేది మానవుడిలోగల గొప్పశక్తిని వెలికితెచ్చి నాశనం చేసిపోతుంది.

మనప్రార్థన, దేవుని ఆశీస్సు నూతిలోవేసిన రెండుబాల్చీలు వంటివి. ఒకటి పైకి వెళుతుంటే మరొకటి దిగువకు వస్తూవుంటుంది.

స్వర్గం తీర్చలేని విషాదం భువిలో లేదు.

సుఖం ఒక్కటే మానవుని ధ్యేయమూ, జీవితలక్ష్యమూ, సాధించ వలసిన ఆదర్శమూ కాదు. దుఃఖము కూడా దాని అంతర్భాగమే. అదే మనజీవితంలో, సత్కర్మాచరణలో, మానసికాంతర్ జగత్తుకు సంబంధించిన ప్రతీ అనుభూతిలోనూ అంతర్లీనమై వుంటుంది.

"ధనమే దైవం" అనటం చాలాతప్పు. అది తప్పు అని రుజువు చేయబడింది.

ప్రపంచంలో దేనిని శాశ్వతమనలేము.- చావు పన్నులుతప్ప.

గురూపదిష్ట వాక్యములందు ఆశక్తిగలవాడు, జ్ఞానమునే ఆశ్రయించి, శ్రద్ధావంతుడై యింద్రియములను జయించి, జ్ఞానమునుపొంది పిదప ఉత్కృష్టంబగు మోక్షమును శీఘ్రముగా పొందగలడు.

కళాఖండాలను పురుషుడు సృష్టిస్తాడు. కాని పురుషులనే స్త్రీలు సృష్టిస్తారు.

పండితులు రాజాశ్రయంవల శోభిసారు.

మీనగరాన్ని సుందరంగా తీర్చి దిద్దుకొనడం ప్రభుత్వ కృషి వల్ల కంటె ముఖ్యంగా వ్యక్తిగత కృషివల్లనే జరగాలి.

పాపులలో పాపి, దుష్టులలో దుష్టుడు కూడా కైవల్యపదం పొందే ఆశ, అవకాశం వుంటుంది.

వినియోగించే శక్తిలేనప్పుడు చట్టం పట్టి బూటకం, నవ్వులాట.

తన్నుతాను నిగ్రహించుకోగల వాడే సర్వసమర్థుడు.

మనుష్యులకు దుఃఖాలన్ని అధర్మవర్తనవల్ల, అక్షయ సుఖాలన్నీ ధర్మాచరణంవల్ల కలుగుతున్నాయి.

సురూప దృష్టజ్ఞానం లేనివాడునూ, అట్టిజ్ఞానమును వృద్ధిపరచుట యందు ఆశక్తిలేనివాడునూ, అందు సంశయ మనసు గలవాడునూ నశించి పోవును. సంశయాత్మునకు ఇహమందును పరమందును సుఖంలేదు.

డబ్బుకోసం మూర్ఖుని సేవచేయరాదు.

కోపంవల్ల అవివేకం కలుగుతుంది. అవివేకంవల్ల మతిభ్రమ కలుగుతుంది. మతిభ్రమవల్ల బుద్ధినశిస్తుంది. బుద్ధినాశనంవల్ల మానవుడు నశిస్తాడు.

నీకు జాలి ఉండవచ్చును. కనికరం ఉండవచ్చును. మరియు గ్రాహ్యేతి వుండవచ్చును. నీవొక లక్షసార్లు ప్రాణాపాయరోగ పీడుతుడివి కావచ్చును. కాని యితరులకు పంటి నొప్పివచ్చిన ఆబాధేమిటో నీకర్థంకాదు. అది మానవ ప్రకృతి.

ప్రతి పాలరాతి ముక్కలోకూడా ఒక ప్రతిమ నిగూఢమైవుంది. నిపుణుడైన శిల్పితొలచినప్పుడుగాని అది బయటపడదు. పాలరాయికి శిల్పి ఎలాగో ఆత్మకు విద్య అలాంటిది.

ముసలితనం రూపసౌందర్యాన్ని, తృష్ణఅన్నిసుఖాలనూ, దుర్జన సేవ స్వాభిమానాన్ని, యాచన ఆత్మగౌరవాన్ని, ఆత్మస్తుతి అన్ని సుగుణాలనూ, చింత బలాన్నీ, క్రౌర్యం సంపదలను నాశనం చేస్తాయి.

సాహిత్యం రెండురకాలు. చదవడానికి పనికిరాని (బహుళంగా చదవబడే) చెడ్డసాహిత్యం. రెండోది చదవని మంచి సాహిత్యం.

శరీరమునకు నశించుస్వభావము కలదు. జగము భ్రాంతిమూల కము. మనసునకు మాయావరణమేర్పడి, ప్రతిదియు తనదే అని, తన కొరకేవున్నదని, తానుశాశ్వతుడనని మానవుడు తాపత్రయపడును. ఇది లోకయాత్ర.

అదృష్టం నీకొక మృణ్మయ పాత్రను ప్రసాదించవచ్చు. అయితే దానిలో అన్నం వండుకునే బాధ్యత నీదే.

ఆయుష్షు వున్నవాడిని ఎవడు చంపగలడు? చావు మూడినవాడిని ఎవడు బ్రతికించగలడు? నిరంతరం బిచ్చమెత్తేవాడిని ఎవడాపగలడు.

మనం ఎంత చదువుకున్నవాళ్లమైనా ఒక్కోసారి అజ్ఞానంలో పడతాం. విలువలను విస్మరిస్తాం.

కాలానుసారంగా మనువుగడుపుకుపోవాలి.

యోగముచేత సమస్తకర్మలను విడిచి జ్ఞానాకారముగా భావించి ఉపదిష్టంబైన జ్ఞానమువలన లభించిన ఆత్మజ్ఞానముచేత సంశయ విముక్తుడై విధినయర్ధములందు దృఢమైన మనసు కలిగినవారికి పుణ్య పాపములంటవు.

బిగ్గరగా నవ్విన నవ్వు శూన్యమనస్సుకు ప్రతీక.

ఒకరిని సహాయం కోరడంతోనే మనం మనస్వేచ్ఛను తాకట్టు పెట్టుకున్నట్లే.

సత్యశీలి అయిన మానవుడు తప్పక సహనశీలి అహింసా తత్పరుడు అయివుంటాడు.

నాగరికం, సంస్కారం, చదువు సాములు సమృద్ధి పెరిగిన కొలదీ తరుగవలసినవే కాని, నేరాలు కసితో బదులుకు బదులని శిక్షించ డంతో, రూపుమాసేవికావు.

తన కష్టాల పల్లవులు పాడుకుంటూందేవాడే వాటిని పదింతలు పెంచుకుంటాడు.

అతను అడిగే ప్రశ్నలనుబట్టి యిచ్చిన సమాధానాల ననుసరించి కాకుండా అతనెంతటివాడో గ్రహించు.

అన్నిటికంటె వేగమయినది మనస్సు ఒక్కటే. దాన్నివదిలేసి పట్టుకొనటం సీతరంకాదు.

కార్యసాఫల్యమునకై మనమెప్పుడును కష్టములతో పెనుగులాడుచునే యుండవలెను. అదియే ఏర్పాటు. ఆ కష్టములతోడి పోరాడుట వలననే మనము మనోదారుఢ్యమును బొంది కార్యదక్షుల మగుదుము. మన సత్కార్యాచరణము వలన మనకిక్కడ కష్టములే కలుగుచున్నను లోకమునకెనను మేలు కలుగపోదు.

ఆకారాన్నిచూచి మనసును అంచనా వేయకు. ఒక్కోసారి ఆకారం యెంత భయంకరంగా ఉంటే మనసు అంత నిర్మలంగా ఉండొచ్చు.

గురువు లేకపోతే ముక్తిలేదు.

మనం లోపరహితులం కాదుకాబట్టి యితరుల విషయంలో కూడా మనం సానుభూతితోవుండి వారికి తొందరపడి దురుద్దేశాలను అంటగట్టగూడదు.

మానవత్వాన్ని ఎగసన దోయాలంటే మన ఆలోచనా విధానాలన్ని మారవలసిన అగత్యం ఉంది. తరతరాలుగా కరడుగట్టిన రకరకాల మూఢవిశ్వాసాలే యిందుకు ప్రగాఢ ప్రతిబంధకము.

మనం ఖర్చు పెటుతున్నామంటే మరోడికింత అన్నంపెడుతున్నాం అన్నమాట. ఖర్చుచేయక కూడబెట్టేవాడే శత్రువు. దానివల్లే నిరుద్యోగ సమస్య ప్రబలుతోంది.

అజ్ఞానమువలన కలిగిన మానవుని మనస్సు యందు నిలిచియున్న ఆత్మవిషయమైన సంశయమును జ్ఞానఖడ్గముచేత భేదించి కర్మయోగము నాచరించవలెను.

శాంతము లేకపోతే సౌఖ్యంవుండదు.

పండితులకు కూడా ప్రాణమందు మమకారము యెక్కువగా వుంటుంది.

మేధాశక్తి వినయంతో కూడుకున్నప్పుడే ద్విగుణీకృతమై ప్రకాశిస్తుంది. ఒకసమర్థుడైన వ్యక్తి వినయ సంపన్నుడై కూడావుంటే అతడొక వెలలేని రత్నమన్నమాటే.

దేవునిపై విశ్వాసము లేకపోవటం - నాస్తికత్వం అనేది పాత విషయం. క్రొత్తవిషయం ఏమంటే తనపై తనకు విశ్వాసములేకపోవటమే అసలు నాస్తికత్వం.

వాదోప వాదాలకన్న నిష్ప్రయోజనమైన తక్కువజాతి సంభాషణ యింకేది వుండదు.

సముద్రాన్ని వేనోళ్ల పొగుడు. కాని నేలమీదే నిలుచుని వుండు.

"ఈదేశంనాది. దాని బాగోగులునావి. నా బాగోగులు దేశానివి. నేనులేనిదే దేశంలేదు. దేశంలేనిదే నేను లేను." అనేభావం ప్రతీ పౌరుడికీ కలగాలి.

సౌందర్యోపాసనము జీవిత సౌఖ్యానికి దోహద మిస్తుందన్న మాట నిజమేకాని సౌందర్యోపాసనము లేనిదే జీవితములో సుఖమే లేదనడం నిజానికి దూరమైన విషయము.

కూర్చుండి తింటూవుంటే కొండకూడా నమసిపోతుంది.

ఈ భూతలంమీద భార్యకంటె ఉత్తమమైనది మరొకటివుంది. ఆమె మాత.

మేధావి అంటే ఆశ్చర్యపడేవాడు కాదు. ఆశ్చర్య పరచేవాడు.

క్రౌర్యమన్నది ఎవరుచూపినా శ్రేయస్కరంకాదు. ఎంత గొప్ప దివిటి అయినా పగటివేళలో ప్రయోజనం పొందనేరదు. ఎంతచిన్న దీపమయినా ప్రయోజనం సాధించగలిగేది కటికచీకటిలో మాత్రమే. అలాగే తీరనిపరిమితులలో ఎంతగొప్ప వాంఛయినా నిష్ఫలమే అవుతుంది.

సవ్యమూ, సక్రమమూ అని భావించుకుని మనంచేసే పనుల్లోనే మనకు ఆనందమూ, మనశ్శాంతి లభిస్తాయేకాని యితరులుచెప్పే వాటిని చేసేవాటిని అనుసరించటంలో కాదు.

నిస్పృహ అనే రాక్షసుని తమ్ముడే సందేహం.

జ్ఞానయోగము, కర్మయోగము అను రెండును తత్వసాక్షాత్కారమును పుట్టించి మోక్షహేతువుస్తు వుండును. అయినను రెండు మార్గములలో జ్ఞానయోగముకన్న కర్మయోగమే శ్రేష్ఠము.

ఆగ్రహం సింహాసనం అధిరోహిస్తే హేతువు నిష్క్రమిస్తుంది.

ప్రియుడూ ప్రియురాలు కౌగలించుకోవడం కంటె యిద్దరు మిత్రులు తమ కార్యక్రమంలో, ఒకే ఆశయంతో తన్మయులై తమ కార్యక్రమంలో కలిసిపోవడంలో ఎంత మాధుర్యం ఉన్నది.

ఏకాంతమంతటి గొప్ప సహచరుడు నాకు కన్పించలేదు.

మూర్ఖత్వంకన్న కష్టమైనది ఏదీలేదు.

అవిశ్వాసంకన్న మరిఎక్కువ ఒంటరితన మేమున్నది.

ఇండియాలో అన్నిటికంటె చెడ్డతనం "ఒకరు మరొకరిని గోతిలో పడవేసి పైకిరావాలని ప్రయత్నిస్తారు."

జీవితాన్ని మించిన సంపద మరియొకటి లేదు.

నీవు కూడా సాతానులో నుండిన యెడల నరకమునకు వెళ్ళుదువు. ఇది దైవన్యాయ తీర్పై యున్నది. అయితే త్రాగుబోతైన వాడు యితరులను తనతో కూడా త్రాగుటకు ప్రేరేపించిన విధముగ, సాతానుకూడా తనకు తన చెడ్డ దూతాళికి ఏర్పాటుచేయబడిన నిత్యాగ్ని లోనికి నిన్నుగూడ తోడుకొని పోవుటకు ప్రయత్నించుచున్నాడు. నీవు శ్రేష్టమైన శుద్ధమనస్సు గలవాడవై నుండగోరిన యెడల ప్రభువైన క్రీస్తు యేసు పక్షముననే యుండుము. (బైబిలు)

యధార్థాలను ఆధారం చేసుకున్న వాదన, నేర్పుగా వెలువరించిన వాదనమీద యెన్నడూ జయం సాధించలేదు. వాస్తవిక తార్పష్టిని అవతలకునెట్టి నేర్పుగా వెలువరించిన అభిప్రాయం అభ్యుదయం కింద పరిగణింపబడుతోంది.

సర్వశక్తివంతులైన పరమేశ్వరుని ప్రదర్శనం ప్రకృతి.

సహజీవన సూత్రమందు అకుంఠిత విశ్వాసమే మానవాళి మనుగడకు ప్రథమ సోపానం.

పిరికివాడు తాను చాలా జాగ్రత్తగా వున్నానను కుంటాడు. లుబ్ధుడు తాను పొదుపరిననుకుంటాడు.

ఏవిధంగా చెట్టుముందో విత్తుముందో చెప్పజాలమో అదేవిధముగా జగత్పంకమునకు తుదిమొదళ్ళు చెప్పజాలము. అనుపమభక్తి తత్పరతయే మానవుని బాహ్యజగత్తునుండి వేరుచేసి పరమాత్మను చేరుటకు అమౌనము కలుగచేయును.

అల్పవిద్య అహంకారానికో హేతువు.

మనం చేస్తున్న పని ముఖ్యంగాని మనంధరించే వేషంకాదు. భగవంతుని ధ్యానించటానికి ఏవేషమైనా పనికివస్తుంది.

ఏకర్మయోగి ప్రతికూల వస్తువులను ద్వేషింపకయును, ఆత్మ వ్యతిరిక్తంబులను కోరకయు నుండునో వాడే కర్మానుష్టాన కాలమందు కూడ నిత్యసన్యాసియని తెలియదగినవాడు. వాడు రాగద్వేషములు లేని వాడై అనాయాసంబుగా సంసార బంధమునుండి విముక్తుడగుచున్నాడు.

గతాన్నిత్రవ్వి నీశక్తిని వృధాచేయకు. వివేకవంతుడు ఎప్పుడూ వర్తమానంలోనే బ్రతుకుతాడు.

ఎటువంటి గొప్పదనాని కయినా త్రాగుడుకన్న గొప్ప శత్రు లేదు.

ఆగ్రహం తప్పిదంవల్ల జనిస్తుంది. పశ్చాత్తాపంతో అంతమవు తుంది.

నిరాశ, నిస్పృహలను కోరివరించడం ఫ్యాషనైన బంగారు కాలంలో అందమైన సాహిత్యమే వుద్భవించింది.

బుద్ధినివాక్యము — దేవుని మెప్పించుటకు, దుష్టగ్రహబాధలు పోగొట్టుటకు, కోరినవాంఛలు పొందుటకు, ప్రతిచోట మన్ననలను పొందుటకు, యమలోకబాధలు తప్పించుకొనుటకు, అహింసా పరమో ధర్మమేదిక్కు, అవశ్యం.

ఏదేశ చరిత్ర చూచినా మనకు కనిపించేది ఆదేశీయుల అచంచల ఆత్మవిశ్వాసము. అదే ఆదేశ ఔన్నత్యానికి కారణం.

పరస్త్రీ కూటమి కూడదు.

కర్మనిర్వర్తించటంలో బాహ్యశక్తుల దౌర్జన్యానికి మనంలొంగి పోవాలిగాని మనం భావనలో స్వేచ్ఛాజీవులం.

అన్నిరకాల సంఘటనలు దైవేచ్ఛప్రకారం మందకొడిగా నడుస్తాయి. లేదా విహంగల్లా విహరిస్తాయి.

జానెడు పొట్ట నింపటానికి పట్టెడన్నంకోసం యితరులను సేవించి, ప్రార్థించి, పొగడి ఏడుసముద్రాలు దాటికూడా వెళ్లతున్నాం! యెంతబుద్ధిహీనత!

మంచినవ్వు యింటికి వెలుగునిస్తుంది.

జ్వరం తగలడానికి అజీర్ణంవంటివే కారణం కాదు. క్రోధం కూడా జ్వరానికి హేతువు.

జ్ఞానయోగము, కర్మయోగము అను నీరెండును ప్రత్యేకములని మూఢులు చెప్పుదురేకాని జ్ఞానవంతులు చెప్పరు. ఈరెంటిలో ఏదైనా ఒకటిని చక్కగా నాచరించిన వానికి నారెంటి యొక్క ఆత్మావలోకన రూపఫలము లభించుచున్నది.

ఏవయసులోగాని మనిషి మనసును తన అధీనంలోనికి తీసుకో గలిగితే జ్ఞాని అయినటే.

పురాతన శాస్త్రాలు భగవంతుడు లేడని వాదించే వ్యక్తిని నాస్తికుడని చెప్తున్నాయి. కాని నవీన మానవదృష్టిలో ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయినవాడే నాస్తికుడు

జీనులేనిగుర్రం వంటివాడే నిర్ణయంలేనివ్యక్తి.

తల్లి, సోదరి, కుమార్తె వీరితో సైతం ఏకాంతము పనికిరాదు. ఏకాసనం అంతకంటె కూడదు. బలమైన యింద్రియ ప్రవృత్తులు ఎట్టి విద్వాంసుని కూడా లొంగతీయకలవు సుమా !

జ్ఞానమెట్లో నీతియు అట్లే మనుష్యునకు స్వభావ ధర్మం. రెండింటిలో జ్ఞానంకంటె నీతి శ్రేష్ఠతరము.

మానవుడి అంగనిర్మాణమే మానవ దేహానికి కావలసిన వేడిమినీ, చల్లదనాన్ని మితంగా వుంచుచూ ఎల్లపుడూ కాపాడుతూంటుంది.

వెయ్యిమూఢగులుకంటె ఒక్కనవ్వు విలువైనది.

సత్పురుషుల సంపద పరోపకారంకోసమే. సముద్రుడు రత్నరాసులను ఏంచేస్తున్నాడు. వింధ్యాబలం ఏనుగు మందలను ఏంచేసుకుంటుంది. హిమాలయ పర్వతం చందన కాష్టాలను ఏంచేస్తుంది. పరులకిస్తున్నాయి. కాని తాము ఏమి చేసుకోవడం లేదుకదా !

దేవుని ప్రవక్త లందరిని ముస్లిములు విశ్వసించవలెను. ఎవడైన ఒకప్రవక్తను తిరస్కరించినచో వాడు మతభ్రష్టుడై అవిశ్వాసి అగును.

''నేను పేదవాడిని. నాకెవ్వరూ స్నేహితులు లేరు.'' అని చింతించ వద్దు. డబ్బు మనిషిని సృష్టించలేదు. మానవుడే డబ్బుని సృష్టించాడు. యావత్ ప్రపంచమూ మానవునిశక్తి; జిజ్ఞాస, అచంచల విశ్వాసముల వల్లనే సృజియింప బడినది.

నీప్రత్యర్థికోసం నువ్వు పుట్టించిన కోపాగ్ని అతనికంటె ఎక్కువగా నిన్నే దహిస్తుంది.

ఋషులు చెప్పినట్లేచేయాలి కాని వారు చేసినట్లు చేయరాదు.

అందరితోనూ కలసి మెలసి వుండటంవల్ల పిల్లలు ఎంతో మానసికమైన బాధపడతారు. ఇలా కలపడంవల్ల మేలు జరుగుతుందనుకోవడం వెర్రి.

అలలు ఎక్కువగా వున్నపుడు సరస్సుఅడుగుభాగం కనపడదు.

జ్ఞానయోగులు పొందెడి స్థానమేదో, దానినే కర్మయోగులును పొందుదురు. కాబట్టి ఒకటే మార్గమైన జ్ఞానయోగ కర్మయోగములు రెండును సమఫల ప్రదమైనవని తెలిసికొనినవాడే తెలిసినవాడు.

లేవండి! ధైర్యంగా ముందుకు పదండి! శక్తివంతులై బాధ్యతలను మీభుజస్కంధాలపై నిలుపుకోండి. దేశాన్ని స్వర్ణభూయిష్ఠమైన భవిష్యత్తు వైపు నడవండి. మీ విధికి మీరేకారకులని తెలుసుకోండి.

కర్మయోగమును విడిచి జ్ఞానయోగమును సాధించుట కఠినము. కర్మయోగ సంపన్నుడైన మునివరుండు శీఘ్రముగా బ్రహ్మస్వరూపమును పొందుచున్నాడు.

మాటలలో సభ్యత, సంస్కారం అనేవి పుట్టుకతోరావు. బాల్యంలో, యవ్వనంలో తలిదండ్రులు పిల్లలకు అందులో ఆడపిల్లలకు తప్పకుండా అవేవో నీతులు చెప్పినట్లుకాకుండా వారి అభివృద్ధినీ, బాగోగులనూ దృష్టిలో వుంచుకుని తెలియచెప్పాలి.

పైమెరుగులు దృష్టి నాకట్టుకుంటాయి. యోగ్యత ఆత్మనుజయిస్తుంది.

విజ్ఞుడు అవకాశాలను అన్వేషించడు. సృష్టిస్తాడు.

క్రొత్తవైద్యుడికన్నా పాతరోగి మేలు.

మనం అందరమూ జీవిత పథంలో బాటసారులమని ఒకద్రష్ట అన్నాడు. మనం కొన్నాళ్లపాటు ఇక్కడ ఉంటాము. ఆతరువాత చనిపోవడంలేదు. స్వగృహానికి మరలి పోతున్నాము. అంతే.

గదికీ, మదికీ కూడా గవాక్షాలుంటాయి.

ఓర్పె – అత్యున్నతమైన ప్రార్థన.

స్త్రీలతో ఏకాంతం బహుచెడ్డది.

అధిక విశ్రాంతి అనర్థానికి దారితీస్తుంది.

సమస్య అనేది గొప్పసమస్య. సమస్యలే జీవితానికి ఆధారం. మనకు సమస్యలే లేనప్పుడు ఏంచెయ్యడానికి తోచదు. అప్పుడు జీవితమే అనవసరం. ప్రపంచమే సమస్యలమయం. ఎన్ని యిబ్బందులు, కష్టాలు ఎదురైనా ముందుకు వెళ్ళాలి. లక్ష్యసాధనకోసం వత్తిడులకు తలఒగ్గడమే జీవితం. సమస్యలను మనం ఎదుర్కోగలం అనే ధైర్యంతో పనిచేసి నపుడే జయాపజయాలు సమంగా మనకు సంతోషాన్నిస్తాయి. అపజయంలో కూడా విజయం వుంది.

ధనికునికీ బీదవాడికి వున్నతేడా — ధనవంతుడు తనకు తోచినప్పుడు భుజిస్తాడు. బీదవాడు తన చేతికందినపుడే భుజిస్తాడు.

భగవదారాధనా రూపమైన కర్మయోగ సంపన్నుడు శాస్త్రీయ కర్మచేత చిత్తశుద్ధికలిగి మనస్సును వశంబు గావించి, యింద్రియములను జయించి, దేవ మనుష్యాది సమస్తభూతాత్మలను సర్వశరీరములందును ఏకరూపముగా భావించి కర్మలను చేసెడివాడు కర్మబద్ధుడు కానేరడు.

పరిశ్రమలేని జీవితం నేరం. కళాత్మకంగాని పరిశ్రమ ఘోరం.

ఈనాడు ఆధ్యాత్మికతత్వం బోధించే ఆచార్యులు ఎక్కువైనారు. ఆబోధనలను అనుసరించి తమ జీవితాలలో అనుష్ఠించేవారు కరువైపోయారు. నిరాడంబరత్వము, స్వాతంత్ర్యం ఔదార్యం, విశ్వాసం యివే నిజమైన పారమార్థిక జీవితానికి ప్రాతిపదికలు.

మూఢాచారాలు మారుతూ వుంటాయి నిజం. కాని సాంప్రదాయము తాత ముత్తాతలనాటి ధనం.

ప్రతివ్యక్తిలోనూ ఏదో సందర్భంలో హృదయదౌర్బల్యం ఏర్పడుతుంది.

బ్రతికినప్పుడు కాకుండా చనిపోయాక గొప్పగౌరవ చేసేవారు బహుకొద్దిమంది.

తనకేమీ లేకుండా పోతుందేమోనని మూర్ఖుడు యీజన్మలో యితరులకు చిల్లికానీ యివ్వడు. ప్రాజ్ఞుడు ముందుజన్మలకుండవలెనని తన సంపాదనంతా యోగ్యులకు దానం చేస్తాడు.

స్వార్థంతో కూడుకున్నది త్యాగం అనిపించుకోదు. నిస్వార్థ త్యాగమే నిజమయిన త్యాగము.

వేద శాస్త్రాలను ఎవడూ తుదముట్ట చదువలేడు. కాని వాటిసారం గ్రహించాలి.

బాహ్యప్రకృతిని జయించడం తేలిక. కాని అంతర్ముఖుడై తన్ను తాను పరీక్షించుకోడం కష్టం.

నివిధికి అంతరాయం కలిగించే ఆలోచనలకు స్వస్తి చెప్పాలి.

ప్రపంచం ఒక్క సంఘటనల సమ్మేళనం మాత్రమేకాదు. జీవితంతో కూడినది కూడా.

ఆత్మతత్వజ్ఞుడు ప్రపంచములో దేనినైనా చూచిననూ, వినిననూ, తాకిననూ, ఆఘ్రాణించిననూ, భుజించిననూ, నడచిననూ, నిదురబోయిననూ, నిట్టూర్పులు విడిచిననూ, మాట్లాడిననూ, మూత్ర పురీషములను విసర్జించిననూ, గ్రహించిననూ, కండ్లు తెరచిననూ, కండ్లుమూసిననూ, యింద్రియములు ఆయావిషయములందు ప్రవర్తించుచున్నవి యని నిశ్చయించి సమాహిత చిత్తుడై తాను యించుకైననూ, యేమి చేయలేదని తలంచును.

సమాజి జీవితం సత్యోత్తేజితమైన విజ్ఞాన సహాయముతో నడువ గలనాడే సార్థకత మానవ ప్రపంచానికి.

భగవంతుని మంచిదనాల చిరుదరహాసాలే సుందర పుష్పాలు.

అసంభావాలను ప్రత్యక్షంగా చూచినా యితరులతో చెప్పవద్దు. నీటిపై రాయి తేలింది. కోతి పాటలు పాడింది. అంటే నవ్వుతారు గాని ఎవరూ నమ్మరుకదా !

సుఖజీవనం ఒకప్పుడు నాగరికతకు భిన్నంగా వుండేది. బ్లాకుమార్కెటు విజృంభించిన తరువాత సుఖజీవనం సాంఘిక పత నానికి చిహ్నంగా భావించబడే ప్రమాదం దాపురించింది.

గంగలో స్నానం చేసినా కాకి కొంగ అవదు.

కర్మఫలములందు ఆశక్తిని విడిచి సకల కర్మలను బ్రహ్మార్ప ణంబు గావించి ఎవడు కర్మలను ఆచరించునో ఆ పురుషునకు దామరాకును నీళ్ళు అంటని రీతిగా ప్రకృతి సంబంధ హేతువులయిన పాపంబులు అంటవు.

ఒకవ్యక్తి వాదాల కంటె ఎక్కువ విలువైనవి అతని అభి ప్రాయాలు.

న్యాయపరుడైన ప్రతీవ్యక్తి దుష్టకార్యాలవల్ల కలిగిన దుష్ఫలి తాన్ని సత్కార్యాలు చేసిపోగొట్టుకుందామని ప్రయత్నిస్తాడు.

శ్రీసాయి నామస్మరణము సర్వార్థ సాధకము. సాయిసేవయే ముక్తికిత్రోవ. సాయిధ్యానమే సంసారమునకు నావ. అందుచేత సాయీశునిసేవించి తరించండి.

మహావటవృక్షమైనా చిన్నగింజనుంచే ఉద్భవిస్తుంది. ఎంత మహోద్యమమైనా స్వల్పసంఘటనల ఆధారంతోనే ఆవిర్భవిస్తుంది.

ఓ మూఢమానవుల్లారా! అష్టకష్టాలుపడి సాధించిన డబ్బును దాచిపెడతారెందుకు? ఊపిరిపోయిన తరువాత ఆధనాన్ని ఎవరనుభవిస్తారు?

బుద్ధదేవుని ఉపదేశము - నూనెకు బదులు నీటితో దీపమును వెలిగింపదలచు వాడు చీకటిని పారద్రోలజాలడు. కుళ్ళిన కలపతో జ్వాలను తీసుకుని రాగోరువాడు తనపనిని నెరవేర్చుకొనలేడు. క్లేశమును తెచ్చు కృత్యములు బాధాకరములు, వ్యర్థములు, నిష్ప్రయోజనములు గూడ. కామజ్వాలలను వుపశమింప చేయజాలని వాడు దౌర్భాగ్య కరమగు జీవితమును గడుపుచుండుటచే నహంకారమునుండి ఎట్లు విముక్తినంద గలడు?

ఆత్మకథ ఒక్కటే యధార్థమైన చరిత్ర.

మానవతికి ధనంకన్న మానమే ప్రధానం.

స్తుతిచేసేవాళ్ళలో పడేకంటే కాకులు గుంపులో పడటం వుత్తమం. చనిపోతే వాణ్ణిపొడిచేవి కాకులు. బ్రతికున్నవాళ్ళను పొడిచేవాళ్ళే స్తోత్రాలు పలుకుతారు.

మంచిగా వుండాలంటే మంచిపనులు చెయ్యాలి. మంచిపనులు చెయ్యడంద్వారా మరింత మంచివారమవుతాము. కష్టించినకొలది కండ పుష్టి పెరుగుతుంది కదా?

శిశువుకు కొద్దిప్రేమను యివ్వండి. మీరిచ్చిన దానికంటె అధికంగా మీకు లభిస్తుంది.

భౌతిక ప్రపంచములోని చరాచర వస్తువులు అనిత్యం. అయినా అందు ప్రతిదానిలో బ్రహ్మప్రతిభాంశ కనిపిస్తుంది. పరమాత్మ ద్యోతకమయ్యే విధానాలలో ఒకటైన కారణాన జగత్తులో మనం కలకాలం ఉండవచ్చును.

న్యాయం గెలుస్తుందన్నమాట నిజమేగాని గెలిచిందంతా న్యాయం కాదు.

ఏ దేశములో స్త్రీలు పూజింపబడుదురో అచ్చట భగవంతుడు నివశించును.

నిరాశచెంది మృత్యువు నాహ్వానించటం అతి నీచమయిన లక్షణం. ఉసురున్నంతవరకూ పోరాటం సాగించటమే జీవితలక్ష్యం.

జీర్ణశక్తి ఆధారంగా వైద్యుడు రోగనిర్ణయం చేసినట్లే ఆత్మకు నాడివంటిది కోరిక. ఎవని కోరికల ఆధారంగా అతని వ్యక్తిత్వం నిర్ణయించ వచ్చు.

మొదటి పేజీనుంచి చివరపేజీ వరకు అద్భుతంగా సాగిపోయే నవల గొప్పనవల కాదు.

కర్మయోగులు ఆత్మయొక్క పూర్వకర్మ బంధ నివృత్తికొరకు శరీరము చేతను, మనసు చేతను, అధ్యవసాయము చేతను, కేవల జ్ఞానేంద్రియ కర్మేంద్రియములచేతను వానికార్యములయిన జ్ఞానకర్మలను ఫలాపేక్షా రహితులై చేయుచుందురు.

బైబిలువాక్యము - ఏసుప్రభువే నాపాలిటి కొండ. నాకుపెట్టని కోట. నాకు మోక్షప్రదాత.

గృహము మహారణ్య సదృశముగాక భూతలస్వర్గమువలె నుండ గోరిన యెడల పురుషులు గృహిణులను విద్యావతులుగాచేసి, జ్ఞానదీపము చేత అజ్ఞాన తిమిరము తొలగించి, దుర్గుణ దురాచార సర్పశార్దూల సంచారములకు నారీహృదయలందు చోటులేకుండ చేయవలెను.

భగవత్ పూజకు వాయిదా పనికిరాదు.

ఈనాడు రెండురకాల నైతికవిధానాలు చలామణీలో వున్నాయి. పైకిచెప్పేది ఒకటి. అనుసరించేది మరొకటి. అనుసరించేది పైకి చెప్పం. పైకిచెప్పింది అనుసరించం.

నిర్యాణస్థితిలో మానవుడు పొందే తాదాత్మ్యమే ఈశ్వరుడు.

మనిషినుంచి మనిషికి సాధ్యమైనంత హెచ్చువుపకారమూ, సాధ్యమైనంత తక్కువ అపకారం జరిగేటట్టు చూసుకోవడమే సరియైన ప్రవర్తన. మిగిలినవి బూటకపునీతి నియమాలను నమ్మకండి.

వ్యాధి దుఃఖబాధలచేత నశించిపోయే ఈశరీరం కొరకు మానవ మాత్రుడు ఎవడు అధర్మకార్యాలు చేస్తాడు.?

గొడ్డురాలికి బిడ్డబాధ తెలియదు.

ప్రయత్నం చెయ్యకుండా నిరాశపడకూడదు.

మహర్షులకుసైతం యింద్రియనిగ్రహం బహుదుర్లభం.

సత్యాన్ని అన్వేషించినకొద్దీ అసత్యం అనేదిలేదని తెలుస్తుంది.

ఒంటరితనం మానవుడికి మంచిదికాదు. అయితే ఒక్కొక్క సారి గొప్ప సౌఖ్యాన్ని కలిగిస్తుంది.

సమాహిత చిత్తము కలిగిన యోగియైనవాడు కర్మఫలమునందు ఆశక్తిని విడిచి నిష్టయందు పుట్టిన ఆత్మానుభవ సుఖంబును పొందును. సమాహిత చిత్తము లేనివాడు కామముల ప్రేరణచేత కర్మఫలాసక్తికలవాడై సంసారబంధము ననుభవించును.

తృప్తిలేనిది అసలైన సంతోషము ఎన్నడూ కలుగదు. తృప్తి తన కష్టాలు ఒకరితో చెప్పుకోగా వాళ్ళాడిన సానుభూతి వాక్యాలవల్ల కూడా వస్తుంది.

భూమిపైన మనజీవిత మెంత యల్పకాలముండునో అవియు క్రీస్తు గొప్ప నిత్యత్వముతో పోల్చిన యెడల యీ జీవిత కాలము మిక్కిలి యల్పమైనదిగా నుండును. ఈ దేహము చనిపోయిన తరువాత ఆత్మ యుగ యుగములు జీవించును. అది మనలను ముద్రతోను, యధార్థత యంతటితోను మన జీవితములపై పరిచయము గల్గినప్పటినుండి గొప్పమార్పును కలుగచేయును. మరియు యిది మొదలుకొని మన జీవితములలో నొక గొప్పకార్యము చేయగలదు. (బైబిలు)

సత్యజీవిత పథములో అడుగుపెట్టాలనుకుంటే మానసికముగా మనకేర్పడిన బద్ధకం పూర్తిగా విడిచి పెట్టాలి. బాగా లోతుగా ఆలోచించాలి. ఆలాచేస్తే మనజీవితం చాలా సరళంగా మారిపోతుంది.

అజ్ఞానమనేది మనస్సుకు రాత్రివంటిది. ఈ రాత్రిలో తారా చంద్రులు కూడా వుండరు.

భార్య భర్తకు బానిసకాదు. ఆమె అతని మిత్రురాలు. అతని బాధ్యతలను హక్కులను సరిసమానంగా పంచుకునే సహచరి.

ప్రపంచానికి మేలుచేయటమే మనలక్ష్యం. కీర్తి ప్రతిష్టలు మన లక్ష్యం కాకూడదు.

అద్దంలో తన ప్రతిబింబాన్ని చూచుకున్నట్లే ప్రతీవ్యక్తి యితరుల జీవితాలను పరిశీలించి అనుసరీయాదర్శాలను గ్రహించాలి. జాగ్రత్తగా వ్యవహరించేవ్యక్తి యెప్పుడూ క్షమార్పణ చెప్పడు.

ఇతరులకు దానముచేయగలవాడు రణరంగమున కేగు ధర్మ వీరుని వంటివాడు.

కొంతమందితో పరిచయమే ఎడ్యుకేషన్. అనేకగ్రంథాలు చదివినట్లు, అనేక క్షేత్రాలు దర్శించినట్లు మనం అనుభూతి చెందుతాము. అందుకే మంచివారితో పరిచయం ఎంతైనా అవసరము.

ఒకడు కోపంతో వున్నాడంటే అర్థం వాడి మనస్సెంతో క్షోభపడుతూ వుంది.

నన్నుగురించి నాకుతెలిసినంతగా యితరుల గురించి తెలియదు. కనుక నాసంగతులే ముచ్చటిస్తాను. "నేను'' అనే యిరుసుచుట్టు యీ సృష్టి చక్రము గిరగిర తిరుగుచున్నది.

ధైర్యం, ప్రగాఢ సృజనాత్మక భావనాపటిమ, సిద్ధాంతాచరణల మధ్యగల సన్నిహిత సంబంధ పరిజ్ఞానం, వైజ్ఞానికాన్వేషణలను అమలుపరిచేందుకు నిరంతర కృషివంటి విశిష్టగుణాలలో అంతర్గతమైన సంపూర్ణముగా నిరంతర వైజ్ఞానికి దృక్పథం విజ్ఞాన శాస్త్రజ్ఞునికి అవసరం.

కీర్తిమార్గం స్వర్గమార్గము లాంటిది. చాలా దుర్గమమైనది.

కష్టపడి సంపాదించిన డబ్బైనప్పటికి దానివిలువ సరిగా తెలియక పోయినట్లయితే ఎందుకు కొరగాకుండా పోతుంది.

ఇంద్రియ జయంబు గావించిన పురుషుడు నవద్వార ప్రదమైన శరీరమే సమస్త కర్మలకు కర్తయేకాని తాను కర్తకాదని నిశ్చయించి కర్మలను శరీరములో వదలిపెట్టి కర్మము చేయుచుండినను చేయనివాడును చేయింపనివాడునై అనాయాసముగా నుండును.

తలపండినంతమాత్రాన హృదయం వయస్సు తెలియదు.

ఇస్లాంమతం ప్రకారం పాపము చేసినవారు పశ్చాత్తాప పడి దేవుని క్షమించుమని వేడుకున్నచో పాపములు హరించును. పరుల

హక్కులను హరించినచో వారిహక్కులను వారికియ్యవలెను. లేదా హక్కుదారుల క్షమాపణవేడి వారి మన్నింపు పొందవలెను. అప్పుడు పాపము హరించును.

దొంగకు అబద్ధమే బలం.

చొరవ ఎప్పుడూ గుడ్డిదే. అది అపాయాలను, అసౌకర్యాలను చూడదు. సలహాకు పరిమితమై చొరవమంచిదిగా కనిపిస్తుంది. కాని ఆచరణలో అది చాలా చెడ్డది.

సామాన్యులు ఉపకరించునట్లు గొప్పవారు లోకులకు అంతగా ఉపకరించడం లేదు. జనుల పిపాసను నూయి తీర్చగలిగినట్లు సముద్రము తీర్చలేక పోతున్నది కదా?

సాహిత్య సృష్టికి ఏకాంతం కావలసిన రచయితలు కొందరు. ఏకాంతం నుంచి పారిపోవటానికి రచనచేసేవారు మరికొందరు.

గతించినదంతా ఒకస్వప్నం. రానున్నదంతా ఒకకోరిక. అవే జీవితంలో రెండు భాగాలని ఆరబ్ సామెత.

నీటిలో పుట్టి నీటిలో పెరిగిన తామరాకు ఏరీతిన నీటితో సంబంధము లేక యుండునో ఈ ప్రపంచమున పుట్టి పెరిగి జ్ఞాని కూడా పాప కార్యములలో సంబంధము లేక యుండును.

సంఘమున తనబాధ్యత గుర్తెరిగిన వ్యక్తి ఎన్నడునూ ముందుగ తానిది చేయుదునని, అదిచేయుదునని శుష్కవాగ్దానము లొనరింపడు. లోకమున వాచాశూరులధికముగ నుందురు. క్రియాశీలుర సంఖ్య స్వల్పముగనే వుండును.

చదివేవానికి మతిలేకపోతే గురువుకూడా ఏమీ చెయ్యలేదు.

ప్రేమ ఎక్కడలభ్యమయితే పిల్లలక్కడ బెల్లంచుట్టూ చీమల్లా చేరుతారు.

నవ్వగలిగే వరంపొందిన ప్రాణి ఒక్కమానవుడే! నవ్వుల పాలయే అర్హతగల వ్యక్తికూడా అతనొక్కడేకదా.

మనుష్యులకు కార్యములందు కర్తృత్వమును గాని, కర్మలను గాని, కర్మఫలాశక్తినిగాని ఈశ్వరుడు కలుగచేయలేదు. అవి ప్రకృతి వలన ప్రవర్తించుచున్నవి.

ఆనందానుభూతి పొందేదానికన్నా యితరులకు ఆనందాన్ని పొందుతున్నామనే అభిప్రాయం కలగచేయడానికిగాను వ్యర్థప్రయత్నం చేస్తాము.

పసితనమునుండియు మీబుద్ధిలో అభివృద్ధికరములు, బలప్రద ములు, లోకోపకారములగు భావములనే ప్రకాశింపనిండు.

మానసికంగా, శారీరకంగా తను యితరులను బాధపెట్టకుండా, యితరులు తనను బాధించినా వారిబలహీనత గుర్తించి తనవ్యక్తిగత విలువలు కాపాడుకుంటూ వారిని సంస్కరించాలి.

కృషితోఆరోగ్యం, ఆరోగ్యంతో సంతృప్తి ఉత్పన్నమౌతాయి.

కాముకులకు యిదిచేతనం, అదిఅచేతనం అనే వివేకంవుండదు.

శైలినిబట్టి వ్యక్తిని గ్రహించవచ్చును.

పొగడ్తపొందాలని బలమైన కాంక్షఉన్నపుడే మానవుడు మహ త్కార్యాలు సాధిస్తాడు.

క్రూరత్వమువల్ల క్రూరత్వమూ, సౌజన్యమువల్ల సౌజన్యమూ సిద్ధిస్తాయన్న నిజాన్ని మనం పరిపూర్ణంగా గ్రహించి తీరాలి.

శిశువు జన్మించినపుడు తల్లిదండ్రులు పడేయాతనకు యేమిచ్చినా ఋణం తీరదు. తల్లిదండ్రులకు నూరేళ్ళు సేవచేసినా ఆఋణం తీరేది కాదు.

ఒకరు తానుపదేశించిన దాని ననుసరించి చూపినగాని కేవలం శుష్కోపన్యాసమువలనను, పుస్తక ప్రకటన వలనను కార్యమవదు.

మానవజీవితమే ఒకమహాసాహసిక యాత్ర.

సంతాన నిరోధము భారతదేశములో స్త్రీలకు ఆశాజ్యోతివంటిది. ఇది స్త్రీల అభివృద్ధికి ఒక నవశకము కాగలదు. కుటుంబము, ప్రేమ, భార్య, తల్లి, సంసారసుఖము మొదలైన పెద్దమాటలతో జీవితమును నాశనము చేసుకొనుటకంటె కుటుంబనియంత్రణము ద్వారా స్త్రీలకు మంచి ఆరోగ్యము, ఆత్మగౌరవము, తగినంత విశ్రాంతి లభించగలదు.

మనకంటె భిన్నమైన జీవాత్మ స్వభావాన్ని మనలోని జీవాత్మ ద్వారా మాత్రమే తెలుసుకుంటాము.

యెంతవరకు తెగింపు చేయగలరో అంత అపకారమూ, యెంత వరకు తప్పనిసరిగా చేయాల్సివస్తుందో అంత మంచిని కూడాచేస్తారు మనుష్యులు.

ఈశ్వరుడు ఒకరిపాపమునుగాని పుణ్యమునుగాని గ్రహింపడు. ఆత్మస్వరూప విరోధియయిన ప్రాచీన కర్మమే ఆత్మస్వరూపమును కప్పియున్నది. కనుక ప్రాణులు చేయుచున్నట్టి కార్యములకు తామే కర్తలని మోహమునందు చుందురు.

మనదృష్టిలో, యీసృష్టిలో అతి నికృష్టంగా బ్రతికే ప్రతి పిపీలికానికి మనమెరుగని ప్రాముఖ్యం ఉంది. "అదేగీత" చెప్పేసృష్టి రహస్యం

అన్యక్షేత్రాలలో చేసినపాపం పుణ్యక్షేత్రాలలో పోతుంది.

అజ్ఞాని మనసు అతని నాలుకలోనే ఉంటుంది. జ్ఞాని నాలుక అతని హృదయంలో ఉంటుంది.

శుష్క స్తని అయిన స్త్రీ రవిక వొదులని నిందించినట్లు బహు సామర్థ్యము కలపండితులకు మాత్రమే అనుభవ యోగ్యములైన కావ్యాలు తమకు తెలియ లేదని మూర్ఖులు నిందిస్తారు.

ప్రజాస్వామ్యం రక్షించడానికి తలపెట్టిన యుద్ధం చివరకు సైనిక నియంత్రత్వానికి దారితీస్తుంది.

కాలం నిజమైన విలువ తెలుసుకో. ప్రతిక్షణాన్ని గట్టిగా చే జిక్కించుకొని పరిపూర్ణంగా అనుభవించి, ఆనందించు. బద్ధకించి కాల క్షేపము చేయకు. నేడు చేయవలసిన పని రేపటికెన్నడూ వాయిదా వెయ్యకు.

తలిదండ్రులు, పెళ్ళాం, బిడ్డలు, సోదరులు, అతిధులు వీరిని వదలిపెట్టి ఏపరిస్థితిలోను గృహస్థు భుజించరాదు.

నీలోని మానవతకి నీదైవత్వాన్ని మేళవించు. అప్పుడు నీ చుట్టూవున్న యీప్రపంచం అతి మనోజ్ఞమూ,మధురరాగ సమ్మేళనమూ.

తప్పనిసరిగా అమానుషంగా ప్రవర్తించ వలసినపుడు సామాన్య మానవుడు తప్పుచేయడం సహజమేనని తన్నుతాను సరిపెట్టుకుంటాడు.

తల్లిమోకాళ్ళమీద కూర్చుని వినిన కథలను యెన్నడూ పూర్తిగా మరువలేనివి. మండుటెండవంటి కాలమనే యడారిలో సాగుతున్న మన జీవితం అనే చిన్న సెలయేరు.

స్వలాభాపేక్ష విడిచి శాశ్వితమైన సత్యాన్నితృష్ణతో అన్వేషించ డమే స్వేచ్ఛాజీవి ఆరాధన.

అపాయాన్ని గుడ్డిగా నివర్తించుకోవడం సహనం అనిపించు కోదు. అపాయాన్ని ముందుగా గుర్తించి జయించడంలోనే సహనం యిమిడి యున్నది.

ఏపురుషులకు ఆత్మస్వరూప జ్ఞానము ప్రాచీన కర్మలన్నిటిని నశింపచేయునో ఆపురుషులకు అపరిచ్ఛిన్నమైన ఆయాత్మజ్ఞానం సూర్యునివలె వెలిగి అన్నిటిని ప్రకాశపరుచును.

మహానుభావులకు యిచ్ఛాశక్తి వుంటుంది. సామాన్యులకు యిచ్ఛ మాత్రమే వుంటుంది.

మనకాలం అంతా పరమేశ్వరునిదే అయినప్పుడు ఒక్క క్షణ మైనా ఎలాగ వ్యర్థం చెయ్యగలము? ఇలాగే మనం భగవంతుని వార మైనప్పుడు వ్యర్థసుఖాలకోసం మన వ్యక్తిత్వం అల్పమాత్రమైనా ఎలా వ్యర్థంచెయ్యగలం?

సుఖంకాని, దుఃఖంకాని యెవరివల్లనో కలిగిందనుకోవటం తెలివితక్కువ.

మనదేశానికి మిధ్యావాదులూ, వేదాంతులూకాదు కావలసింది. దృఢశరీరులూ, దృఢసంకల్పులూ కావాలి.

అజ్ఞానమే అనుమానం కన్నతల్లి.

నైతికంగా మనజీవితం రెండుభాగాలుగా విడివడు నట్లున్నది. మొదటిది - అవినీతికి పాలుపడడం. రెండవది - అలాకాలుజారకూడ దని బోధించడం.

ప్రతిపనిని తొందరపడకుండా జాగ్రత్తగా ఆలోచించి చేయాలి.

నీచులను యాచింపరాదు.

దారిద్ర్యం అనేక అనర్థాలకు పుట్టినిల్లు. మనస్సును చిందర వందరచేసి మనిషిలోని నీచత్వాన్ని బయలు పరుస్తుంది. దారిద్ర్య నాశనమే లోకకల్యాణ హేతువు.

నిజమైన స్వర్గసౌఖ్యాలను చవిచూడలంటే "గీతాపఠనం" కన్న ''పుట్‌బాల్'' ఆటలో ప్రావీణ్యం కావాలి. మానసికంగాను శారీర కంగాను పెరుగుదలయే స్వర్గసౌఖ్యాల నిస్తుంది.

ప్రేమ ప్రపుల్ల హృదయమే నిజమయిన విజ్ఞానము.

తనకాలంలో వ్యాపించే మూఢనమ్మకాలను నాశనం చేయడం ప్రతివ్యక్తి కర్తవ్యం. యెంతోమంది స్త్రీలు, పురుషులు, — తల్లులు, తండ్రులూ మనస్ఫూర్తిగా మూఢనమ్మకాలు తప్పు అని నమ్ముతూనే వుంటారు. అయినా తమ పిల్లలు మూఢనమ్మకాలలో కొట్టుకుపోతూవుంటే వూరుకుంటారు.

పిరికి పందలు తప్ప మరెవ్వరూ అబద్ధాలాడరు.

ఆత్మజ్ఞానముచేత సమస్త కల్మషములను బోగొట్టుకొనిన వారును, ఆత్మయందే అధ్యవసాయము గలవారునూ, ఆత్మయందే మన సును నిల్పిన వారునూ, ఆత్మయందే అభినివేశము గలవారును, ఆత్మయే పరమ ప్రయోజనముగా గలవారనూనై పునరావృత్తి రహిత మైన శుద్ధాత్మ స్వరూపమును బొందుదురు.

డబ్బు మనిషిని చేయడం ఎవరైనా చూశారా? మనిషే డబ్బును చేస్తాడు.

ఐశ్వర్యాలకి, భోగాలకి వ్యామోహపడే నేటి మన సంఘానికి విజ్ఞానంయొక్క విలువ తెలియదు. మానవజాతి చిరకాలమునుండి కూడ బెట్టుకుంటున్న అమూల్య ఖనిజ విజ్ఞానము. ఆ విషయం గ్రహించ

లేదు మనసంఘం. పరిశీలనా శక్తిలేని యాత్రికుడు రెక్కలు లేని పక్షితో సమానం.

ముందువెనకల ఆలోచించకుండా తొందరపడి ఏపని చెయ్యకూడదు. అవివేకమే ఆపదల కన్నిటికి కూడలి.

వర్గాతీతమైన సంఘంలో సాహిత్యం వికసిస్తుంది.

చిన్నపామునైనా పెద్ద కర్రతో కొట్టవలెను.

మాతృహృదయమే పసివాని పాఠశాల.

చదివి గొప్పవారైన స్త్రీలు యీదేశంలో లేన్నట్లున్నారు. మళ్ళీ చదువు వల్ల చక్కని పాలిష్ వచ్చిన పురుషులు వున్నారు.

జ్ఞానైక స్వరూపముగల ఆత్మలు సర్వత్ర యేక రూపమై యుండుటవలన పండితులు, విద్యా వినయములుగల బ్రాహ్మణుని యందును, పశువునందును, గజమునందును, శునకమునందును, ఆశునకమును భక్షించెడి చెండాలునియందును సమదృష్టిగల వారలై యుందురు.

ప్రపంచంలో అత్యద్భుతమైన అసత్యం - ప్రజాభిప్రాయం.

అతి పరిచయం పనికిరాదు.

నావాళ్ళకోసం నన్ను శ్రమపడనివ్వండి. అందులోనే నాకు ఆనందముంది.

సౌఖ్యమనేది ఆత్మలోని పరిమళం. హృదయం అంతరాంతంలో నివసిస్తూ గానం చేస్తున్న జీవితమే ఆత్మ. ఆత్మ గీతాలన్నిటిలోను సౌందర్యోపేతమైనది కరుణ.

ఉదారహృదయులు విభిన్న ధర్మాలలోని సత్యాన్ని వెదకి గ్రహిస్తారు. సంకీర్ణ హృదయులు కేవలం భేదాల్ని వెదకి కలహిస్తారు.

మూఢ నమ్మకాలకు పునాది అజ్ఞానము, నాలుగు వైపుల గోడలు నమ్మకము, పైకప్పు ఫలితంలేని ఆశ. మూఢ నమ్మకం అజ్ఞాన జనితం. అది బాధలకు తలి.

అసత్యానికి అనుంగు సోదరుడు అతిశయోక్తి. ఇద్దరూ నిందార్హులే.

యెవరికోపం వారికే అపకారం చేస్తుంది. ఎవరిశాంతం వారికి ఉపకరిస్తుంది.

మానవ సంఘానికి లాభాలకోసం పాకులాడకుండా ఒక మహాత్కార్యం సాధించడంలో తమ సర్వస్వం అర్పించి స్వార్థం మరచి నిరంతరం ఉన్నతాశయాలు సాధించడంలోనే తన్మయులు కాగల మహామహులు కావాలి.

మూర్ఖుడు తనకోటుకు జరీ అంచులు కుట్టించుకోవచ్చు. అయితేనేం — అతను మాత్రం మూర్ఖుడే.

పేదలంటే కనికరంకలవానికే దేవుని ఆశీర్వాదం. (బైబిలు)

మానవునికి ఆలోచించుకునేశక్తి, ముందుకుచూచే శక్తివుంది. కనుక జీవితానికొక ఆదర్శాన్నుంచుకొని ప్రయోజనయుక్తంగా చేసుకోవచ్చు.

ఖడ్గాన్ని రద్దుచేస్తుంది ఖడ్గం. సైన్యాన్ని సైన్యం తిని వేస్తుంది. రైతు పొలములో నాగలి దున్నుతూ కలకాలం వుంటాడు.

కంఠస్తంగాని విద్య నిరర్థకం.

దయతో పరోపకారంచేస్తే మంచిదే. కాని మనిషిలో దైవత్వాన్ని గుర్తించి సేవాబుద్ధితో చేసిననాడు అది అద్వితీయ మవుతుంది.

ఎప్పుడూ అంతగాలేనివాడే అత్యుత్తమ వుదారస్వభావుడు.

అజ్ఞానములో, అమాయకత్వంలో జీవిత సంస్కారము లేని ప్రజాసామాన్యునకి విద్యా విజ్ఞానం, సమానత్వం, సంస్కారం కలిగించడానికి నిరంతరం కృషిచేయాలి.

నేను ప్రజలను వారి నమ్మకాలబట్టికాక వారిచేతలనుబట్టి పరీక్షిస్తాను. అలాగే వారి ఆదర్శాలు కాదు. వారి ఆచరణ నాకుముఖ్యం.

ఆగ్రహం సింహాసనం అధిరోహిస్తే హేతువు నిష్క్రమిస్తుంది.

సమస్తశరీరమునందలి యాత్మలందు సమదృష్టి వహించి మనస్సును నిలుపువారలు యీ ఆత్మప్రాప్తిసాధనానుష్టానకాలమందే జన్మసంస్కారమును పొందుదురు. ప్రకృతిసంబంధ దోషరహితంబైన ఆత్మయే బ్రహ్మము. కనుక దానియందు మనస్సును నిలిపి సమదృష్టిగల వారందరును బ్రహ్మమందుండు వారే యగుదురు.

పరోపకార జీవితము గడుపుడు.

తనజీవితాన్ని బలిచేయుటకు తగినంత ఆదర్శమేది లేదనుకునే వ్యక్తి జీవించుటకే అనర్హుడు.

దేవుడు! వృధాకవిత హృదయాలలో వుద్భవించి రకరకాల రూపాలను సంతరించుకునే పదం అది. మనిషిబాధలలో, వ్యధలలో వున్నపుడు చప్పున దేవుడు అతని మనస్సులో ఉద్భవిస్తాడు. ఆశ నశించనంతకాలం ఆతని మనసులోని దేవుడు సజీవుడే.

మనిషి మనసును నరకముగా రూపొందించునది అనుమానం.

కష్టాలను ఎదుర్కొనడంలో మహాత్ములకు సామాన్యులు సాటిరారు. సానబడితే వజ్రంతట్టుకో కలిగినట్లు మట్టిపెళ్ళ తట్టుకొన జాలదు కదా.

చిప్పలోని నీరు చీమకుసముద్రమువలె తోస్తుంది.

సద్గురువు దొరకడం దుర్లభం.

అంటరానితనం మనలో ఉన్నన్నాళ్ళు మనం మానవులం అనిపించుకోము.

నా మనసు ఉత్తమసంకల్పములు గలదియగుగాక!

ఉత్తముడు మాటలలో మూగిగాను చేతలలో చురుకుగాను వుంటాడు.

ప్రేమలేని చోట బాధవుండదు.

మానవుడు చేసేది-కోతులు చేయనిది సంస్కారమనబడుతుంది.

స్థిరమైన ఆత్మయందు అధ్యవసాయము కలిగి దేహమందు ఆత్మభ్రమమును ఆత్మయందు దుఃఖత్వ జడత్వాది భ్రమమును వదలిబ్రహ్మనిష్ఠుండైన బ్రహ్మవేత్త ప్రియమును చూచినప్పుడు సంతోషమును, అప్రియమును చూచినపుడు వ్యసనమును లేనివాడై యుండును.

నమ్మకం కలిగించే తప్పిదాలు అపనమ్మకం సృష్టించే యోచనలకంటెగొప్పవి.

ధనమిచ్చేవానికి పుచ్చుకునేవానికి గగుర్పాటు గలిగించాలి. యుద్ధంచేస్తే చూసేవార్కి శత్రువుకి ఆశ్చర్యం కలిగించాలి. ఏదైనా చదివితే విన్నవారికి మైమరపు కలిగించాలి. లేకపోతే ఆదానం, యుద్ధం, పఠనము అంతావ్యర్థమే.

చనిపోతూ సంగీతం వినగలిగితే నాకదే పదివేలు. నేనంతకన్నా కోరుకోవలసిన ఆనందమేమిలేదు.

దేవుళ్ళను మానవాతీతమైన వ్యక్తులను, శక్తులను, విసర్జించడమే లక్ష్యంకాదు. ఒకలక్ష్యం చేరడానికి అది సాధనము. అసలు లక్ష్యం మానవాళిసుఖం.

అన్యాయం యెక్కడవున్నా ప్రతీచోటావున్న న్యాయానికి ప్రమాదం తెస్తుంది.

అహంకారము ప్రాణికి ప్రధానశత్రువు.

దుఃశ్చింత వుంటే కొట్టడానికేదోగురి దొరకనే దొరుకుతుంది. దానిపై కాల్చడానికి ఏదో సాకుచిక్కనే చిక్కుతుంది.

జీవితం పరిమితమైనది. దానిలో ప్రశాంత సమయాలు యింకా పరిమితమైనవి. కనుక వాటిని శుష్క గ్రంథాలను పఠించడంలో దుర్వినియోగం చేయరాదు.

మనం గమ్యస్థానం చేరేవరకు కర్మబద్ధులమే. మన ఆశయాలను, ఆచరణలనుబట్టి మనపురోగతి నిర్ణయమవుతుంది. మనగత కర్మలను బట్టి ప్రస్తుత స్థితి కలిగింది. అలాగే యిప్పటి కర్మలనుబట్టి మన భవిష్యత్తు నిర్ణయమవుతుంది. మరణము, పునర్జన్మ మన గమనానికి ఆటంకాలు కావు. మనవర్తమాన స్థితికి మనమే కారకులము.

మహత్తర వైజ్ఞానిక విజయాలు ఏకొద్దిమందికో వుపయోగ పడకూడదు. అవి సకల దేశాలకూ, కార్మిక సామాన్యమంతటికీ ఉపయోగపడాలి.

లోభికి చేయరాని పనంటూలేదు.

ఓడిపోవుదునేమోనని భయపడేవాడు వీగిపోవుట తథ్యం.

భౌతికాభ్యుదం పొందాలనే సంకల్పం, ఆధ్యాత్మికాభ్యుదం పొందాలనే సంకల్పం ఏకమయి ఆధునిక నాగరికతకు పునాదులు వేస్తున్నాయి.

"పార్థసారథి" దేవాలయానికి పోయిచూడండి. రేపల్లెలోని గొల్ల వారందరితోనూ కలసి తిరిగి, వారికోసం తన శక్తిని వినియోగించి వారి ఆపదలలో తన అండ చూపిన త్యాగపూరిత నిర్మల నయనాలు దర్శిన మిస్తాయి మీకు. మరి మీరు.......?

స్త్రీ కి ప్రకృతి సమర్పించే మొదటి బహుమానం అందం. ముందుగా వెనక్కి తీసుకునేదీ దానినే.

తార్కాణాలు చూపించడానికి బదులు, వుద్రేకాన్ని కనబరచ దలచుకున్నపుడే మనం విశ్వాసం గురించి మాట్లాడుతాము.

ఆత్మకంటె బాహ్యములైన విషయములందు ఆశక్తిలేక ఆత్మ యందు మాత్రమే సుఖమునను భవించెడి పురుషుడు బ్రహ్మధ్యానాభ్యాస ముతో గూడిన మనస్సు కలవాడగుచు బ్రహ్మానుభవమగు శాశ్విత సుఖము ననుభవించును.

ఇంకొక జాతివారి ఆచారాలను నిందించవద్దు. అవివారికి మంచివి కావచ్చు. వారి ఆహారం మనకు విషతుల్యము కావచ్చు.

ఉపనిషత్తులలో వర్ణింపబడిన బ్రహ్మస్వరూపమును నేనెప్పుడును మరువకుందునుగాక.

ప్రపంచ ధోరణినిబట్టి పరిశీలిస్తే నిజాయితీపరుడు కావాలను కుంటే పదివేలమందిలో ఒక ప్రత్యేకవ్యక్తి కావడమన్నమాట.

ఒకశత్రువున కింకొకవైరి, ఒకద్వేషికి మరియొకద్వేషి ఎంతక్లేశ మును తీసుకొనిరాగలరో అంతకన్న మిన్నయైన క్లేశమును దుష్టపథము నవలంభించిన చిత్తము తేగలదు.

నీతివాదులు, దీక్ష, ఓరిమి, ప్రయత్నాలకు పట్టంగట్టి విజయాన్ని ఘనతగానూ, పరాజయాన్ని లోపంగాను చిత్రించి, కడగండ్లలోకూడా మనిషి మనిషిగానే మనగలడనే శుష్కవాదాన్ని నమ్మజూపిస్తారు.

గొప్పవాడు తానువెదికేదాంట్లో లీనమైపోతాడు. తుచ్ఛుడు తాను వెదికేదాంట్లోకాక రెండవదానిలో కలుస్తాడు.

ప్రతివ్యక్తియు తాను పయినించవలసిన మార్గమున కూలంకష ముగా నెరుగవలెను.

చేపపిల్లకు ఈత నేర్పనవసరములేదు.

వివేకహీనులు పశుతుల్యులు.

భగవంతుడు విశ్వాన్ని ఎలా పరిపాలిస్తున్నాడో తెలుసుకోవ డానికి వార్తాపత్రికలు చదువుతాను.

విషయేంద్రియ సన్నికర్షము వలన గల్గిన సుఖములకు ఉత్పత్తి నాశములు కలవు. అవి దుఃఖ కారణము లైనందువల్ల ఆత్మజుడట్టి భోగములందు ఆసక్తినుంపడు.

పురాణ శ్రవణంవల్ల చిత్తశుద్ధి కలిగి మనస్సు ఇంద్రియ దశ కాన్ని పరమార్థము వంకకు తీసుకుని వెళ్ళుతుంది.

మనకి సంపూర్ణమైన సత్యస్వరూపం తెలియదు. కనుక ఏది సత్యం! ఏది నిత్యం! అని అడుగుతూ కూచోనక్కరలేదు.

పాపమనునది ఒకటి కలదని వేదాంతము అంగీకరింపదు. పొర పాట్లు వుండునని మాత్రము అది అంగీకరించును. దానిప్రకారము

పొరపాటు అన్నిటిలో మిక్కిలి హేయమైనది "నేను దుర్బలుడను, నేను పాపిని. నేను నీచుడను, నేను శక్తి హీనుడను, నాకీ పని చేయ సమర్థత లేదు. ఆపనిచేయ సమర్థతలేదు" అని పల్కుటమే. భగవంతుని ఉనికియందు విశ్వాసము లేనివాడు నాస్తికుడని ప్రాచీన మతములు పలికిన విశ్వశక్తియందు విశ్వాసము లేనివాడు నాస్తికుడని ఈ నవీన మతము పలుకుచున్నది.

బీదవాళ్ళలోనూ, రోగులలోనూ, ఆపదలలో చిక్కుకున్న వారిలోనూ, శివసాక్షాత్కారముపొంది సేవచేయగలిగిన వారిని శివుడు తప్పక కాపాడుతాడు.

ఏదో ఒక కాంక్షలేనివాడు బ్రతుక వలసిన అవసరమే వుండదు.

చాలా దీపాలొకేసారి వెలుగుతూ వుండవు. ఎప్పుడూ ఏదో ఒక జ్వాల వెలుగుతూనే వుంటుంది. లోకంలో పాతవిశ్వాసం ఆరిపోతూనే క్రొత్తవిశ్వాసం వెలిగింప బడుతుంది.

స్త్రీలు, బాలురు, వృద్ధులు, దరిద్రులు, రోగులు, వారిని మృదువుగా దండించాలి. అంటే వేళ్ళు బద్దలు తాళ్ళతో కొట్టే శిక్షమాత్రమే విధించాలి.

ఈశ్వర బలం, సత్యబలం ముందు మనుష్యబలం, ధనబలం, అధికారబలం ఎందుకూ కొరగావు.

దూరం కరిగిపోతోంది. కాలం మరిగిపోతోంది. స్నేహితుడా! మానవుడిగా మేలుకొనుము. ఈ ప్రపంచాన్ని సమస్తము ఏలుకొనుము.

ఇస్లాంమతం ప్రకారం నమాజుచేయని ముస్లిములు తమ మత ధర్మమును విడిన వారగుదురు. నమాజుదేవునికి చాలా ప్రియమైనది.

ప్రతిదినము అయిదుపూటలు నమాజు చేయవలెను. ప్రతి ముసల్మాను డును నమాజు చేయుటయందు శ్రద్ధకలిగి యుండవలెను. నమాజు సలుపుటచే భక్తుల పాపములు తొలగును. ఆత్మశుద్ధి లభించును. మోక్షము చేకూరును.

విశ్వాన్నంతా తనలో చూసుకోగల్గిన మానవుడు పుట్టుకురావ టానికి ప్రజాస్వామిక విధానం పునాది.

తన్ను తాను పొగడుకోరాదు.

సుఖం అనేది కష్టాన్ని తోడుగా తీసుకునే వస్తుంది. రెంటినీ సమా నంగా చూచి ఆహ్వానించిననాడు హృదయం నిర్మలమై. దుఃఖానికి దూరంగా నిజమైన సుఖానికి చేరువుగా నిలిచిపోతాడు మనిషి.

నేరం చేసినవాడిని శిక్షించడమే ప్రధానంకాదు. నేరంచేయడానికి ఏపరిస్థితులు పురిగొల్పుతున్నాయో వాటిని తొలగించటం ముఖ్యం.

ఏ పురుషుడు శరీరమును విడుచుటకు మునుపే సాధనాను ష్ఠాన కాలమునందే ఆత్మానుభవ ప్రీతిచేత కామక్రోధాదుల వేగమును జయింప సమర్థుడగునో వాడే ఆత్మానుభవమునకు యోగ్యుడై పిదప బ్రహ్మానంద జ్ఞానము ననుభవించును.

నన్ను పాపము మరియు మృత్యువు బాధించకుండుగాక.

చేష్టలు అవస్థాను గతముగా క్రియలు సమయాను కూలంగా వుండాలి. ఏపనైనా ప్రారంభించేముందు కాలమానపరిస్థితులను చక్కగా అంచనా వేయాలి.

జగమెరిగిన బ్రాహ్మణునకు జంధ్యమనవసరం.
మిత్రద్రోహం చేస్తే నరకం తప్పదు.

మేల్కొనండి! .... మేల్కొనండి! .... జగత్సత్యస్వరూపం మటుమాయ మవుతుంటే నిద్రపోతున్నారేం .... ....

ఎవడు అంతరాత్మయందే సుఖము గలవాడై ఆత్మారాముడై ఆత్మజ్ఞానము గలవాడై అంతః ప్రకాశకుడై యుండునో ఆయోగి బ్రహ్మస్వరూపుడై ఆత్మానుభవమును పొందును.

గతాన్ని తలచి వగచడం విజ్ఞుల లక్షణంకాదు. అతిధియగు వైరినైనను గౌరవింపవలయును. తన్ను నరుకుటకు వచ్చిన వానినైనను వృక్షములు తమ నీడ నొసంగుచున్నవి గదా!

రాత్రి నీవు లేచినపుడు నీతప్పులను విచారించుకో. ఇతరుల తప్పులను నిద్రలో విచారించు.

మానవుని మొదటి గృహం తల్లి ఒడి. అతడు పెరిగి పెద్దవాడైన కొద్దీ ఆగృహం విస్తరిస్తుంది. చివరకు ప్రపంచమే అతడి గృహం.

ఒకవ్యక్తి మరోవ్యక్తినుంచి మంచితనాన్ని మాత్రమే ఆశించడు. క్రూరత్వం, మూర్ఖత్వం కూడా కోరుతాడు. అందుకే ఈలోకం యింత దుఃఖదాయకమైనది.

ప్రపంచం ఒక గ్రంథం. ఎప్పుడూ ఒకేచోట పాతుకుపోయే వారా గ్రంథంలో ఒకపూట మాత్రమే చదువుతున్నారు.

ఎన్నడూ అప్పు తీసుకోకు. ఎన్నడూ అప్పు యివ్వకు.

సంఘ సంబంధాలలో ఘర్షణ, ఉద్రిక్తత లేకపోవడం మాత్రమే నిజమైన శాంతికాదు. నిజమైనశాంతి అంటే సర్వత్రా న్యాయం గోచరించాలి.

కేవలం నరకంలోనికి చూస్తూ కూచుంటే చాలదు. నీజీవితం అంతటితో ఆగిపోతుంది. ఆనరకంలో వున్నవారికి చేయందించి వారిని లేవతీయటానికి ప్రయత్నించాలి.

ఉన్నత మానశిక శక్తులవలెనే, ఉన్నతనైతిక శక్తులుకూడా సంకేర్ణాలు.

నీవు యవ్వనుడుగా నుండగనే దేవునితో సమాధానపడుము. తన వాక్యమును చదువుము. నీయొక్క జీవిత సంవత్సరములు నియమితములో నుండగనే తనమార్గములలో నడువుము. అవ్విధముగా రానైయున్న సంవత్సరములలో దేవునిసేవించి ఆయన మనుష్యుడుగా నుండి ఆశీర్వాదకరమైన సేవచేసి దానికి జీవమను ఫలమును పొందుము.

తలిదండ్రులు యిద్దరు బిడ్డలను పెంచి పెద్దచెయ్యాలని, తండ్రి యింగితాన్ని బిడ్డలు తెలుసుకునేట్లు కొంతకృషి తల్లిచేస్తున్నమాట నిజమేకాని తరచు భార్య భర్తను తప్పు పడుతుండటం వినుక్కోవడం మంచిదికాదు. భార్యాభర్తల తత్వాలు ఏడదారి పెడదారిగా వుంటే పిల్లలు చెడిపోతారు. ఈఊగిసలాట సందిగ్ధ పరిస్థితికే దారి తీస్తుంది, బిడ్డను ఏక్షణాన తల్లిమనసు ఎట్లామారుతుందో అన్నఆవేదన చివరకు ఏంచేస్తే ఏమవుతుందో నన్నభయం కుంగదీయక తప్పదు.

సత్యమైన వాక్కులు ఎంతశక్తిమంతములు? (బైబిలు).

హంస ఏ రీతిని నీరమును క్షీరమును వేరుచేసి క్షీరమును గ్రహించుచున్నదో అదేరీతిని మానవుడు ప్రపంచములోని పాపకార్యములను వేరుచేసి పుణ్యమునే గ్రహించవలెను.

దుర్జన సహవాసం చేయరాదు.

ప్రపంచానికి కావలసింది శీలం. త్యాగశీలంతో యితరులను హృదయపూర్వకంగా ప్రేమించగలిగినవాడొనరించే ప్రతికార్యము స్వర్ణాక్షరాలతో లిఖింపబడుతుంది.

ఇతరులకు ఆజ్ఞలిచ్చేబదులు వాళ్ళకేదైనా సహాయం చెయ్యి.

పాపరహితులును నిశ్శంశ యాత్ములును ఇంద్రియ జయశీలురును సమస్తప్రాణిహితైషిణులునైన ఋషీశ్వరులు ఆత్మప్రాప్తికి విరోధములైన సకల పాపములను పోగొట్టి బ్రహ్మానందమును చెందుదురు.

జిజ్ఞాస, పరిశీలన, పరిశోధన, ఆలోచనలు ప్రోత్సహిస్తాము. ప్రతీవిషయం మాకుతెలుసునని ప్రతీసమస్యను పరిష్కరించామని మేమునటించము. అయితేదేవునికి భయపడేకంటె మానవులనుప్రేమించడం మంచిదని, ఒకమౌఢ్యాన్నినమ్మి గుడ్డిగా అనుసరించే బదులు స్వయంగా ఆలోచించడం పరిశీలించి నిర్ణయానికి రావడం గౌరవప్రధంగాను హుందాగాను వుంటుంది.

రచనా వ్యాసంగం జీవితంకాదు. జీవితంనుంచి పలాయనం కాదు. అదిఒక వృత్తి. ప్రతివృత్తికి కొంతవిద్య, కృషి, శిక్షణ, నిజాయితి, బాధ్యత అవసరం.

తనపాపము తన్నే కొట్టును.

విద్యార్థికి సుఖాశక్తి కూడదు.

సమానస్థాయిలో నున్న స్నేహితులను స్నేహం చేసుకోవడం అంతమంచిదికాదు.

కామక్రోధములును త్యజించి అతఃకరణంబును నియమించి

జితేంద్రియులై ఆత్మస్వరూపము నెరింగిన యతీశ్వరులకు చూచిన చోటనంతయు బ్రహ్మానందము కరస్థంబైయుండును.

అసంపూర్తిగా జరిపిన కార్యక్రమము అవతలకు విసిరివేయదగిన ఉడకని రొట్టివంటిది.

ఆత్మహత్య అర్థంకాని విషయం. ఎలాటి బాధలలోమునిగియుంటేమాత్రం పోరాటంచాలించి మనిషిలొంగిపోవడం - బోధపడదు. బాధలు వాటిని ప్రతిఘటించి పోరాడటం సహజమైన విషయాలు. అవే ప్రపంచానికి వెన్నెముక.

కోరినది యిచ్చేదాత యేలోకానికి యిష్టం. కాని కోటీశ్వరుడు కాదు. మేఘాన్ని లోకులు కాంక్షిస్తారు కాని జలనిధి సముద్రాన్నికాదు.

బుద్ధుని వాక్యము :- మానవుడు తనబాధలు భస్మమై పోవాలంటే ఏ జీవిని బాధింపరాదు తన దుఃఖములు రూపుమాసి పోవాలంటే యే జీవిని తాను దుఃఖపెట్టరాదు. తన కష్టములు నశించాలంటే ఏ జీవిని తాను కష్టపెట్టరాదు. పాడిపంటలు కావాలంటే సాధు జీవహింస మానాలి. తాను అభివృద్ధికి పోవాలంటే త్రికరణ శుద్ధిగా వుండాలి. దేవుళ్ళను పూజింపకపోయిననూ తనకు బాధలు రావుగాని జీవులను బాధించిన తాను బాధలొందుట నిజము, జీవులను రక్షింపకున్న తనకు అధోగతి రాదుగాని జీవహింస లొనర్చిన తాను అధోగతి పొందుట ఖాయము. ఉపకార మొనర్చక పోయిన తనకు పాపము రాదుకాని అపకార మొనర్చిన తాను పాపాత్ముడగుట ధృవము. సన్మార్గము నవలంభింపక పోయిన ఉపద్రవంరాదు కాని దుర్మార్గము నవలంభించిన తాను ఉపద్రవము లొందుట నిక్కము. ప్రాణులను సంతోష పెట్టుట సన్మార్గము. ప్రాణులనుదుఃఖపెట్టుటే దుర్మార్గము. గోసంతతి మాత్రమే

పవిత్రమనియు యితర జీవులను భక్షింప వచ్చుననియు తలచవద్దు. దేశ క్షేమమునకు జీవులన్నియు అవసరమే. మీకు శక్తియున్న కౄర జంతువులవల్ల గూడ వుపయోగముఖ పొందవచ్చును.

అధితిని ద్వారంవద్ద విడిచి గృహస్థు తాను భోజనం చేస్తే ఆపట్టిన అవుపోసన సురాపానంతోనూ అన్నం గోమాసంతోనూ సమాన మౌతుంది.

వర్తమాన యుగంలో నిరీశ్వరవాదంకంటె మూర్ఖ విశ్వాసాలే ప్రమాదకరములుగా వున్నాయి. విశ్వాసం మనలో యెప్పుడూ వుంటుంది. జయం మారుతూవుంటుంది.

రచనలో ఒకనీతిని తేల్చిచెప్పేదానికంటె ఒకసంస్కారము, ఒకదృష్టిని పాఠకునికి కలగించడం ఉత్తమం. అప్పుడేచదువరి తనంతట తాను చాలా తెలుసుకోగలుగుతాడు.

చీకటిని చీల్చుటకు చాట ఒకచిన్నదివ్వె. కారుణ్యంచూపి క్రూరత్వం బాపుటకు చాలు ఒకత్యాగం.

దౌర్జన్య కృత్యాలు, విధ్వంసక చర్యలు ఏవుద్యమానికైనా తీవ్ర కళంకాశే.

నిర్మాణ శిల్పములో గొప్పనైపుణ్యం సంపాదించి నప్పుడెల్లా మానవులు ఎత్తైన కట్టడాలను నిర్మిస్తూ వచ్చారు.

చేసిన పాపకృత్యముల ఫలమునుండి తప్పించుకొని సుస్థిరముగా క్షేమంగా నివసింపదగిన ప్రదేశం భూమిలోగాని, అంతరిక్షమునగాని, సముద్ర మధ్యమునగాని, పర్వత గుహలలోగాని, కనిపించదు.

మానవుడు పురోగమిస్తున్నకొలది తన హక్కులకు ఎక్కువ విలువయిస్తాడు. మనహక్కులకు మనం ప్రాముఖ్యత యిస్తున్నకొద్ది యితరుల హక్కులను గుర్తించడం ప్రారంభిస్తాం. అందరుమనుషులూ తమకు వున్నాయనే హక్కులన్ని యితరులకు కూడా యివ్వడం ప్రారంభిస్తే యీప్రపంచం నాగరిక ప్రపంచం అవుతుంది.

నమ్మికకు మనకు కావలసింది అసలు విషయం ఏమిటో కనుక్కుందామనే జిజ్ఞాసకాని దృఢవిశ్వాసంకాదు. మొదటిది రెండవ దానికి విరుద్ధం.

బాహ్యములైన శబ్దాది విషయములను బాహ్యమందే విడిచిపెట్టి దృష్టిని భ్రూమధ్యమున నిలిపి నాసాభ్యంతరమందు సంచరించెడి ప్రాణాపానములను సమగమనంబుగావించి యింద్రియమును, మనస్సు, బుద్ధి, వీనిని నియమించి మోక్షపరాయణుండై యిచ్ఛాభయ క్రోధము లను పరిత్యజించి ఆత్మావలోకనంబు చేయువారు సదాముక్తుడగు చున్నారు.

ఒక బ్రహ్మాండ మయిన వృక్షము ఒక చిన్న విత్తనమునుండి వుద్భవిస్తుంది. కాని ఆవిత్తు పూర్తిగానశించి ఆచెట్టుకు రూపమిస్తుంది.

సాహిత్య నిరాడంబరత సాధించుకో వలసిందేకాని సహజ సిద్ధమైనది కాదు.

యువతులు మనస్సును హరించేటంత మనోహరంగా ఉన్నారు. మిత్రులు, సహృదయులు అనుకూలురు. బంధువులు మంచివారు. సేవకు ప్రేమతో వినయంగా మాట్లాడుతారు. ఏనుగులు గోవాడుతుండగా తురంగములు ఉత్సాహతరంగితములుగా వున్నాయి. సకలభోగాలు సర్వ సంపదలు వున్నప్పటికీ కన్నుమూస్తే యివేమీలేవు. కూడా రావు.

పవిత్రతత గౌరవాలు అనే రూపాల చాటున మన మనో వికారాలను యెంతగా కప్పిపెట్టుకోవాలని ప్రయత్నించినా అవి ఆతెరగుండా కనిపిస్తూనే వుంటాయి.

తన్నుమాలిన ధర్మంలేదు.

అన్ని మంచి గుణాలకు గట్టి పునాది వినయమే.

సుఖ దుఃఖముల మధ్యనున్న భేదము బహు విచిత్రమైనది. ఇతరులతో అనుభవించెడు దుఃఖము దుఃఖమే అని పించదు. అపుడు దుఃఖ పరిమితి తగ్గిపోవును. కాని సంతోషమున పాలు పంచుకొను వారుండిన కొలదియు నది అధికాధిమగును.

మధుర స్మృతులకు మనుష్యులెపుడూ బందీలే.

మాట్లాడే ముందర రెండుసార్లు ఆలోచించు.

చిమ్మ చీకటి మునిగియున్న పట్నంలో ఒకసారి ఎలక్ట్రిక్ దీపాలు వెలిగి కాంతినిండి క్షణాలు-మన జీవితంలో అప్పుడప్పుడూ జత పడుతూ వుంటాయి. హృదయ తమస్సును చీల్చుకుని అందులో ఓ దివ్యజ్వాల చటుక్కున జాజ్వల్యమానమై వెలుగును చిమ్ముతుంది.

నీ అనుభవానికి, జ్ఞానానికి, సరిపడనిమాటలు యెవరు చెప్పినా ఒప్పుకోబోకు. విశ్వసించబోకు.

మహాపురుషులు భగవంతుని యజ్ఞ తపస్సుల ననుభవించువానిగాను, సర్వలోక నియామకునిగాను, సకల చరాచర హితునిగాను సర్వసాక్షినిగాను ఎరింగి మోక్షము చెందుచున్నారు.

శత్రుత్వం అంటే నాకు మృత్యువే! ఆమాట చెవితేనే నాకు అసహ్యం. నేనెల్లప్పుడు సజ్జనులప్రేమను కోరుకుంటాను.

రాజ్యాంగాలిని, కుటుంబ పద్ధతుల్ని. విద్యావిధానాన్ని మార్చ గలము. కాని ఆత్మలోని రోగాన్ని పోగొట్టలేము.

అమ్మకోసం ఆవేదన చెందని జీవివుండదు. అమ్మ మమత జీవితంలో కొన్నిక్షణాలైనా పొందని మనిషి — మనిషి అనిపించుకోడు. ఆమమత యెంత యెక్కువగా యుంటే మనిషిలో అంత యెక్కువ మానవత్వం ఉద్దీప్తమవుతుంది. పరిపూర్ణత సిద్ధిస్తుంది.

ఒకమనిషి తన ప్రకృతి ధర్మాన్ని త్యజించి, కృత్రిమ ఆచారాలకు లోనైనప్పుడు — అది ఏ దుష్పరిమాణాలకైనా దారితీస్తుంది.

స్త్రీయెన్ని కష్టాలను భరిస్తే అంతపేరు సంపాదించుకోగలదు. ఆమెవల్ల రెండురంగాల గౌరవం యినుమడించాలి.

స్వర్గాదిఫలములం నపేక్షింపక కర్తవ్యములైన కర్మముల నాచరించువాడు కర్మఫలత్యాగియైన సన్యాసియును, చిత్తశుద్ధికలిగిన కర్మయోగియు నగునే కాని శాస్త్రీయములైన గార్హస్పత్యాది అగ్నిసాధ్య కార్యములను తపోదానాది అనగ్ని సాధ్యక్రియలను నాచరింపని వాడు కాడు.

స్వేచ్ఛగానూ, నిర్భయంగానూ, జీవించడంకంటె మానవుడికి ముఖ్యమైనది లేదు. బానిసగా చిరకాలం జీవించే కంటె స్వేచ్ఛాయుత పౌరుడుగా కొద్దికాలం జీవించడం మేలు.

ప్రాజ్ఞుడు తన భార్యను ఒంటరిగా వుత్సవాలకు, యాత్రలకు, సభలకు పంపరాదు. బంధువునిగాని, సేవకునిగాని, కుమారునిగాని తోడిచ్చిపంపాలి.

మానవజాతినైతికంగా అభివృద్ధిచెంది సకలకార్యరంగంలోను ఆధ్యాత్మిక, భౌతిక, పురోభివృద్ధి సాధించడమే నాగరికత.

ఈతరంలో మనం పశ్చాత్తాప పడవలసింది దుష్టుల దుర్భాషలకు వారుచేసే హింసాకృత్యాలకు కాదు. "కాలంకలసిరావాలి" అనేదృష్టితో మంచివారు ప్రదర్శించే భరింపరాని నిశ్శబ్దతను, నిర్లిప్తతకు మనం విచారించవలసి ఉంటుంది.

మనఃపరిపాకము ఏర్పడేందుకు సర్వవిధములైన విజ్ఞానాన్ని రుచిచూడటం అవసరం. అప్పుడే మనస్సు సాధ్యమైనంత సంపూర్ణ వికాసాన్ని సాధించగలుగుతుంది.

ఎప్పుడైతే మానవుడు తన శరీరాన్ని, మనస్సును దేవునికి అప్పగించి వేస్తున్నాడో అప్పుడే అతని హేతువాదం మూఢవిశ్వాసానికి బలి అయిపోతుంది. దైనిందిన జీవితంతో గడిస్తున్న ప్రపంచానుభవం జ్ఞానం అతనికి దూరమైపోతుంది. దీనిమూలంగా విమర్శనా జ్ఞానం నశించి సత్యం తెలుసుకోవాలనే జిజ్ఞాస రోతగా కనిపిస్తుంది.

నెత్తిన చేయిపెట్టుకొని ప్రమాణం చేసినంత మాత్రంచేత అందరి మాటలు నిజంఅని అనుకోనక్కరలేదు

మనలోని సద్గుణాలు మనకు తెచ్చిపెట్టేటన్ని అనర్థాలను, అరిష్టాలను మనలోని దుర్గుణాలు తెచ్చిపెట్టలేవు.

తలగడ తిరగవేసినను తలనొప్పి తగ్గదు.

ఏది సర్వకర్మ పరిత్యాగ లక్షణమైన సన్యాసమనం బరుగునో అదియును కర్మానుష్టాన లక్షణమైన కర్మయోగమని ఎరుంగవలయును. సంకల్ప త్యాగము చేయకయే ఎవడును యోగికాడు.

అజ్ఞానం, నమ్మకముల సమాధి, గతశాంతికంటె ఆలోచన, ఆచరణల ఝుంఝూమారుతమే నాకు కావాలి.

జీవితశక్తి సెలయేరులాంటిది. ఈనాడు నిండుగా ప్రవహిస్తుంది. రేపు ఎండిపోతుంది. నిండుగా వున్నపుడే నీజీవిత శక్తిని కాలవలోకి పారించాలి. బుద్ధిని కట్టుబాటులో వుంచుకోవాలి.

ఆకాశంలోని తారలు ఎల్లపుడూ ప్రకాశిస్తూ వుంటాయి. చిత్ర జగత్తులోని తారలు స్వల్పకాలం ప్రకాశించి అటు తరువాత మటుమాయ మవుతాయి.

అజ్ఞానం దేవునిశాపం. జ్ఞానం స్వర్గానికి ఎగుర వీలైన రెక్క.

ఈ మహావిశ్వం అతి ప్రధానమైన నియమం పరివర్తన. పరివర్తన ప్రతిక్షణం అణువణువులోను, నీలోను, నాలోను కూడా జరుగుతూనే యుంది.

మనుష్యులు పరస్పరం ఎందుకు ద్వేషించుకుంటారంటే ఒకరికి మరొకరు భయపడతారు కనుక. వారు పరస్పరం ఎందుకు భయపడతా రంటే పరస్పరసదవగాహన లేదు కనుక. పరస్పర సదవగాహన ఎందుకు లేదంటే ఒకరితో ఒకరికి సంబంధాలు లేవు కనుక. సంబంధాలు ఎందుకు లేవంటే రకరకాలుగా విడివడి వున్నారు కనక.

జ్ఞానయోగము నెక్కుటకు నిశ్చయించిన వానికి ఫలత్యాగ పూర్వకమైన కర్మయోగమును, పిదప చిత్త శుద్ధి ద్వారా జ్ఞానం నెక్కిన వానికి సర్వకర్మ పరిత్యాగమును సాధనములని చెప్పబడుచున్నవి.

మనం ఏమయినా చెడుగా ప్రవర్తిస్తున్నామంటే అందుకు మనలో వున్నఅసాధారణ వాంఛలే కారణం.

సమస్తప్రాణికోటిలోను ఒకేరకమైన జీవితసూత్రములు వ్యాపించి ఉన్నాయి.

మేకలు, గాడిదలు వీటిగిట్టలచే లేచిన ధూళి, చీపురుదుమ్ము, స్త్రీల పాదరజం సోకితే దరిద్రం పట్టుకుంటుంది.

మతనైష్టికులు తమభాధ్యతల్ని మరచిపోవడం వల్లనే కమ్యూనిజం ప్రచారం పొందుతున్నది.

తుపానులో నడిచినప్పుడే నీకు నీశక్తియేమిటో అర్ధమవుతుంది.

యెప్పుడు సమస్తకర్మలను పరిత్యజించి శబ్దాది విషయములందు దగులకయు, సాధనములైన నిత్యనైమితికాది కర్మములందాశక్తి లేక యుండునో అప్పుడేవాడు యోగరూఢుండనబరగును.

మనపూర్వీకులకు దేవుళ్ళను నిర్మించిన కార్ఖానాలేకాక దయ్యాలను తయారుచేసిన కర్మాగారాలు కూడా ఉండేవి.

అతీతమైన ఈశ్వరశక్తికి కట్టుబడి ఉండడమే మతం. మతం భగవంతుడికి మానవునికి మధ్యలంకె.

చెడుని దుష్టత్వాన్ని నిస్సహాయత పేరుతో అంగీకరించేవాడు చెడుకార్యం చేసేవానితో సమానంగా ఆచెడులో భాగం పంచుకుంటున్నాడు. చెడుని వ్యతిరేకించకుండా దానికి తలఒగ్గేవాడు చెడుతో సహకరిస్తున్నట్లు లెక్క.

ఇంగ్లీషువాళ్ళకు మనకు తేడాఏమిటంటే వాళ్ళకు ఆత్మవిశ్వాసం ఎక్కువ. మనకు అసలు అదిలేనేలేదు.

వయస్సుముదిరిన తరువాత మనకు అవసరమయిన ఆశ్రయం యివ్వగలిగేది విజ్ఞానమే. అయితే వయస్సులో వున్నప్పుడే ఆమొక్కను నాటితే తప్ప అదిపెరిగి పెద్దదై వార్ధక్యములో తగినంత నీడను మనకు సమకూర్చలేదు.

ఒకమహాకార్యాన్ని మహాపురుషుడే చేయగలడు. అతడుదాన్ని ఆశ్రమంగానే చేయగలడు.

పురుషునకు తన మనస్సు వశీకృతమైనచో అదితన్ను వుద్ధరించుటవలన తనకుబంధువును, వశీకృతము కానిచో నది తన్ను దుఃఖపరుచుటవలన శత్రువునయి వుండుటచే సంసారమగ్నుడైనవాడు తన్ను తనమనస్సుచేత నుద్ధరింపవలయునుగాని అధోగతిని బొందింపకూడదు.

మనం ఏమయినా చెడుగా ప్రవర్తిస్తున్నామంటే అందుకు మనలోవున్న అసాధారణ వాంఛలే కారణము.

హత్య, దొంగతనము, వ్యభిచారము అనునవి శరీరముగావించు పాపములు. అబద్ధమాడుట, అపవాదులువేయుట, ధూషణము, వ్యర్థ భాషణమనునవి నాలుకచేయుపాపములు. లుబ్ధత, ద్వేషము, భ్రమయనునవి చిత్తజనితములైన పాపములు.

మీరు జీవమునే కోరుకొనునట్లు మీకు సహాయం చేసెదను. కాని మరణము కాదు. ఎన్నుకొని ప్రభువైన క్రీస్తును సేవించుము. నీజీవితము దుష్టత్వంలో త్రోయబడుటకు కాదు. ఇక మీదట జీవనమున కచ్చట గంభీరత గల్గనై ఉన్నది. జీవితమనగా తమాషాకాదు. బైబిలు).

సూర్యునిగాని, మృత్యువునుగాని రెప్పవెయ్యకుండా తదేక దృష్టితో చూడలేము.

తలమీద వ్రాలు తుడిచినను తప్పదు.

ధనంవల్ల సద్గుణం లభించదు. సద్గుణంవల్లే డబ్బు, కోరిన యితరవస్తువులు లభిస్తాయి.

మానవుడు విధిచేతిలో కీలుబొమ్మ. విధిని ఎదిరించాలని అతడు చేసే ప్రయత్నాలు వ్యర్థములే అవుతాయి.

అందరినీ సంతృప్తి పరచాలనుకునే వ్యక్తి యెవరినీ ఆనంద పరచలేడు.

కళాకారుడు ఎప్పుడూ తన ప్రతిభను పిండుతూ వుండాలి. దానిని స్వేచ్ఛగా వెదజల్ల కూడదు.

నశించిపోయే యీ శరీరానికి రక్షలేదు. నాశములేనిది యశశ్శరీరము. కనుక దానిని కాపాడు కోవాలి.

మనోజయంబు గావించు పురుషునకు ఆ మనస్సు యోగహేతువగుటచేత బంధువును, మనోజయంబు గావింపని వానికి అట్టి మనసు ప్రారబ్ధాది దుఃఖహేతువగుటచేత శత్రువునై యుండును.

నీస్వంతబుద్ధిని ఆధారము చేసుకోక నీపూర్ణ హృదయములో యెహోవాయందు నమ్మకముంచు. నీప్రవర్తన అంతటియందు ఆయన అధికారానికి ఒప్పుకో.

లభించిన వారికి అనుభవించడం పుణ్యము, లభించన వారికి వైరాగ్యము పుణ్యమూ యిట్లాంటి బోధన లేకపోతే పుణ్యాత్ములు సృష్టించుకొన్న సంఘం నిలవదు.

దేశమునకిపుడు కావలసినవి సహనమును, వైజ్ఞానిక ప్రతిభయును, మహాధీరత్వము, అఖండశక్తి సామర్ధ్యములు, అపరమితోత్సాహము, ఆడంగితనం బొత్తిగాపనికిరాదు. కార్యశూరుని, పురుషసింహుని విజయలక్ష్మి వరించును, వెనుకకుచూడ పనిలేదు. ముందుకు నడవడు. అఖండశక్తి, అఖండోత్సాహము, అఖండధైర్యము, అఖండశాంతత, యివియే మనకు ఆవశ్యకము, అవియున్నగాని మహాకార్యములు సాధింపబడవు.

మనిషి తనొక్క ప్రాణంకోసం తనసర్వస్వం అర్పించేందుకు సిద్ధపడతాడు. (బైబిలు)

మానవజీవితానికి వున్నట్టే రచనావిధానానికీ ఒకచట్రం వుండక తప్పదు. మనం చెయ్యగలిగింది జీవితాన్ని సమగ్రంగా చిత్రించడానికి అనువైన చట్రాన్ని నిర్మించుకోవడం మాత్రమే.

ఇంద్రియ జయంబుగావించి యుపశాంతిం బొందిన మనస్సు గలవాడు శీతోష్ణ సుఖదుఃఖ మానావమానములందు సమత్వము నొంది సుఖించుచుండును.

న్యాయమనే లతకు విచ్చినపూవు, కాచినకాయ స్వేచ్ఛ, స్వేచ్ఛ వల్ల కారుణ్యానికి సుగంధ మచ్చుతుంది. అభ్యుదయానికి, ప్రేమకి, సంతోషానికి స్వేచ్ఛ నేల, నీరు గాలి, విత్తు.

అసత్యాన్ని కనిపెట్టి ప్రచారం చెయ్యడానికయినా ప్రత్యేక ప్రతిభా విశేషాలు అవసరం.

ప్రభుత్వం కొరకు మానవుడు ఏర్పడలేదు. మానవునికొరకే ప్రభుత్వం ఏర్పడింది. మానవుని స్వాతంత్ర్యం నిరాకరించడం, అతనిని ఒకవ్యక్తిగా ఔన్నత్యానికి తీసుకుని వెళ్ళేబదులు ఒకజడపదార్థంగా చేసి అతని స్థాయిని, అర్హతను తగ్గించడమే అవుతుంది. మానవుణ్ణి ఎప్పుడూ ప్రభుత్వమనే లక్ష్యానికి ఒక సాధనంగా చూడగూడదు. మానవుడు తనకుతానే ఒకలక్ష్యము.

అలసత్వం అంటే బద్ధకం. మనుష్యులకు మహాశత్రువు. ఉద్యమంలో సమానమయిన బంధువువేరొకడులేడు. నిరంతరకృషి శీలునకు నాశం ఎక్కడది? లేదు.

నువ్వు ఒక విషయాన్ని పూర్తిగా నమ్మనంతవరకూ నువ్వు ఏ విషయాన్ని నమ్మినా ప్రమాదంలేదు.

జ్ఞానవిజ్ఞానముల చేతనే తృప్తిచెందిన మనస్సు కలవాడును, కూటస్థుడును, జితేంద్రియుడును, మట్టిపెళ్ళ, రాయి, బంగారము, అను వీనియందు సమభావము కలవాడునై చిత్తసమాధానము గావించిన పురుషుడు ఆత్మానుభవజ్ఞానయోగమునకు అర్హుడగుచున్నాడు.

మంత్రిచాడీలు చెప్పకూడదు. ఆచాడీలు విని రాజు ప్రజలను హింసించ కూడదు.

ఈర్ష్యకి ఆయువుపట్టు అనుమానం. అనుమానించింది యదార్థమే గనక అయ్యిందో ఈర్ష్యాదేవి అవతారమన్నా లిస్తుంది. లేదా ప్రచండకాళికారూపమన్నా ధరిస్తుంది.

తల్లినిచూచిపిల్లను, పాడినిచూచి బఱ్ఱెను తీసుకోవలెను.

ఉపకారులయందును, మిత్రులయందును, శత్రువుల యందును, ఉదాశీనుల యందును, విరోధుల యందును, బంధువుల యందును, సాధువుల యందును, పాపిష్టుల యందును సమబుద్ధికలవాడు యోగారూఢులలో శ్రేష్టుడని చెప్పబడుచున్నాడు.

అస్పృస్యత ఒకపాపం. నికృష్టమైన నేరం. హిందూ ధర్మం ఈసర్పాన్ని సరియైన సమయంలో చంపకపోతే అదిహిందూధర్మాన్నే మ్రింగివేస్తుంది.

గాంభీర్యం చాలా గొప్ప విషయం. అయితే అది క్రమంగా స్తబ్దతలోకి దిగజారిపోయే ప్రమాదముంది.

భాగ్యభోగాల హంసతూలికా తల్పాలమీద చాలాసామ్రాజ్యాలంతరించిపోయాయి.

జీవితానికి అడ్డుగానిలిచే ప్రతివిషయాన్ని దుయ్యబట్టడమే హేళన కావ్యోద్దేశం. అది దృశ్యకావ్యమై రంగస్థలంమీద ప్రదర్శింప బడితే మానవ దౌర్బల్యానికి, అవివేకానికి మంచి ఔషధంగా వుపయోగపడు తుంది.

నీదగ్గర డబ్బుఉంటే రొట్టె, పువ్వులిని కొనుక్కో. రొట్టె నీకు జీవన మిస్తుంది. పువ్వులు నీకు కళను నేర్పుతాయి.

భగవంతుని పూజచేయుటలో నీకు ఏపద్ధతి నచ్చితే అదే అనుసరించు. భగవంతు డొక్కడే.

శాంతి వాదము అంటే చెడుని వ్యతిరేకించక పోవడంకాదు. చెడుని అహింసాయుతంగా వ్యతిరేకించడం. ఈ రెండు విధానాల మధ్య అగాధమైన వ్యత్యాసం వుంది. అహింసాయుతంగా వ్యతిరేకించడం అంటే ప్రత్యర్థిపై హింసచేయడంకాదు. ప్రత్యర్థిచేసే హింసను స్వీకరించడం ద్వారా ప్రత్యర్థిని సిగ్గుపడేట్లుచేసి అతనిలో మార్పు తీసుకు రావడం.

ఆరు రుక్షువునకు దేహేంద్రియ జయంబు, నిరాశ, అపరిగ్రహము, ఏకాంత స్థలవాసము, ఏకాకియగుట యీ అయిదును లేక యోగము సిద్ధింపదు.

విద్య మహాసముద్రాన్ని తరచిన కొలది దానివైశాల్యం మరీ మరీ యెక్కువ అవుతుంది.

జాతీయత అనేది ఒక విధమైన రాజకీయవాదము.

పిల్లలకు ఏది మంచి, ఏది చెడు తెలుసుకుని వివేకవంతంగా మెలగాలని ప్రతీది బోధించడానికి తల్లులు ప్రయత్నిస్తారు. వ్యతిరేక పద్ధతులను ఎదుర్కొనడంలో కూడా ఓపికగా తల్లులు బిడ్డలకు కాపుదలగా

సాయపడుతున్నారు. కాని అట్లా సాయపడుతూ వుండడం ఆబిడ్డ తనకుతానుగా వ్యతిరేకతకు తట్టుకొనలేని దౌర్బల్యానికి తావివ్వ కూడదు.

సాంఘిక పురోగతివల్లనే నైతిక ప్రవర్తన వుత్పన్న మవుతుం దని అనుకోవడం కుంపట్లు తయారుచేసి నిప్పు తయారయిందని అను కోవడమే అవుతుంది.

స్వబుద్ధి వలన సుఖం, పెద్దల ఆలోచనలవలన క్షేమం కలిగితే పరబుద్ధివలన వినాశనం, స్త్రీబుద్ధివలన ప్రళయం కలుగుతుంది.

''జీవించాలని కోరే ప్రాణులమధ్య జీవించాలని కోరే ప్రాణిని నేను'' అనేదే మానవుని తక్షణక్రియ.

ఇల్లు వాసయోగ్యంగాను, ఆనందపూర్ణంగాను ఉంచటం గృహి ణికి పెద్ద బాధ్యత.

ఆరోగ్యంగా వుండండి. 'గీత' చదవటంకంటె ఫుట్‌బాల్ ఆడటం వలన స్వర్గానికి దగ్గరవుతారు.

సత్యం శిలువ వేయబడడం, మంచితనం పూడ్చిపెట్టబడడం మనం చూస్తున్నాము. అయినా వాటికొరకే కృషిచేస్తున్నాము. ఎందు కంటే సత్యం, మంచితనం ఎంతగా అణచబడ్డా మరింతశక్తి వంతంగా పునరుద్భవిస్తాయి.

పండితులు చాలామంది వున్నప్పటికీ వారు హితైషులుకారు. హితైషులుగా వున్నప్పటికీ వారు పండితులుకారు. తీయనిది మంచి పథ్యమైనటువంటి ఔషధం దుర్లభంకదా.

యోగము నాచరించునపుడు దారువు మొదలగువానిచే చేయబడి మిక్కిలి పొడుగును మిక్కిలి పొట్టివియు లేనిదై సమంబును దృఢం

బును సైన ఆస్తరణంబొక్క టే పరిశుద్ధ ప్రదేశంబున కల్పించి దాని మీద దర్భలను పైన కృష్ణాజనమును పిదప వస్త్రంబును పరచి సుఖ స్పర్శగలయట్టి ఆసనమును ఏర్పరచుకొన వలయును.

వైద్యుడు చేదుమాత్ర నిచ్చినయెడల రోగిమింగలేడని ఆమా త్రకు చెక్కెర తేనెలాంటివి పైపూత పూయును. అట్లే కవినీతిని బోధించుటకు రసమును పైపూతగావుంచి హృదయంగమముగ రచించవలయును.

బండిని లాగు ఎద్దును ఆబండి చక్రమనుసరించును. ఇట్లే పాపబుద్ధితో మాట్లాడినను, ప్రవర్తించినను, అట్టివానిని బాధ అనుసరించ గలదు.

గర్వంఅనేది అందరిలోనూ సమానంగా వుంటుంది. ఉన్నతేడా అల్లా పైకికనబరచే పద్ధతి, విధానాలలో మాత్రమే.

దారితప్పి స్వార్థమునకు లొంగి తప్పుడుమార్గమున పడిపోవు వారిని నిర్భయముగ విమర్శించి నిర్మాణాత్మకమగు విధానమును నిర్దేశించుట ఎంతయు ముఖ్యము.

బుద్ధునివాక్యము :- జంతుబలులిచ్చుట తామస భక్తియనియు, మూఢాచారమనియు, నధోగతికి మార్గము. పశుబలివర్జించి సాత్విక పూజతో దేవతలను ఆరాధించండి. మీవాంఛితములు ఎల్ల నెరవేర గలవు.

తల్లియొక్క బంగారమునైనా కంసాలి దొంగిలించక మానడు.

చిన్నవానికి చదువురావాలన్న ధ్యాసలో అయ్యవారు కట్టడులను అతిక్రమించి తనధర్మాన్ని నిర్వర్తిస్తే అది అమానుషంకాదు.

ఎక్కువమంది చేతులెత్తినంత మాత్రాన న్యాయంకాజాలదు.

జీవితం విల్లువంటిది. కల విలుకాడు.

సుఖదుఃఖములు రెండునూ తనవే యనుకొని మోహము చెందు వాడు మోక్షమునకెంతమాత్రము అర్హుడుకాడు.

అయిదు పదాలను జ్ఞప్తిలో వుంచుకొనుము. గాంభీర్యము, ఆత్మ ఔదార్యము, లక్ష్యము, దయ, తృప్తి.

ఆత్మరక్షణార్థము హింసను అనుమతిస్తే అహింస అర్థరహిత మవుతుంది.

తనను నిరాకరించుకొని తృణీకరించుకునే వేదాంతము ఆత్మ నాశనానికి హేతువు.

సజ్జనులకు స్నేహితుడు, విజ్ఞులకు మార్గదర్శికుడు, మూర్ఖుల పాలిటి యముడు, దుర్జనులకు శత్రువు — అదృష్టం.

శాస్త్రప్రకారము నిర్మించిన ఆసనముమీద కూర్చుండి మనసును ఏకాగ్రముగాచేసి యింద్రియ వ్యాపారములను నియమించి చిత్తశుద్ధి కొరకు యోగభ్యాసము గావింపవలయును.

భార్యా భర్తలు యిద్దరూ ఒకరి నొకరు తెలుసుకోవడంమంటే పరిచయం పెంపొందించు కోవడముకాదు. భిన్నశరీరాలతో, భిన్నమగు మనఃప్రవృత్తులతో వుంటారు. కాన ఒకరి మనసు నింకొకరు తెలుసు కోవడమే అది. అంటే ఒకరి ఆలోచనలకు భావాల నింకొకరు స్పష్టంగా చెప్పుకోవాలి.

ఏపనినైనా సకాలములో చేయకపోవడంవల్ల కలిగే అనర్థాలు అన్నీ యిన్నీకావు.

ఒకొ్కక్క విషయాన్ని మూఢంగా నమ్మవద్దు. ప్రతివిషయము లోను లోతుకు దిగిన విమర్శతో, నిష్పాక్షికంగా ఆలోచించే బుద్ధి అలవరచుకోవటం ఆరోగ్యవంతమైనది.

శరీరమును, కంఠమును, శిరమును కదలకుండునట్లు చక్కగా నిలిపి దృఢప్రయత్నము గలవాడై దిక్కులు చూడక తన భ్రూమధ్య మందు దృష్టిని నిలిపి నడుమ నడుమ దిక్కులు చూడక యుండ వలయును.

మహామేధావు లైనందుకు శిక్ష ఎప్పుడూ ఒంటరి తనాన్ని అనుభవించడం.

నేలమీద వొలికిన నీటిని ప్రోగుచేయడం దుర్లభం. (బైబిలు)

తింటూ తిరగకూడదు. పెద్దగానవ్వుతూ మాట్లాడరాదు. నష్టాలకై శోకించవద్దు. నువ్వుచేసిన మంచిపనుల గురించి నువ్వేపొగుడుకోకు.

శాసనం యొక్క సౌందర్యము లోనూ, హుందాతనంలోనూ నేను ఎంతగా నమ్ముతానంటే ఒక్కశాసనం తప్పుఅని నేను భావించి నప్పుడు దానిని ఆమోదించే కంటే, వ్యతిరేకించి జైలుకు పోవుటకే నేను యిష్టపడతాను.

ప్రజలలో సహనము ఆత్మనిగ్రహం వున్నపుడే ప్రజాస్వామ్యం జయప్రదంకాగలదు.

ద్వేషాన్ని ప్రేమతోనే జయించాలి. ద్వేషంతో జయించలేము.

ప్రశాంతమయిన మనసు గలిగి నిర్భయుడై బ్రహ్మచర్య వ్రతుడై మనస్సును చక్కగా నియమించి భగవంతుని యందుచేర్చి భగవంతునే పరమపురుషార్థముగా నెంచిన మాహితచిత్తుడై మానవుడు వుండవలయును.

భావాలమధ్య సంఘర్షణ, వ్యక్తులమధ్య వైరుధ్యం నాటకీయతకు అవశ్యకం.

పదిపదులు బ్రతకాలంటే ఉదయం ఆరింటికి లేచి పదింటికి భోంచేయాలి. సాయంత్రం ఆరింటికి భోంచేసి రాత్రిపదింటికి నిద్ర పోవాలి.

ఇతరుల ధనాన్ని అపహరించకు. ఇతరుల మనస్సు కష్ట పడేటట్లుగా మాట్లాడకు.

ధర్మవిముఖుడైన వ్యక్తి చదువుకొన్నా మూర్ఖుడే. ధనికుడైనా నిరుపేదయే. బలవంతుడైనా శక్తిహీనుడే.

వాసనాశూన్యులై ప్రశాంత చిత్తులైన మహాత్ములు వసంతఋతువు లాగా లోకోపకారం చేస్తారు. భయంకర సంసారార్ణవాన్ని తాము తరించి, నిర్హేతుక కటాక్షంలో యితరులను కూడా తరింపచేస్తారు.

నియమింపబడిన మనస్సుగలవాడగు యోగాభ్యాసి ఎల్లప్పుడును మనస్సమాధానమును చేయుచున్నవాడై సుఖాదిక్యంబై భగవంతుని యధీనంబగు మోక్షమును పొందుచున్నాడు.

సుఖప్రదమైన వివాహాలు చాలాతక్కువ. అది ప్రకృతికే కొంత విరుద్ధం. ఇద్దరి మనస్సంకల్పాలను - అందులో ఏదో ఒకదాన్ని నులిమి వేయకుండా - కలిపికట్టడం సాధ్యంకాదు. ఒక్కొక్కసారి ఆకలయికకోసం రెంటినీ నులిమివేయడం కూడాకద్దు. పైగా పరిశుద్ధిని చేకూర్చే ఆవేదననైనా కాదది.

ఇరుగు పొరుగులంటే ఏహ్యభావం ఏర్పర్చుకోవడం కూడా మంచిదికాదు. ఎవరితోనైన వుండవలసిన హద్దులలోవుంటే యెప్పుడూ అలజడి రాదు.

అవకాశం అందరికీ అందుబాటులోనే వుంటుంది. కాని దానిని సక్రమంగా వినియోగించు కొనేవాళ్ళే అరుదు.

అన్యాయాన్ని సహించడంకంటె అన్యాయంచేయడం మంచిది. ఈసిద్ధాంతాన్ని ఎవరూ ఒప్పుకోరు.

విజయమెపుడూ ఆత్మదేగాని ప్రకృతిది కానేరదు. దేహాత్మ భ్రాంతి (తమ శరీరములే తాము అనెడి భ్రాంతి) గల పామరులే "దుర్బలులము, దుర్బలులము మేము దుర్బలులము" అని దీనంగా విలపింతురు.

అపరిమితముగా భుజించినవానికి, బొత్తిగా భుజంచని వానికిని, విశేషముగా నిద్రించువానికిని, బొత్తిగా నిద్రలేక యుండు వానికిని యోగము సాధ్యము కానేరదు.

అక్రమమైన శాసనాలను ఆమోదించలేనట్లే న్యాయస్థానాల న్యాయ విరుద్ధ ఉపయోగాన్ని కూడా సహించలేను.

దేవుళ్ళు, దేవతలు - అంతా కల్పితం. దేవుళ్ళ పేరు చెప్పి భయాన్ని చూపి ప్రజల శ్రమఫలితాన్ని దోచుకోవడం ఘోరమయిన అన్యాయం.

అజ్ఞాని కంటె పుస్తకంచూచి చదువగలవాడు శ్రేష్ఠుడు. కంఠత పట్టినవాడు వాడికంటె మేలు. అర్థం తెలిసినవాడు యింకానయం. అందరికంటె ఆచరణశీలి కడు శ్రేష్ఠుడు.

భౌతిక దృష్టికి కారణం జీవితాన్ని గురించిన సంశయాలే. మానవుడు దైహికావసరాలకు, ఆత్మవిచారణకు మధ్య ఊగిసలాడుతాడు. జీవితం నిస్తబ్ధతతో కొట్టు మిట్టులాడుతాడు. ఏదో యింద్రియ వ్యాపారం

కల్పించుకుంటాడు. భౌతిక దృష్టి ఎంత నాజూకుగా ఉన్నా అది జీవిత సమస్యను సరిదిద్దలేదు.

ఇతరుల వ్యవహారాలలో తమకు సంబంధంలేనివారే చొరవ చేసుకుని ముందు కలగ చేసుకుంటూ వుంటారు.

జీవితాన్ని రక్షించడం, పెంపొందించడం, ఉన్నతస్థాయికి తీసుకువెళ్ళడం, ధర్మంగానూ, జీవితాన్ని నాశనంచేయడం బాధించడం అణచివేయడంగానూ భావించాలి.

సంసారిక దుఃఖమును పోగొట్టినదియైన ఆత్మసంయమయోగము ఉచితాహారము, ఉచితవిహారము, ఉచితపరిశ్రమము, ఉచితనిద్ర, ఉచితమైన మెలకువ యివిగలిగిన వానికే సిద్ధించును.

లౌకికజ్ఞానమే అధికంగా విజ్ఞానికి దారిచూపుతుంది.

నాటకంలో పాత్రలు మాట్లాడేటపుడు వాటిచేత పెద్దపెద్ద ఉపన్యాసాలు పలికించటంకన్న మధ్యమధ్య కొంచెం అడ్డంవేసి విరుస్తూ వుంటే ప్రేక్షకుల ఆశక్తి పెరుగుతుంటుంది.

కష్టాల్లోవున్నవాళ్ళు, బీదవాళ్ళు నువ్వు ముక్తిని పొందడానికి సహాయంచేస్తారు.

గృహానికికానీ, ఉద్యోగానికికానీ సంబందించి కాక మనసులో ఎన్నోవిషయాలు ప్రవహిస్తుంటాయి. అనుక్షణానుభూతులెన్నో వస్తుంటాయి. అలాంటి భావాలనే భార్యాభర్తలు ఒకరిని ఇంకొకరికి తెలుపుకోగల అవకాశం ఉండటం చాలా అవసరం. వైవాహిక జీవితానికిదే ప్రాణమనవచ్చును. మనసులో విరిసే ఈ అనుభూతుల్లో సభ్యతాభంగం గాని విషయాలను పరస్పరం ఒకరికి నింకొకరు తెలుసుకోగల శక్తి ఎవరికి వుంటుందో వారి జీవితాల్లో ఎంతో సౌఖ్యం వికసిస్తూవుంటుంది.

ఎప్పుడు మనస్సు చక్కగా నిగ్రహింపబడి తనయందే నిలచి బాహ్యవిషయాశక్తుల త్యజించి నిస్పృహుడై వుండునో అప్పుడు నిష్కాముడైన ఆపురుషుడు యోగి అని చెప్పబడును.

చిత్రలేఖనము నిశ్శబ్దకవిత్వం. కవిత్వం మాట్లాడే చిత్రలేఖనం.

తన వయస్సెంతో సరిగా చెప్పే స్త్రీని ఎప్పుడూ నమ్మకు. అది చెప్పిన స్త్రీ యింకేదైనా చెప్పకపోవటం అసాధ్యం.

చిన్నచిన్న విషయాలను పట్టుకు ప్రాకులాడేవాళ్ళు పెద్దపెద్ద పనులను నిర్వహించే సామర్ధ్యత కలిగివుండరు.

తాటిచెట్టుక్రింద పాలుత్రాగినను కల్లుత్రాగినట్టు భావిస్తారు.

నిరోధభూమియందు అసంప్రజ్ఞాత సమాధియోగము నాచరించు వాని చిత్తము రజస్తమస్సులు లేక సత్వోద్రిక్తమగుటచే గాలిలేని స్థలమునందుంచబడిన దీపమువలె చలింపనిదై ఆత్మస్వరూపమును సాక్షాత్కరించును.

పనులుచెయ్యడంలో పనిమనిషివలె సేవచేసి, భర్తకు ఆలోచన చెప్పేటప్పుడు మంత్రిలాగ తెలివితేటలతో సలహాలు చెప్పుతూ, భోజనం పెట్టేటపుడు తల్లిలాగ ఆదరించి, అన్నంవడ్డిస్తూ భూదేవంత ఓర్పుగల భార్య కులాన్ని ఉద్ధరించాలి.

కళాజీవి కొంతవయసు చెల్లాక యిక జీవితంలోకంటె తన కళ లోనే ఎక్కువ బతుకుతాడు. జీవితం కల్పనగానూ, కళాజీవితంగానూ పరిణమిస్తుంది.

సంఘం భవిషత్తు మాతల హస్తాల్లోనేవుంది. ఒకస్త్రీవల్ల ప్రపంచమే పతనమయితే తిరిగి దానిని స్త్రీయే రక్షించ గలుగుతుంది.

కళ్ళు గుడ్డిగావుండాలని హృదయం కోరినప్పుడు అవిచూడవు. భూమిని చీకటి దాచినట్లే వాంఛ నిజాన్ని కప్పుతుంది.

ఏకాగ్రతలేనిదే ఏవ్యక్తితోనూ ప్రతిభ ఉత్పన్నము కాదు.

యోగభ్యాస బలముచే నిరోధింపబడిన చిత్తము ఏకాకార వృత్తిని గూడ వదలి నిర్వృత్తికమైన శాంతిస దేనియందు పొందునో, ఎచ్చట తన మనస్సుచే పరమాత్మను ఆత్మయందే చూచుచు సంతోషించునో, యింద్రియంబుల కగోచరంై బుద్ధిచేతమాత్రము గ్రహించిన నిరవధిక సుఖమునుదేనియందెరుంగునో, ఏనిరవధిక సుఖస్థితిలో నిలిచిన యోగి ఆస్థితినుండి కదలడో, ఏదిలభించిన పిదప అంతకన్న అధికముగా వేరు లాభము వుండదో, ఏనిర్వృత్తి చిత్తావస్థా విశేష లాభమును పొంది అంతకన్న అధికముగ వేరులాభమును పొందడో, దేనియందు వసించి మహా దుఃఖములకుగూడ మనస్సు చలింపదో అట్టి పూర్వోక్త దుఃఖ సంబంధనివృత్తి స్వరూపముగల దానిని యోగమని తెలిసికొనవల యును. అట్టి యోగమును సంప్రీతి కల మనస్సుతోను, నిశ్చయ బుద్ధి తోను ఆచరింపవలయును.

నిప్పురవ్వలు పైకి చిమ్మినట్లుగా మనిషి కష్టాల్లోంచి పైకొస్తాడు. (బైబిలు).

ఆర్థిక స్వాతంత్రములేని రాజకీయ స్వాతంత్రం నిరుపయోగమై నట్లే. రాజకీయ స్వాతంత్రంలేని ఆర్థికస్వాతంత్రంకూడ నిరుపయో గమే. రెండూ మానవాభి వృద్ధికి ప్రధానమైనవి. ఈ రెంటినీ అణచివేయ గలిగితే మానవుడు వ్యక్తిగా పరిగణింప బడడానికి, అతనిలోవున్న శక్తులు వివిధరూపాల్లో వికసింపటానికి అవకాశంవుంది.

పరిశ్రమ అనేది పైకి కనిపించేది, కనిపించనిది అని రెండు రకాలు. అందుకని ఆలోచిస్తూ కూర్చున్న మనిషిని సోమరిగా భావించ రాదు.

జర, మృత్యువు, భయం, వ్యాధి యివి ఎవరికీ తప్పవు. ఈసంగతిని గుర్తించి ప్రవర్తించేవాడే పండితుడు. అట్టివాని మనస్సు నిలకడగా వుంటుంది.

సంకల్ప జన్యములైన సమస్త కామమును నిశ్శేషముగా పరిత్యజించి ఇంద్రియ వ్యాపారములను నిరోధించి యోగమును ప్రారంభింపవలయును.

అసంపూర్ణముగావున్న జ్ఞానాన్ని ఎప్పటికప్పుడు నింపుకోవడమే అభివృద్ధి. జ్ఞానం అసంపూర్ణంగదా దానిజోలి మనకెందుకనుకుంటే జ్ఞానమూలేదు, అభివృద్ధీలేదు.

యుగయుగాలనుండి వచ్చే సనాతన ఆచార ధర్మములు ఎంత ఉత్తమమైనవో అంత అపాయకరమైనవి.

స్త్రీ తనపై భర్తవుంచే విశ్వాసాన్ని కోల్పోకుండా జాగ్రత్తగా ఉండటం చాలా అవసరం.

సౌఖ్యాన్నికోరి విషయలోలుడయ్యే వాడికంటె మూర్ఖుడుండడు.

మనుష్యులు మరణించడానికైనా యిష్టపడతారు. కాని ఆలోచించరు.

మానవుని చిత్తవృత్తికి స్ఫురణం కలుగచేసి మనస్సును స్పందింప చేయడమే నాటకంలోఉన్న గొప్పతనం.

దేశపరిపాలనను ఒకరిద్దరి చేతుల్లో ఉంచడంకన్నా శాసన

నిర్మాణాన్ని పలువురిచేతుల్లో పెట్టకంకన్నా ప్రజలు చెయ్యగలిగిన గొప్ప పొరపాట్లు వేరే ఏవీలేవు.

మెల్లమెల్లగా వివేకయుక్తంబైన బుద్ధిచేత మనస్సును విషయములనుండి విరమించి ఆత్మయందు నిలిపి పిమ్మట వేరొకట్టియును చింతింపక యుండవలయును.

నీపాపములో నీవు జీవించిన యెడల తప్పక పాపములోకె చని పోదువు. మరియు నీకు శుభనిరీక్షణ వుండదు. (బైబిలు).

అధికారిని, ప్రియులను చూడటానికి వెళ్ళేటప్పుడు వొట్టి చేతులతో వెళ్ళడం మంచి లక్షణంకాదు.

తనని తాను నమ్మనివాడు మౌనవ్రతం పూనడమే మంచిది.

బుద్ధునివాక్యము - భగవంతుడు మూగజీవుల హృదయములలో కూడ ప్రకాశించుచున్నాడు. అట్టి భగవంతుని స్వరూపములైన జంతువులను బాధించువాడు, చంపువాడు ఎన్ని ఘనకార్యములు చేసినను వ్యర్థములగుటేగాక భగవంతుని అవమానం చేసినట్లవుతుంది.

తాను ఒకటితలిస్తే దైవమొకటి తలుస్తుంది.

చంచల స్వభావము వలన స్థిరము కానిదైన మనస్సు ఏ యే మార్గముగా బయట తిరుగునో ఆయామార్గములనుండి దానిని త్రిప్పి ఆత్మ యందుండునట్లు వశంబు కావింప వలయును.

భౌతిక శరీరపోషణకు ఆహారం ఎంత అవసరమో, ధార్మిక జీవిత పరిరక్షణకై ప్రార్థనలవంటి ఆధ్యాత్మిక ఆహారం అవసరం.

సత్యంచేతా, ప్రేమచేతా ప్రపంచాన్నంతా జయించవచ్చును.

జీవితకాలం ఎంతవున్నా అంతర్దృష్టి ఒక్క క్షణం వుంటేచాలు. ఆత్మవికాసంతప్పక గల్గుతుంది.

భయపడేలా చేసేవ్యక్తిని ఎవరూ ప్రేమించరు.

స్త్రీకి తనభర్తపై ఎంత ప్రేమ వుంటుందో అతనికి సంబంధించిన విషయాల్లో అంత ఆవేశం వస్తుంది. ఆవేశం ఆలోచనకు శత్రువు. కాబట్టి ప్రేమ ఎక్కువగా వున్నచోట ప్రేమకు తగినంత మృదువాక్యమూ, మాటనేర్పూ వుండాలి. అలవరచుకుంటే ప్రసన్నంగా, లలితంగా మాట్లాడటం ఏమంత కష్టమైనది కాదు.

కృత్రిమ కళే నేటి రంగస్థలానికి, లలితకళలకు కూడా శాపంగా పరిణమించింది. కావున నాటకంలో కేవలం నటనా కౌశలమే ప్రదర్శించాలి. లేనిచో కళాత్మకు భంగం కలుగ గలదు.

ప్రశాంతమైన మనస్సుగలిగి భోగరహితుడై కల్మషములు లేనివాడై బ్రహ్మరూపమైయున్న ఈయోగిని ఉత్తమమైన సుఖము పొందుచున్నది.

హత్యకు బదులు హత్య మూర్ఖుడు చేసేపని.

పుస్తకజ్ఞానంకన్నా అనుభవంవల్ల వచ్చే జ్ఞానం అన్నివిధాలా మేలుచేస్తుంది.

నాటకకళ జీవస్ఫూర్తిగలకళ, అర్థవంతమయిన కళ.

ఎల్లపుడునూ మనస్సును వశముగావించి ఆత్మధ్యానము చేయుచు పాపములను పోగొట్టికొనిన యోగి బ్రహ్మానందమును సుఖముగా అనుభవించును.

రోజు ఉదయం ఆలస్యంగాలేచి జీవితంలో కీర్తి శిఖరాల్ని అందుకున్న వ్యక్తులు నాకీనాటివరకూ తారస పడలేదు.

గొప్పకష్టాలువచ్చి సరిక్రొత్త మనుష్యులలోని సౌభ్రాతృత్వాన్ని వెలుగుకు తెస్తాయి.

లోకమందస్థిరమైనవి జీవితం, ధనం, యౌవనం. స్థిరమైనవి రెండే ధర్మం, కీర్తి.

ఆర్జన పురుషుని బాధ్యతై ఆదరణతో గృహాన్ని పాలించవలసిన బాధ్యత స్త్రీదే అయివున్నచోట సంసారజీవితంలో సామరస్యం ఏర్పడటానికి స్త్రీ తీసుకోవలసిన జాగ్రత్తలే ఎక్కువ. విలువలుమారిపోతూవున్న నేటి సంఘంలో ఈచిన్నవిషయాల్లో మనం శ్రద్ధవహించకపోతే సుఖసంతోషాలకు దూరమవుతాం. స్త్రీల కంటి వెలుగులోనే కదా పురుషులహృదయ పద్మాలు వికసించేది.

నీతి అనేది క్షణక్షణం అభివృద్ధిచెందే విషయం నీతినిగొడ్డళ్ళ ద్వారానూ, ఉరికంబాలద్వారానూ మనం కాపాడలేము. పైగా అలా కాపాడటానికి యత్నించడం నీతికి విరుద్ధ మవుతుంది.

వేదాలలో చెప్పినప్రకారం నడుచుకోవడమే ధర్మంగా నడచుకోవడం అన్నమాట. ఎవరికి తోచినట్లల్లా వారు నడుచుకుంటే జనుల్లో ఘర్షణఏర్పడుతుంది.

యోగయుక్తమయిన మనస్సుగలవాడు సర్వభూతములను సమముగ జూచువాడగుచు సమస్త భూతములందు తానును, తనయందు సమస్త భూతములను నుండునట్లు చూచును.

రసజ్ఞుడు తనసర్వస్వమూ ధారపోయడానికై వెనుదీయడు. సుకావ్యమందలి ఆకర్షణ అటువంటిది.

నేను, నాది అను అహంకార, మమకారములవలన మానవుడు

బ్రహ్మ జగత్తుకు దాసుడగుచున్నాడు. అది వీడిననాడు మానవుడే దేవుడు. భూమే స్వర్గము కాగలదు.

రోడ్డుమీద కాలుపెట్టిన స్త్రీ బ్రతుకు దెబ్బతిని క్రిందబడ్డ కాకి బతుకులాంటిది.

తీగకు కాయ బరువుకాదు.

ఆనందము విషాదం అవినాభావసంబంధాలు. విషాదం అనే గొయ్యి తీస్తేనే ఆనందము అందులో పొయ్యడం.

బ్రహ్మాండమైన వాగ్దానా లెప్పుడూ అనుమానించ వలసినవే.

యోగజన్య జ్ఞానముచే సమస్త భూతములందు భగవంతుని స్వరూపమును దేవునియందు సమస్త భూతములును నుండునట్లు చూసెడి యోగికి భగవంతుడు కనబడకపోడు. యోగియును భగవంతునకు కనబడకపోడు. పరస్పరము ప్రత్యక్షస్వరూపులుగానే యుందురు.

క్రమపద్ధతిలో అభ్యాసం చాలా మంచిది. జీవనేచ్ఛ పూర్తిగా నశించి ఏకాంతముగా బ్రతుకుతున్నపుడు మనలను చేయి విడవకుండా మహా భక్తి విధేయలతో సాయపడేది - ఈ అభ్యాసమే. తిరిగి జీవితానందం మనలో పొటమరించే వరకు యిది పనిచేస్తుంది.

తన వృత్తిని పవిత్రంగా గౌరవంగా భావించే వ్యక్తి ఒక్క క్షణం కూడా సోమరిగా ఉండలేడు.

సేవకునకు తన రహస్యమంతా చెప్పడం వానిని తన యజమానిగా చేసుకోవడమే.

శత్రువుని మిత్రునిగా మార్చాలన్నా, మిత్రుల్ని మిత్రులుగా ఎల్లకాలం వుంచుకోవాలన్నా ఎప్పుడూ మంచే చేయాలి.

విద్య వ్యాపించేకొద్దీ ప్రాచీనత అదృశ్యమై పోతుంది. గ్రామీణులలో కృతక శిల్పం అభివృద్ధి పొందిన కొద్దీ జానపదకళలో కృత్రిమత్వం హెచ్చుతుంది.

యోగముచేత భేదబుద్ధిని వదలి సమస్త భూతములందు దేవుని భజించెడి యోగీశ్వరుడు వ్యుత్థానదశయందు గూడ ఏవిధముగా వర్తించినను సర్వ ప్రకారములుగా భగవంతునియందే వర్తించు చుండును.

నూరుమందిని వదలిపెట్టైనా సమయానికి భోజనం చేయాలి. వేయిమందిని వదిలైనావెళ్ళి స్నానం చేయాలి. లక్షమందిని విడిచిపెట్టి వెళ్ళిదానం చెయ్యాలి. కోటి మందిని వదిలైనా ఈశ్వర ధ్యానం చేయాలి. భోజనం, స్నానం, ధ్యానం, దానం ఆయా సమయాలలో క్రమము తప్పకుండా చేయాలని తాత్పర్యం.

మానవత్వంలోని ఉత్కృష్టతయే మతం.

జీవితం, దురదృష్టాలు, ఒంటరితనం, వెలి, దారిద్ర్యము, రణరంగాలు. ఇందులో పోరాడే అనామకులే ఒక్కొక్కపుడు అజేయులైన మహావీరుల కంటెమిన్న.

అతిథి, బాలుడు, స్త్రీ, రాజు, అల్లుడు, ఈ అయిదుగురు గృహస్థుపై జాలితలచరు. అతను వున్నవాడా, లేనివాడా అని కూడా ఆలోచించరు.

సందేహం అనే బురదనేలమీద సత్యమనే నగరం నిర్మించలేము.

భయాన్నివదులు. అన్నికష్టాలకు కారణం భయమే!

సర్వభూత సుఖదుఃఖములను తన సుఖదుఃఖములుగా భావించువాడు భగవంతునికి సమ్మతమైన పరమయోగి యగుచున్నాడు.

అభ్యాసం ప్రతిరోజుకి వృద్ధిపొంది అలవాటై గట్టిపడుతుంది. దానిని మనం మరిమానలేము.

సహనమూర్తి ఆగ్రహిస్తే జాగ్రత్తగా ఉండండి.

కళలో ప్రధానాంశము సౌందర్యం. వికారాన్ని చిత్రించేటప్పుడు కూడా యిది అవసరమే.

వినయము, నమ్రత అట్టేమంచిలక్షణాలుకావు. అవివున్నవారికి అస్తమానం నచ్చచెప్పి, ధైర్యం చెబుతూ వుండాలి. వినయంవలన చేయగలిగే పనులుకూడా వారుచేయలేకపోతారు.

అదృష్టం మానవజీవితంలో అన్ని దశల్లోనూ వుంది. దాని కెంతోస్థానముంది. అయినా అనుకూల దాంపత్యానికి అదృష్టంఒక్కటే కారణంకాదు. దాంపత్యానికి యిద్దరూ సమానభాగస్థులే. ఇద్దరికృషి పైనా, స్వభావాలపైనా దాంపత్యంయొక్క స్థిమితత్వం ఆధారపడి వుంటుంది.

చలించుచున్న మనస్సును నిగ్రహించుట యసాధ్యమనుటకు సంశయములేదు. దానిని అభ్యాసముచేతను స్థిరపరచవచ్చును.

ఒకఆడది జీవితమంతా ఒక్కణ్ణే ప్రేమించడం అంటే ఒక మైనపువత్తిజీవితాంతం వెలుగుతుందని చెప్పినట్లే వుంటుంది.

అజ్ఞానానికి అపారధనం తోడైనపుడే మనిషి పతితుడౌతాడు.

చెడి చుట్టం యింటికివెళ్ళకూడదు.

నిజమైన దయ్యాలలాగే నిజమైనప్రేమ అనేదీవుంది. ప్రతీవాడూ యీవిషయం మాట్లాడుతాడు. అయితే చూచినవాళ్ళు మాత్రం బహు అరుదు.

పితరుల ఋణాన్ని పుత్రులు తీర్చగలరు. కాని ఎవని భవబంధాన్ని వాడే విముక్తి చేసుకోవలసిందే. ఇతరులు చేయలేరు. నీ బంధ విమోచనకు నీవే ప్రయత్నించాలి.

బుద్ధునివాక్యము :- దేహము శాశ్వతముకాదు. కబళింప వలెనని మృత్యుదేవతయు, నానాబాధలు పెట్టవలెనని వ్యాధులును, నొకదాని కంటె నొకటి ముందు పైబడవలెనని, నిముష నిముషమునకు కాచుకొని తిరుగుచున్నవి. రేపోమాపో చచ్చుట సిద్ధముగాన ఏరోజుకారోజు పట్టుదలతో శక్తికొలది, వీలైనంతవరకూ పాపకృత్యముల జోలి విడనాడి, పుణ్యకార్యముల సాధించుటయందు తగిన కృషి చేయుటయే మానవజన్మ ఎత్తినందుకు తగినఫలము.

తేనెవున్నచోట ఈగలు పోగవుతవి.

పరలోకమనే అసత్యభావన ప్రచారంలో జీవితాన్ని నరక ప్రాయంచేశారు. ఈవాదం నూటికి తొంబైతొమ్మిది మందిని గొర్రెలుగానూ, మిగిలిన ఒకడిని వాళ్ళరక్తాన్ని పీల్చేతోడేలుగాను చేసింది.

అసమాహిత చిత్తంగలవానికి యోగము సాధ్యముకాదు. ఉపాయము నవలంబించి వశంబు గావించిన వానికి ప్రయత్నములచేత యోగము ప్రాప్తంబగును.

రకరకాలుగావుండే యిరుగు పొరుగుతో ఒకవిధంగా మెలగడం కష్టమేకాని మనిషిలో సభ్యత, మంచితనంవుంటే వీటిని అన్నింటిని గెలుచుకు రావచ్చు.

జ్ఞానంవల్ల ఏకాగ్రత, అజ్ఞానంవల్ల భిన్నత కల్గుతుంది.

జీవితంలో ఎన్నో ఒడిదుడుకులు. వాటిని ఓర్చుకుని నిలబడగలగాలంటే భార్యాభర్తలిద్దరిమధ్యా సామరస్యం ఎంతో అవసరం.

ఇది అంత తేలిగ్గా కుదిరే విషయంకాదు. వారివారి స్థితిగతులపై, చేసే వుద్యోగాలపై, వృత్తులపై, వంశసాంప్రదాయాలపై ఆధారపడివున్న విషయం.

మానవ స్వాతంత్రమే ప్రధానమనుకున్నపుడు మతవ్యామోహం, వర్గదృష్టి ఏమాత్రం పనికిరావు. స్వలాభాపేక్ష, స్వార్థచింతన కల్గిన వ్యక్తులు, ప్రజాసేవకులు, యితరుల దాస్యవిముక్తికి పనికిరాదు. మానసికంగా నైతికంగా అభివృద్ధి చెందనివ్యక్తి యితరులకు ఎలామార్గదర్శి అవుతాడు?

మధ్యలో పనిమానేస్తే ప్రమాదం. అలవాటుతప్పాక మానేసిన పని మళ్ళీ మొదలెట్టి చేయడం కష్టం.

జీర్ణముకాని జ్ఞానము మానసిక దేహానికి కొవ్వువంటిది. బాగా జీర్ణించుకోబడిన జ్ఞానము కండరాల వంటిది.

మనిషి వున్నతస్థితిలో వున్నాడంటే చుట్టూ అంతా మాయ అన్నమాట. ( బైబిలు )

జీవితప్రవాహం ప్రచండవేగంతో వెళ్ళిపోతూ వుంటుంది. ఎవరెవరి సంస్కారానిబట్టి వాళ్ళు తమ సుఖంకోసం పోటీపడుతున్నారు. ఇదొక మహాసంగ్రామం. ఇందులో పిరికివాళ్ళకు, అసమర్థులకు చోటులేదు. అంతేకాదు. జ్ఞానమును సంఘజీవితానికి ఉపయోగపరిచే మనస్తత్వం కావాలి. అదిలేకుంటే సంఘర్షణ, పతనం తప్పవు.

తల్లులకున్న అధికారం గొప్పది. ఒక పద్ధతిలో బిడ్డలను పెంచాలన్న కోరిక తల్లులకుంటుంది. అయితే ఆనియమాలు మహాకఠినమైనవి. వాటిని బిడ్డలు పాటించలేక పోయినపుడు తల్లులు చిరాకుపడడం, బాధపడడం, బిడ్డలపట్ల విసుక్కోవడం జరుగుతుంది. దానివల్ల బిడ్డలు ఒకవిధంగా ఆత్మవిశ్వాసాన్ని కోల్పోవడమూ జరుగుతుంది.

శుభకార్యమైన యోగానుష్ఠాన పరుపు ఒకప్పుడును దుర్గతిని చెందదు.

పనిలేకుండా యిరుగుపొరుగు యిండ్లకు తిరగకూడదు.

దుర్జనుడు, శ్లేష్మం రెండూ ఒక్కటే. తీపిచేత, తీయనిమాటల చేత రెండూ వృద్ధిపొందుతాయి. కటుత్వంచేత, కఠినవాక్యములచేత రెండున్నూ శాంతిపొందడం, లోకవిదితమేకదా.

శాంత స్వభావమైన మనస్సే గాఢమైన ప్రార్థన చేయగలుగు తుంది.

జీవితం పరిపూర్ణమైనది. ఉత్తమ మయినదీనూ. దానిలోని మంచీ చెడూ రెంటిని మనం స్వీకరించ గలగాలి.

ఈలోకంలో పిచ్చివాళ్ళు మంచివాళ్ళనుచూచి పిచ్చివాళ్ళను కుంటారు. అంటే తమలోవున్న పిచ్చిలక్షణాలను వాళ్ళు తెలుసుకోలేక పోతున్నారన్నమాట.

మననీడలు మనలను వెన్నంటి వచ్చుచున్నట్లు మన మాచరించు శుభాశుభకర్మలు మనల వెన్నంటి వచ్చును.

గృహస్థు పెళ్ళాన్ని జాగ్రత్తగా రక్షించుకోవాలి. బిడ్డలకు విద్య చెప్పించాలి. సర్వజనులను, బంధువులను పోషించాలి. ఇది సనాతన ధర్మం.

ఇతరులకన్నా మనం తెలివిగలవాళ్ళం అనుకోవడం మనని మనం మోసగించుకోవడమే.

మనలో జీర్ణించుకు పోయిన పాతసిద్ధాంతాలను, భావాలను పూర్తిగా వదలలేక, మనసుకు నచ్చిన ఆధునిక భావాలను ఆచరణలో పెట్టలేక ఈ సంధియుగంలో నలిగి పోతున్నాము.

తొక్కితే కరవని పాము వుండదు.

యోగభ్రష్టుడు పుణ్యవంతుల పొందెడి లోకములను పొంది బహుకాలము పుణ్యమనుభవించి మిగిలిన పుణ్యము ననుభవించుటకు పుణ్యాత్ములైన శ్రీమంతుల యింటియందు మరల పుట్టుచున్నాడు.

మనగురించి నలుగురూ చెప్పుకొనుట మనేది చాలా చెడ్డవిషయం. కాని మన గురించి ఎవ్వరూ చెప్పుకోక పోవడమనేది యింకా నిస్సహాయ స్థితి.

మన మందరమును మహాకార్య నిర్వహణమునకై జన్మించితి మను పరిపూర్ణవిశ్వాసమును కలిగి యుండవలెను. కుక్కపిల్లల మొరుగు లకు ఉలికిపడకూడదు. లోకములను కంపిల్లచేయు ఘోరగర్జారావముతో ఆకాసమును ప్రేల్చుకొనివచ్చు పిడుగు పాటులకు కూడా చెదరక నిశ్చలులమై నిలబడి యుండి కార్యనిర్వాహ మగ్నులమై యుండవలెను.

అనుభవయోగ్యమైన ఊహజ్ఞానమే జ్ఞానమనిపించుకోబడు తుంది.

చాయారహితమైన వెలుగు సౌందర్యరహితంకూడా.

తానుశాశ్వతంగా బ్రతికివుండాలనే స్వార్థమూ-చనిపోతున్నందున కలిగే భయమూ - వీటి నివారణ కొరకు మృత్యువు తరువాత కూడా ఆత్మక్రియందన్న నీచమైన కల్పనను కల్పించారు. ఈ నీచకల్పన ప్రసాదమే పరలోకమూ, పునర్జన్మను.

ఒకవేళ తీవ్రమోక్షేచ్ఛవలన వైరాగ్యము కలిగినేని పుణ్యలోకము నకు పోకయే గృహస్థులలో శుద్ధాత్ములను, జ్ఞానవంతులును నైనవారి కులమున అవశ్యము పుట్టును. ఇట్టి జన్మము లోకములో మిక్కిలి దుర్లభమే కదా!

మనము నశించు ఈలోకమునుండి తప్పించుకొని జీవనములో ప్రవేశించగలము. కాలుచున్న కట్టడము రీతిగా మనలను మనమే క్రీస్తు ద్వారా రక్షించుకొనగలము. (బైబిలు)

వ్యక్తుల ఆశయాలను ప్రకటించుకోవడానికి మతం ఒకమార్గము. ఆశాభంగము కలిగినపుడు ఉపశాంతికూడా అందులోనే దొరకుతుంది.

మానవుడు మంచి జన్మయందు పూర్వదేహసంబంధమైన ఆయభ్యాసవిషయమైన బుద్ధిసంబంధమున బొందిసంబంధమును పొంది అచటనుండి మరల యోగసిద్ధికి యత్నము చేయుచున్నాడు.

ఎవరు ఉత్పత్తిచేయగలరో వారే సాధకులు. ఎవరు సాధకులో వారే నిజమైన స్వతంత్రులు.

అను నిత్యము మారుతున్న పరిస్థితులలో కూడా మానవుడు తన నిశ్చితాభిప్రాయాన్ని మార్చుకొనగలగకుండా ఉండాలంటే కాలంతో పాటు అతనూ మారగలగాలి. కాని ఆలామారుతున్నప్పటికీ తనదృక్పథాన్నిమాత్రం అతను విడనాడకూడదు.

ఘోరమైన తప్పిదాలు సన్నటి పోచలతో ఏర్పడ్డ పెద్దపెద్ద తాళ్ళవంటివి.

ఒకవ్యక్తి తన యవ్వనంనుండి వృద్ధాప్యంవరకూ ప్రేమ, మతం, రాజకీయాలు, విద్య అనే అంశాలపై వేర్వేరుగా తనఅభిప్రాయాలను వ్రాసుకుపోయి చివరకోరోజు తీరికగా పరిశీలిస్తే ప్రతి అంశముపైన అభిప్రాయాలూ తానువ్రాసుకున్నవేనా అవి ఏరెండు అభిప్రాయాల మధ్య పొత్తుకుదరక పోవడంచూసి ఆశ్చర్యపోతాడు. ఆవిషయాలు ఊసరవెల్లుల్లాంటివా లేక మనిషి నిత్యచంచలుడా!

చట్టంలేకుండా ప్రభుత్వం వుండగలదు గాని ప్రభుత్వంలేకుండా చట్టం వుండలేదు.

యోగికులమందు జనించిన యోగభ్రష్టుడు యోగము చేయుటకిచ్ఛలేకున్నను పూర్వజన్మమందలి అభ్యాసముచేత బలాత్కారముగా యింద్రియ విషయములనుండి ఈడ్వబడుచున్నాడు. యోగమును సాంగముగ తెలియగోరువాడు కూడ వేదోక్త కర్మముల నతిక్రమించ గలడు.

తనబలం చూసుకుని యితరులతో కలహించడం మంచిపనికాదు.

శాస్త్రాల్లోవున్నప్రకారం అనుభవించారా, వారంరోజుల్లో లోకంలో ఒక్కడూ మిగలరు.

బలహీనత అనేవ్యాధికి చికిత్సలేదు.

దిక్కులేనివాడికి దేవుడేదిక్కు.

యోగాభివృద్ధికొరకు ప్రయత్నంచేసి అనేక జన్మసంస్కారముల చేత సాధింపబడిన యోగ పరిపూర్తిని పొంది పాపరహితుడై పిదప ఆజన్మములోనే మోక్షమును పొందుచున్నాడు.

మారిపోవడమే నియమముగా గలిగిన యీజగత్తుకు ఎవడో ఒకడు కర్త గాని లేక యీశ్వరుడుగాని ఆధారం వుండాలనుకోవడం ఉన్నాడనుకోవడం అవివేకం.

మంచిఊహ, మంచిమాట, మనిషికి సుఖాన్ని కలుగచేస్తాయి. అంతేకాకుండా తోడు నీడయై కాపాడుతాయి.

అతిచిన్నతనంలోనే అన్నీమంచిపుస్తకాలే చదవటంకూడా ఒక విధంగా పొరపాటే.

పండితుడు, మూర్ఖుడు, బలవంతుడు, బలహీనుడు, ప్రభువు, దరిద్రుడు అని తరతమభావములేదు. మృత్యువునకు అందరూ సమానులే కదా.

ఒకగడ్డిపోచ మొలిచే స్థలంలో రెండుగడ్డిపోచల్ని మొలిపించ గలిగినవాడూ, ఒక్క జొన్నకంకి పండేస్థలములో రెండు కంకుల్ని పండింప కలిగినవాడే నిజమైన దేశసేవకుడు. దేశంలోని దేశం రాజకీయ నాయకులంతా చేరిచేస్తున్న సేవకన్నా మహా ఉపకారమే చేస్తున్నాడన్నమాట.

సౌందర్యము, ప్రపంచమందలి పెద్దల రికమండేషన్ పుత్తరాల కన్నా చాలాగొప్పది.

చాంద్రాయణాది తపస్సులను ఆచరించు వారికన్నను, శాస్త్రార్థ జ్ఞానముకలవారి కన్నను అగ్నిష్టోమాది కర్మకుల కన్నను యోగియే శ్రేష్టుడు.

పుస్తకాలు వ్రాసుకుంటూ, అధ్యాయనం చేసుకుంటూ పోవచ్చు. వయసు ముదిరి శరీరం సళ్ళిపోవలసిందే కాని దానికి అంతెక్కడ! (బైబిలు).

నాలుగేండ్లు వచ్చేదాకా లాలించి, పాలించి తరవాత పదహారేండ్ల వరకూ విద్యాబుద్ధులు గరపాలి.

మానవునిలో ధర్మనిష్ట ఎంత ప్రగాఢమయిన దయితే అంతీంద్రియ విషయ విజ్ఞానాన్ని అంత తక్కువగా కోరతాడు.

మార్పుచెందటం వస్తువు ధర్మంకాబట్టి మార్పు ఒక్కటే శాశ్వతమైనది.

స్త్రీలకు బిడ్డలుఅంటే మహాప్రేమ. ఆ గారాబంవల్ల బిడ్డలను శిక్షించవలసిన సందర్భాలలోకూడా శిక్షించరు. చిన్నతనం తెలియదు

అని సరిపెట్టుకుంటారు. ఆమెత్తదనమే ఉత్తరోత్తరా బిడ్డలకు చెరుపు చేస్తుంది.

సమాజ సౌభాగ్యం అంటే వ్యక్తికి సౌఖ్యం. పౌరుసిస్వేచ్ఛ. దేశానికి ఘనత.

బలంకంటె నీతి ఉత్తమ మయినది.

చెడ్డపనులలో నియోగించేది పెద్దవారైనా ధిక్కరించు. మంచి పనులు చేయమని అడిగేది చిన్నవాడైనా త్రోసిపుచ్చక పాటించు.

నైతిక దృక్పథంలో వీక్షిస్తే మనిషి సురాసురుల వింతకలయిక.

ఒకే ఒక మంచిపుస్తకాన్ని సరిగా ఆలోచించి ఎన్నుకో. అలా ఎన్నుకున్నాక నీధ్యానాన్నంతా ఆపుస్తకంపై కేంద్రీకరించి చదువు. అలా చదువుతూ చదివిన దానిని గురించి లోతుగా ఆలోచించు. అప్పుడే నీవు నిజమయిన ఆనందాన్ని పొంద గలుగుతావు.

ఒకవిచిత్రం ఏమిటంటే — దుర్దినాలు వచ్చినపుడు గడిచిపోయిన సుదినాలను మనం వివరంగా జ్ఞాపకం చేసుకోగలం. కాని తిరిగి సుదినాలు వచ్చినపుడు గడచిన దుర్దినాల జ్ఞాపకము అస్పష్టముగా మాత్రమే మిగులుతుంది.

ఆదిత్య విరాడాత్మ సూత్రాత్మ కారణాత్మ మొదలగు వారల నుపాసించెడి యోగులందరిలో షడ్గుణైశ్వర్య సంపన్నత గలిగిన భగవంతుని యందు మనస్సును నిలిపి సదా భగవంతుని భజించువాడెవడో వాడే మిక్కిలి శ్రేష్ఠుడు.

ఆత్మవిశ్వాసం లేదంటే అర్థము దేవుని యందు విశ్వాసం లేదన్నమాట.

ధర్మప్రవృత్తిగలవాని దూషించు దుష్టుడు ఆకసమువంక చూచి ఆకసముపై వుమియువాని వంటివాడు. ఆవుమ్మి ఆకసమునకు మాలిన్య మొసగుటకు బదులు క్రిందికివచ్చి వుమ్మినవానిని మలినపర చును.

ప్రేమ అనే రెండక్షరాలూ వినివుండకపోతే కొందరికి ప్రేమ రాహిత్యంగానే జీవితం గడచి పోతుంది.

దూరపుకొండలు ఎప్పుడూ నునుపుగా కనిపిస్తవి.

శాస్త్రజ్ఞానాధికారులైన వేలకొలది మనుష్యులలో ఎవరో ఒకడు జ్ఞానసిద్ధికొరకు ప్రయత్నము చేయును. యత్నముచేసెడి సిద్ధులలో ఎవడోఒకడు మాత్రమే భగవంతుని నిజస్వరూపము నెరుగును.

యవ్వనం, సౌందర్యం, ఆకర్షణ - యివేవీ గొప్ప విషయములు కాకపోయినా అవున్నాయని తెలుసుకోవడం గొప్పవిషయం.

బుద్ధుని వాక్యము - మనము నిత్యము త్రికరణముల ద్వారా చేయుచున్న పనులవల్ల పాప పుణ్యములనే విత్తనాలు మనః భూమిలో నాటబడి కష్టసుఖములనే ఫలములను పొందుచున్నాము. ఘోరవ్యాధులనుండియు, నరకబాధల నుండియు తప్పించుకుని ప్రతి జన్మలో రెండు లోకములందు సకలభోగములు ననుభవింపగల హక్కును పొందగోరువారు త్రికరణ శుద్ధిగా ప్రవర్తింప వలెను. త్రికరణ శుద్ధియనగా 1. మనస్సుద్వారా ఏజీవికిని కీడుతలచరాదు. 2. వాక్కుద్వారా తిట్టరాదు. 3. క్రియపూర్వకముగా కొట్టుట, చంపుట మొదలగు పనులు చేయరాదు.

దురాలోచనలకు గురికాకుండా ఉండడం దైవమిచ్చిన గొప్ప వరం.

సంఘవ్యవస్థవల్ల కలిగే అశాంతిని అంటుంచితే, మానవులు తమకష్టనిష్ఠూరాలకు, తమ మానసికాందోళనకు తామేచాలవరకు కారణం.

చిత్రకళ అనేది స్నేహితుని వంటిది. దానితో కలిసి జీవిత ప్రయాణంలో అధికభాగాన్ని నడిచి అధిగమించవచ్చు.

భగవంతుని ప్రకృతి యచేతనం బైనందువలన నికృష్టమైనది. దీనికంటె ఉత్కృష్టమును జీవభూతమునైయున్న భగవంతుని ప్రకృతి శేరొకటికలదు. దానిచేతనే ఈప్రపంచము ధరింపబడియున్నది.

గురువులను, బంధువులను, వంచించి పొట్టబోసుకొనువాడు లోకంచేత నిందింపబడుతాడు. తిన్నగా నరకానికి పోతాడు.

ఆత్మపవిత్రతను నిల్పుకోవాలీ అంటే దైహికంగా కల్గే చెడుగులను అన్నింటినీ నిరోధించాలి.

వృద్ధులైనవారు ఆహార విషయంలో ఎలాంటి నియమాలు పాటించాలో ఆలాగే యువతరంవారు కూడా తాము చదివే పుస్తకాలను గురించి శ్రద్ధవహించాలి. ఆహారాన్ని బాగా నమిలి, జీర్ణంచేసుకోవాలే తప్ప అంతా ఒకేసారి మ్రింగెయ్యరాదు. అలాగే యువతరంకూడా తాము చదివినదాన్ని బాగా పరిశీలించి తర్వాత ఆకళించుకోవాలి.

సర్వప్రాణులకును ప్రకృతి ద్వయమే మూలమని తెలిసికొనవలయును. ఈ రెంటికి మూలమైన భగవంతుడు ఈ ప్రకృతిద్వయం మూలముగా సృష్టిస్థితి సంహారములను చేయుచున్నాడు.

ఋణదాతకంటె యజమానే నయం. యజమానికి అధికారం ఒక దేహంమీదే. అప్పులవాడు నీకీర్తిని డప్పుకట్టి డోలు వాయిస్తాడు.

మనిషి మానసికంగా పెరగాలంటే మనకళారూపాలలో బాహ్య

సమస్యలనేకాక, భౌతికాతీతమైన సమస్యలకు కూడా ప్రత్యేకమయిన స్థానం యివ్వాలి.

తనకన్న ఉన్నతులూ, తనసమానులూ, తనసేవకులూ ఈ మూడు తరగతుల వారితో ఏపేచీలేకుండా సమానంగా సవరించుకుని ప్రవర్తించేవాడే నిజమయిన పెద్దమనిషి

ప్రతివ్యక్తి తనచూపు ఆనినంతమేరకే ప్రపంచపు మేరలని భావిస్తాడు.

భగవంతుని కన్న ఉత్కృష్టమైన కారణము వేరొక్కటియులేదు. అభిన్నకారణంబైన ఈ చేతనాచేతన ప్రపంచము దారమునందు గ్రుచ్చబడిన మణులవలె భగవంతుని యందు గూర్చబడియున్నది.

భృత్యుల సేవకులకు పాలకులు సంతుష్టులై మన్ననలు చేస్తాడు. మన్ననలు పొందిన సేవకులు తమ మాన ప్రాణాలను లెక్కచేయకుండా అవసరం వచ్చినపుడు రాజును కాపాడుతారు.

అనేకవిషయాలను కొద్దిమాటలలో చెప్పడం మేధావుల లక్షణం. విషయం అనేది లేకుండా మాటలు అల్లుకుపోవడం అల్పబుద్ధుల లక్షణం.

దొంగకు అందరిమీదా అనుమానంగా ఉంటుంది.

తొంబై తొమ్మిదిమంది రక్తాన్నిపీల్చే ఈజలగలు (స్వార్థపరులు) వున్నంతవరకూ ఈప్రపంచం బాగుపడదు. నరకప్రాయంగానే వుంటుంది.

ఉదకమునందు రసగుణమును, చంద్ర సూర్యులయందు కాంతియును, సర్వవేదములందు ప్రణవమును, ఆకాశమునందు శబ్దగుణమును, పురుషులయందు పౌరుషమును భగవంతుడే యగుచున్నాడు.

నీకు యిష్టంవచ్చినది చేయడం లాభకరం కాదు. నీవు చేసేప్రతీ పని నీకు యిష్టాన్ని కలిగించగలగాలి.

పెళ్ళిచేసుకున్న మిత్రుడు తానేం చేసినాసరే మొదటిరకం మిత్రుడు కాలేడు. ఆడుదానిహృదయం అతనిహృదయంతో మిశ్రితమై వుంటుంది.

ఆశయ సాఫల్యం కోసం నీచుల సేవచేయడం, కొండనెక్కడానికై నేలమీద ప్రాకడం ఈరెండింట్లో తేడాఏమీలేదు.

చికిత్సకుడు కేవలం చికిత్సచేస్తాడు. ప్రకృతి పూర్తిగా బాగు చేస్తోంది.

పృథివియందు పుణ్యగంధమును, అగ్నియందు తేజస్సును, భూతములందు జీవమును, తపోధనులకు తపంబును భగవంతుడే అయివున్నాడు.

ద్వేషం హృదయంలో జనిస్తుంది. జుగుప్సమెదడులో ఉద్భవిస్తుంది. ఈరెండు భావాలు మనస్వాధీనంలో లేనివే.

పునిస్త్రీలైన యింటి ఆడపడుచులు, కన్యలు, రోగులు, గర్భిణీ స్త్రీలు వీరికి అతిథులకంటె ముందు నిస్సంశయంగా భోజనం పెట్టవచ్చు.

సర్వవస్తువులకు శాశ్వత బీజమును, బుద్ధిమంతులకు అధ్యవసాయమును, తేజోవంతులకు ప్రాగల్భ్యమును భగవంతుడే అయి వున్నాడు.

భారతదేశం బాగుపడాలంటే కేవలం విదేశపెత్తనం పోయి మనమేపెత్తనం చేసుకోవడం వల్ల జరిగేపనికాదు. సంఘంలో వేలాది

సంవత్సరాల నుంచి వస్తున్న దేవుడు, కర్మ అనేవి పోయి వాటిస్థానంలో హేతుబద్ధమైన ఆలోచనాశక్తి రావాలి.

సౌఖ్యం వంటబట్టడమే శాంతి.

సజ్జనసాంగత్యమందు కోరిక, పరగుణములందు ప్రీతి, పెద్దల యెడల వినయం, విద్యలయందు ఆశక్తి, స్వభార్యయందే అనురాగము, లోకనింద అంటే భయం, శివునియందు భక్తి, ఆత్మనిగ్రహశక్తి, దుష్టులకు దూరంగా వుండటం - ఈనిర్మల గుణములు కలవారికి నమస్కారములు.

ఎవరి ప్రభావ మయితే నీపైపడలేదని భావిస్తావో వారేకొన్ని సమయాలలో నీపై తమగాఢ ప్రభావాన్ని చూపించగలిగే అవకాశ ముంది.

మనిషి కోరికలకు భిన్నంగా నీతి, నియమాల వ్యవస్తే లేదు.

బలవంతులకు ఆశానురాగములులేని బలమును, ప్రాణులకు ధర్మ విరుద్ధముగాని కామమును భగవంతుడే అయివున్నాడు.

ఒక్కయుగానికి ఏ అయిదారుగురో మహాపురుషులు పుడతారు. వారందరూ సమకాలికులై ఒక్కటిగా నిలిస్తే ఈ భూమండలమంతా చేరినా వారిని జయించ సాధ్యంకాదు.

మూర్ఖత్వం అంత పాపం మరొకటిలేదు.

వయస్సు తరుగుతుందేగాని నిముషంకూడా ఆగదు. అందుచేత యిట్టి అనిత్యమైన శరీరంతో శాశ్వతమైన కీర్తి సంపాదించు.

అవతలవాడి పొగడ్తలకు ఆశించేవాణ్ణి మనం మెచ్చుకోవటం మొదలు పెడతాం.

ధైర్యం లేనివారికి దయ్యాలు కనబడతాయి.

ఏయే వస్తువులు సాత్త్విక రాజసతామసగుణములను గలిగి యున్నచో అవియన్నియు భగవంతునియందున్నవియే కాని భగవంతుడు వానియందుండువాడు కాడు.

నిత్యం పరివర్తనచెందే ఈ ప్రపంచంలో క్షణకాలపు అతిధులం మనం.

బాగాపరిశీలించిచూస్తే మానవజాతిని మూడు తెగలుగ విభజింప వచ్చు. ఒకరు జీవితాంతం శ్రమచేసేందుకే పుట్టేవారు. మరొకరు బాధలు తోనే మరణకాలాన్ని సమీపించేవారు. వేరొకరు అవసాన సమయం వరకు నిరాశ, నిస్పృహలతో జీవితంపై విసుక్కునేవారు.

అదృష్టం చిత్రమైనది. దేనినీ లెక్కచేయనివారేమో ఆవలలో నుండి సులువుగా తప్పించుకుంటారు. అనుమానిస్తూ, విచక్షణతో, దూరదృష్టితో ప్రవర్తించేవారు ఆవలనుంచి తప్పించుకోలేరు.

గుణమయములైన వికారములచేత మోహము చెందియున్న ఈ ప్రపంచము పరమోత్కృష్టుండును, నాశరహితుండును అయిన భగవంతుని ఎరుగజాలరు.

అతి దారిద్ర్యంగాని, అతి సౌభాగ్యస్థితిగాని హేతువాదాన్ని వినవు.

ప్రతిమనిషీ నిండునూరేళ్ళు బ్రతకాలని కోరుకుంటాడు. కానీ ముసలితనాన్ని మాత్రం ఏవ్యక్తీ కోరుకోడు.

పాపిష్టులును మూఢులును మనుష్యాధములును భగవంతుని మాయవలన వివేకము చెడినవారై రాక్షస స్వభావులై భగవంతుని శరణము పొందక యున్నారు.

ఒక ప్రజ యింకో ప్రజను తెలుసుకొనేట్టుగా మనం చేయాలి. న్యాయాన్ని కోరి, హేతుబద్ధంగా జీవించ నభిలషించే ప్రతి ఒక్కరూ వారి ఐక్యతను, వారి లక్ష్యాల ఐక్యతను, వారి మనోభావాన్ని అర్థంచేసుకునే టట్టుగా; అజేయశక్తిగా ఐక్యము యెలాగా, ప్రపంచంలో చెడుగులన్నిటిని చివరికి జయించగల శక్తిగా ఐక్యమయ్యేలాగ మనంకృషిచేయాలి.

ఆడుకునే బొమ్మ శైశవావస్థలో అన్నింటికంటె ఎక్కువ—అంతే కాదు. పుట్టుకతో ఆడపిల్ల మనసులో వూయలలూగే అందమైన కోరిక.

భగవంతుని భజించెడు పుణ్యవంతులు నాలుగు విధములగు వారలైయుందురు. వారెవరనిన సంకటముచేత పీడింపబడువారు, శాస్త్రార్థముల నెరుంగ నభిలషించెడువారు, ఐశ్వర్యకాముకులు, ఆత్మసాక్షాత్కారమును కోరువారు ఈనలుగురూ భగవంతుని భజించు పుణ్యకృతులు.

భగవంతుని ఓర్పు ఎంతటిదో తెలియచేసేదే భూగర్భశాస్త్రం.

ప్రతివ్యక్తికి ఎల్లపుడు కొన్ని బాధలు, కష్టాలు అవసరం. ఓడలో అడుగున కొంత బరువు వెయ్యనిదే అదితిన్నగా, నిలకడగా ప్రయాణంచెయ్యలేదు.

ఎవరయినా నన్ను "నీవు నిరాశావాదివా, ఆశావాదివా" అని ప్రశ్నిస్తే "నావిజ్ఞానం నిరాశ పూరితమైనది. కాని నాసంకల్పము, నావాంఛ ఆశపూరితమైనవే" అని జవాబిస్తాను.

నిజంగా సంతోషప్రదము, సురక్షితమైన జీవితాన్ని గడపాలంటే ప్రతిమానవునికీ కనీసం రెండుమూడు సరదాలూ, అభిరుచులూ, వాస్తవికమయినవిగా వుండాలి.

అనుకరణ నాగరికతకాదు.

జ్ఞానియగువాడు భగవంతునిలో నిత్యసంబంధము గలవాడునూ, అచంచలమైన భక్తిగలిగినవాడును, అందరికంటె శ్రేష్ఠుడునగును. వానికి భగవంతుడు అత్యంత ప్రియుడు. భగవంతునికి కూడా వాడే ప్రియుడు.

ఆశ అనేది మోహపాశం అవుతే అవుగాక జీవితం అవతల తీరం వరకూ మనని తనవెంట తీసుకు వెళుతుంది.

నడిఏట్లోనైనను కుక్కనాకుతూనే నీరుత్రాగుతుంది.

జ్ఞానియైనవాడు భగవంతునియందు చిత్తము నిలిపి భగవంతుని పరమ ప్రాప్యస్థానముగా నమ్మియుండును.

గౌరవం యిచ్చిపుచ్చుకోవటంలోనే ఉన్నది మానవత.

ఈ విశాల జగత్తులో అమూల్యమయిన వస్తువు లెన్నోవున్నాయి. కాని అతిసామాన్యమయిన వస్తువులకు కూడా ప్రత్యేకము, స్వతస్సిద్ధ మయిన అందము, గొప్పదనము సంక్రమించి వున్నాయి.

నీతికంటె మనసు బలీయమైనదనీ, మనస్సుకంటె అవసరం బలీయమైనదనీ చెప్పడానికి పురుష స్త్రీ స్వభావాలు అత్యుత్తమమైన ఉదాహరణలు.

సుఖాలకు పరసేవ, ధనానికి దురలవాట్లు, గుణాలకు యాచన వృత్తి, ప్రజలకు దుష్టుడైన ప్రభువు మూలచ్ఛేదకరాలని తెలుసుకో.

బుద్ధుని వాక్యము :- శాశ్వత భోగములను యివ్వగల అధి కారం ఒక్క అహింసా వ్రతమునకే తప్ప తక్కిన వ్రతములకు అధికారములేదు. ఇతర వ్రతములన్నియు తాత్కాలిక సుఖముచూపి తర్వాత ఎన్నియో బంధములు కల్పించుచు జనన మరణపు రాసులను

వృద్ధిచేయు స్వభావముఁగలదై యున్నది. శాశ్వత సుఖములు కోరువారి కెల్ల అహింసావ్రతమే దిక్కు.

ఉన్నవాస్తవ పరిస్థితిని గమనించకుండా ఏంలేదని భావించడం దూరదృష్టి కలవారి లక్షణంకాదు.

జ్ఞానియగుట సులభముకాదు. జ్ఞానార్థ సంస్కారము కొరకు లెక్కలేని పుణ్యజన్మములెత్తి పిదప ఒకపుణ్య జన్మమున తనకు ప్రాప్య ప్రాపకములు సమస్తమును భగవంతుడేయని నిశ్చయజ్ఞానము గలిగి భగవంతుని ఆశ్రయించు చున్నాడు.

జట్టులో పొగడడం చాలా అమర్యాదకరమైంది. అందర్నీ కలిపి పొగిడితే ఏ ఒకరినీ సంతోషపెట్టినవాళ్ళం కాము. ఒకరిద్దరిని పొగిడితే మిగిలిన వాళ్ళను కించపరచినవార మౌతాము.

మానవజాతి అవస్థాభేధాలు ననుసరించి మతాలు మారుతుంటాయని నానిశ్చితాభిప్రాయం.

తప్పుచేయడం మానవ నైజం.

మానవులకు విద్యయే సౌందర్యము. అదే దాచుకున్న ధనం. అదే సుఖాన్ని, భోగాన్ని, కీర్తినీ కలిగిస్తుంది. అదే విదేశాలకు పోయినపుడు అక్కడ మనకు బంధువు. విద్యయే పరలోకనేత్రం. రాజసభలలో విద్యకేగాని ధనానికికాదు పూజ్యత. విద్యావిహీనుడు నరుడుకాదు. వింతపశువు.

మనము నైతిక పటిష్టతను నిల్పుకోవలెనంటే ఆత్మశక్తిని కోల్పోనివిధంగా శాస్త్రపరిజ్ఞానాన్ని సమన్వయించు కోవాలి.

భగవంతుని విడిచి దేవాంతరములను భజించువారలను గలరు. ఆపురుషులు తమతమ ప్రకృతి గుణములచేత కట్టబడి ఆయా ప్రాకృత విషయమునందలి కోరికలచేత జ్ఞానశూన్యులై ఆయాకల్పోక్తి నియమముల నాచరించి యింద్రాది దేవతలను శరణము పొందుచున్నారు.

పొదలో దాగిన పక్షికోసం చేతిలోపిట్టను వదిలిపెట్టిన వాడికంటె మూర్ఖుడుండడు.

మరణంఅంటే మనకు భయంలేకపోతే ఆత్మ శాశ్వతత్వం గురించి మనం ఆలోచించేవారం కాదు.

రాజకీయాలనేవి ఉదాత్తమయిన వృత్తి. తరుచుగా రాజకీయనాయకులూ, వారివుద్దేశ్యాలూ, నడవడులూ విమర్శింపబడినా చిట్టచివరకు మాత్రమే వాటినిగురించి ప్రజలు విశాల దృక్పథంతో సరిగా నిర్ణయించగలుగుతారు.

ఎవరికోరికలు చౌకగా వుంటాయో వాడే అధిక ధనవంతుడు.

భగవంతుడు సర్వమూర్తి. స్వరూపుడు, మూలకారణుడు అయి వుండుటచేత ఏ యే దేవతాభక్తుడు ఏయేదేవతను శ్రద్ధాభక్తితో భజించునో ఆయాభక్తునకు ఆయాదేవతలయందు శ్రద్ధాభక్తిని భగవంతుడే స్థిరపరచుచున్నాడు.

నిరర్థకపు మాటల్తో గంటలు తరబడి బేజారెత్తించే మనిషికన్న మనం భయపడాల్సిన భయంకర జంతువు ప్రపంచంలో వేరేదిలేదు.

మహాపురుషుని ఉన్నత స్థానానికి తీసుకునివెళ్ళి వారిని మహామహులుగా చేసేది స్త్రీయే. కాని పతితులైనవారి విషయంలో అలా కాదు. వారిని ఆస్త్రీమూర్తి అట్టడుగుకు తొక్కిపెడుతుంది. ఒకే స్త్రీమూర్తికున్న రెండు రూపాలివి.

నారువేసినవాడు నీరుపోయకుండా వుండడు.

శ్రద్ధావంతుడైనవాడు ఆయాదేవతల నారాధించునపుడు, ఆయా దేవతలకు భగవంతుడు అంతర్యామియై యుండుటను మానవుడు ఎరుగకున్నను ఆయారాధనము భగవంతుని యారాధనంబై యుండుట వలన ఆయా దేవతలచేతనే అతనికి ఫలము లభించునట్లు భగవంతుడు చేయుచున్నాడు.

చచ్చిపుట్టడమనే సిద్ధాంతం చాలా అసభ్యతతో కూడినది.

లేడి, ఏనుగు, మిడత, చేప, తుమ్మెద అనేవి శబ్దాది విషయా లలో ఒక్కొక్క విషయమందు మాత్రమే అధికానురాగం కలిగి మర ణాన్ని పొందుతున్నవి. ఏ ఒక్క విషయంతోనోకాక శబ్దాది విషయము లైదింటిలో ప్రేరితుడైన మానవుని గతి యింక ఏమనిచెప్పవచ్చు ?

చెమట ఓడ్చి శ్రమించనిదే అంటే తపించనిదే ఏది ఎన్నడు సాధించలేము.

నేరం చెయ్యటం అసభ్యతకాదు. అసభ్యతేనేరం.

వితరణలేక కూడబెట్టేవాడు సముద్రంవలె అట్టడుగున వుం టాడు. దానగుణం కలవాడు మేఘునివలె లోకంపైన వుంటూగర్జిస్తూ వుంటాడు.

గాలిపాటుచూచి పోయేవారు కొందరయితే అదికూడా తెలియ కుండా రోటిలో తలపెట్టి దైవంమీద భారంవేసేవారు కొందరయితే గాలికి పోయినపిండి కృష్ణార్పణం అనుకునేవారు కొందరుగా తయా రవుతారు.

క్రాంతి చిన్నచిన్న విషయాలపై కలుగదు. చిన్నచిన్న మాటల వల్లక్రాంతి చెలరేగుతుంది.

నిద్రయందు వచ్చుకల ఏవిధముగా మనకు భ్రాంతిని కల్గించునో ఆరీతినే మానవునకు బాహ్యజగత్తు విషయ వాంఛలందు భ్రాంతిని కలుగచేసి నాశనమునకు హేతువగుచున్నది.

దేవతలను భజించువారు ఆయా దేవస్థానములను పొందుదురు. భగవంతుని భజించువారు. భగవంతునే పొందగలరు.

మృత్యువుకు ఎంత బలంవున్నదో ప్రేమకు అంత బలంవున్నది. కాని ఈర్ష్యద్వేషాలు సమాధివలె కడు క్రూరమైనవి. (బైబిలు)

గురువును మించినవేషం శిష్యుడు ఎప్పుడూ వేయకూడదు. భోజనం కూడా వారికంటె ముందుచేయ కూడదు. గురువు కంటెముందు నిద్రలేచి వారుపరున్నతరువాతే పడుకోవాలి.

భగవంతుడు యోగ మాయచేత ఆవృతంబై యుండుటవలన అతనిని జననమరణములు లేనివానిగా ఎవరును తెలిసికొన జాలరు.

తల్లితనప్రేమను ప్రతిఒక్కరికీ పంచియిచ్చినా అంతా అందరికీ లభిస్తూవుంటుంది.

ప్రకృతినిగూర్చిన భయమే మతసంస్థాపనకు దారితీసింది.

మానవుడు అనాదినుంచి పొందుతున్న అనుభవం, ఆధునిక విజ్ఞానశాస్త్రం భౌతిక వాదానికి పునాదిరాళ్ళు. మానవుని బుద్ధికందని విషయాలు లేవని భౌతికవాదం చెప్పుతుంది. అనాదినుంచీ అజ్ఞానంతో, మూఢవిశ్వాసంతో నిర్మించుకున్న ఊహాప్రపంచాన్ని కల్పితమని రుజువుచేసి హేతుబద్ధమైన స్వతంత్ర ఆలోచనాశక్తిని భౌతికవాదం పెంపొందిస్తుంది.

సౌందర్యాన్ని చూడగలగడం మననైతిక శక్తికి పరీక్ష.

జీవితాన్ని తనదిగాని, సాటిమానవులదిగాని, చరాచరకోటిదిగాని పవిత్రంగా పంచుకుని సహాయం కావలసిన వారందరికి సహాయ పడటానికి జీవితం అర్పించినపుడే మానవుడు నీతివంతుడని చెప్పాలి.

యుద్ధరంగంలో శత్రువు నెదిరించి నిలువగలగాలి. ఎదురు దెబ్బ తీయడంలో శత్రువును మించగలగాలి. యుద్ధములో విజయుల మయినప్పుడు శత్రువు ఎడ దయచూపించాలి. శాంతి సమయములో యితరుల యెడల సుహృద్భావం కలిగి వుండాలి. ఇవే జీవితంలో ప్రతీమానవుడూ నేర్చుకొనవలసిన నాల్గు నీతి సూత్రాలు.

భగవంతుడు భూత భవిష్యద్వర్తమాన కాలము లందలి ప్రాణు లను ఎరుగును. అయినను భగవంతున్ని ఒక్కడును ఎరుంగడు.

రచియితకు వివేకం పెరగటం వల్లనే వివేకం వస్తుందని నా నమ్మకము.

ఈప్రపంచాన్ని మోసంచేసే స్వార్థపరులు మార్జాలాలు. వీరి విక్రయశాలలు — స్వార్థసాధన కేంద్రాలు దేశమంతటా వున్నాయి. శివాలయం, విష్ణ్వాలయం, జనాలయం, బౌద్ధవిహారాలు, రాజమంది రాలు- యివన్నీ వీరి విక్రయశాలలు. సాధారణప్రజలు- నిత్యపీడితులు- మూషికాలు.

నిండుకుండ యెప్పుడూ తొణకదు.

ఇచ్ఛా ద్వేషముల వలన బుట్టిన శీతోష్ణాది ద్వంద రూపమైన అజ్ఞానముచేత సమస్తప్రాణులును సృష్టికాలమందే అవివేకము చెందు చున్నారు.

మనవారిని అభిమానిస్తాము. అదిసహజం. కాని యెవరో పర

చయం లేని వ్యక్తిపట్ల వాంఛకాని ప్రేమ కలిగితే అది మానవత్వానికి నిదర్శనము.

కొందరు పురుషులు తండ్రులుగాకాక ప్రియులుగానే వుండి పోతారు. వారిని మనమేమీ అనలేము.

బంగారం, దాన్యం, రత్నాలు, వివిధ సంపదలు రాజుకు ఎక్కడ్నుంచి వస్తున్నాయి. ప్రజలనుంచేకదా !

బుద్ధునివాక్యము - మాంసభక్షణ మానవులకు నియమించలేదని స్పష్టమగుచున్నది. ఎట్లన మాంసభక్షణ జంతువులన్నియు మాంసమునే తినుచున్నవి. కాని కొన్నిజంతువులు తినుటయు, కొన్నిజంతువులు తినకపోవుటయు లేదు. మానవుడు మాంసభక్షకుడు అయిన యెడల మానవులందరూ మాంసమునే తినుచుండవలెను. కొందరు తినుటలేదు. అందుచే మాంసభక్షణ నియమించలేదని నిర్ధారణ యగుచున్నది. మాంసము తినెడి జంతువులన్నియు సృష్టిమొదలు నేటివరకు మాంసమునే తినుచున్నవి. కాని శాఖాహారమును తినుటలేదు. శాఖాహారము తినెడు జంతువులన్నియు అనాదినుండి యిప్పటివరకూ గడ్డినేతినుచున్నవి గాని మాంసమును తినుటలేదు. నరులు మాత్రము విపరీత బుద్ధికలిగి ఈశ్వర శాసనముల ధిక్కరించి తమకు నియమించిన శాఖాహారముతో తృప్తిచెందక మాంస భక్షకులగుట అధోగతికి పోవుటయే యగును.

తన నిత్యజీవితానికి సంబంధించని విషయాలను గురించి మానవుడు యెంతో జ్ఞానాన్ని పొందగలుగవచ్చు. కాని వాటివల్ల అతనికే విధమైన లాభముగాని లేక సంతృప్తిగాని కలుగదు.

ఎవరు పుణ్యకర్మములు చేసి పాపరహితులై పిదప ద్వంద్వ

రూపమైన అవివేకమునుండి విముక్తులై దృఢవ్రతులై యుందురో వారే భగవంతుని భజింతురు.

తనపొలం సేద్యం చేసుకునే వ్యక్తికి కడుపునిండా అన్నం దొరుకుతుంది. (బైబిలు)

సూర్యుని తేరిపార చూడకు. పెద్దబరువులు నెత్తిమీద మోయకు. సూక్ష్మములైనవి సైతము మెరుస్తున్నవి. అశుద్ధము, అప్రియములను చూడబోకు.

విజ్ఞాన శాస్త్రజ్ఞులు కనుగొన్న విషయాలు పరిశోధనాలయాలకు పరిమితమై వుండకుండా వెనువెంటనే పరిశ్రమలలో వాటిని అమలు జరపాలి.

జరామరణాది సమస్త దుఃఖనివృత్తి రూపమైన మోక్షాపేక్షతో భగవంతుని ఆశ్రయించి తగిన యత్నమును చేయువారెవరో వారు ఆబ్రహ్మమును ఆధ్యాత్మ్యమును, సమస్త కర్మమును ఎరుంగు చున్నారు.

భయం అపాయాన్ని ఆహ్వానిస్తుంది. ముసుగులో దాగిన పిరికి పందలు అందరికీ తెలిసిన పిరికిపందల్ని అవమాన పరుస్తారు.

కడుపు క్రమం తప్పితే దేవుడువేసే శిక్షఅజీర్తి.

సర్వజీవులను నీవలెనే చూచుకోవడం సాధనచేయాలి.

రాజనీతిజ్ఞుడైనవాడు దూరదృష్టితో తానుచేసే ప్రతీకార్యాన్ని దేశక్షేమాన్నాశించి చేయాలి. అలా దేశక్షేమానికి సంబంధించిన కార్యాన్ని చేయవలసి వచ్చినప్పుడు తనుఒకప్పుడు ప్రగాఢంగానమ్మిన మహాసిద్ధాంతం ఒకటియేదైనా అడ్డుతగిలినాసరే ఆసిద్ధాంతాన్ని విడనాడి ఆకార్యాన్ని చేయడానికి సంసిద్ధుడై వుండాలి,

అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము వీటియన్నిటికి భగవంతుడే ఆధారమని ఎవరు భగవంతుని యెరుగుదురో వారు చరమ ప్రయాణకాలమందు గూడ తమతమ కాంక్షావిషయమైన ఫలానుగుణముగా సమాహిత చిత్తముతో భగవంతుని తెలుసుకొనుచున్నారు.

భూతకాలాన్ని ప్రియంగా పరిగణించే వారి పరిపాలనలో వున్నదేశం భవిష్యత్తు భద్రంగా వుంటుంది.

ప్రపంచంలోని కష్టాలన్నిటిని కుప్పగాపోసి మానవులందరిని సమానంగా పంచుకోమంటే అధికసంఖ్యాకులు యెవరిభాగం వారు తీసుకొని వెళ్లిపోతారు.

ఓనోటితో పాశ్చాత్యులను వెక్కిరిస్తో ఓమూలనుంచి వాళ్ళను వికృతంగా అనుకరించడం మొదటినుండి మనలో జరుగుతున్నపనే.

నిజమాడితే నిష్ఠూరముగానే ఉంటుంది.

ప్రకృతికంటె పరంబై నాశరహితంబగు ఆత్మస్వరూపమే బ్రహ్మము. ప్రకృతి సంబంధాది స్వభావమే అధ్యాత్మము. భూతోత్పత్తికికారణమైన ద్రవ్యత్యాగమే కర్మము.

కాపురుషులు తినడానికి, త్రాగడానికి జీవిస్తారు. సజ్జనులు జీవించటానికి తింటారు, త్రాగుతారు.

చిత్రకారులు ఎంతో ఆనంద జీవులు. ఎందువల్లనంటే వారు ఎప్పుడూ ఒంటరితనాన్నెరుగరు. ప్రకాశవంతము మరియు వర్షపాలితము అయిన ఈ ప్రపంచం, శాంతి మరియు జీవితంపై కోరిక వారితో యావద్దినమూ లేక యించుమించు యవద్దినమూ — చెట్టాపట్టా వేసుకుని నడుస్తాయి.

ఊరంతా వస్తువకుకున్నప్పుడు నీవు నీకుండున్న ఆహారాన్ని పారేయడంకాదు; చేయాల్సినపని. నీలాంటి ఆకలిగొన్న మరొక మానవుడికి అందించాలి. అదే సహజమయిన మానవ హృదయం చేసేపని.

సంఘమున సంభవించుచున్న అన్యాయములను, దౌష్ట్యములను తెలిసియు తెలియనివారివలె మసలుచు, తమమనుగడయే ముఖ్యముగా నెంచి, ఎక్కడి కక్కడ తప్పించుకుని తిరుగువారు కొందరు. కొందరు తాత్కాలికోద్రేకములకు లోబడి, ధైర్యముగలవారివలె ముందునకుసాగి ఎదురైన విఘ్నపరంపరకు వెన్నిచ్చి అటునిటుగాక అర్థాంతరముగ నదృశ్యులగుదురు. మరికొందరు తమ గమ్యస్థాన మెట్టిదో గ్రహించి తాము పయనించవలసిన బాటలోని మిట్టపల్లములను, రక్కసపొదలను ముందుగనే గుర్తెరిగి, తోడునీడా లేకుండా సాగవల యునని, అడుగడుగునను, నెత్తిపైకెక్కు అపనిందలను భరించుచు, విద్యుక్తధర్మమును విడవక, ముందునకే చొచ్చుకొని పోదురు. అట్టి వారు మెట్టిన బాటకే ముందుతరముల వారికి భద్రత నొసగు కోటలు.

ప్రేమకాదు, ధనంకాదు, కీర్తికాదు - నాకు సత్యం కావాలి.

క్షమాశీలి, దాతగుణగ్రహణ పారీణుడైనరాజు, పుణ్యవశాత్తూ లభించవచ్చుగాని అనుకూలవంతుడు శుచి, సమర్థుడు, విద్వాంసుడునైన కవి లభించడం దుర్లభం. అట్టికవి లభిస్తే ఆజాతికే గౌరవము.

నాశమును పొందదగిన వస్తువధి భూతము. భగవంతుని యంశమైన పురుషుడే అధిదైవతము. శరీరములందు అంతర్యామియైన భగవంతుడు అధియజ్ఞుడు.

కులీనులతో వివాహాది సంబంధాలు పెట్టుకునేవారు, పండితు

లతో స్నేహం, జ్ఞాతులతో ఐకమత్యం కలవారు ఎన్నడూ ఆపదలు పాలుకారు.

దైవం అనేమాటతో ప్రకాశించే దివ్యజ్యోతితో పోల్చిచూస్తే ప్రకృతి, శాస్త్రము, హేతువాదనలు, ప్రసరించే వెలుగు అంధకారం.

అన్నికోరికలు తీరిపోయిన తరువాత తనసత్కార్యాల తాలూకు మంచిఫలితాలను చూడవలెననే కోరిక మనిషిని వేధిస్తుంది. ఇదికూడా అనవసరమైన కోరికే.

ఏపురుషుడు తనయొక్క అవసానకాలమందు గూడ భగవంతుని స్మరించుచు శరీరమును విడుచునో వాడు భగవంతుని స్వరూపమునే పొందుచున్నాడు.

లోకంలో నాకంటె పిరికివాడులేడు. నేను ఒక్క చెడుపని కూడా చేయడానికి సహించలేదు.

సమస్త జీవులయెడ బాధ్యత భావమే నీతి.

మనదేశంలో దేవుడు, కర్మచలామణి అవుతున్నట్లు మరేవి చలామణి కావటంలేదు. నీతిని రుజువు చేయడానికి వేదాలు, ధర్మశాస్త్రాలు, సృష్టించబడ్డాయి. వాటికనుగుణంగా మానవసంఘం నిర్మించబడ్డది.

ఉత్తమరచనకు నిదర్శనం ప్రజల ఆధారం ఒక్కటేకాదు. ప్రజల శ్రేయస్సుకు ఉపయోగపడే భావాలుకావాలి. మనిషి మనస్సును పెంచి, అతనికి ఆహ్లాదం కలుగచేయడం కూడా కళ ప్రయోజనాలలో ఒకటి.

అంతిమ స్మరణము స్మరించువానిని స్మరించబడిన దానితో సజాతీయమైన యాకారముగలవానిగా చేయునది. కనుక అంత్యకాల

మందే యే దేవతా రూపమును తలచుచు శరీరమును విడుచునో వాడెల్లప్పుడునూ ఆయా స్మరణముచేత కలిగిన సంస్కారముల వలన ఆయా రూపములను పొందుచున్నాడు.

సంతృప్తికి సహనం ఆధారం.

దుర్వార్త తొందరగా ప్రాకుతుంది.

ప్రతివ్యక్తి ఒక దేవాలయాన్ని నిర్మిస్తాడు. అది అతని దేహమే.

ఈనాటి స్త్రీకి పురుషుడే విధాత. పురుషుడు తయారుచేసిన ఒక ఆటబొమ్మ స్త్రీ. కనుక ఈనాటి స్త్రీ ఏంచేసినా అందుకు బాధ్యుడూ, కర్తా పురుషుడే.

నీళ్ళుపోకముందే గట్టుకట్టాలి.

అభ్యాసయోగముతో గూడుకొనునదియును, యితర విషయములందు ప్రవర్తింపనిదియునైన మనస్సుతో అప్రాకృతుడైన పరపురుషుని ధ్యానించువాడు ఆపరమపురుషునే పొందుచున్నాడు.

శాంతి సుస్థిరమైనప్పుడే లోకంలో సమృద్ధి తలసూపగలదు.

శ్రమపడకుండా ఫలితం ఆశించటం దొంగతనం చేయుట వంటిది.

అఖండమూ, అమేయము, అగోచరమూ అయిన జీవితశక్తి ప్రపంచాన్ని నడుపుతూ వుంటుంది. మనుషులను పురోగమింప చేస్తూ వుంటుంది. ఆ అగోచరశక్తిముందు మానవుడు వినమ్రుడై పురోగమించాలి. కాస్తకన్నుమూసాడా ఆశక్తి మనిషిని పట్టుకుని గిరగిర తిప్పి కిందపడగొడుతుంది. ప్రవాహం అతణ్ణిముంచి, పుత్తకళేబరాన్ని

ఏ గట్టుకో తోస్తుంది. ప్రతిమానవుడు తనపోరాటం మాత్రమే చాలదని తనసంకల్పబలము మాత్రమే చాలదని గుర్తించాలి.

యుద్ధాల్లోమాదిరి వాదనల్లోకూడా బలహీనమైన పక్షమే ప్రతిపక్షం. తమని బలవంతులుగా ఊహించుకోవాలనే ఉద్దేశంతో ఉట్టిమాటలుతోనే హడావిడి చేసి హడలగొట్టుంటుంది.

ఇతరుల విషయాలలో, వ్యవహారాలలో జోక్యం కలిగించుకోకుండా వుండగలగడం చాలాముఖ్యం.

పరమపురుషుడు సర్వజ్ఞుడు, పురాణపురుషుడు, జగన్నియామకుడు, అణువుకంటె మిక్కిలి సూక్ష్మ స్వరూపుడు, సర్వజగద్రక్షకుడు, అచిన్త్యస్వరూపుడు సూర్యతేజస్సువంటి స్వయంప్రకాశ స్వరూపుడు.

శ్రమకు అంతమే విశ్రాంతి.

ఈపుడమిపై అన్నింటికంటె అత్యంతానందాన్ని కలిగించే సంగీతము ఏదంటే చిట్టిపాపల చిన్నారి పెదవులపైనుండి వినిపించే జిలిబిలి పలుకుల గీతం.

మహాపురుషుని భక్తియుక్తుడై చిత్తస్థైర్యలక్షణమగు యోగబలము చేత అవసానకాలమందు ప్రాణవాయువు ఆకర్షించి భ్రూమధ్యంబున చక్కగ నిలిపి స్మరించుచుండెడు పురుషుడు బ్రహ్మ రంధ్రమును భేదించుకొని ప్రకాశాత్మకుండైన యాపరమ పురుషునే చెందును.

భగవంతుడనే వాడుంటే అతను తన వునికిని విశ్వసించని వాళ్ళమీద కోపం చూపించేటంత అహంభావికాడు.

కర్మసిద్ధాంతము మనిషిని ఆజన్మాంతం బానిసత్వంలో వుంచుతుంది. కర్మసిద్ధాంతం ప్రకారం మానవుడు తానేమీ చేయలేని స్థితిలో పడిపోతాడు. అంతాదైవమే నిర్ణయిస్తాడు అని తృప్తిపడతాడు.

కాలప్రవాహంలో వ్యక్తిజీవితం ఒకబిందువు. అందువల్ల జీవితం వుండగనే అనుభవించు. వృథాచేయకు.

బంధువులు లేకపోతే దిక్కులేదు. విద్యలేకపోతేజీవితంశూన్యం. పుత్రులులేకపోతే యిల్లు, దరిద్రం కలిగితే సర్వం శూన్యమే.

శ్రోత్రాది సర్వేంద్రియములను నిరోధించి హృదయ కమల మందుండెడి భగవంతునియందు మనస్సునిలిపి ఊర్ధ్వగామియైన, నాడిని యధిష్టించి బ్రహ్మరంధ్రమందు ప్రాణవాయువు నుంచి యోగ ధారణ నాశ్రయించవలెను.

ఆచారాలు, సాంప్రదాయాలు పేరిట చేసిన హింసలు దుష్ఫలితాలను కూడా మనిషి తనకర్మఫలమునుంచి తుడిచివేయలేదు. దానినికూడా అనుభవించ వలసిందే.

"చీకటి: చీకటి'' అని అరచినంత మాత్రాన చీకటి పోతుందా! దీపముతెచ్చి చీకటిని పోగొట్టు.

ఎక్కువతెలిసి తక్కువ మాట్లాడేవారు తక్కువ. తక్కువ తెలిసి ఎక్కువ మాట్లాడేవారు ఎక్కువ.

సత్యం, ధర్మం, పరాక్రమం, దయ, ప్రియవచనాలు, దేవాతిథి పూజనం యివన్నీ స్వర్గానికి మెట్లుఅని సత్పురుషులు చెపుతారు.

నోరుముయ్యడానికి మూకుడుంది గాని ఊరిని ముయ్యడానికి మూకుడులేదు.

చార్వాక మత సిద్ధాంతాన్ననుసరించి ఆత్మ, పరమాత్మ, ఉత్తర జన్మ, పూర్వజన్మ ఏమీవుండవు. ఇహజన్మ, ఇహ జీవితం, ఈలోకపు అనుభవాలే ముఖ్యమైనవి.

యోగధారణకు పర్యవసాన స్థితినిపొంది పరబ్రహ్మ వాచకం బైన ప్రణవము నుచ్చరించుచు దానికి వాచ్యార్థమైన భగవంతుని స్మరణము చేయుచు ఎవడు దేహమును పరిత్యజించునో వాడు అర్చిరాది మార్గమునంబోయి పరమప్రాప్య స్థానమును పొందుచున్నాడు.

బీదలకు యిచ్చువానికి లేమిఅంటదు (బైబిలు).

మానవుని జీవితంలో ముఖ్యమైన మూడు అంశాలకు హేతువు లేదు. అవి — పుట్టుక, పెళ్ళి, చావులు.

పరుషంగా మాట్లాడడం కూడా క్రూరత్వంలో భాగమే. మాటలతో యితరులను గాయపరచడం దారుణమయిన పని.

ఎవడు అనన్య మనస్కుడై సదాభగవంతుని స్మరించుచుండునో అట్టిస్థిరమైన సమాధికల ధ్యానాభ్యాసికి భగవంతుడు ప్రయాసలేకయే సులభముగా బొందదగినవాడై యున్నాడు.

స్వర్గోన్ముఖమైనప్పుడే జీవితం సాగరతరంగాలవలె నిత్యనూతనత్వం నంతరించుకుంటుంది.

నెమ్మదిగా, ప్రియంగా, ధైర్యంగా మంచికలిగేలా సత్యం చెప్పు. ఆత్మస్తుతి, పరనింద విసర్జించు.

గతించిపోయిన వాటినీ, పాతబడిపోయిన వాటినీ త్రోసిపుచ్చడానికి, ప్రగతిని నిరోధించే వాటిని త్రోసిపుచ్చడానికి విజ్ఞానశాస్త్రం జంకరాదు.

ఆశలేనిచోట సాధనమృగ్యం.

గొప్పవంశంలో జన్మిండచం గొప్పదే. కాని ఆగొప్పతనం పూర్వీకులకే చెందుతుంది.

కొవ్వొత్తులు ఆరిపోయిన తరువాత ఆడవారందరూ అంద గత్తెలే.

మానవుడు తనను గురించీ తనచుట్టూవున్న ప్రపంచాన్ని గురించీ ఆలోచించే ప్రతిక్షణంలోనూ జీవించాలనే సంకల్పానికి వస్తాడు.

శ్రేష్టమైన యోగసంసిద్ధివలన సర్వోత్కృష్టంబగు మోక్షమును పొందిన మహాత్ములు మరల దుఃఖాస్పదమును అనిత్యములైన జన్మమును పొందరు.

క్రూరత్వం రెండురకాలు. ఉద్దేశపూర్వకంగా చేసేది. ఉద్దేశము లేకుండా (తెలియకుండా) చేసేది. ఉద్దేశపూర్వకంగా చేసేక్రూరత్వం (తోటిప్రాణికి హింసకలిగించడం లాంటిది) అన్నిపాపాలలోనికి గొప్ప పాపం. అది రాక్షసులపని. మనుష్యులపని కానేకాదు.

మంచికి, చెడుకు ఒక్కక్షణమైనా రాజీలేదు. ఎప్పుడూ నష్టం రానిపెట్టుబడి మంచి ఒక్కటే.

సంఘంలో జరిగినది జరిగినంత వరకే, చూసినది చూచినంత వరకే చెబితే రచయిత కేవలం ఫొటోగ్రాఫరు మాత్రమే అవుతాడు. సంఘంలో జరిగే సంఘటనలకు ప్రయోజనాన్ని కలిపి రచయిత చదు వరుల దృష్టికి తేవాలి. ఆరచనే కలకాలం నిలుస్తుంది.

బ్రహ్మలోకము పర్యంతము సమస్తలోకమును జీవులకు పునరా వృత్తి హేతువైనది. భగవంతుని పొందిన వారికి మాత్రము పునర్జన్మము లేనేలేదు.

నీకు చేతనైతే భగవంతుని ఆరాధించు. అంతేగాని ఆపని చేయని వాళ్ళను నిందించకు.

సూర్యగ్రహంలో ఎంత యినుము వున్నదీ తదితరలోహాలు ఏ యే పాళ్ళలో వున్నదీ తెలుసుకోవడం తేలికే. కాని మనలో జీర్ణించి వున్న నైజాన్ని తెలుసుకోవడం మనతరం కావడంలేదు.

పండిన చెట్టుకే ఎక్కువ రాళ్ళదెబ్బలు తగులుతూ వుంటాయి.

బ్రహ్మాది లోకములను పునరావృత్తి హేతువులనుటకు కారణము కలదు. అహోరాత్రి విభాగముల నెరింగినవారు చతుర్యుగ సహస్రమును బ్రహ్మకు ఒక పగలనియు మరియొక సహస్రము అతనికి ఒక రాత్రి యనియు చెప్పుదురు.

మానవ సహజమైన భోగము సదా గ్రాహ్యమే. కాని దొంగలా పదిమందిని దోచుకుని వొంటరిగా అనుభవించిదమన్నదే అదిపశుభోగం, పశుకామం.

ఒక్క నిరంతర సౌభాగ్యస్థితిని తప్ప ప్రపంచంలో యితర అంశాలన్నిటికీ సహనం చూపించవచ్చు.

నీభౌతికశరీరము, నీకోరికలు, నీఆలోచనలు, తామే నీసర్వస్వం అన్నట్లుగా వ్యవహరించి నిన్ను మభ్యపెట్టడానికి ప్రయత్నిస్తాయి. అవి కేవలం నీకు ఉపకరణాలు మాత్రమే అనిగుర్తించు. నీవు వాటికి యజమానివి. వాటివిలువ, ప్రయోజనం గుర్తించి, గమనించి వాడుకోవాలి.

సృష్టికార్యం జీవితంలోనే ప్రప్రథమ కార్యం.

ఏకాంతముకంటె, మంచిసహచరుడు నాకింతవరకు దొరకలేదు.

తలమీదనున్న గడ్డిపోచను తీసివేసినా గొప్పవుపకారం చేసినట్లు సత్పురుషులు భావిస్తారు. ప్రాణాన్ని అడ్డంవేసి ఉపకారము చేసినా దుష్టులు పగపడ్తారు. అది వారివారి నైజం.

భారతదేశమునకు సహజపరాక్రమ సంపన్నులగు శూరులు కావలసి యున్నారు. మనమట్టి శూరులుగా నుండవలెను. పర్వతస్థైర్యంతో ప్రతివారూ నిలవాలి. సత్యమునకు సర్వదా జయమే చేకూరును. జాతీయ రక్తనాళములలో యితోధికశక్తి నుద్దీపింప చేయగల యొక నూతన విద్యుత్తేజమే భారతదేశమునకు యిపుడు కావలసినది. మనము ధీరత వహింపవలెను. మనుజుడు మృతినొందునదొక్కసారియే. దేనికిని తొణకకుండు పరిపూర్ణ మనః స్థైర్యమును అలవరచుకొనవలెను.

బ్రహ్మయొక్క పగటి ప్రారంభమును ప్రకృతి స్వరూపము నుండి ప్రపంచములన్నియు నుత్పన్నములగు చున్నవి. రాత్రి ప్రారంభమున ప్రకృతి రూపమందే అన్నియు లయమును పొందు చున్నవి.

జలాలు ఎన్నైనా ప్రేమ దేహాన్ని తీర్చలేవు. వరదలెన్నైనా దానిని ముంచలేవు (బైబిలు).

తండ్రియెదుట పొగరపోతు మాటలాడరాదు. వేళాకోళాలు, బెదిరింపులు, చాడీలు పలుకరాదు. అది తనకు మేలు కాదు.

పూర్వకల్పమున పుట్టిన ప్రాణి సమూహమే కర్మపరాధీనమై పగటి ప్రారంభమునందు పుట్టును. రాత్రి ప్రారంభములో లీనమగును.

వేదాంతం అభ్యసించటమంటే ఆత్మను చావుకు దారితీయించడం వంటిదే.

వెయ్యిమంది ఒకవిషయంలో ఒక అభిప్రాయాన్ని వెలుబుచ్చ వచ్చునుగాక. కాని వారందరూ అజ్ఞానులు అయినట్లయితే సంఖ్యలో వారు వెయ్యిమంది అయినందువల్ల ఆ అభిప్రాయానికి విలువరాదు. అది నిష్ప్రయోజనం అవుతుంది.

ప్రకృతికంటె లక్షణంబును వుత్తమంబును యింద్రియములకు అగోచరంబును అనాదియునైనది ఒకటి కలదు. అది సమస్త భూతములు నశించినను నాశము నొందదు.

కన్నతల్లి చేతులు అతిమృదువైనవి; ఆ చేతులలో వ్రాలిన పసిపాపకు శుభాశీస్సులు కమ్మటినిద్రే.

రాజుమంచివాడు కావాలి. రాజ్యం బాగుండాలి. అప్పుడే జనులు సుఖపడతారు. ఇలా జరగాలంటే రాజయినవాడు యింద్రియాలను జయించుకోవాలి.

నీతిశాస్త్రం ప్రకారం ఖూనీకంటె దొంగతనం పెద్దనేరము. ఖూనీ అంటె ఒకవ్యక్తి లేక కొంతమంది వ్యక్తులు హింసకుగురికావడం,

ఏపరబ్రహ్మము యింద్రియములకు గోచరంబు కాదనియు, నాశములేనిదనియు చెప్పబడుచున్నదో ఆపరబ్రహ్మమునే పరమప్రాప్యస్థానముగా చెప్పుచున్నారు. అట్టిస్థానమును చెందిన వారు మరలపుట్టరు. ఆపరమోన్నతంబైన స్థానమే భగవంతుని పరమపదస్థానము.

పృధ్వీశ్వరులను నిరంకుశులుగా చేయడానికి జగదీశ్వరులను కల్పించడం జరిగింది.

ఈ సమస్త చరాచరములును యెవనియందు అంతర్గతంబై యుండునో, ఈ సమస్త భూతములందును వ్యాపించియుండువాడెవడో ఆపరమ పురుషుడు యితర వ్యాపారశూన్యమైన భక్తిచేతనే పొందబడువాడు.

నీవు చేసే పనిలో నిజాయితీగావుండు. లేనిది ఉన్నట్లుగా కనిపింప చేయడానికి ప్రయత్నించకు. నటన జీవితాన్ని నాశనం చేస్తుంది. సత్యం చేరువకు నిన్ను చేరనీయకుండా అడ్డుతెరలు ఏర్పరుస్తుంది.

ఒంటరిగా బయలుదేరవలసినవాడు నేడే బయలుదేరవచ్చు. కాని మరొకరితో కలసి బయలుదేరవలసినవాడు వారికోసం ఆగాలి.

మహాత్మగాంధి ఏ ఆశయములకోనమై తన జీవితమంతయు సంకితం చేసెనో, వానిని మనస్సునందుంచుకొని, అస్పృశ్యతను వెడల నడిచి, కులమత విద్వేషముల కూలద్రోసి, సత్యాహింసామార్గముల మనమందరమును సంచరింపగలుగుటయే మన కర్తవ్యము.

పాటుబడితే భాగ్యము కలుగును.

అభిమాన దేవతలతో గూడిన అగ్ని, తేజస్సు, దివసము, శుక్లపక్షము, ఉత్తరాయణము దీని అభిమాన దేవతలు ఏమార్గమున ప్రాపులై యుందురో ఆ మార్గమునంబోయిన బ్రహ్మవేత్తలు బ్రహ్మమునే పొందుచున్నారు. ఇది అర్చిరాది మార్గము.

ఆశను పెంచేదే సహసాన్ని ప్రశంసిస్తుంది.

ఎంతచక్కగా, నిండుగా, సుఖంగా, భాగ్యవంతంగా, ప్రశాంతంగా ఎవరిజీవితమైనా వున్నప్పటికీ ఒడుదుడుకులు, యిబ్బందులు, ఆశాభంగాలు ఉండకతప్పవు.

సహనం శక్తివంతమైనది. కాలంతో చూపిన సహనంవల్ల మల్బరిఆకు సిల్కుగా మారుతున్నది.

మనసుకు ఫలించిన కష్టం ఆలోచన. ఫలించిన సంతోషం పగటికల.

స్త్రీ, రత్నం, విద్య, ధర్మం, సదాచారం, మంచిమాట, సుందర శిల్పాలు, యివి యెక్కడనుంచి వచ్చినా నిశ్శందేహముగా సేకరించవచ్చు.

విద్య, ధనం, యశస్సు, ధర్మంవాటిని ఎన్ని ప్రయత్నాలైనా చేసిఆర్జించు.

వ్యసనాల్ని, దుష్టులతోనేస్తం, తగువులను, ద్రోహకృత్యాలను ప్రయత్న పూర్వకంగా పరిత్యజించు.

మన ఆత్మబలం సత్యాన్వేషణకు పూనితే కాలమే అవసరమూ, అర్థమూ అయిన పరిణామం కలిగిస్తుంది.

మానవుడి జ్ఞాపకశక్తి అక్షయమైనది. అభేద్యమైనది.

ధూమము రాత్రి కృష్ణపక్షము దక్షిణాయనము. ఈమార్గమునం బోయిన కర్మయోగులు చంద్రప్రకాశముతోనున్న స్వర్గాది లోకములకు బోయి మరల జన్మమునెత్తుదురు. ఇది ధూమాది మార్గము.

సాహిత్యం ద్వారా సంస్కారానికి పూనుకునే రచయిత మొదట తన్నుతాను పరీక్షించుకుని తన నిజాయితీ, శీలం, వ్యక్తిత్వంపట్ల నమ్మకము కల్గినతరువాతనే అందుకు అర్హుడు.

నీకుగల వెలుగులో ధైర్యంగా, తెలివిగా నడకసాగించు. నీకు తోడ్పడే హస్తంపైన, స్వర్గానవుంది.

ఆత్మవిశ్వాసం లేనివాడు తిరుగుబాటేం చేయగలడు.

ఎడతెగని నీటిధారకు ఎంతకఠిన శిలలైనా అరిగిపోతాయి.

నాలుకతో చెడుచెప్పకు. పెదాలతో కపటాలు పలక్కు (బైబిలు).

మానవుడే గనక తనవిషయము, తనకూ ప్రపంచానికీ సంబంధించిన విషయము స్పష్టంగా తెలుసుకోవాలని వాంఛిస్తే వివిధ విషయాలను గురించి ఆలోచించడం మానివేసి ముందుగ తన చైతన్యాన్ని గురించి ఆలోచించాలి.

జీవితం విజ్ఞానంచేత నడప బడాలి. ప్రేమచేత ప్రకాశింప బడాలి. అదే మంచి జీవితం.

పావురం పిల్లిముందు పడితే తప్పించుకోడానికి ప్రయత్నం చేయకుండా కళ్ళు మూసుకుంటుంది.

పెందలకడ నిదురపొమ్ము. వేకువనే నిదురలెమ్ము.

జ్ఞానాజ్ఞాన ప్రకాశములు కలిగిన ఈశుక్లపక్ష కృష్ణపక్ష మార్గములు రెండును వేదసమ్మతములును, శాశ్వితములునైనవి. శుక్లపక్ష మార్గము పునర్జన్మము లేనిదియును, కృష్ణపక్ష మార్గము పునర్జన్మము కలదియు నగును.

నువ్వుయెరివకీ సహాయం చెయ్యలేవు. సేవ మాత్రమే చెయ్యగలవు.

అనంతత్వానికి ప్రస్తుతక్షణం తప్ప వేరొక పట్టుకొమ్మ ఏదీ లేదు.

వేదాధ్యాయనమును, యజ్ఞమును, దానమును వీనివల్లన కలిగెడి పుణ్యమును యోగియైనవాడు తృణప్రాయములుగ దలచి యపేక్షించి ఆద్యంత రహితుడైన సర్వేశ్వరుని స్థానమును పొందుచున్నాడు.

తెగేవరకు తాడులాగి తెగిపోయిందని కేకలుపెట్టి ప్రయోజనం లేదు.

ఆగ్రహోద్రేకాలకు బానిసకాని వ్యక్తిని నాకు చూపించండి. అతన్ని నాహృదయాంతరాళంలో భద్రంగా దాచుకుంటాను.

రచయిత ఆంతరంగిక ఘర్షణలనూ, వైరుధ్యాలనూ చిత్రించాలి. తారుమారైన భావోద్వేగ లక్షణాలను అతడు గమనించాలి. మానవ

హృదయంలో మంచిచెడ్డల మధ్య జరుగుతున్న ఘర్షణపై కాంతిని ప్రసరింపచేయాలి.

విజ్ఞానయుక్తమైన జ్ఞానము విద్యలలో శ్రేష్ఠంబును, రహస్యములలో పరమరహస్యమును, పావనంబును, ఉత్తమంబును, ప్రత్యక్షావగమనంబును, ధర్మయుక్తంబును, ఆచరించుటకు మిక్కిలి సుఖంబును, నాశరహితంబును నైనది.

తప్పుపని చేసినవాళ్ళు ఎన్నడూ క్షమించరు.

దేవునిమీద నమ్మకం లేనిదీ, దేవుణ్ణి పూజించనిదీ ఆడదేనా!

విజ్ఞానయుక్తమైన పరమరహస్య జ్ఞానమనెడు ధర్మమునందు శ్రద్ధలేని నాస్తికులు భగవంతుని పొందకయే మృత్యురూపమైన సంసార మార్గములోబడి పరిభ్రమించుచున్నారు.

ఆశే జీవితం. జీవితమే ఆశ.

సజీవ ప్రజలను చిత్రించాలంటే సత్యం, ఉద్వేగం, మానవత వుండాలి. ఈ గుణాలు హస్తవిక వాదికి, రొమాంటిస్టుకు కూడా కావలసిందే. ఒకసాహిత్య పద్ధతినుండి మరోపద్ధతిని విడదీసే గుణాలుకావు అవి. కాని చెత్తా కానీ సాహిత్యంనుండి కిరాయి సాహిత్యం నుండి వేరుచేసే గుణాలవి.

మనసా, వాచా, కర్మలద్వారా సాగే యింద్రియ నిగ్రహమే బ్రహ్మచర్యం. భౌతికంగా పవిత్రుడుగావుండి మనోవికారాలకు లొంగిన వ్యక్తి సత్యబ్రహ్మచారి కాజాలడు.

ఇస్లాం మతంలో వివాహానికి పవిత్రత, ప్రాధాన్యత అత్యధికంగా యివ్వబడింది. సుగుణవతియైన యువతిని పెళ్ళాడి సత్సంతానాన్ని పొంది, కటికబీదరికం సంభవించినాసరే ఆలుబిడ్డలకు లోటుపాటులు

రానీయకుండా వారిని పోషిస్తూ, అతిథి అభ్యాగతులను ఆదరిస్తూ, దైవప్రార్థనలు చేస్తూ దేవుని భక్తులను దూషించకుండా ఉండేవాని స్వర్గంలో నావెంట వుంటాడని ప్రవక్త మహమ్మదు స్వయంగా వివరించాడు.

ఇంద్రియములకు గోచరముకాని స్వరూపుడు భగవంతుడు. ఈచేతనా చేతనాత్మక ప్రపంచమందు వ్యాపించి యున్నను ఈసమస్తములును భగవంతుని యందున్నవియే గాని భగవంతుడు వాని యందుండువాడుకాడు.

జీవితం నవల లాంటిది. నవల జీవితంలాంటిది. కాబట్టి మానవుని అంతఃకరణాభివృద్ధికి సంబంధించిన కష్టాలను, అభివృద్ధికి గతకాలపు అవసాన చిహ్నాలకూ మధ్యగల వైరుధ్యాలనూ, హృదయపూర్వకంగా, సంపూర్ణంగా వాస్తవిక జీవితంలో వలె చిత్రించాలని రయితలను పాఠకలోకం కోరుతుంది.

భగవంతుని స్వరూపములను భూతములను ధరించినట్టిదియును, వానిని వృద్ధిపొందించు నట్టిదియు నైనను భూతము లందున్నది కాదు. భూతము లందుండునట్లుతోచెడు భగవంతుని యోగసామర్థ్యము అసాధ్యమైన కార్యమును సాధ్యమగునట్లు చేసెడు మహిమగలది యగును.

మేధ మనిషిలో సగం మాత్రమే. హృదయమే అతని సర్వస్వం.

చేసిన నేరాలన్నీ మనంతేలికగా మరచిపోతాము.

సహనంతో సాగించే నిరీక్షణ, కృషివల్ల కలిగిన సాధనకంటె మించినదేదీలేదు.

ఢక్కా ముక్కీలు లేకుండా ఎవడైనా ధనవంతుడై పోతే నేటి సమాజములో అతడు మనిషిగా నిలువలేడు. లోకంలో ఢక్కా ముక్కీలు తినాలి. పచ్చికుండవంటి జీవితం బాగా బట్టీలో కాలాలి. అప్పుడు మనుషులవుతారు.

నిరాలంబమైన ఆకాశమందు సర్వవ్యాప్తమైన మహావాయువు అణగి యుండునట్లు లోకసిద్ధములేని భగవంతునియందు సమస్తభూత ములు వుండును.

ప్రతివాడు తనగృహ పరిసరాలను శుభ్రంగా వుంచుకుంటే ప్రపంచమంతా శుభ్రంగా వుంటుంది.

నిజానికి ధనికుడంటే గౌరవం వున్నంతకాలమే ఆ ధనికత్వానికి విలువ.

సమస్త భూతములును కల్పాంతమందు దేవుని యధీనంబైన ప్రకృతియందు ప్రవేశించి లీనమై యుండును. మరల వానిని కల్పాది యందు భగవంతుడే సృజియించును.

నైతిక విలువలు పెంచే ఔషధంగా దురదృష్టాల్ని స్వర్గం మనకు పంపిస్తూంటుంది.

సాహిత్యం ప్రజలను విజ్ఞానవంతులుగా చేస్తుంది. వారు యింతకు పూర్వముకన్నా బాగా జీవించడానికి తోడ్పడుతుంది. వారి భావాలను ఉన్నతపథానికి కొనిపోతుంది. తమబంధువుల, స్నేహితుల, యితర ప్రజలందరిని గురించి ఎక్కువగా ఆలోచించేటట్లు చేస్తుంది. నవలలు, కథలు, కవితలు సమాజాన్ని బంధించే రాగబంధనాలు.

తండ్రులు కుమార్తెల గొప్పలను ఎన్నుతారు. తల్లులు కుమారుల గొప్పలెక్కువగా చెప్పుకుంటారు.

చిత్రరూపంబగు భగవంతుని ప్రకృతిని అవలంభించి ప్రాకృతి కంబైన ఆభూత సముదాయమును వానిప్రాచీన కర్మస్వభావము ననుసరించి మాటిమాటికి భగవంతుడు సృష్టించును.

నూనె అయిపోయిందంటే దీపంలేదు. వెలుతురులేదు.

స్త్రీ ఎంతశక్తిగలదైనా, డబ్బుగలదైనా పురుషుడి సహాయం లేకుండా సంపూర్ణంకాదు.

కర్మములందు అభిమానమును సంబంధము లేకయే ఉదాసీనుండై యుండు భగవంతుని ఆకర్మము కెంతమాత్రమును బంధింపవు.

చాలాకాలము బ్రతకాలని అందరూ కోరుకుంటారు. కాని ముసలితనం కావాలని ఎవ్వరుకోరుకోరు.

పాత్రలుచేసే తప్పులను కొందరు విమర్శకులు రచయితనే నిందించుతారు. చిత్తశుద్ధిగల, ధైర్యవంతులైన, ఉదాత్తులైన ప్రజలను గురించి రచయిత వ్రాస్తున్నపుడు రచయిత వారి బలహీనతలను కప్పి పుచ్చలేదు. వారిపొరపాట్లను, అపజయాలను దాచలేదు. ఎంచేతనంటే రచయిత చిత్రించదలచినది ప్రజల్నిగాని, ఆటబొమ్మల్నికాదు.

విజ్ఞానం సంపాదించడం కంటె అజ్ఞానాన్ని దాచడం కష్టం.

జీవితంలో ఎప్పుడూ ఒక కదలిక వుండాలి. విశ్వసనీయంగా జీవించాలంటే ముందుకు దూసుకు పోవాలి. ఒక్కొక్కప్పుడు దారి తప్పినా పోరాడుతుండాలి. తప్పుచేస్తే ఆతప్పును సరిదిద్దుకుని దానిని పరిహరించి క్రొత్తదారి తొక్కాలి. మొదలుపెట్టడం, పరిత్యజించడము మళ్ళీ మొదలుపెట్టి దానిని పరిత్యజించడం ఇట్లా పోరాటాన్ని దీక్షగా కొనసాగించాలి.

సాక్షిమాత్రంబైన భగవంతుని సాన్నిధ్య విశేషముచేత స్థావర జంగమాత్మకంబైన ఈ ప్రపంచము ప్రకృతియందుండి పుట్టుచున్నది. మరియు భగవంతుని సాక్షిత్వ నిమిత్తము చేతనే ప్రపంచమంతయు ప్రవర్తించు చున్నది.

మందహాసం చిందిస్తూ తుపానుకు పుట్టిన పుత్రికే ఇంద్రధనుస్సు.

తల్లిదండ్రులు అతిగారాబంవల్ల ఆడపిల్లలు మంచి ఇల్లాండ్రు కాలేరు.

నాప్రార్థనలన్నింటికి ప్రతిఫలితం రాలేదని భగవంతునికి కృతజ్ఞత తెలియచేసుకోడానికే నేను జీవించి వున్నాను.

మూఢులైన మానవులు వృద్ధాపేక్షయును, విఫల కర్మావసానమును, వృథాజ్ఞానమును, విముఖ మనస్సును గలిగియుండుటయేగాక హింసారూపమయినదిగను నగు ప్రకృతికి వశ్యులై యుందురు.

బాధలు, కష్టాలు, మనిషి మంచితనాన్ని తెలియ పరిచే గీటురాళ్ళు. వాటివల్లే మనిషి వున్నతుడు కాగలుగుతాడు. ప్రతివాడి జీవితం పూల బాటకాదు. ఏదో సమయంలో ఎవరికైనా వస్తాయి అవాంతరాలు. అప్పుడే నిలదొక్కుకోవాలి.

శాంతి కావాలంటే వూరికే లభించదు. ఉత్తమమైన మూల్యాన్ని వెచ్చించి నపుడే శాంతి. దుర్బలులు ధైర్యాన్ని అలవరచు కోవాలి. అప్పుడే విశ్వానికి శాంతి.

కళాకారుడు ప్రకృతిని బానిసలాగ కాపీచేయడు. ప్రకృతిని మార్చి నూతనరూపాలను సృష్టిస్తాడు. అవి వాస్తవికంగా తయారవుతాయి.

దేవతా సంబంధమైన సాత్విక స్వభావముగల మహాత్ములు భూతప్రపంచమునకు కారణంబులను నాశరహితమైన భగవంతునే సేవించుచుందురు.

మగవాడు భూమి వంటివాడు. స్త్రీ జాబిల్లి వంటిది. స్త్రీ ఎప్పుడూ ఒకవైపునే మగవాని కంటబడుతుంది. కనక మగవాడు స్త్రీ కింక వేరొక వైపు లేదనుకుంటాడు.

మనస్సును, ఉద్రేకాలను సమరస పరుచుకుంటే శరీరం మంచి "పనిముట్టుగా'' తయారవుతుంది. హృదయంలో ఈశ్వరుని ప్రతిష్టించుకోగలిగితే ఆశరీరం దేవాలయం అవుతుంది.

జీవితం పాలరాతితోనూ, బురదతోనూ నిర్మించిన కట్టడం.

కొందరు ధృడవ్రతులై భగవంతునే కీర్తనము చేయుచు, భగవంతుని యందు ప్రీతికలిగి, భగవంతుని కర్మముల నాచరించి, భగవంతునికి ప్రణామంబు గావించి, భగవంతుని పొందవలయునని ఏకాగ్ర చిత్తముతో సదా భగవంతునే ధ్యానించు చుందురు.

సశాస్త్రీయంగా పెద్దల సమక్షాన జరిగేవివాహ సంస్కారం ద్వారా దేవుడంటే విధేయత, భార్యఅంటే ఆప్యాయత, దాంపత్యమంటే అన్యోన్యత, సంతానం అంటే మమత ఏర్పడుతుంది.

యోగ్యత, అదృష్టమూ పెనవేసుకుని ఉంటాయని మూర్ఖులు గ్రహించరు.

పాఠకునికి చెప్పినదానికంటె కూడ రచయితకు తన పాత్రల గురించి ఎక్కువ తెలుసు. వ్యక్తిస్వభావాన్ని అతని నడవడినీ విశద పరిచేటటువంటి ఘటనలను, జీవిత వివరాలను, ఆలోచనలను, భావనలను, రచయిత ఎన్నుకుంటాడు. పాఠకుడు పుస్తకంచదవడం ముగించ

గానే తనకా కథలోని పాత్రలతో పరిచయం అయినట్లు, వాటి జీవితాలను తెలుసుకున్నట్లు వారి హృదయాలను అర్థంచేసుకున్నట్లు భావించాలి.

మహాత్ములు జ్ఞానమను యజ్ఞమ చేయుచు సర్వాకారుండైన భగవంతుని ఏకాకారముగాను అనేక విధములైన వేర్వేరు జగదాకారముగాను ఉపాసింతురు.

మూడు రోజులు తర్వాత చుట్టాలు చేపలు కొట్టేవాసన భరించడం కష్టం.

ఒక ''సుగుణం'' వల్లనీకు, ప్రత్యేకించి వొరిగేదేమీ లేదు. ఆసుగుణము నీజీవితంలో రంగరించి పోయినపుడే దాని ప్రయోజనం

ఋగ్యజుస్సామ వేదముల నెరింగిన వారలు యజ్ఞములచే భగవంతుని ఆరాధించి సోమపానము చేసి పాపరహితులై స్వర్గప్రాప్తి గోరి పుణ్యఫలమైన సురేంద్రలోకముచేరి అచట దివ్యభోగముల ననుభవించు చుందురు.

ఉదయమే మనము నిద్రనుండి లేచినపుడు పడకమీదనే కూర్చుని భగవంతుని ధ్యానించ వచ్చును. భగవన్నుతి రూపాలయిన శ్లోకాలుగాని పద్యాలుగాని రాకపోయినా బాధలేదు. "ఓదేవుడా! నా జీవితములో మరొక దినం ప్రారంభమవుతుంది. తెలియనందువల్లగానీ బుద్ధిపూర్వకంగానీ నేను తప్పులు చెయ్యవచ్చు. వాటినన్నిటిని క్షమించి నన్నురక్షించాలనీ ప్రార్థిస్తున్నాను."అని అనుకుని లేచి నిత్యకృత్యాలు నెరవేర్చుకోవచ్చు. పగలంతా దేవునిగురించిన ఆలోచన అవసరంలేదు.

సాధారణంగా ఒకనవలలోని పాత్ర అనేక వ్యక్తుల మేళవం. అనేకమంది ప్రజలను కలుసుకున్నాక అవి సృష్టించ బడుతాయి. ఆపాత్రలలో రచయిత తన యావజ్జీవిత అనుభవాన్ని వొప్పించుతాడు.

ఎంతో తాపత్రయపడి జీవిస్తాడు మానవుడు.

మానవులు బహుకాలం స్వర్గలోకసుఖము అనుభవించి పుణ్యము క్షీణించిన పిదప మర్త్యలోకమందు జనింతురు. ఇట్లు త్రయాధర్మ ములననుసరించి భోగములను కోరువారికి భూలోక స్వర్గలోకములకు యాతాయాతములు (రాకపోకలు) కలిగియున్నవి.

వృత్తిని బట్టి మనిషిని తక్కువ, ఎక్కువలుగా భావించడం మంచిదికాదు. అన్నివృత్తులూ భుక్తికోసమే. అందుకని అన్నీ సమా నమే. పనిచేస్తే సంతోషంతో చెయ్యండి. ఇతరులను చూచి మీపని హేయమయినదిగా భావించవద్దు. అన్నివృత్తులు పవిత్రమైనవే. ఇత రులను మోసం చేయడం, దొంగతనం, అబద్ధంలేని అన్ని వృత్తులు మంచివే.

ఎవరు అన్య దేవతా భజనము చేయక సదా భగవంతుని ధ్యానించుచు ఉపాసింతురో వారు భగవంతుని యందు నిత్య సంబం ధముగల వారగుదురు. వారలకు భగవంతుని ప్రాప్తి రూపమైన యోగ మును పునర్జన్మ నివృత్తి రూపక్షేమమును భగవంతుడే యిచ్చు చున్నాడు.

కొంతమంది అన్ని పరిస్థితులను మౌనంతో జయించ వచ్చునను కుంటారు. కాని యీ మౌనాన్ని అలుసుగా తీసుకుని చుట్టూ ఉండేవారు హద్దుమీరే అవకాశం ఉంది.

"నేను సంతోషంగా ఉన్నానా, లేదా'' అని నిన్ను నీవు ప్రశ్నించుకొన్న మరుక్షణాన నీసంతోషం కాస్తా ఎగిరిపోతుంది.

ప్రతి రచయితకు హృదయ కవాటాలు తెరువగల బీగా లున్నాయి. కాని అందరి హృదయ కవాటాలను తెరవగల బీగాలు ఏరచయిత వద్దా లేవు.

ఇతర దేవతా భక్తులై శ్రద్ధతో పూజించువారుకూడ భగవంతునే పూజించుచున్నారు. అయినను అది విధిపూర్వకము కాదు.

ఇతరుల విషయంలో నీతిబోధ చేసినంత సులువుగా మన విషయంలో మనం చేసుకోలేం.

నీకు ఆపదకలిగిన దినమందు నీసహోదరుని యింటికివెళ్ళకుము. దూరంలోవున్న నీసహోదరునికంటె దగ్గరవున్న పొరుగువాడు వాసి. నీస్నేహితుడైనను, నీతండ్రి స్నేహితుడైనను, విడిచిపెట్టకుము.

సమస్త యజ్ఞములకు భోక్తయును ప్రభువును భగవంతుడేను. భగవంతుని యధార్థ బ్రహ్మత్వం నెరుంగనివారు దేవతలను పూజించి స్వర్గలోకము చేరి మరల మర్త్యలోకమునకు వచ్చుచుందురు.

గుణవంతుని ప్రార్థనలు చీకటిలోయలనుంచి స్వర్గానికి అధిరోహించిన భూతలానికి పరం తెచ్చుకుంటాయి.

1659 లో చైనాలోని ముగ్గురు క్రైస్తవ మతగురువులకు క్రైస్తవమత పీఠాధిపతినుంచి స్పష్టంగా ఈ విధంగా సూచనలు వచ్చాయి.''మనమతం స్వీకరించ దలచేవారి ఆచారాలు, వ్యవహారాలు, పూజావిధానాలు కూడా మారాలని మీరు ఆశించవద్దు. ఆమార్పులు జరగాలని మీరు వారికి సూచించరాదు. మతమూ, నైతిక విలువలకు సంబంధించినంతవరకూ అది పూర్తిగా విభిన్నంగా కనిపిస్తేతప్ప అటువంటి సూచనలు చేయవద్దు. క్రీస్తుదేవునిపట్ల విశ్వాసాన్ని తప్ప మిగిలిన వాటిని దిగుమతిచేయరాదు.

ప్రజలను వర్ణించడానికి ముందు వారిహృదయ కవాటాలకు తాళం నీవద్దవుండాలి. ఇతరుల అనుభవాలను తానను భవించగల శక్తినే రచయిత పరిశీలనాశక్తి అని అనవచ్చు.

పురుషుడు ముందుగా తాను హీనస్థితి రాకుండా స్త్రీని హీన స్థితికి తీసుకురాలేడు. తాను ఉన్నతస్థితిని పొందకుండా స్త్రీని ఉన్నతికి తేలేడు.

దేవతలనుగూర్చి వ్రతముల నాచరించువారు దేవలోకమును, పితృదేవతల నుద్దేశించి వ్రతమును సలిపినవారు పితృలోకంబును పొందుదురు. యక్షరాక్షస పిశాచాది భూతములను పూజించువారు వానిని చేరుదురు. భగవంతుని పూజించువారు భగవంతునే పొందుదురు.

మానవుడికి వినయమూ, నమ్రతా వుంటేనేగాని యింద్రియాలను స్వాధీనం చేసుకోవడం కుదరదు.

ఒకపత్రముగాని, ఒకపుష్పముగాని, ఒకఫలముగాని, జలము గాని, భక్తిచే ఎవడు భగవంతునికిచ్చు చున్నాడో ఆ పరిశుద్ధ మనస్సు గలవాడు ప్రీతిపూర్వకముగా దేవునికి సమర్పించిన ఆవస్తువును భగవంతుడు స్వీకరించుచున్నాడు.

నిదానంగా యోచించి మాట్లాడటం చాలా అవసరం. ఒకరికి ఏదైనా వాగ్దానం చేసేటప్పుడు ఒకరితో ముడిపడిన వ్యవహారాలను పరిష్కరించేటప్పుడు ఆలోచన పూర్తయి నిశ్చయానికి వచ్చాకే వెల్లడించాలి.

మంచి మనిషిలో దైవత్వం వుంటుందంటారు. అప్పుడు అతడే నేరుగా స్వర్గాన్ని చేరతాడా లేక స్వర్గమే అతని వాకిలికి దిగి వస్తుందా అనేది మనకు మిగిలే ప్రశ్న.

ఎప్పుడూ ఏతప్పూ చేయని మనిషి ఎప్పుడూ ఏపనిచేయని మనిషే.

నవయవ్వనుల ప్రేమ ఎడతెగని ఆర్భటితో నడిచే వరద లాంటిది. ఆ ప్రవాహాన్ని ఆటంక పర్చగలిగేదేదైనా అడ్డుపడితే అది ఒడ్డులు తెగొట్టి విజృంభిస్తుంది.

పత్రపుష్పాదులు కూడ మానవునకు ప్రయాసమయ్యేనేవి అతను ఆచరించెడు కర్మమును, భుజించెడి వస్తువును, హోమముచేయు ద్రవ్యమును, దానమొసగెడి పదార్థమును, ఆచరించెడి తపమును భగవంతుని కర్పింపవలయును.

మానవుడు తనకు తాను ఎప్పుడూ పతనాన్ని కోరుకోడు. హృదయాన్ని కల్మషపరచడానికి అంగీకరించడు. కాని, పరిస్థితులు, సంఘం అతనిచేత చేయిస్తాయి. ఆత్మనువంచిస్తాడు. హృదయాన్ని కల్మష పరుస్తాడు. పతనానికి దారితీస్తాడు. చెయ్యరానిపనులు చేస్తాడు.

వినయమూ, నమ్రతా అబ్బాలంటే వయస్సులోనూ, విద్యలోనూ, సదాచారంగా నడుచుకోవడంలో పెద్దలయినవారిని ఆశ్రయించి, పూజించి వారు చెప్పినట్లు చెయ్యాలి.

భగవంతుడు సమస్త భూతములు నాశ్రయించుటకు భేదములేనివాడు. భగవంతునికి ప్రియుడుగాని, ద్వేషముగానిలేదు. అయినను భక్తిశ్రద్ధలతో భగవంతుని భజించువారు సదా భగవంతునియందుందురు. భగవంతుడును అనుగ్రహరూపుడై అట్టిమానవులయందు వుండును.

యోగులకు వారికునికిపాటు సైతం ధ్యానముద్రే.

పురుషులకీర్తి వారి జుట్టువంటిది. వారుచనిపోయాక అది పెరుగుతుంది. దానివుపయోగం వారికేమీ వుండదు.

క్రీస్తు దైవప్రార్థనలలో పూజావిధానాలలో ఈదిగువ పేర్కొన్న మార్పులను కాథలిక్ బిషప్పుల సభ అంగీకరించింది. మోకాళ్ళమీద

నిలబడడానికి బదులు మతగురువుల ప్రక్కనపాదాలమీద నిలబడవచ్చు. లేదా కూర్చోవచ్చు. అనూచానంగా వెలిగించ బడుతున్న కొవ్వొత్తులకు బదులు నూనెదీపాలు వెలిగించవచ్చు. ధూపదీపాలు సమర్పించవచ్చు. తలను, శరీరాన్ని వంచి ప్రార్థన జరపడానికి బదులు అంజలిహస్తం, నమస్కార బాణంతో పూజచెయ్యవచ్చు.

తొందరపాటు తన మడమలపై తానే గిరికీలు కొడుతూ చివరకు తానే సంకెళ్లు వేసుకుని ఆగిపోతుంది.

ఇతర ప్రయోజనమును తలపక దేవుని భజించువాడు మిక్కిలి దురాచారముగలవాడైనను వానిని సాధువనియే తలంపవలయును. ఏలన ? భగవంతుడే తనకుస్వామి, గురువు, మిత్రుడు, భోగ్యము అనెడి మనోనిశ్చయము గలవాడు వాడేకదా ?

మాటలకి ఎటువంటి మహిమ ఉన్నదో తెలుసునా ! క్షణంలో పులిని మేకగానూ, మేకను పులిగానూ చేసెయ్యగలవు. మానవుల హృదయ పేటికలకి మాటలే తాళంచెవులు.

సౌందర్యం చూసేవారి కళ్ళలో వుంటుంది.

మానవులందరూ అపరాధులే. పాపులే యింకొకరిలో మనం వ్రేలెత్తి చూపేతప్పు జాగ్రత్తగా పరిశీలిస్తే మనలోనే కనబడుతుంది.

కర్మాధికారులుగాని, స్త్రీలుగాని, వైశ్యులుగాని, కేవలము కృషి పరులైన శూద్రులుగాని, పాపయోని సంభవుడగు చండాలుడుగాని దేవుని యందు భక్తిగావించినేని పరమమైన మోక్షమును చెందుదురు.

కుటుంబములోని సభ్యులందరూ నోటిని అదుపులో పెట్టుకోవడం అలవరుచుకుంటే మనస్తాపాలురావు. త్వరత్వరగా నిర్ణయాలను చేసు

కోవడం, మార్చుకోవడం చేస్తూవుంటే కొంతకాలని కెవరూ నమ్మక పోయే పరిస్థితి కూడా రావచ్చు.

ధృఢవిశ్వాసానికి సరియైన ఆధారంకావాలి. లేనిపక్షంలో అది మూఢనమ్మకంతో సమానం.

ఏదైనా ఒకవృత్తి చేసుకోవాలంటే ఆయా వ్యాపారాల్లో నేర్పు అలవడిన జీవనం సుకరం అవుతుంది. ఆనేర్పు శాస్త్రం చదువుకుంటె కలిగినట్లు కేవలము అభ్యాసంవల్ల కలుగదు.

క్షణభంగురమైన సుఖవర్జితమగు ఈలోకమున జనించిన మానవులు భగవంతుని శరణుపొంది భజింపవలయును.

మనకత్తికి ఎదురులేనప్పుడు కథలేదు. మనకత్తి మొక్కవోయి నపుడు నాటకంలేదు.

ప్రేమజ్యోతి ఎవరిలో వెలుగుతుందో వారికిగాని దానిమహిమ తెలియదు. ప్రేమకంటె బలమైనదేదీలేదు. సంకెళ్ళకూ, జబ్బులకూ చలించని కిరాతకులుకూడా ప్రేమనే పట్టుపోగుకి కట్టుపడుతారు. ఇక ఆప్రేమ నీతివంతమయితే దానికి ప్రపంచాన్ని వూపివేసే శక్తివుం టుంది.

భగవంతుని యందు మానవుడు మనస్సుచేర్చిన వాడుగా వుండవలెను. భగవంతుని భజింపవలయును. భగవంతుని పూజించ వలయును. భగవంతునికి నమస్కరించ వలయును. భగవంతుడే పరమ ఆశ్రయమని చిత్తమును భగవంతుని యందు నిలిపినయెడల పరమానంద స్వరూపుడగు భగవంతునే పొందగలరు.

వాదాన్ని ఖండించడానికి తగు ప్రతివాదనలు లేనప్పుడు మానవులు దూషణ తిరస్కారాలకు దిగడం జరుగుతుంది.

మంచికీర్తి నిప్పు లాంటిది. నిప్పును రగిల్చినట్లయితే సులభంగా భద్రపరుచుకోవచ్చు. కాని దానిని ఆర్పివేస్తే తిరిగి జ్వలింపచేయటం అంతసులభంకాదు.

వేదాంతము వంశపు పేరు ప్రతిష్టలవల్ల సంక్రమించేది కాదు. ''ప్లేటో'' అను వంశికంగా గొప్ప వ్యక్తి కాలేదు. అతని జ్ఞానమే అతనిని గొప్పగా నిలిపింది.

పైకమే పెనిమిటి వేశ్యకి. అలాగే చాలామంది యువకులుకి కట్నమే భార్య. వెల తీసుకోవడం వల్లనే వేశ్యని వెలయాలన్నారు. అలాగే కట్నాలు తీసుకునే వారు వెల మగలుకారా ?

ఇంద్రియాతీత విషయములందు గూడి గ్రహించెడి శక్తిమంతులైన బ్రహ్మాది దేవతలుగాని, భృగ్వాది మహర్షులుగాని భగవంతుని యొక్క ప్రభావము నెరుంగ జాలరు. ఏలన ఆదేవతలకును, మహర్షులకును అన్ని విషయములలోను ఆదికారణం భగవంతుడే.

బీదవాళ్ళు పరస్పరం పరిచయం కాక ముందే కలిసిపోతారు. శాశ్వతంగా తమ సంబంధాన్ని నిలబెట్టుకుంటారు. బీదవానికి బీదవాని మీద అభిమానం. కాని భాగ్యవంతునికి మరొక భాగ్యవంతుని చూస్తే అసూయ. పేదవాడు మరొక పేదవానికోసం ప్రాణాలిస్తాడు. కాని ధనికుడు తన స్వార్థసాధన కోసం యింకొక ధనికుని ప్రాణాలుకూడా సులువుగా తీస్తాడు.

భగవంతుడు అనాదియైనవాడు. బ్రహ్మాది సమస్త "లోకేశ్వరులకును పరమేశ్వరుడు." అని యిట్లు నిశ్చయించి భగవంతుని యెరింగిన వాడు మనుష్యులలో నజ్ఞానము లేనివాడై సమస్త పాపములనుండి విముక్తుడగును.

బాహ్యాభ్యంతర శుద్ధినిపొంది దేవుని దర్శించాలనే ఆకాంక్ష కలవాళ్ళందరూ వివాహం చేసుకోవలసిందే. తద్వారా కన్నులు, చెవులు, మనస్సు మర్మాంగాలు కీడునుంచి కాపాడబడుతాయి. పాపపు చింతలనుండి పరిరక్షింప బడతాయి.

లెక్కలేనన్ని తప్పులున్నా ఒకపుస్తకం ఆశక్తికరం కావచ్చు. ఒకతప్పు లేకపోయినా ఒకపుస్తకం పేలవంగా ఉండవచ్చు.

పరిశ్రమవల్ల శరీరం గట్టిపడితే కష్టాలవల్ల మనస్సు దృఢమౌతుంది.

అందరి మంచి ఆలోచించి వ్రాయగలిగినవాడే నిజమైన రచయిత.

బుద్ధియును, జ్ఞానమును, మోహరహితమును, క్షమాసత్యములను, బాహ్యేంద్రియ అంతరేంద్రియ నిగ్రహంబులును, మోదభేదములును, భావాభావములును, భయాభయములును, అహింసయును, సమబుద్ధియును, తపోదానములును, కీర్త్యపకీర్తులును యిట్టి నానావిధములైన మనోభావములు వారివారి కర్మానుసారముగ ప్రాణులకు భగవంతుని వలననే కలుగుచున్నవి.

సమస్య స్వరూపాన్నిబట్టి నిదానంతో దృఢమైన నిశ్చయానికి రావడం సమంజసముగా వుంటుంది.

అప్పిచ్చినవాడు, అల్లుడు, అద్దెయింటి యజమాని, కులవినోది, పన్నులు వసూలు చేసేవాడు వీరు పురుషునికి పుస్తెకట్టని మగలు.

నీప్రపంచములో నుండు ప్రజలందరు నెవరివలన సృజియింపబడిన వారగుదురో అట్టిప్రాచీనులును బ్రహ్మమానస పుత్రులునునైన

సప్త మహర్షులును నలుగురు మనువులును భగవంతుని సంకల్పము వలనే జన్మించారు.

పొరబాట్లను ఎలాచేసినా వాటిని సరిదిద్దు కోవటంలోనే ఉంది గొప్పతనం.

ఎప్పుడూ నవ్వుతూవుండే వాళ్ళనుచూచి మోసపోవద్దు. వారి కన్నా దుఃఖితులు దురదృష్టవంతులు ప్రపంచములో వేరెవ్వరూ ఉండరు.

ప్రేమ విషయములో స్త్రీకున్న సహనం పురుషునికి యెప్పుడూ వుండదు.

నిజంకంటె కల్ల తీపి. కన్నబిడ్డకంటె ముండబిడ్డతీపి. జీతంకంటె లంచంతీపి. అసలు సొమ్ముకంటె వడ్డీతీపి.

సమస్తమయిన భగవంతుని ఐశ్వర్యమును యోగమహిమయును యదార్థముగ ఎరింగినవాడు విశ్చలమైన జ్ఞానముతో కూడినవాడగును.

అర్ధశాస్త్రము, వార్తాశాస్త్రము, శిల్పశాస్త్రము, యిలాంటివి నేర్చు కుంటే కలిగే విజ్ఞానమువల్ల పురుషుడు సంపూర్ణుడవుతాడు. ఆత్మవశ పడుతుంది. ధైర్యం, విశ్వాసం కలుగుతుంది. దాంతో మనోనిగ్రహం ఏర్పడుతుంది. అప్పుడి మనిషి కష్టసాధ్యాలయిన పనులున్నా సాధించుకోగలుగుతాడు.

పరమార్థ తత్వము నెరిగిన జ్ఞానులు ఈ ప్రపంచమునకు భగ వంతుడు ఉత్పత్తి కారాణమనియు, నమస్తము భగవంతుని వలననే ప్రవర్తించుచున్నదనియు ఎరింగి భగవంతునియందు నివేశము కలిగి భగవంతుని భజించు చుందురు.

దాంపత్య ధర్మ నిర్వహణ ద్వారా మానవునిలోని సోమరితనం

దూరంగా పారిపోతుందనీ, దేహానికి ఆరోగ్యం, మనస్సుకుశాంతి, హృదాయానికి ఆనందం కలుగుతుందనీ, అతిథి మర్యాదలకు, ఆదర సత్కారాలను, సవ్యంగా నెరవేర్చగలడనీ, సత్సంతానాన్ని పొంది ప్రవక్త గారి విశ్వాసుల సంఖ్యను వృద్ధిపరచ వచ్చుననీ—ఇలాంటి వివిధ రకాల యిన సదుపాయోగాలు ఇటు వ్యక్తికీ, అటు సమాజానికీ సమకూర్చగల్గు తాడని యిస్లాం మతంలో బహు చక్కగా నిర్వచించ బడింది.

నిష్కళంకమయిన అంతరాత్మ కోటిమంది సాక్ష్యమిస్తామన్నా బెదరదు. అదే కళంకితమైనప్పుడు ఏకాంతంలోకూడా తన నీడకు తానే భయపడుతుంది.

భక్తులు భగవంతునియందు లయించిన మనస్సు గలవారై భగ వంతుని విడిచి బ్రతుకలేక భగవంతునియందే ప్రాణములు నర్పించినవారై, తాము అనుభవించిన భగవంతుని స్వభావ మహిమలను పరస్పరము తెలియబరచుకొనుచు భగవంతుని సంకీర్తనము గావించుచు ఎల్లప్పుడూ ఆనందము అనుభవించు చుందురు.

ఒక్కొక్కప్పుడు నలుగురూ ఔనన్నా అది అన్యాయమని తన మనస్సాక్షి చెప్తున్నపుడు కాదన గలగడంలో మనిషి గొప్పదనం పెరుగుతుంది.

సముద్రపు పాచి (స్పాంజి) చదువనీ, గరాటా చదువనీ, జల్లెడు చదువనీ చదువులు మూడు విధాలు. సముద్రపుపాచి—నీటిని నలకలతో సహా పీల్చివేసి మళ్ళీపీల్చినది పీల్చినట్లే కక్కేస్తుంది. గరాటా — మీదనుండి గ్రహిస్తూ ఎప్పటిదప్పుడు క్రిందికి విడిచి పెట్టేస్తుంది. జల్లెడ — వడ్లూ రాళ్ళూ మొదలైన వాటినుంచి బియ్యాన్ని వేరు చేస్తుంది.

ఒక వృద్ధుడు తానింతకాలం బ్రతికానని చూపించుకోవడానికి తన వయస్సు తప్ప యింకేమీ లేకపోయినపుడు అంతకన్నా అవమానం అతనికింకేదీ వుండదు.

మతం ఎంత మంచిదో అంత చెడ్డది.

మేధావుల చర్యలు నవ్వు పుట్టిస్తే వారిని అర్థం చేసుకునే స్థాయికి చేరుకోలేదన్నమాట.

ఎల్లకాలమునందు భగవంతునియందు ఏకాగ్రచిత్తము కలిగిన భక్తులకు భగవంతుని జేరదగిన యుపాయంబగు జ్ఞానయోగమును భగవంతుడే ప్రీతిపూర్వకముగా నిచ్చుచున్నాడు.

తేనెటీగలు కష్టపడి సమకూర్చే తేనె మధురం. కలకంఠి కంఠుల గానరసం అంతకంటె మధురం. గ్రీష్మఋతువులో వానజల్లుమీది పిల్లగాలి దానికంటె మధురం. కృతజ్ఞతతో కూడినమాట అన్నిటికంటే మధురం.

భక్తులకు మాత్రమే అనుగ్రహము చేయుటకొరకు వారి స్వాభిప్రాయ మందున్న భగవంతుడు ప్రకాశించుచున్న జ్ఞానదీపముచేత అవిధ్యాంధ కారమును నాశనము చేయుచున్నాడు.

ప్రతీమనిషీ మొదట విజ్ఞానం సంపాదించుకోవాలి. తరువాత మనస్సు స్వాధీనం చేసుకోవాలి. ఆమనిషి కృతార్థుడవుతాడేపనిలో అయినా.

సమస్త ప్రాణులకును హృదయ కమలములందున్న పరమాత్మ స్వరూపము భగవంతుడే యగుచున్నాడు. సకలభూతములకు నుత్పత్తి స్థితి నాశకారణము భగవంతుడే.

కఠిన్

విద్య ప్రసాదించిన వివేకంతో, విచక్షణా జ్ఞానముతో, వయస్సుతో, పెరిగే అనుభవాలతో సమయానుకూలమయిన నిదానంతో నడుచుకునేవాడు సకాలంలో సమస్యలను సవ్యంగా పరిష్కరిస్తూ బాధ్యతలను నెరవేరుస్తూ స్నేహాలను, బాంధవ్యాలను పటిష్టం చేసుకుంటూ మనశ్శాంతితో జీవించ గలుగుతారు.

అతిశయోక్తులతో తనభావాలు ప్రకటించేవాడు తనను తాను కించపరచుకున్నట్లే.

ఏమనిషి, ఏనాడు తనలోని చెడును తానే బయటపెట్టు కోవడానికి యిష్టపడడు. ఎందుకు ! యింకా చెడులో మునిగియున్నందునే.

మంచితనం ప్రత్యక్షంగా నిందింపబడిన పరోక్షంగాకీర్తింపబడుతుంది.

అవివేకులు బుద్ధిమంతుల నుండి గ్రహించేదేమీ వుండదు. కాని బుద్ధిమంతులు అవివేకులనుండి చాలాగ్రహిస్తారు.

ఆదిత్యులు పన్నిద్దఱలో విష్ణువను సూర్యుడును, ప్రకాశము కలవానిలో కిరణములతోకూడిన రవియను సూర్యుడును, సప్తవాయువులలోమరిచియును, నక్షత్రములలో చంద్రుడును భగవంతుడే.

ముస్లిం సాంప్రదాయం ప్రకారం పుణ్యకార్యతత్పరుడు, పరాత్పరుని భక్తుడుఅయిన శ్రద్ధావువు వివాహం చేసుకున్నాడంటే అతడు చేయవలసిన ధర్మకార్యాల్లో, పుణ్యకృత్యాల్లో, సగం పరిపూర్తి చేసినట్లవుతుంది.

లక్షలాది సోదర మానవులు దారుణంగా చనిపోతున్నప్పటి కంటె మన చిటికెనవ్రేలు గోరుచుట్టు యెక్కువ బాధకలిగిస్తుంది.

చతుర్వేదములలో సామవేదమును, దేవతలలో యింద్రు, గజప యింద్రియములలో మనస్సును, భూతములలో చేతనుండును వంతుడే.

మానవుల మూలం ఒకటే అయిన నిశ్చల, పరిశుద్ధమయిన అంతరాత్మ ఒక్కొక్క మానవుణ్ణి మహావ్యక్తిగా నిలప గలుగుతుంది.

ప్రతిపురుషుడు స్త్రీని అర్థంచేసుకున్నాననుకుంటాడు. అర్థం చేసుకున్నాననుకుని బోల్తాపడుతుంటాడు.

ఏకాదశ రుద్రులలో రుద్రుడును, యక్షరాక్షసులలో కుబేరుండును డు, వసువులలో పావకుండును, పర్వతములలో మేరువును భగ వంతుడే.

సింహాన్నిచూచి ఒకటి, నేర్చుకోవాలి. కొంగని చూచి ఒకటి, కోడిని చూచి నాలుగూ, కాకినిచూచి అయిదూ, కుక్కను చూచి ఆరూ, గాడిదను చూచి మూడు నేర్చుకోవాలి. చిన్నదో పెద్దదో ఏదో పని చేయాలంటే ముందు అన్నీ అందుకు తగ్గ జాగ్రత్తపడాలి- సింహాన్ని చూచి నేర్చుకోవలసినదిది, ముందు యింద్రియాలను జయించుకోవాలి. తరువాత దేశము కాలము, తనశక్తి బాగా గుర్తించుకోవాలి. అప్పుడు చేయాలి ఏపనైనా-కొంగను చూచి నేర్చుకోవలసినవివి. ముందు ఎదిరించాలి. తరువాత కలియబడాలి. అదయిన తరువాత తనవాళ్ళకెవళ్ళకు ముట్టచెప్పవలసింది వాళ్ళకు ముట్టచెప్పాలి. ఇదిన్నీ అయాక అప్పుడు తాను ఆక్రమించుకుని సర్వస్వము అనుభవించాలి- కోడిని చూచి నేర్చుకోవలసిన నాలుగు యివి. బహు జాగ్రత్తగా తిరగాలి. బయటకు

వెళ్ళితే సంభోగ సుఖం బహురహస్యంగా అనుభవించాలి. కావలసినదల్లా ఎప్పటికప్పుడు సంగ్రహించుకుంటూవుండాలి. కనువిప్పుకలిగి ఉండాలి. యెవరినీ ఎందుకు నమ్మకుని వుండకూడదు– కాకినిచూచి నేర్చుకోవలసిన అయిదూయివి. ఎక్కువగా తినాలి, కొద్దితో తృప్తిపడాలి. గాఢంగా నిద్రపోవాలి. కాని అతిగా మెలకువగా వుండాలి. యజమాని యెడల బహునమ్రత, నమ్మకంగా యుండాలి. స్వయంగా శూరుడున్నూ కావాలి– కుక్కనుచూచి నేర్చుకోవలసిన ఆరు యివి. యెంత బడలికగా వుండిన పనిపడితే కిక్కురుమనకుండా బరువులు మొయ్యాలి. యెండకు, వానకు, చలికి జంకకూడదు. యెప్పుడు సంతుష్టిగావుండాలి– గాడిదను చూచి నేర్చుకోవలసిన మూడు యివి. ఈ ఇరవై గుణాలు బాగా అలవర్చుకున్న మనిషి యెలాంటి అవస్థలలోను కూడ అజేయుడవుతాడు.

పురోహితులలో బృహస్పతియును, సేనాపతులలో సుబ్రహ్మణ్యుడును, జలాశయంబులలో సముద్రుడునూ భగవంతుడే.

మహర్షులలో భృగువునూ, శబ్దములలో ప్రణవమునూ, యజ్ఞములలో జపయజ్ఞమునూ, స్థావరములలో హిమాచలమునూ భగవంతుడే.

వృక్షములలో అశ్వత్థమునూ, దేవఋషులలో నారదుడునూ, సిద్ధులలో కపిలుడును భగవంతుడే.

మీరుయెన్నడూ మోసగించలేని వ్యక్తులు ముగ్గురు: మీవైద్యుడు మీవద్ద నేరాన్ని ఒప్పుకొన్నవాడు, మీన్యాయవాది.

నిజమైన సంతోషము కొఱకు బయటయెక్కడ వెదుకాడకు. అది నీ అంతరాత్మలోనే వుంటుంది.

పెద్దలతో వచ్చిన చిక్కు ఏమిటంటే అనుభవించ వలసిన వన్ని అనుభవించి "మా అనుభవంమీద చెప్తున్నాము — ఏది అనుభవించ వద్దు" అంటారు పిల్లల్ని.

అశ్వములలో అమృతోద్భవంబైన ఉచ్చైశ్రవంబును, గజము లలో ఐరావతమునూ, మనుష్యులలో రాజునూ భగవంతుడే.

ముస్లిం సాంప్రదాయములో వివాహమంటే పాణిగ్రహణమహో త్సవంకాదు. అది హృదయ గ్రహణ మహోత్సవం.

ఆయుధములలో వజ్రాయుధంబును, గోవులలో కామధేనువునూ, ఉత్పత్తికారణమైన కందర్పుడునూ, ఒక్క తలగల సర్పములలో వాసుకి యును భగవంతుడే.

చిన్న దుఃఖాలెప్పుడూ ఎక్కువ అల్లరి పెడతాయి. కాని గొప్ప దుఃఖాలు మనిషిని మూగవాడ్నిగా చేస్తాయి.

ప్రపంచంలో కష్టసుఖాలు కొంతవరకూ అర్థం చేసుకోవాలంటే బ్రహ్మచర్యాన్ని కొన్నాళ్ళు పాటించాలి.

నాగములలో ఆదిశేషుడును, జలదేవతలలో వరుణుండునూ, పితృదేవతలలో అర్యముడునూ, శిక్షించువారలలో యముడునూ భగ వంతుడే.

రాజుసమర్థుడైతే అధికారులు, జనులుకూడా సమర్థులవుతారు. ఇట్లావుంటే అధికారులకు, ప్రజలకు ఉన్నతి కలుగుతుంది.

రాక్షసులలో ప్రహ్లాదుడునూ, లెక్కబెట్టువారలలో చిత్రగుప్తుడునూ, మృగములలో సింహమునూ, పక్షులలో గరుత్మంతుడునూ భగవంతుడే.

చెప్పదగినదేదీ లేకుండా వాగేమనిషి కన్న భయంకరమైన జంతువులేదు.

పరిశుద్ధకరములలో వాయువునూ. శస్త్రధరులలో రాముడునూ, మత్స్యములలో మకరమునూ, నదులలో గంగానదియూ భగవంతుడే.

నలభై అయిదు యేళ్ళుదాటాక యెప్పుడూ యిల్లుకట్టకు. అయిదేళ్ళ ఆదాయం చేతిలో ఉంటేనే తప్ప పునాది వేయకు. అంచనావేసిన దానికంటె రెట్టింపు ఖర్చవుతుందని తెలుసుకో.

హృదయం గుడ్డిదైనప్పుడు కళ్ళున్నా మనం చూడలేము.

సృష్టిస్థితి నాశములను చేయువాడు భగవంతుడే. విద్యలలో అధ్యాత్మవిద్యయునూ, జల్పవాదము వితండవాదములు చేసెడి వారలకు తత్వనిర్ణయారంభ వాదమునూ భగవంతుడే.

తన సౌందర్యాన్ని మనఃపూర్తిగా ప్రశంసించే పురుషుడు ఎదురైనప్పుడు స్త్రీహృదయం పులకరిస్తుంది. నిలువెల్ల స్త్రీత్వంతో నిండిపోతుంది. కలలకు, వాస్తవానికి, మధ్యగల అగాధాన్ని దాటి కలను వాస్తవం చేసుకోవాలని ప్రయత్నిస్తుంది.

దైవం ఉనికిని సందేహించే వ్యక్తి నాశన మౌతాడు.

అతిచురుకుతనం స్త్రీకి మంచిదికాదు.

అక్షరములలో ఆకారమును, సమాసములలో ద్వంద్వసమాసమును, నాశరహితంబైన కాలమును, కర్మఫలప్రదుండైన చతుర్ముఖ బ్రహ్మయును భగవంతుడే.

బహుభార్యాత్వంలో భార్య హక్కులను సవ్యంగా, శాస్త్రీయంగా, న్యాయంగా, ధర్మంగా పూర్తిచేయలేనివాళ్ళు ఒకభార్యతోనే తృప్తిచెందవలసి వుంటుందని ముస్లింమతం ప్రకారం ఆదేశించబడింది.

బాల్యాన్ని బంగారు బాల్యం అన్నారు. బాధలు, బరువులు, బాధ్యతలు, లేనికాలం బాల్యం.

సర్వవస్తువులను హరించెడి మృత్యువును, కలుగబోవు వస్తువులకు వుత్పత్తియును, స్త్రీలయందు కీర్తియును, లక్ష్మీసరస్వతులును, స్మృతిమేధ బృతిక్షమారుణును భగవంతుడే.

క్షమించడమే దివ్యశక్తి కాంతిని సంకుచిత హృదయం తెలుసుకోలేదు.

పొదుపు అనేది మనపై మనమే విధించుకొనే ఒకరకమైన పన్ను.

సామవేదగానములలో బృహత్సామవేద గానమును, చందస్సులలో గాయత్రియును, మాసములలో మార్గశీర్షమును, ఋతువులలో వసంతమును భగవంతుడే.

వలకుగల బెరడు వంటిదే ఆశ. ఆత్మను నిస్పృహ, నిరాశలలో మునిగిపోకుండా కాపాడుతుంది; వలలోని గేలంవంటిదే భయం—భ్రమతో అది వలను తేల్చుతూంటుంది.

మోసపుచ్చువానిలో జూదమును, తేజోవంతులకు తేజమును, జయించు వారికి జయంబును, సాత్త్వికులకు సత్త్వంబును, యత్నించు వారలకు యత్నరూపమును భగవంతుడే.

రాజుకంటె అధికారి వర్గమే ప్రధానం రాజ్యానికి. అందుచేత అది బాగా సమర్థం కావాలి. నీతి సంపన్నమూ అయివుండాలి.

స్నేహ వాత్సల్యాల విలువను మనిషికన్న మిన్నగా అర్థం చేసుకోగలిగిన జంతువు కుక్క.

భగవంతుడు యుగయుగాలుగా భాగ్యవంతమైన జీవితం గడుపు తున్నాడంటే కారణం – తప్పులు చేసే వారివల్లనే! అటువంటప్పుడు తప్పులు చేసేవారిని నిర్ధనులుగా చెయ్యాలంటే భగవంతుడు ఎంతకృత ఘ్నుడై వుండాలి.

వృష్ణి వంశస్థులలో వాసుదేవుండును, పాండవులలో ధనంజ యుండును, ఋషులలో వ్యాసుండును, కవులలో శుక్రాచార్యుండును, భగవంతుడే.

పొదుపుగా, సులువుగా జీవించాలనుకుంటే నీకువచ్చే ఆదాయంలో రవంత తక్కువగా ఖర్చుచేసుకో.

భూమిని చీకటి కప్పివుచ్చేలా సత్యాన్ని కోరికలు కప్పివుంచుతాయి.

దైవానికన్నా దైవానికిచ్చిన నిర్వచనం గొప్పది.

దండించు వారలకు దండమును, జయించు వారికి జయోపాయ మును, రహస్యములలో మౌనమును, జ్ఞానవంతులకు జ్ఞానమును భగవంతుడే.

ప్రేమికుని ఆయుధం ఆశ, దానిలోనే అతను ముందడుగు వేస్తాడు. నిస్పృహ కలిగించే ఆలోచనలను దానితోనే ఖండిస్తూంటాడు.

తనశక్తికి మించిన కార్యాచరణకు మానవుడు నడుంబిగించ కుండావుంటే ఆతురత, ఆందోళనలకు అవకాశమేలేదు.

భగవంతుడు సమస్త వస్తువులకును, ఆదికారణంబై యుండు వాడు. భగవంతుడులేని స్థావరముగాని, జంగమముగానిలేదు

ఏపురుషుడైతే ఆలుబిడ్డలపై అత్యధిక విశ్వాసాన్ని, అనంత మైన ప్రేమనూ కలిగివుంటాడో ఆపురుషుడు నిజంగా పురుషోత్తముడే అంటూ ప్రవక్తమహమ్మదు ద్రువపరిచారు.

రాజైనవాడు తనఅధికారవర్గం అవినీతిపాలు పడకుండా చూచు కుంటూ వుండాలి. అధికారవర్గం నీతితప్పితే మాత్రం మరి రక్షణలేదు ప్రజలకు.

నిజాయితీగావుండే వాళ్ళకు సంఘంలో వుండే గౌరవం, మను ష్యుల హృదయాల్లోవుండే విలువ, గొప్పలు చెప్పుకునేవాళ్ళ కుండదు.

అప్రాకృతంబులైన భగవంతుని మహిమలు అపరిమితములు.

చక్కదనం, చిరునవ్వులుకన్న కన్నీరే అందమైనది.

ప్రకృతి నాటిపెంచిన మహావృక్షపు భాగాలమే మనం. మానవు లము పరస్పరం ప్రేమించుకుంటూ సమిష్టిగా బ్రతకడమే మన కర్తవ్యం.

పచ్చనిచెట్టూ, చేమా చూచినప్పుడు మనసు ఉప్పొంగని వాడిని— మనిషనడానికే కాదు—పశువనడానికీ అవకాశంలేదు.

లోకములో ఏయేవస్తువుల స్వజాతీయ,విజాతీయవస్తువులలో ఐశ్వ ర్యంబును బలపరాక్రమంబును గలిగియుత్సాహ యుక్తంబై యున్నవో అవియన్నియు భగవంతుని తేజోంశసంభవములని ఎరుగవలయును.

పాము కోరలలోని విషము మనిషి ప్రాణాలను తీస్తుంది. మనిషి చేష్టలలోని విషం అతని ప్రాణాలనే తీస్తుంది.

తనకుండవలసిన యోగ్యతలు సంపాదించుకోని రాజు ప్రజల శ్రేయస్సు కోరనే కోరడు. కనక ప్రజలు యిది గుర్తించి తమ రాజు నీతి తప్పకుండా వుండేటట్టు చూచుకోవాలి.

యెంత తెలిసినను తెలిసికొన వలసినది శేషించియే యుండును. భగవంతుడు యీ సమస్తజగత్తును తన యొక్క అనేక అంశములలో ఒక అంశము చేతనే వ్యాపింపచేసి నిలుపుకొని యున్నాడు.

నిత్యజీవితములో ఆత్మకు పట్టిన దుమ్మును కడిగివేసేదే సంగీతం.

వేలమంది ద్వేషింప బడతారు. కాని ఏదో హేతువు లేకుండా ఒక్కరూ ప్రేమించబడరు.

నిజానికి ఏవుద్యమం ముదిరినా ఏదో దుర్గుణం వస్తుంది. సాంస్కృతిక తెగలాగితే — శిలానియమ శృంఖలాలలో ప్రాణం పోతుంది. వాస్తవికత పెచ్చు పెరిగితే రంగూ, రుచి, వాసనా పోతాయి.

మనసునకు నచ్చిన చెడుపని చేస్తున్నపుడు "తప్పేవుందీ'' అనుకుంటాం. తప్పేముందో సరిచేసుకోలేని స్థితికి వచ్చాక కాని తెలియదు.

విభేదాలు తాత్కాలికమైనవి. శాశ్వతమైనది మనిషికీ మనిషికీ మధ్య వుండే ప్రేమాభిమానాలు.

విషణ్ణహృదయులకు ఆశమినహా మరొక మందులేదు.

మనిషి మనసు రెండు గదుల్లో నివసిస్తూ వుంటుంది. యదార్థం. ఊహ,

భగవంతుని విశ్వరూపమును యదార్థముగా నెరుంగుటకును, సేవించుటకును, సంపూర్ణముగ ననుభవించుటకును, అనన్యంబయిన భక్తి చేతనే సాధ్యమగును.

ముస్లిం ఆచారం ప్రకారం పవిత్రమైన వివాహసంస్కారం పావనమైన మశీదు ఆవరణలో జరపటం దేవునికి ప్రీతికర కార్యం.

రాజ్యం ఏలడంలో తనకు సహాయపడ్డానికి నీతిపరులు, సమర్థులూ అయిన అధికారులను తనకు సాయంగా కూర్చుకోవాలి.

పల్లె తల్లివంటిది. పట్టణం ప్రియురాలివంటిది. అన్నం పెట్టడం, చల్లని అంకంమీద పవళింప చేసుకోవడం గారంగా పెంచుతుంది–పల్లె. ఆకర్షించడం, ఎప్పటికప్పుడు ఆవేశాలతో కదిలించి వేయడం, –గాఢంగా ఊపేస్తుంది పట్టణం.

"నాదీ" అనేది ఏదియు లేనివాడు నిజమైన స్వేచ్ఛాజీవి.

ఏపురుషుడు కర్మములను భగవంతుని యొక్క ఆరాధన రూపములుగా చేసి భగవంతునికి సమర్పించి అతనినే పరమప్రాప్త్య స్థానముగా దలంచి యితరాసక్తులను విడిచి భగవంతునియందు భక్తిని నిలిపి సమస్త ప్రాణులయందును వైషమ్యములేక యుండునో ఆ పురుషులు భగవంతుని పొందుచున్నారు.

అలవాట్లవల్లనే మనవ్యక్తిత్వం ఏర్పడుతుంది. మన నీతులు, మన ఆలోచనలు, అచంచలములైన మననమ్మకలు అన్ని మన జన్మదేశాల మీదనే ఆధారపడతాయి.

యెన్నో విధాల పనులు తనకుతానే సర్దుకోవాలంటే ఎలాంటి రాజుకి సాధ్యంకాదు. అందుకని రాజైనవాడు తనకు మంచి ఆలోచన చెప్పగలవారిని సహాయులుగా చేర్చుకోవాలి.

భగవంతుని ఆరాధనా రూపమైన కర్మముల నాచరించుచు, భగవంతుని యందు మనస్సును నిల్పినిరంతర సమాహితచిత్తులై మిగుల శ్రద్ధాపూర్వకముగా భగవంతుని ఉపాశించువారలే భగవంతుని యభిమతంబగు శ్రేష్ఠతమంబైన యోగ్యులు,

హృదయంలో ఆవేదనవుండి మానసికంగా శక్తిలేనివాడు ఎప్పుడూ పరాజితుడే అవుతాడు. సమాజ విషభుజంగాలమధ్య సంచరించే మనిషికి మంచితనం ఒకశాపం.

ప్రపంచములో మాతృప్రేమ ముందు సాటి అయింది మరేదిలేదు.

బీదవాడి ఆత్మగౌరవం ధనికుడికి పొగరమోతుతనంగా కనిపిస్తుంది.

దేవ మనుష్యాది శబ్దములంబట్టి అట్టిదిట్టిదని నిర్దేశింప గూడనిదై, యింద్రియములకు గోచరంబుకానిదై సర్వవ్యాపకంబైనదై, స్వదేహము లందుండియు నచింత్యమైనదై కూటస్థంబును, అచంచలంబును ధృవంబును అక్షరంబునైన ఆత్మస్వరూపమును, ఎవరు యింద్రియ నిగ్రహంబు గావించి సర్వభూతములందు సమబుద్ధి వహించి సర్వప్రాణులకు హితముచేయ నాసక్తికలవారల యుపాసింతురో వారు సర్వభూత హితమును కోరువారై భగవంతునే పొందుదురు.

భగ్నహృదయులకు దివ్యౌషధమే సంగీతము.

ఒకని నిస్వార్థంనుంచి పరమార్థానికి మళ్ళించగలశక్తి ఒకసత్యవాక్కుకు ఉంది.

కవి త్రికాలజ్ఞుడు. గరుత్మంతునివంటి దృష్టి. దూరాలుచూస్తాడు. నాలుగువైపుల చూస్తాడు. వర్తమాన దేశకాల పరిస్థితుల్ని బాగాముందుకి సాగడానికి అనుకూలమైన మార్గాలు, మజిలీలు ఏర్పరచుతాడు. అనంత

యాత్రా మార్గంమీద జనం యాత్రికకోటి. వాన్కి పెత్తందారు, నాయ కుడు కవి.

రూపరహితంబైన ఆత్మస్వరూపమందు మనస్సును నిలిపిన వారలకు కష్టము మిక్కిలి అధికంబైయున్నది. ఏలన శరీరాభిమానం కలవారికి యింద్రియములకు అగోచరంబైన నిరాకార ధ్యాన విషయము లభించుట మిక్కిలి శ్రమయే కదా!

తన కష్టాలు యితరులకి తెలియ చేయడానికి పదే తాపత్రయ ములో పదోవంతు యితరుల కష్టాలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తే ఆవ్యక్తికి దైవాంశ వున్నదన్నమాటే.

యెవరు సమస్త కర్మలను భగవంతునికి సమర్పణచేసి భగ వంతుని పరమోత్కృష్టగతిగా తలచి భగవంతుని వినా యితరాలంబ నము గైకొనక దేవునే భజించుచుందురో అట్టివారలను మృత్యు రూపమైన సంసార సాగరంనుండి భగవంతుడు శీఘ్రముగా నుద్ధ రింపు చున్నాడు.

చెడు అభిరుచికన్న మంచి అభిరుచి మేలు. కాని అసలే అభి రుచి లేకపోవడంకన్న చెడు అభిరుచి ఉన్నా మంచిదే.

యవ్వనదశలోవున్న వ్యక్తి తనంత వాడు లేనట్లును, తన అను భవమంత అమూల్యమైనది లేనట్లున్నూ, లోక రంగంలోతానే నాయకు డయినట్లున్నూ అనుకుంటాడు. సాక్షిగా, తటస్థుడుగా యీలోకాన్ని చూడలేడు. అనుభవంవైపు మొగ్గినంత ఆలోచనవైపు మొగ్గడు. ఈ అవ స్థలోవున్న జాతి కూడ తనంత గొప్పదీ, లోపంలేనిదీ లేదనుకుంటుంది.

మానవుడు భగవంతునియందే మనస్సు బుద్ధిని నిలిపి భగవంతుడే

పరమ ప్రాప్యమని నిశ్చయించి యుండిరేని అట్టి అధ్యవసాయ బలము చేత పిమ్మట నిశ్సంశయముగా భగవంతుని యందే నివశించును.

రాజు నియమించుకున్నటువంటి మంత్రులు ఆలోచనా పరులై యుండాలి. రహస్యాలు దాచగలవారై యుండాలి. రాజు యెడల భయము, భక్తి గలవారై యుండాలి.

మానవుడు తన చిత్తమును భగవంతునియందు స్థిరముగ నిలుపుటకు భక్తిలేనియెడల అభ్యాస యోగముచేత చిత్త సమాధానమును బొంది భగవంతుని పొందుటకు యిచ్ఛగింప వలయును.

సత్యము సర్వోత్కృష్టమైన పరమ సత్యము సత్యారాధకుని సర్వకర్మలు దేవుడు ప్రీతితో స్వీకరిస్తాడు. వారి పొరపాట్లను, తప్పిదాలను, సహృదయంతో క్షమిస్తాడు.

మనము రాత్రి నిదురపోవునపుడు భగవంతుణ్ణి ధ్యానించుకోవాలి. భగవంతుడా ! నేటికి నాశరీరయాత్రను ముగించాను. ఇక విశ్రాంతిగా నిద్రపోతున్నాను. నేను ఈదినం చేసినపనులలో నాకు తెలిసిగాని, తెనియక గాని, ఎన్నోతప్పులు ఉండవచ్చును. నాతప్పులను క్షమించి, నామనస్సు మంచిమార్గములో ప్రవర్తించేటట్లు చెయ్యి. నన్ను రక్షించడానికి నీకంటె వేరేదిక్కులేదు". అని అనుకోవాలి.

మాతృభాషను న్యూనత పరచేవాడు తన తల్లిని కించపరచుకున్నట్లే.

మన తెలుగునాట కోవెలలేని పల్లెలేదు. గ్రామాన్ని కాపాడటానికి మాత్రమే కోవెలలేదు. కోవెలలేనిదే పల్లెజీవితానికి చల్లదనంలేదు. గ్రామ శోభకు వన్నెలేదు కూడాను.

దైవాన్నికన్నా దైవాన్ని సృష్టించినవాడు యుక్తిపరుడు.

భగవంతుని చేరుటకు అభ్యాస యోగము చేయుటకు శక్తి లేనపుడు మానవుడు భగవంతునికి ప్రియము లైన నిష్కామ కర్మలనే ముఖ్యముగా చేయవలెను. అట్టి కర్మలద్వారా అభ్యాసయోగములను, తన్మూలముగా సమాహిత చిత్తమును, తద్వారా భగవత్ప్రాప్తి రూపమైన మోక్షసిద్ధియును బొందగలడు.

శారీరక మౌఢ్యమే సోమరితనం. సోమరి తనమే మౌఢ్యం.

ఒక్క అబద్ధం చెపితే ఆతరువాత నూరు నిజాలు చెప్పినా అవతల వాళ్ళకు నమ్మకం కలగదు.

వివేకహీనమైన పాండిత్యం అడివి కాసిన వెన్నెలవంటిది.

మానవుడు భగవంతునియొక్క భక్తియోగము నాశ్రయించి పిమ్మట సమాహిత చిత్తముగలవాడై తను చేసెడి సర్వ కర్మ ఫలమును భగవంతునికి అర్పణము చేయవలెను.

కరుణ మనుష్యులనందరినీ దేవతలుగా మార్చివేస్తుంది.

త్రాచుపాము తనకు అపకారము చేస్తారనుకున్న వారినే కాటు వేస్తుంది. కానీ మనిషి తనకు ఉపకారంచేసినవారినీ కాటువేస్తాడు.

కొన్ని స్మృతులు మంచులో కొండలలాగా కలసిపోయి కంటికి దొరకవు. కొన్నిస్పష్టంగా నిలిచి కనపడుతూనే వుంటాయి. వెనక ఆకాశంమీద చిత్రించబడ్డ తోపుల్లాగా.

అవివేకముతో గూడిన అభ్యాసముకన్న శాస్త్రజ్ఞానము శ్రేష్టము. శాస్త్రజ్ఞానముకన్న ధ్యానముతరము. ధ్యానముకన్న కర్మఫలత్యాగము శ్లాఘ్యము; కర్మఫలత్యాగముకన్న మనశ్శాంతిశ్రేష్ఠము.

శక్తినిబట్టిపని, పనినిబట్టి ప్రతిఫలం అన్నసూత్రాన్ని సఫలం చేయడం యిదే విశుద్ధమైన సాంఘిక న్యాయం, వ్యక్తిస్వేచ్ఛ యొక్క పరాకాష్ఠ అని సోషలిష్టు ప్రజాసామ్యాలు పరిగణిస్తూవుంది.

సమస్తప్రాణుల యందును ద్వేషము లేనివాడై, సర్వభూత హితుడై, సర్వజన దయాపరుండై, మమతాశూన్యుండై అహంకార రహితుండై, సుఖదుఃఖములకు సముండై క్షమియై, నిత్యతృప్తుండును, ఆత్మానుసంధాన పరుండును, నిశ్చయ చిత్తుండును, దృఢనిశ్చయుండును, నిశ్శంశయుండునునై భగవంతునియందు భక్తిగలవాడే భగవంతునికి ప్రియుడు.

పాఠాలుస్కూలులోనే ముగుస్తాయి. కాని చదువుకోవడంజీవితంతోనే ఆఖరవుతుంది. ప్రతివారికి ప్రపంచమే పాఠశాల.

ఆడంబరముగా దుస్తులు ధరించినవానిని మూర్ఖులు, ముదితలు తప్ప యితరులు మెచ్చుకోరు.

మలుపు పిలుపువంటిది. మలుపుతెలుచుకొన్న తలుపు వంటిది. మలుపులు లేనిమార్గం బావుండదు.

మనిషికి జీవించడానికి కొన్ని పరిస్థితులు అత్యవసరము. అవి లభించేవరకు వాటిని కోరుకుంటాడు. అవి అన్నీ లభించిన తర్వాత కృత్రిమంగా కొన్ని సమస్యలను సృష్టించుకొని వాటిని పరిష్కరించడంకోసం శక్తియుక్తుల్ని ధారపోస్తాడు.

తనవలన లోకులకును, లోకులవలన తనకును, ఏ విధమైన భయమును, లేని వాడును, సంతోషా కోపాసూయాదులకు అతీతుండైన వాడును, హర్షామర్ష భయోద్వేగములచే విముక్తుడైన వాడును ఎవడో అతడే భగవంతునికి ప్రియమైనవాడు.

ఒకరితో స్నేహంచేసేటప్పుడు నెమ్మదిగా ప్రారంభించడం మంచిది. స్నేహం కలిసిన తరువాత సుస్థిరత అలవరచుకో. మరి విడిచి పెట్టకు.

ప్రపంచములో విహరించే అన్నిభూతాలకంటె ప్రమాదకర మైనది నిజాయితీ లోపించడమనేదే.

ఆత్మేతర వస్తువులందు ఆశక్తిలేనివాడును, పరిశుద్ధుడును, సమయస్ఫూర్తిగలవాడును, ఉదాసీనుండును, సర్వసంకల్ప విముక్తుండును, శుభాశుభ పరిత్యాగియును, భక్తిహితుండును, అయినవాడెవడో వాడు భగవంతునికి ప్రియమైనవాడు.

ఇదివరకు సామాన్యలోకం కోసం మహాత్మ్యం అవతరించేది. ఇప్పుడు సామాన్యలోకం మహాత్మ్యం దగ్గరికి అధిరోహిస్తున్నది.

రెండుసత్యాల మధ్యగల ఒకస్వప్నం జీవితం.

ఏకార్యం చెయ్యాలన్నా, ఏకార్యం చెయ్యగూడదన్నా ముందు మంచి చెడ్డలూ, కష్టసుఖాలూ, లాభాలాభాలూ, సాధ్యాసాధ్యాలూ బాగా తరిచి చూచుకోవాలి. అలా చూచుకుంటేనే అవిసరిగ్గా సిద్ధిస్తాయి.

ఏమానవునకు యిష్టవస్తువులను గురించి సంతోషమును, అనిష్టమునుగురించి ద్వేషమును, పుత్రాది వియోగమందు దుఃఖమును, అపేక్షయును, పుణ్యపాపములును, లేవో ఆపురుషుడు భగవంతునికి ప్రియుడు.

భర్తయిష్టమే భార్యయిష్టము భర్తయిష్టాలతో ఆశయాలతో భార్యలీనమైనపుడే ఈజగన్నాటకంలో తన పాత్రపోషణను చక్కగా సిద్ధింకోగలుగుతుంది.

దయయే మతానికి మూలం. బ్రతికున్నంతకాలం దయను విసర్జించకు.

మనిషి, తనయాతనలకు, తన ఆనందానికి తానేబాధ్యుడని అనుభం గడించినకొద్దీ నిస్పష్టంగా బోధపడుతున్నది. యిటువంటి పరిస్థితులలో సుఖదుఃఖాలెందుకు కలుగుతున్నాయి? అసలు సంగతేమంటే మనిషి యిటువంటి విషయాలనుగురించి ఆలోచించడు, ఇటువంటి ఆలోచనకు యెక్కడ తీరికే వుండదు.

శత్రుమిత్రులయందు మానావమానములందును, చల్లనయందును, వేడిమియందును, సుఖమునందును, దుఃమునందును, సమానుడై సంగవర్జితుడై నిందాస్తుతులయందు తుల్యుడై, మౌనియై, యదృచ్ఛాలాభసంతుష్టుడై, నియతస్థానరహితుడై, నిశ్చయ బుద్ధియుతుడై భగవంతునియందు భక్తిగలవాడెవ్వడో వాడు భగవంతునికి ప్రియమైనవాడు.

అనర్హులను పొగడడం వారిని వెటకారం చెయ్యడమే.

వినడం ఎల్లాగో నేర్చుకో; చెడుగాప్రసంగించేవారినుంచి సైతం నీకు కొంతమేలు చేకూరుతుంది.

భావన కవికి ఎంతఅవసరమో — పాఠకుడికి అంతే అవసరం.

ఎవరు శ్రద్ధగలవారలై దేవుడే పరమ ప్రయోజనముగా గలిగి ధర్మోపేతంబైన యమృతమువలె భోగ్యమైన భక్తియోగమును ఆచరింతురో ఆభక్తులే భగవంతునికి పరమ ప్రియులు.

మంచిపుస్తకం నేస్తాలందరిలోకి గొప్పనేస్తం. ఎప్పటికైనా యిదే యదార్థం.

కవుల దృక్పథాలు — అప్పటప్పటి కాలపరిస్థితుల ననుసరించి, ఆయావుద్యమాల పలుకుబడినిబట్టి, కొన్ని కొన్ని కొత్తపాత సంస్క్రు

తుల ప్రభావాలానుబట్టి తమతమ ప్రత్యేక ప్రతిభలనుబట్టి మారవచ్చును. కనుక కంఠధ్వనులు, బాణీలు మారవచ్చును. కాని పట్టిచూస్తే కవిత్వ మంతా ఒక్కటేకదూ.

మంత్రాలోచన, కార్యనిశ్చయమూ, ప్రణాళికకూడా రాజూ, ఆయన అధికారవర్గం బహురహస్యంగా, నిగూఢంగా వుంచుకోవాలి.

భగవంతుడు రాముడైనప్పుడు లక్ష్యప్రాయుడైన మానవుడు. భగవంతుడు కృష్ణుడైనపుడు పరిపూర్ణ మానవుడు.

క్షేత్రమనగా శరీరమనియు, శాస్త్రజ్ఞుడనగా అశరీర తత్వము నెరింగినవాడు.

స్నేహాన్ని పెంపొందించు కోవాలంటే అబద్ధాలు ఆడడం తగ్గించుకోవాలి. హృదయం తోటలాటిది. శుభ్రంగా లేకుంటే విషపురుగులు చేరుతాయి. అబద్ధాలనే కలుపుమొక్కల్ని పెరగనివ్వ కూడదు.

ఆలోచన — నీవుచేసే ప్రతిపనికీ అదేబీజం.

సర్వ శరీరములందును భగవంతునే క్షేత్రజ్ఞుడనువానిగా తెలుసుకొనవలెను. క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగజ్ఞానమేదో అదే జ్ఞానము.

విజ్ఞానం లక్ష్యం సత్ప్రవర్తనమే.

ప్రతీవాడూకూడా తాను బాగుపడాలనీ చూచుకోవాలేగాని యెదటి వాళ్ళు చెడిపోవాలని భావించుకోగూడదు. తాను చేసే ఆలోచనవల్ల తాను బాగుపడాలి. ఎదుటివాడుకూడా బాగుపడాలని కోరుకోవాలి.

ఆలోచన చేయవలసివస్తే యిద్దరు మాత్రమే చేయాలి. ఎప్పుడూ ముగ్గురు కూర్చుంటే వారిలో ఒకరిమాటింకొకరికి నచ్చదు.

రాజుకు మంత్రిగా నియమింపబడ్డవాడు స్వార్థచింతలేనివాడై వుండాలి. చదువు, తెలివితేటలు, సామర్థ్యమూ వుండాలి.

పృథివ్యాది పంచభూతములను, అహంకార తత్త్వమును, మహాతత్త్వమును, ప్రకృతియును, దశేంద్రియంబులును, మనస్సొకటియును, శబ్దాది తన్మాత్రలు అయిదును, క్షేత్రము నాశ్రయించియుండు తత్త్వములు, క్షేత్ర వికారములైన ద్వేష సుఖదుఃఖంబులును, దేహేంద్రియాది సంఘాతమును, మనోవృత్తియును, ధైర్యమును, యివి మొదలగు తత్వేంద్రియాది విజ్ఞానములతో గూడిన చతుర్వింశతి తత్త్వాత్మకంబగు యీ శరీరమే సంక్షేపముగా క్షేత్రమని చెప్పబడుచున్నది.

మగవాని స్వార్థానికి అనాదిగా స్త్రీ బలి అవుతూనే వస్తున్నది. అతని సరదాలు, కోరికలుతీర్చి సుఖపెట్టడానికి స్త్రీకావాలి. ఆమె మనసు, కోరికలు, సరదాలు అతను పట్టించుకోడు.

మానవుని మేధస్సుకు విద్యారంభం ఉయ్యాలలోనే జరుగుతుంది.

జూదానికి కారణం అత్యాశ. ఫలితం పతనమే.

తన్నుతానే స్తోత్రముచేసికొనక యుండుట, తాను ధార్మికుడను, ప్రతిష్ఠను కోరిక యుండుట, ప్రాణులను బాధింపకుండుట, ఓరిమి, ఋజుమార్గము, ఆచార్యసేవ, శౌచస్థైర్యమనోనిగ్రహము కలిగియుండుట జ్ఞానమనబడును.

మనసు నిర్మలంగా, శరీరం ఆరోగ్యంగా, వుండాలనుకుంటే తాగుడుమాట తలపెట్టకు.

జీవిత యాత్రలో ఒక్కచోట ఆగిపోవడానికి ఎవరికైనా

అవకాశంవుంది. కాని కవికి ఆఅవకాశము అధికారముకూడా లేవు. ఈ సమాజము మనది. దానితో మారాలి. దానిని మార్చాలి.

కవితా రచనకూడా తపస్సు. కవిముదిరాకవ్రాసే కావ్యరూపమూ, గుణమూ మారవచ్చును. కాని కావ్యకల్పన మానగూడదు.

సహజసౌందర్యానికి అలంకరణ అవసరంలేదు.

వేపాకునకు తీయదనం, సర్పమునకు సాధుత్వం, లోభివానికి కనికరము, వేశ్యలకు విశ్వాసము కలుగుట కల్ల.

ఇంద్రియార్థములందు వైరాగ్యమును, నిరవధికారము, జనన మరణ జరావ్యాధి దుఃఖాదులను శరీర దోషములని యాలోచించి వానిని తుచ్ఛములని తెలుసుకొనుము.

మగడు, సంసారం, పిల్లలు — స్త్రీ కి సమాజంలో భద్రత కలిగిస్తాయి; గౌరవం పెంపొందింప చేస్తాయి.

గృహానికి యజమాని అలంకారంగా వుండాలి. కాని అది అతనికిఅలంకారం కారాదు.

ఆత్మేతరములందు ఆశక్తిని జెందకుండుట, దారాపుత్ర గృహాదులయందు ప్రీతియున్నభిమానము లేకుండుట జ్ఞానమనబడును.

రాత్రి నక్షత్రాలను వెలువరించినట్లు దుఃఖం మనకెన్నో సత్యాలను సాక్షాత్కరింప చేస్తుంది.

వృద్ధాప్యంవలె మృత్యువుకూడా అనివార్యమే,

భగవంతుడు తప్ప వేరుగతిలేదని అనన్యయోగముచేత భగవంతుని యందు అవ్యభిచారిణియైన భక్తిగావించుట, నిర్జన ప్రదేశమాశ్రయించియుండుట, జనసమూహమందు ప్రీతిలేకపోవుట జ్ఞానమనబడును.

డబ్బుకోసం తాపత్రయపడని మనిషి ఎప్పుడూ మానసిక విలువ లకు ప్రాధాన్యం యిస్తాడు.

జీవితమార్గంలో మలుపు తిరిగితే ఆపదవచ్చినా, ఆనందంకల్గినా తరువాత స్థిమితంగా వాటిని నెమరువేసుకొన్నపుడు మాత్రం అన్నీ అమూల్యంగానే కనపడతాయి. ఆప్తంగావుంటాయి. అవి తీయనయి పోతాయి. అనంతయాత్రా మార్గములో అవి మనకు దారిబత్యం.

సౌందర్యం గొప్పదే — కాని ఆ సౌందర్యాన్ని ఆరాధించగల సహృదయత యింకాగొప్పది.

ప్రపంచాన్ని, జీవితాన్ని, మానవులని విరక్తిగా ఏవగించుకొనే వారికంటె జీవితాన్ని భగవంతుడిచ్చిన వరంగా భావించి దానినిఉన్నత మైన మార్గంలో దైవపదమైన విధంలో గడపాలని కాంక్షించేవారు యోగసాధనలో ముందంజ వేస్తారు.

చీమ ఏమీచెప్పదుకనుక దానికంటె ఉత్తమంగా ఎవడూ ప్రబో ధించలేడు.

జ్ఞేయవస్తువును ఎరింగినయెడల యమృతరూపంబైన మోక్ష లాభముకలదు. అదియే బ్రహ్మమనంబరగునది. అది ఆదిలేనిది. సర్వోత్కృష్ట మయినది. సత్తునుగాక అసత్తుసుగాక విలక్షణంబైనది.

ఆపదలు వచ్చినప్పుడే తెలుస్తుంది. నిజమైన మిత్రులైన వారె వరో కానివారెవరో ? ఆపదల్లోవచ్చి చుట్టుకునేవారే మిత్రులు.

ఆత్మజ్ఞానము నెల్లపుడు కలవాడగుట, మోక్షజ్ఞానమందు ప్రయోజన దృష్టి యుండుట జ్ఞానమనబడును.

జీవితమార్గంలో గొప్ప మలుపులున్న మానవుని జీవితం మహా కావ్యం అవుతుంది. రామాయణంలాగ, మహాభారతంలాగ!

నిన్నటికంటె నేడు నీవివేకం పెరగకపోతే మరొకరోజు వ్యర్థ మయిందని తెలుసుకో.

జ్ఞేయవస్తువు సమస్తదిక్కులయందును హస్తపాదములను గలిగి యెంతటి నేత్ర శ్రోత్రశిరోముఖములతో గూడినదై సమస్త పదార్థము లందును వ్యాపించి యుండునది.

వెలకాంతలు మన్మధుని వంటి అందగానిని సైతము కనెత్తి చూడరు. ధనమిచ్చు గ్రుడ్డివానినైనను ప్రేమించుచున్నట్లు నటింతురు.

గొప్పతప్పిదాలెన్నో చెయ్యకుండా ఏవ్యక్తి గొప్పవాడు గాని, సజ్జనుడుగాని కాలేడు.

జ్ఞేయవస్తువు సర్వేంద్రియ వ్యాపారములచే విరాజిల్లునటుల నుండినను సర్వేంద్రియ వివర్జితంబైనది. ఎందున నంటకుండునది యైనను దేహాది సకల ప్రపంచమును భరించుచుండునది. సత్వరజస్తమోగుణములు లేనిదైనను ఆగుణముల ననుభవించునట్లు తోచుచుండునది.

కొంతకాలము కొందరిని వంచించవచ్చు. అంతకాలం అందరనూ వంచించడం అసాధ్యం. అసంభవము.

జ్ఞేయవస్తువు పృధివ్యాధిభూతములకు లోపలను నుండునది. తన యిష్టము చొప్పున జంగమరూపములో కదులుచుండునదయ్యును చలింపకయే స్థావరరూపముగా నుండునది. సూక్ష్మంబగుటచే గ్రహింప శక్యము కానిది. మరియు నజ్ఞానికి పొందనసాధ్యంబై దూరస్థముగాను, జ్ఞానికి సాధ్యంబై సమీపస్థంబుగాను నుండునది.

రాజు, చిత్తశుద్ధీ, నిశ్చలమైన మిత్రభావమూ, కర్తవ్యపరాయణతా, నిర్వహణ సామర్థ్యమూగల మిత్రులను కూర్చుకోవాలి.

జ్ఞేయవస్తువు సర్వభూతములందు నేకాకారమై యుండినను ఆకారభేదమును కలదానివలెతోచునది. భూతములనుభవించునట్టిదియు, భూతవికారవస్తువులను భజించునట్టిదియు, మరల సృజించునట్టిదియునై యున్నదని యెరుంగ దగినది.

పరిశ్రమించని వ్యక్తికి భగవానుడెన్నడూ సాయపడడు.

సమాజానికి ఎదురునిలిచినవారు ఎప్పటికప్పుడు శేషప్రశ్నలుగా నిలిచిపోతారు. వారినివారే క్షమించు కోవాలిగానీ సమాజం వారిని క్షమించడానికి సిద్ధపడదు.

ఆలస్యం అంటే బద్ధకం—శరీరవ్యాధులలో యిదిఒకటి. మనిషికి అదిఒకశత్రువే అనిచెప్పాలి. అదిప్రయత్నాలు చెయ్యనివ్వదు. ప్రారంభించినవన్నీ మానిపించేస్తుంది. అన్నిపనులు పాడుచేస్తుంది. దాన్నెంత మాత్రము చేరనివ్వగూడదెవ్వరూకూడ.

జ్ఞేయవస్తువు తేజస్సునకు తేజస్సును, అవిద్యకుపరంబును, ప్రకాశస్వరూపంబును, జ్ఞానగమ్యంబును, సర్వభూతహృదయ కమలస్థంబునుగానుండునది యనిచెప్పబడుచున్నది.

డబ్బు ఒక అట్టడుగులేని మహాసముద్రం. దానిలో గౌరవం, నిజాయితీ, సత్యము — అన్నీ మునిగిపోతాయి.

జీవితంలో కలిగే వియోగాలకంటే చావువలన కలిగే ఎడబాటులో సుఖముంది.

గర్వం అయిస్కాంతం వంటిది. దేన్ని అది ఆకర్షించేది? స్వార్థాన్ని.

వేశ్యలకపటతంత్రమున జిక్కినవాడు నదీప్రవాహమునబడిన వృక్షమువంటివాడు.

ప్రకృతి పురుషులిరువురును ఆదిలేనివారలు, బంధ హేతువులైన ఇచ్ఛాద్వేషాదికార్యములను, మోక్ష హేతువులైన అమానిత్వాది గుణములును, పురుషునితో ననాదిగాక కలిసియుండెడి క్షేత్ర (శరీరము) రూపమైన ప్రకృతి సంభవములని ఎరుంగవలయును.

ఏదో ఒక నిర్ణీతలక్ష్యం, నిర్దిష్టమార్గము, నిర్దిష్టగతి ఏవ్యక్తి జీవనంతోనైనా అవసరం.

నేను హాయిగా వున్నపుడు మానవులనర్థం చేసుకున్నానను కున్నాను. కాని నాదురదృష్టంలోనే వారి నవగాహన చేసుకునేదురదృష్టం పట్టింది.

సోమరితనం ఏపనిచెయ్యనివ్వదు. సోమరికి బ్రతుకే భారంగా వుంటుంది. సామాన్యుడైన, రాజైనవాడైన సోమరితనం విడిచిపెట్టు కోవాలి.

ధృఢమైన, ఆరోగ్యవంతమైన, శరీరము ఒకమహాసామ్రాజ్యము. మంచిమనస్సు దాని నలంకరించే మణికిరీటం.

కార్యమైన శరీరమును కారణమైన యింద్రియములును తమ తమ వ్యాపారములైన సుఖ దుఃఖములను పుట్టించుటకును, ప్రకృతియే కారణమగుచున్నది. ప్రకృతితో చేరిన పురుషుడు ఆ సుఖ దుఃఖముల ననుభవించుటకు హేతువని చెప్పబడును.

అష్టైశ్వర్యాలూ ఉండవచ్చు. అయినా స్త్రీకి తగిన భర్త, పురుషుడికి తగిన భార్య లభించకపోతే జీవితం వృధా.

మంచి—చెడ్డ — రెండూవున్నాయి నీలో. వాటిని నువ్వు జయించ గలవేకాని- నాశనం చెయ్యలేవు.

ఉన్నత పథాలలో విహరిస్తున్న వారితో స్నేహంచెయ్యి. ఇష్టంలేనినాడు క్రిందికి సులువుగా రావచ్చు. దర్పం పెట్టుకోబోకు. పైకిరాలేవు. యెప్పుడూపైకి ఎక్కడంకంటె క్రిందికి దిగడం తేలిక.

పురుషుడు ప్రకృతి యందున్నవాడై ప్రకృతి గుణములవలన కలిగిన సుఖ దుఃఖాదులననుభవించుచున్నాడు. అట్టి గుణసంగము అతనికి పుణ్యాపుణ్యయోనుల యందు బుట్టుటకు కారణమగుచున్నది.

పాప ప్రక్షాళనలకు దానం ఉపకరించినంత శక్తివంతంగా మానవులముందు నమ్రత ఉపయోగిస్తుంది.

గొప్పగొప్ప యాత్రలూ, తీర్థయాత్రలూ చెయ్యాలి. దానివలన సజ్జన సాహవాసము కలుగుతుంది. సజ్జన సహవాసంవలన ధర్మం అంటే ఏమిటో బోధపడుతుంది. దానియెడల ఆదరభావమూ, అనురాగమూ, కూడా కలుగుతాయి. తీర్థయాత్రలవల్ల ధర్మానురాగం పెరిగి శాంతి యేర్పడుతుంది.

కార్యకారణ వ్యాపారములయందు దేహమును చూచువాడును, చూచి యూరకుండువాడును, దేహేంద్రియాదులను సహించువాడును, సుఖదుఃఖముల ననుభవించువాడును, యింద్రియాదుల ముఖ్య నియామకుడునునై పరమాత్మగా చెప్పబడెడి పురుషుడైన క్షేత్రజ్ఞుడు (శరీర తత్వము నెరిగినవాడు) యీదేహమందు ఉత్కృష్టుడైనవాడు.

స్నేహానికి కాలం గుర్తు అతిత్వరగా ఏర్పడిన స్నేహాలు అతి వేగంతో సమసి పోతాయి.

జీవితంలో జూదమాడేమనిషి ఆత్మహత్యకు తలపడుచున్నాడని అర్థం.

గడచిపోయిన కష్టాలను స్మరించుకో. అనుభవిస్తున్న సుఖాల తీయదనం పెరుగుతుంది.

పురుషుని, ప్రకృతిని, గుణములలోగూడ నెరుంగువాడు ఆచార వైకల్యాదులను చెందినవాడై ఏస్వభావములో వర్తించినను మానవుడు మరల జన్మమును పొందడు.

మేకతోలును గప్పుకొన్న పులులును, తేనెపూసిన కత్తులును యెంత ప్రమాదకరములైనవో వేశ్యలు అంతటి ప్రమాదకారులు.

సృష్టిలో యేదీ శాశ్వితముకాదు. బుద్బుదప్రాయమైన మానవ దేహమూ అంతే.

యోగసిద్ధిగల కొందరు ఉత్తమాధికారులు తమయందు అంతర్గతమైన పరమాత్మను మనస్సుచేతనే ధ్యానించి సాక్షాత్కరింతురు. యోగసిద్ధిలేని మధ్యమాధికారులు కొందరు జ్ఞానయోగముచేత ఆత్మను దర్శింతురు. జ్ఞానయోగమందు శక్తిలేని అధమాధికారులు కొందరు జ్ఞానగర్భమైన కర్మయోగము నాచరించి దర్శింతురు.

సోమరితనము మెల్లగా పయినిస్తుంది. దానిని వెనక్కినెట్టి ముందడుగు వేస్తుంది దారిద్ర్యం?

నీతీ — నిజాయితీ — వీటినిమించిన సౌందర్యములేదు.

మెరుస్తున్న రాళ్ళన్ని మాణిక్యాలంటావా ?

కర్మయోగమునందు గూడాశక్తిలేని అధమతమాధికారులు కొందరు యితరులైన జ్ఞానవంతులవద్ద నుపదేశముబొంది యుపాసింతురు. వారు కూడా వేదాంత శ్రవణానుష్ఠాన పరులై సంసారము నతిక్రమింతురు.

రాజ్యతంత్రం నాలుగు పనులు కూడిక. ఒకటి- అసాధ్యమైనది. సాధించుకోవడం, రెండు- సాధించుకున్నది జాగ్రత్త పెట్టుకోవడం. మూడు- జాగ్రత్తపెట్టుకున్నది వృద్ధిచేసుకోవడం. నాలుగు— వృద్ధిచేసుకొన్నది చక్కగా ఉపయోగించు కోవడం.

రాజు తనరాజ్యం మంచిస్థితిలో వుంచుకోవాలంటే యితరుల రాజ్యాల అంతరంగిక స్థితులు బాగాతెలుసుకోవాలి. తనరాజ్యం రక్షించుకోవాలన్న యితరుల రాజ్యం స్వాధీనం చేసుకోవాలన్నా రాజుకు రాజ్యతంత్రం బాగాతెలుసుండాలి.

స్థావరజంగ మాత్మకరమైన వస్తువు ఏదేది యెంతవరకు పుట్టుచున్నదో అదియంతయు ప్రకృతి పురుష సంసర్గము వలన గలిగినది యని యెరుంగవలయును.

శాజ్ఞైనవాడికి తనయేల్బడికి సంబంధించిన కార్యాలోచన చేసుకోవడం యెంత అగత్యమో, శత్రువుల గుట్టుమట్టులు తెలుసుకోవడం అంత అగత్యమే.

సమస్త ప్రాణులయందును సమముగా నుండునట్టి పరమేశ్వరుని సమస్తము నశించినను నశింపనివాడని చూచువాడెవడో వాడే నిజముగా జూచువాడు.

స్వార్థ శ్రేయస్సును పరిత్యజించనివాడు, తన జన్మపరిస్థితులన్ని గ్రహించలేనివాడు సేవామార్గాన్ని అనుసరించలేడు.

తప్పులు చేయకపోవడం మనిషిగొప్పతనానికి గొప్పలక్షణం కాదు. చేసిన తప్పుల్ని దిద్దుకోగలగటం, తిరిగి అటువంటి తప్పును చేయకపోవడం — యివే మనిషి ఔన్నత్యానికి గుర్తులు.

నేర్పువలన సర్వార్థసిద్ధి కలుగును.

సమస్త ప్రాణులయందు సమముగానున్నట్టి ఈశ్వరుని తెలిసికొనుచున్నవాడు తనచేత తన్ను హింసించుకొనడు. వానివలన ఉత్తమమైన గతిని పొందుచున్నాడు.

కొందరు భయపెట్టే వస్తువును ద్వేషిస్తారు. మరికొందరు ద్వేషించే వస్తువునుచూచి భయపడతారు.

వ్యాపారములన్నియు ప్రకృతిచేతనే చేయబడుచున్నవి యనియు, ఆత్మ యేమియు చేయనివాడనియు చూచువాడెవడో వాడే తన ఆత్మను ఉపాధిరహితునిగా చూచువాడు.

రాజయినవాడు యెప్పుడేపని చేసినా నీతిశాస్త్రం చెప్పినట్లు చెయ్యాలి. ఈశాస్త్రం బాగాఅర్థంచేసుకున్న వాడికే ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి, కలుగుతాయి.

భూతపృథగ్భావమును వస్త్వైకదేశములలో విద్యమానమైయుండునట్లుతెలుసుకొనెడు వాడుఎవడో వాడుసమస్త ప్రపంచములును ఆవస్త్వైకదేశమువలననే ఉత్పన్నములైన వానిగా నెరింగి అప్పుడే బ్రహ్మసంపత్తిని పొందుచున్నాడు.

అనుభవించడంలోకంటె అనుభవంకోసం ఎదురు చూడడంలోనే మనిషి జీవితంలో ఎక్కువకాలం గడిచి పోతుంది.

పొగడ్తకంటె ప్రమాదకరమైన అసత్యంలేదు. సత్యాన్నిపూతపూసి అందించిన అసత్యం మరీప్రమాదకరమైంది.

నాశరహితుడైన భగవంతుడు కారణంలేని వాడగుట వలన శరీరమునందుండునట్లు కనబడుచున్నను కర్మములను చేయువాడుకాడు. కర్మఫలముల ననుభవించువాడుకాడు.

గొప్పపండితులు మాత్రమే అయినవారు చేసేరచనలు గొగ్గిపళ్ళ లాగ అసహ్యంగా ఉండడానికి, నిజంగా కవులయినవారు చేసేరచనలు ద్రాక్షగుత్తులులాగ ఆస్వాధ్యాలు కావడానికి శబ్దాలఅంతస్తు, ప్రయోజనం, ప్రయోగసరళి — ఈపరిజ్ఞానంలేక పోవడమూ, ఉండడమూ తప్ప మరేమికారణముకాదు.

రాజు తనపక్కవాని తరువాత రాజులుస్నేహం చేసుకోవాలి కోరి--ప్రయత్నించి మరీస్నేహం చేసుకోవాలి.

ఎట్లు ఆకాశము సమస్తవస్తువులలో సంయుక్తమై యుండినను సూక్ష్మమై యుండుటవలన ఆయావస్తువు స్వభావముల నంటనిదో అట్లు ఆత్మశరీరమందుండినను శరీరదోషములో సంబంధపడదు.

జీవితం క్షణికం — అని బాధపడతాం కాని ఎన్నిక్షణాలు యీ జీవితంలో వ్యర్థంచేస్తున్నాం మనం?

మన మంచితనాన్ని మనమే నమ్ముకోవడం మననీడలో మనమే ఆశ్రయాన్ని వెతుకున్నట్టు. యెంతవొంగినా మననీడ మనక్రిందనే మిగుల్తుంది. నీడకొరకు ఏమహావృక్షాన్నో ఆశ్రయిస్తే యెండబారి నుంచి తప్పించుకోవచ్చు.

ఒక్కడైన సూర్యుడు ఈసమస్త లోకములను ప్రకాశింపచేయు రీతిగా క్షేత్రజ్ఞుడైన ఆత్మక్షేత్రములైన సమస్త శరీరములను ప్రకాశింపచేయుచున్నాడు.

మూఢుడగువాని ప్రయత్నము వంటచెరకుకై యింటివాసములను పీకివేయుట వంటిది. తెలివిగలవాని ప్రయత్నము మర్రివిత్తనము పాతి కొండవంటి చెట్టుగా చేయుటవంటిది.

ఎన్ని గ్రంథాలు చదివావు అనేది ప్రశ్న కాదు. ఎటువంటి గ్రంథాలు చదివావు? మంచి స్నేహితుల్ని ఎన్నుకున్నట్లే మంచి గ్రంథాలను కూడా జాగ్రత్తగా ఎంచుకోవాలి.

మనిషయినవాడు ప్రవృత్తి మార్గంలో నేను, నాది అన్న చిత్తవృత్తి దృఢపరచుకుంటేగాని ముందుకు వెళ్ళలేడు.

క్షేత్రక్షేత్రజ్ఞుల (శరీరం, శరీరతత్త్వముల నెరింగినవాడు) భేదమును, సమస్త భూతములకు గారణమైన అవ్యక్తమనెడి యవిద్యనుండి నివర్తించు ఉపాయమును యెవరు తెలుసు కొనుచున్నారో వారు పరమ పదమైన మోక్షమును పొందుచున్నారు.

మనిషీ, నిన్ను నీవు తెలుసుకో! విజ్ఞానం అంతా నీలోనే ఉంది.

రాజు తనతో సమానుడైనవానితో సంధిచేసుకోవాలి. తనకంటె తక్కువబలం కలవాడితో మాత్రం స్నేహం చేసుకోరాదు. యెవడూ కూడా యెలాంటి సందర్భంలోనూ కూడా తక్కువ వాడితో జట్టుకట్టుకోకూడదు.

జ్ఞానమునాశ్రయించి భగవంతునితో సామ్యమును పొందినవారలు బ్రహ్మసృష్టి కాలమందు కూడా జననము నొందరు. బ్రహ్మప్రళయమందునను కష్టముచెందరు.

వంటరితనాన్ని వాంఛించడం సామాన్యమానవుల లక్షణంకాదు. ఆకోరిక మూర్ఖులకూ కలుగుతుంది. మహాయోగులకూ కలుగుతుంది.

నూరుమంది పురుషులు చేరినచోట వొకబస ఏర్పడుతుందేమో గాని ఆడది లేనిదే ఒకగృహాన్ని నీవుసృష్టించలేవు.

కాలినలోహం కలిసిపోయినట్లు కష్టాల్లో మనుష్యుల మనస్సు తొందరగా కలిసిపోతాయి.

మనిషయినవాడు నివృత్తిమార్గంలో "నేను" "నాది" అన్న చిత్తవృత్తి చంపుకుంటేనేగాని ముందుకు వెళ్ళలేడు.

సమస్తయోనుల యందును ఏయేశరీరములు పుట్టుచున్నవో వాని కన్నిటికిని మహద్బ్రహ్మమైన ప్రకృతి తల్లివంటిది. భగవంతుడు బీజ ప్రదమైన తండ్రి.

ప్రధాన సమస్యలు అనేకమున్నప్పుడు వాటిలో యేది ప్రప్రథంగా పరిష్కరించు కొనవలసి ఉన్నదో నిర్ధారణ చేసుకోవడం అవసరం.

కాల్చనిలోహం లోహంతో అతుక్కోదు. రెండులోహం ముక్కలూ నిప్పులోపెట్టి కాలిస్తేనే అతుక్కుంటాయి.

సత్వగుణము నిర్మలమైనందున అదివస్తువుయొక్క యధార్థ స్థితిని ప్రకాశపరచునదియును ఆరోగ్యజనకమునై యుండును. అది సుఖమునందు, జ్ఞానమునందును ఆశక్తికలుగచేసి పురుషుని బద్ధునిగా చేయును.

ప్రేమోద్వేగములో స్పందించే హృదయం భగవంతుని పూల పాన్పు.

చట్టబద్ధమైన న్యాయము కొరకు కోర్టుల కెక్కడం పిల్లిని రక్షించుకోవడానికై పాడిఆవును పోగొట్టుకోవడంలా ఉంటుంది.

జాతికి సంస్కారం కలిగించగలవాడు, తద్వారా జాతికి ఉన్నతో, అవనతో కలిగించగలవాడు కవి.

తానే పొగుడుకుంటేకాదు. పైవారు పొగిడితేనే గుణవంతు డవుతాడు ఎవడైనా.

ఎట్టిసమర్థవంతులకైనను విఘ్నములు కలుగకమానవు. విఘ్న భయమున ప్రయత్నము మానుట అధమాధమ లక్షణము. విఘ్నము

వచ్చినప్పుడు కాళ్ళుచాచుట మధ్యముని లక్షణము. కార్యమును విడువక నెరవేరువరకు సాధించుట ఉత్తముని లక్షణం.

రజోగుణము ఇచ్ఛారూపమైనది. ప్రాప్తవిషయములందు ఆశక్తిని బుట్టించి ఆత్మను బంధించుచున్నవి.

తల్లిదండ్రులు, అప్పచెల్లెండ్రు, అన్నదమ్ములు మిగిలిన బంధు వర్గము వివాహమైన స్త్రీకి తరువాతే వారంతా నామమాత్రులే.

చక్కని దృశ్యము వంటిది మంచిసంభాషణ. అది యెంతటి నిరంతరమైనదో అంతటి కొత్తదనం, దిగ్భ్రమలను కలిగించే సొగసు కలదికూడా.

నీవు నవ్వుతూ నీచుట్టూ ప్రపంచాన్ని నవ్వించు.

తమోగుణము అజ్ఞానము వలన కలిగినది. సమస్త ప్రాణులకును విపరీత జ్ఞానమును పుట్టించునది. అది ప్రమాదాలస్యం నిద్రలచేత పురుషుని బంధించుచుండును.

దోపిడీనుండి, పీడననుండి స్వేచ్ఛ; నిరుద్యోగం, దారిద్ర్యం, ఆత్మిక దాస్యనుండి స్వేచ్ఛ; ఉత్పత్తి సాధనాలవిషయములో ప్రజల సమానత్వం; సర్వులకు సమానమైనహక్కు.

కాలాన్ని మించిన నియంతలేదు.

రచన గొప్పదైతే వికాసం జాతికి. తత్కర్తకుకాదు. రచన చెడ్డదైతే నష్టం జాతికే. అది కర్తకుకాదు.

సత్వగుణము కేవలం సుఖములందును, రజోగుణము కేవల కర్మములందును, తమోగుణము కేవలం విపరీత వ్యాపారములందును ప్రవర్తింప చేయుచున్నవి.

సహనం లేక ఓపిక అనేది ఒకమహత్తర శక్తి. కాలాన్ని, సహనాన్ని రంగరించి పట్టుపురుగు, ఉప్పు నేరేడు ఆకును వెలలేని పట్టుదారంగా మార్చగలుగుతూవుంది.

లోకాలన్నీ సంతోషపెట్టగల కూతపుట్టేదాకా కోకిల మౌనంగా కాలం గడుపుతుంది.

సత్వరజస్తమోగుణములు దేహమందుండినను ఒక్కొక్క సమయమున రజస్తమోగుణములను నణచిపెట్టి సత్వం బధికవించియు, సత్త్వతమోగుణములను తిరస్కరించి రజోగుణము ఉద్రేకము చెందియు, సత్వ రజోగుణములకు తలనెత్తకుండాచేసి తమోగుణము విజృంభించి యుండును.

ఒకే గమ్యస్థానంవైపు సాగేరకరకాల బాటలవంటివే మతాలు. అదే గమ్యస్థానం జేరుకో కలిగినపుడు ఏబాటననుసరిస్తేనేం ? నిజానికి వ్యక్తులెందరున్నారో అన్ని అసంఖ్యాకమతాలున్నాయి. వివిధమతాలు పరిఢవిల్లుతున్నంత కాలం ప్రతిమతానికి ఒక విభిన్న ప్రత్యేక చిహ్నం అవసరం. అయితే ఆచిహ్నాన్ని మరొకమతంకంటే తమ మతం గొప్పదని ఆధిక్యం కలదని రుజువు పరుచుకోడానికి ఉపయోగించుకునే ఆయుధంగా మారినట్లయితే మాత్రం పరిత్యజించాలి.

దేహమునందలి శ్రోత్రాది జ్ఞానమార్గములందు యధార్థమును ప్రకాశింపజేసెడి తత్త్వజ్ఞానము శమసుఖాదులును యెప్పుడు కలుగునో అప్పుడు సత్వగుణమే ప్రబలమని యెరుంగవలయును.

బాహ్యాడంబరములలోగాక అంతశ్చేతనముద్వారా మానవుడు మోక్షమునుసాధించాలి.

డబ్బునే దైవంగా భావించుకుంటే అది నిన్ను పిశాచంలా పీడుస్తుంది.

మహాపురుషుడంటే ఎవరు? మానవత్వంలోని ఉత్తమగుణాలకు ప్రాతినిధ్యం వహించే ప్రతినిధి.

గొప్పవ్యక్తులు ఆశయాలకై జీవిస్తే దుర్భలులు ఆశలుకొరకు జీవిస్తారు.

విపరీతబుద్ధి వినాశకాలమునకు హేతువు.

ఎప్పుడు దేహమందు లాభమును వ్యర్ధచేష్టలును, కర్మాసక్తియును ఆశమ స్పృహాదులును కలుగుచున్నవో అప్పుడు తమోగుణము వృద్ధిజెందినదని యెరుంగవలయును.

మనవాళ్ళనమ్మకం, చదువు సంస్కారంకోసం అనికాదు. పొట్ట కూటికోసమని. ఇప్పుడు మనదౌర్భాగ్యానికీ, పతనానికి యిదేబీజం.

అగ్నే, నీరు, తాచుపాము, రాజు, మూఢుడూ, స్త్రీలు — వీరిని చాలాజాగ్రత్తగా చూచుకుంటూ వుండాలి. వీలుతప్పిందా ఎప్పటి కప్పుడే ప్రాణాలు తీసేస్తారు. నిర్దాక్షిణ్యంగా.

నాఅంత విజ్ఞానిలేడని గర్వించడమే గొప్పఅజ్ఞానం.

అజ్ఞానమును ఆలస్యమును అనవధానమును విపరీత జ్ఞానమును ఎప్పుడు కలుగుచున్నదో అప్పుడు తమోగుణము వృద్ధిచెందినదని ఎరుంగవలయును.

ఎప్పుడూ సుఖంగా ఉన్నట్లు విరగబడి నవ్వుతూ కనిపించే మనిషిగుండెల్లో ఎటువంటి అగ్నిపర్వతాలు రగులుతున్నాయో నీకెలా తెలుస్తుంది.

సత్వగుణం బుద్రేకమైనప్పుడు మరణమునొందెనేని ఉత్తమ

జ్ఞానము కలవారల యొక్క నిర్మలమైన కులమునందు జన్మించు చున్నాడు.

ప్రేమ ప్రాతిపదికపై సర్వమానవ సమానత్వంగల సమాజ వ్యవస్థ ఏర్పడాలి.

సంతోషమనేది నీడను సృష్టించని అతిసన్నటి సూర్యకిరణం లాంటిది. కానీ దుఃఖం వరదల్ని సృష్టించే జడివాన.

"నేను'' అహంకారమేగాని 'నాది' అన్న మమకారం పుట్ట లేదు మనకింకా.

రజోగుణం బతిశయించిన దశలో మృతిచెందెనేని స్వర్గాదిఫల మును గోరి కర్మలనాచరించు వారల కులమున పుట్టును. తమోగుణం బధికరించునపుడు దేహత్యాగము చేసెనేని పురుషార్థమునకు యోగ్యత లేని శ్వానవరాహాది నికృష్ట యోనులయందు ఉద్భవించును.

ఒక్కొక్క నీటిచుక్కపడ్డా క్రమంగా బిందె నిండిపోతుంది. విద్యలు నేర్చుకోవాలన్నా డబ్బుగడించుకోవాలన్నా, ధర్మం చేసు కోవాలన్నా యిదేసూత్రం.

రాజు తనకంటె బలవంతుడైనవానితోను, తనతో సమానమైన వాడితోనూ కూడా యుద్ధం చేయకూడదు.

సాత్త్విక కర్మలకు సత్వ ప్రధానమైనట్టి సుఖరూపమైన జ్ఞానమే ఫలము. రాజ సకర్మమునకు దుఃఖప్రాప్తియే ఫలము. తామస కర్మము లకు అజ్ఞానమే ఫలము.

సత్త్వగుణము వలన నాత్మస్వరూప సాక్షాత్కార జ్ఞానమును, రజోగుణము వలన ప్రమోదమోహ అజ్ఞానములను సంభవించు చున్నవి.

పాటపాడుతూ కులాసాగా పనిచేసే తేనెటీగవలె బ్రతకటం నేర్చుకో.

ప్రపంచంలోకెల్లా యిద్దరే మంచివ్యక్తులు - మరణించినవాడు, పుట్టనివాడు.

సత్వగుణ సంపన్నులు ఊర్ధ్వములైన దేహాదిలోకములను చెందు చున్నారు. రజోగుణయుక్తులు మధ్యమున దేవమనుష్యాది జన్మములందా తిరుగుచుందురు. తమోగుణ వృద్ధిగలవారలు నికృష్టగుణ క్రియల నాశ్ర యించి శ్వానాది జన్మములను నరకమును బొందుదురు.

తెలుగువారి ప్రతిభా, ప్రాగల్భ్యాలు తెలుగువారు అర్థంచేసుకో గలరు. కాని అంగీకరించలేరు.

బంధాలెన్నో వున్నాయిలోకంలో. కాని ప్రేమబంధానికి చాలింది లేదు.

విద్యకుతోడు లౌకికజ్ఞానము లేకున్నచో ముప్పువాటిల్లును.

ఏవివేకి గుణములే కర్తగాని వేరుకర్తలేదనియును, గుణములకు విలక్షణమైన తాను సాక్షీభూతుడే గాని కర్తకాదనియును ఎరుంగునో అతడు దేవుని స్వరూపమును పొందుచున్నాడు.

ఔదార్యంలేని ఐశ్వర్యం వ్యర్థం. దానితో యితరుల నాదుకున్న పుడే దాతకది ఒక అదృష్టంగా పరిణమిస్తుంది.

శత్రువు ఒకరాజుమీదకు దండెత్తి వచ్చినపుడు ఆరాజు కంగారు పడిపోయి ఆశత్రురాజుతో సంధిచేసుకోకూడదు. తన రక్షణ విషయమై బాగా జాగ్రత్తపడుతూ శత్రుసేన యెంతవుందో, శక్తి ఎంతటిదో,

ధనస్తోమత ఏపాటిదో పరిశీలించాలి. శత్రువే వోడిపోయే పరిస్థితిలో వుండవచ్చు.కనక రాజు ఎటూ తొందర పడకూడదు.

దేహసముద్భవములైన సత్త్వ రజస్తమోగుణములు అతిక్రమించు వాడెవడో వాడు జన్మ మృత్యుజరాదుఃఖములచే విముక్తుడై అమృతత్వ మును బొందుచున్నాడు.

ప్రతీబాలిక ఒకనాడు గృహిణి అవుతుంది. భగవంతునియందు భక్తి, భర్తయందనురాగము, పెద్దలయెడల గౌరవము, అతిథిసత్కా రము, ఆపదలోవున్న వారిని ఆదుకోవడం — యివన్నీ నేర్పగలిగినదే నిజమైన విద్య.

నీమాటలకంటె నీచేతలు బిగ్గరగా మాట్లాడగలవు.

నీవు మెలకువగా వుండేరాత్రి మొదటిఝాములో నీవుచేసిన తప్పు లను గురించి ఆలోచించుకో. ఇతరుల లోపాలను గురించిమాత్రం నీవు నిద్రపోతున్న మిగతమూడు ఝాములు ఆలోచించినా పరవాలేదు.

సత్వగుణ కార్యమైన ప్రకాశమును, రజః కార్యమైన ప్రవృత్తి యును, తమఃకార్యంబైన మోహమును, ఆత్మ తన వస్తువులయందు ప్రవర్తించు నప్పుడుగాని నివర్తమైన పోవునప్పుడుగాని వానియందు త్రిగుణాతీతుడు ద్వేషముగాని, రాగముగాని పొందకుండును.

నీవు జీవితాన్ని ప్రేమిస్తున్నావా ! అయితే కాలాన్ని వ్యర్థం చెయ్యకు ! కాలంవల్లనే కదా జీవితం తయారయింది.

సనాతనుల దృష్టిలో సంస్కృతం నేర్చినవాళ్ళే చదువుకున్న వాళ్ళు. అధునాతన దృష్టిలో యింగ్లీషు నేర్చినవాళ్ళే చదువుకున్న వాళ్ళు. ఆసనాతనులు, అధునాతనులు కూడా అచ్చంగా తెలుగు—వాళ్ళే

మళ్ళీ. కాని వారి ఉభయులకూ గూడా తెనుగు తమ మాతృభాష అన్న అభిమానములేదు, జ్ఞానమూ లేదు.

లోకంలో — అన్నమూ, నీరూ, మంచిమాటా యీ మూడే ముఖ్యమైనవి.

రాగద్వేషములు లేకుండుటచేత గుణములయందును గుణ కార్యములందును, ఉదాసీనుండై యీ కార్యములన్నియు త్రిగుణముల యొక్క వ్యాపారములే యని యెంచి తాను చలింపక యుండును.

వెదజల్లనిదే అంతగా ఉపయోగపడని యెరువు వంటిదే ధనం.

నీటిపక్షి కూతవల్ల కదలని పక్షులు అదిలేచి పైకెగిరినప్పుడు తామూ ఎగిరి దాన్ని వెంబడిస్తాయి. మాటలకన్నా చేతలకే ఎక్కువ విలువ.

తెలుగువాళ్ళు సర్వవిషయాల్లోనూ తీసికట్టే. తమలో తాము గోతులు తవ్వుకోవడంలో తప్పించి.

వివేకము గల్గియుండుయును సమయానుకూలముగా వర్తింపనిచో ప్రమాదము వాటిల్లును.

మానవుడు చలింపకుండుటవలన నతడు స్వరూప నిష్ఠలోనే సంతుష్టిచెందును. సుఖ దుఃఖములందును, కాంచన పాషాణముల యందును సమచిత్తుడగును. ఇష్టానిష్టములను తుల్యముగా దలచును. ప్రకృత్యాత్మ వివేకములో ధీరుడై దూషణ భూషణలయందు మనో వికారం లేనివాడగును.

విజ్ఞానితో ఒకరోజు సంభాషించటం నెలరోజులు పుస్తకాలు చదవటంతో సమానం.

"ఈపని చేయటంవల్ల ప్రమాదముందా" పిరికితనం అడిగే ప్రశ్న. ఈ "దానివల్ల నాకు కలిగే లాభమేమిటి" స్వార్థంతో అడిగే ప్రశ్నయిది. "పదిమంది యీపనిని మెచ్చుకుంటారా" స్వాతిశయం అడిగే ప్రశ్న అది. "ఈపని మంచిదా ? చెడ్డదా ?" అంతరాత్మ అడిగే ప్రశ్న అది. ఆప్రశ్నలకు సమాధానం అక్కడే వినిపిస్తుంది.

దీపం వెలిగితే చీకటి మాయమవుతుంది. చీకటంత వుంటుందా దీపం?

మానవుడు మానావమానములను, శత్రుమిత్రులను సమముగ దలచువాడై, సర్వకర్మ పరిత్యాగియునై యుండును. అట్టివాడే సత్వ రజస్తమో గుణములకు అతీతుడని చెప్పబడుచున్నాడు.

శక్తిలేని రాజు బలవంతుడైన రాజు నాశ్రయించుకోవాలి. శత్రువు బలవంతుడైతే అతనితో యుద్ధం పెట్టుకోవడం ఏమాత్రమూ మంచిదికాదు.

ఆదర్శం నిలుపుకోలేని మనిషి అభివృద్ధిని సాధించలేడు.

సత్త్వరజస్తమోగుణములకు అతీతుండైనను అనాదియైన దానన చేదేవుని విషయమైన తలంపు బాధింపబడును. కనక అచంచలమైన భక్తితో ఎవడు భగవంతుని భజించుచున్నాడో వాడు త్రిగుణాతీతమైన బ్రహ్మస్వరూపప్రాప్తికి అర్హుడగుచున్నాడు.

దుష్టులలో తారతమ్యాలుండవు. వారిలో ప్రతిఒక్కడూ అవిధేయుడైన కొడుకుగానే జీవితాన్ని ప్రారంభించి వుంటాడు.

తెనుగువాడు సాటితెలుగువాణ్ణి నమ్మలేడు, ప్రేమించలేడు, బలపరచలేడు. తనకు ప్రయోజనం లేకపోయినా పడగొట్టకుండానూ వుండలేడు.

అన్నంకంటె పిండిపదిరెట్లు బలకరం. పిండికంటె పాలు పదిరెట్లూ, పాలకంటె మాంసం పదిరెట్లూ బలకరం. మాంసంకంటె పది రెట్లు బలకరంనెయ్యి.

ఆనందమయములైన అమృతమువలె భోగ్యమై బ్రహ్మస్వరూప మునకును, శాశ్వతంబయిన ధర్మమునకును. ఏకాంతిక సుఖమైన మోక్షానందమునకును భగవంతుడే ప్రతిష్టాస్థానమై యున్నాడు కనుక ఆత్మప్రాప్తిని భగవంతుని భజనముచేత పొందవచ్చును.

స్వతంత్రంగా మసులుకోవడానికి రాజుకిశక్తిలేనప్పుడు మరె వ్వణ్ణో ఒకణ్ణి ఆశ్రయించుకొని తిరగవలసిందేతాను, తనలాగే దుర్బలు డైన మరొకరాజును మాత్రం ఆశ్రయించుకో గూడదు.

రాజుకీ అగ్నికీ భేదంలేదు. కనుక రాజు నాశ్రయించుకునేవారు రాజుకు ఎప్పుడూకూడా దగ్గరగానూ వుండకూడదు. దూరంగానూ వుండకూడదు. అందీ అందనట్టుండాలి.

సంసారమనెడి వృక్షముయొక్క స్వరూపమునుగాని, ఉత్పత్తిని గాని, నాశమునుగాని, ఆధార ప్రదేశమునుగాని, యెరుంగశక్యము కాదు. నాలుగు ప్రక్కల వేరునాటి స్థిరంబైయుండెడి ఈ వృక్షమును వైరాగ్యబద్ధముచేత భేదింపవలయును.

మానవ సమాజంలోని అసమానతలను తొలగించి ప్రపంచ ప్రజలందరి శుభమును ఆశిస్తూ మానవుడు సమన్వయమూర్తి కావాలి.

పరిశ్రమలో అదృష్టం రాణిస్తుంది.

రాపిడిలేనిదే రత్నం ప్రకాశించదు. అలాగే కష్టాలను తట్టుకో లేని మానవుడు ఏనాటికీ పరిపూర్ణతను పొందలేడు.

ఒక్కొక్కసీమలో ఒక్కొక్క జీవకళ ఉంది. తెనుగు రక్తంలో అన్నీ ఒకచోటికి చేరగల — అన్నీ వొక్క తెనుగువాడి రక్తంలో నిరూపించగల మొనగాడు పుట్టుకు రావాలి.

సూక్ష్మబుద్ధిచే సాధింపదగని కార్యములేదు.

భగవంతుని శరణము పొందిన జ్ఞానవంతులును మానమోహములు లేనివారును, పుత్రమిత్రాది సంపర్క దోషరహితులును, ఆధ్యాత్మజ్ఞాన సంపన్నులును, కోరికలు లేని వారును, సుఖదుఃఖాది ద్వంద్వ విముక్తులై నాశరహితంబైన యాపరమస్థానమును పొందుచున్నారు.

మానవులు తమ సలహాలిచ్చినంత ఉదారంగా మరిఏమీ యివ్వరు.

పువ్వుల్లో సువాసనా, నువ్వుల్లో నూనె, కర్రలలో నిప్పు, పాలల్లో నెయ్యి, చెరకుల్లో బెల్లమూ వున్నట్లే జ్ఞానుల దేహాల్లో ఆత్మ వుంటుంది.

ఏఒక్కడూ కూడా డాబుగా వేషం వేసుకుని తిరగడం మంచిది కాదు. అలా వేసుకోవడం చిక్కులు కలిగిస్తుంది. వేషధారణలో వినయం కనిపించాలి. అసభ్యంగా వుండకూడదు.

శాశ్వతంబైన భగవంతుని యంశమే లోకమునందు జీవస్వరూపమై యున్నది. అట్లుండియు కర్మవశంబుచే ప్రకృతి పరిణామమైన శరీరమునందుండెడి అంతకరణమును జ్ఞానేంద్రియములను ఆకర్షించుకొనుచున్నయవి.

వయస్సు మీదపడుతున్న కొలదీ జీవితసౌఖ్యం తగ్గిపోతుంది. కాని జీవితంమీద వ్యామోహం పెరుగుతుంది.

నెలరోజులు గ్రంథపఠనంతో సంపాదించే జ్ఞానాన్ని పండితుడితో గంటకాలం సంభాషించడం తోనే పొందవచ్చు.

సంతోషం అనేది నిజంగా అమృతం. దాంతో తృప్తిపడేవాడికి కలిగే సుఖమూ, శాంతీ ఈరెండూ ధనలోభికీ, దానికోసం, దీనికోసం, పరుగులు తీసేవాడికీ ఎన్నడూ లభించవు.

పరిమళమునకు స్థానమైనపుష్పము లందుండి దాని సూక్ష్మాంశము పైన వాసనల మాత్రము వాయువు గ్రహించుకొని పోవునట్లు, దేహేంద్రియములకు ఈశ్వరుడైన జీవుడుశరీరమునుండి ఉత్క్రమించునపుడు సూక్ష్మములైన ఈ యింద్రియములను గ్రహించుకొని పోవుచున్నాడు.

నాస్తికత్వంమానవుని జీవితంలోనేగాని హృదయంలో కానరాదు.

తెలుగుభాష — మధురాతి మధురమైన తెలుగుభాష - తెలుగు జాతివాళ్ళు చిన్నచూపే చూస్తూవుండినా, మాధుర్యం గుర్తించి శక్తిని అవగాహన చేసుకుని పాశ్చాత్యులు కూడా ముక్తకంఠంతో కీర్తించిన తెలుగుభాష.

వ్యసనాల్లో తగులుకున్నవాడికి ఏకార్యసిద్ధికాదు. వ్యసనం ఒక్కటయినా వున్నవాడేపనీ సాధించుకోలేడు. ఏదయినా పనిచెయ్యాలనుకునేవాడు — చేసి లాభం పొందాలనుకునేవాడు ఎప్పుడూ వ్యసనాలకు లోబడిపోగూడదు.

జీవుడు శ్రోత్రనేత్ర స్పర్శరసనాఘ్రాణ మనస్సులను వానివాని విషయములందు ప్రవర్తింప చేయుటకు తగినవిగా చేసికొని శబ్దాది విషయముల ననుభవించుచున్నాడు.

చాలా తక్కువమందిమాత్రమే తమ సేవకులవల్ల మెప్పుపొందగలరు.

ఒకసారి అంతర్థానమైన నమ్రతకు తిరిగిరావడం తెలియదు.

స్త్రీ తన స్త్రీత్వ విశేషమును విడిచిపుచ్చి పాపమతియై ఉత్తమ ధర్మమునకు భంగము కలిగించునపుడు ఆ స్త్రీని చంపవచ్చును.

కొత్తసంగతులకు వీపు చూపిస్తాడు పిరికిపంద. సహనవంతుడు కొత్తసంగతులమధ్య ఉరికి ముందుకు ఉరకలువేస్తాడు.

సంపదమీద ఆధారపడకు. సత్ప్రవర్తనమీద ఆధారపడు,

ఆత్మను తత్వజ్ఞానములేనివారలు శరీరమునుండి వెడలునపుడు గాని, శరీరమునందున్నప్పుడుగాని, విషయముల ననుభవించునప్పుడు గాని, శరీరమునందు అన్యమైనవానిగా నెరుగజాలరు. ఇవి అన్నియును జ్ఞానదృష్టి గలవారలకే వేద్యములగును.

సమాజంలో జీవిస్తూ సమాజంనుండి వేరుపడి ఎవ్వరూవుండలేరు.

తన తెలివితేటల్ని నిరూపించే ప్రయత్నంలోనే సాధారణంగా మనిషి తెలివితక్కువతనం బయటపడుతుంది.

నీవు నీ శత్రువుకొరకై రగిల్చినమంటలు మూడువంతులు నిన్నే కాల్చేస్తాయి.

తెలుగు నా సొంతభాష — మొదటిమాట నాతల్లి. నా జీవశక్తికి జతచేసిన నాకు వాగ్ధార ఆవిర్భవింపచేసిన సంజీవినిఅన్న ఆత్మీయతా, మమతా, ఉద్బోధాలు చేసుకోవాలిముందు. అప్పుడుగాని ఏ తెలుగు వాడికీ నిండుప్రాణం వుందని చెప్పడానికి వీల్లేదు.

ధ్యానాదులచే తగిన యత్నములు చేయుచున్న యోగులు కొందరు దేహాంతర్గతుండైన యాత్మను తెలుసుకొందురు. ప్రయత్నములుచేసియును చిత్తశుద్ధిలేని యవివేకులు యీఆత్మను తెలుసుకొనజాలరు.

మనిషికుండే శక్తులు రెండురకాలు. సహజంగా పుట్టుకతో వచ్చేవికొన్ని సాధనవలన సమకూరేవి కొన్ని.

నాతెనుగుభాష యుగయుగాలు ప్రవాహం అయివుండినది. నాతెనుగుభాష సరస్వతికే తేనెచినుకు లందించింది. నాతెనుగుభాష యెక్కడ పట్టినా చక్రవర్తుల రాజ్యాంగాలు నడిపింది. నాతెనుగుభాష స్వతంత్రముగా బతగ్గలది.

ఏతేజస్సు సూర్య సోమాగ్నులయందు అంతర్గతంబై సమస్త లోకములను ప్రకాశింపజేయుచున్నదో ఆతేజస్సు భగవంతునియొక్క సంబంధముగల దానిగా నెఱుంగుము.

సుఖములను ఎలాసంతోషముతో అనుభవిస్తామో అలాగే కష్టాలను ఎదుర్కోవాలి.

డబ్బుఎరచూపిస్తే లోభివశపడతాడు. చేతులుజోడిస్తే ఎంతటి అహంకారికూడా స్వాధీనమవుతాడు. వాడు చెప్పినట్లల్లా నడుచుకుంటే మూర్ఖుడు లొంగిపోతాడు. పండితుడు మాత్రం ఒక్క సత్యానికి వశం అవుతాడు.

ఇంద్రియాలు జయించుకోనివాడికి ఏపని గట్టెక్కదు. ఇంద్రియాలు చాల బలమైనవి. తనకు కార్యసిద్ధి కావాలనుకునేవాడు తప్పకుండా యింద్రియాలు లొంగదీసుకోవాలి.

భగవంతుడు భూమియందు ప్రవేశించి అతని బలముచేత సమస్త భూతములను ధరించుచున్నాడు. అట్లే రసస్వరూపియైన చంద్రుడై భగవంతుడు ఓషధులను పోషించు చున్నాడు.

మనిషి ఎదుటి వారికి దారాళంగా దానం చేసేవాటిలో మొదటిది సలహా.

తాను వ్రాసే గ్రంథం తనలో ఒక పరిపూర్ణభాగం. అని రచయిత భావించని పుస్తకాలు, తన రచనకు ప్రసవవేదనలాంటి శ్రమను పడని పుస్తకాలు — రచయిత ఉద్దేశాలు యెంత సదుద్దేశాలైనప్పటికి కూడా — సాధారణంగా అవిచాలాతక్కువరకం పుస్తకాలవుతాయి.

ప్రాణాలయొక్క శరీరములను ఆశ్రయించి జఠరాగ్ని స్వరూపుడై భగవంతుడు ప్రాణాపానములతో చేరుకొని వారు భుజించెడు ఖ్యాధ్య, బోష్యలేహ్యాపేయములైన చతుర్విధ పధార్థములను పచనము చేయుచున్నాడు.

తెనుగుభాష — సరస్వతి వాగ్విలాసం అది. అసూయాజనకమైన మాధుర్యం దానిది. ఖండాని కంతకూ ఏకైక మధురిమం అది.

దుష్టుడెల్లవేళల సజ్జన వ్యతిరేకి. సత్కార్యములను చెరుచువాడు.

ప్రాణకోటి సంతను కాలమే పెంచుతుంది. కాలమే తుంచుతుందికూడా. విద్రించినవాడ్ని కాలమే మేలుకొలుపుతుంది. కాలం ఉల్లంఘించడం ఎవరికీ తరంకాదు.

సమస్తభూతములకును ప్రవృత్తి, నివృత్తి జ్ఞానప్రదేశంబైన హృదయకమలమందు భగవంతుడు అంతర్యామియైయుండుటచేత వారలకు స్మృతియును, జ్ఞానమును, మోహమును కలుగుచున్నది. కనుక వేదవేద్యుండును, వేదహిత ఫలప్రదుండును, వేద విదుండును భగవంతుడే.

కారుమబ్బు, కాంతిరేఖలాగ చెడూ, మంచీ కొంత కలిసే వుంటుంది.

వృద్ధాప్యంమీద పడుతున్న వివేకంతోపాటు మూర్ఖత్వంకూడా పెరిగేప్రమాదం వుంది.

మొదట మనం ఆంధ్రులంకనక తరువాత భారతీయులం.

చెడురాజు ఏలుబడికంటె అసలు ఎలాంటిరాజరికం లేకపోవడమే మంచిది.

ఈ లోకమునందు క్షరుండనియు, అక్షరుండనియు పురుషులు యిరువురు కలరు. ఆ యిరువురిలో ప్రకృతి సంబంధముగల ప్రాణి సముదాయము క్షరుడు. ప్రకృతిసంబంధరహితుడై స్వయముగానే యుండెడి ముక్తస్వరూపుడే అక్షరుడు.

తనకుతానే చట్టమయినపుడిక వేరేచట్టాల ఆవశ్యకతలేదు.

తొందరపడి ఏమీఆలోచించుకోకుండా ఏపనిఅయినా చేసే వానికూ్కడా ఏపని నెగ్గదు. అందువల్ల అనేక విధాలయిన చిక్కులు, విఘాతలు మాత్రం చుట్టుకుంటాయి. కనక ఏదైనా ఒకపనిచేసి దాని ఫలం అనుభవించాలనుకునే వాడికి తొందరపాటు పనికిరాదెప్పుడూ.

క్షరాక్షరులకంటె అన్యుండును, విలక్షణుండును, నాశరహితుండును, నియామకుండును, ముల్లోకములయందు ప్రవేశించి వానిని భరించువాడునునైన ఏ పురుషోత్తముడో కలడో అతడు శ్రీమన్నారాయణమూర్తియైన పరమాత్మయని చెప్పబడు చున్నాడు.

రాజు వేట అనే వ్యసనములో పడ్డాడా ఆరాజు ధనందారికే వృత్తులలో ప్రవేశించలేడు. దాంతోధనహీనుడున్నూ అయిపోతాడు. కనక ధర్మము, అర్థము సంపాదించుకోవాలనుకునేవాడు వేటకు వెళ్ళకూడదు.

తత్వశాస్త్రం అంటే సత్య పరిశీలకమైన శాస్త్రం.

నమ్రత ఒక ఆభరణమేకాదు. సద్గుణానికి కవచం కూడా.

కాలాన్నీ, పరిస్థితుల్నీ అర్థంచేసుకుని తదనుగుణ్యంగా జీవితాన్ని దిద్దినవాడే సుఖంగా బ్రతకగలడు.

కాలాని కొక్కటేపని. అదిరావడం వచ్చివెళ్ళిపోవడం నిజానికి రెండూ ఒకటే. కాన సావధికమైన మనుష్యుని దృష్టిలో వుందీ విభాగం.

భగవంతుడు క్షరపురుషునకు అతీతుండును, అక్షరపురుషునకన్న ఉత్కృష్టుండునునైనవాడు. కనుక లోకమునందును, వేదములందును. పురుషోత్తముడని భగవంతుడు ప్రసిద్ధిని పొంది యున్నాడు.

మెరుగురాయి బంగారాన్ని పరీక్షించినట్లు పనిషిని తరీక్షిస్తుంది బంగారం.

ప్రజలకేదో చెప్పాలని అతనికి వుండబట్టే, ఏదో వ్రాయాలని అతని బుర్రలోబాధ కలగబట్టే ప్రజల్ని విషయాలి, చూదాడు కాబట్టే తమను వర్ణించమని ఆలోచనలు మస్తిష్కంలో గోలపెట్టే రచయిత వ్రాస్తాడు.

సత్యంవల్లనే భూమి స్థిరంగావుంది. సత్యంవల్లనే సూర్యుడుతపిస్తున్నాడు. సత్యంవల్లనే గాలివీస్తుంది. సత్యంవల్లనే జగత్తంతా నిలిచి వుంది.

ఎవడు మోహవర్జితుడై క్షరాక్షర పురుషులకన్న విలక్షణుండైన పురుషోత్తముడన్ని భగవంతుని తెలుసుకొనుచున్నాడో ఆపురుషుడు సర్వము నెరింగినవాడు. కనక అతడు సమస్తమునకు ఆత్మయనెడి యధ్యవసాయముతో భగవంతుని భజించుచున్నాడు.

భయరాహిత్యము, చిత్తశుద్ధి, జ్ఞానయోగానుష్టానము, దానము, దమము, యజ్ఞము,వేదాధ్యయనము, తపోనిష్ట, ఋజుమార్గము, పరపీడా

వర్జనము, సత్యము, అక్రోధము, పరిత్యాగము, శాంతి, పరనిందారాహిత్యము, జీవకారుణ్యము, నిస్పృహత్వము, మృదుత్వము, లజ్జ, చపలరాహిత్యము, తేజస్సు, క్షమ, ధైర్యము, శుచిత్వము, పరానుకూలము, విగర్వము ఈ సమస్తగుణములును దేవతల సంపద నాశ్రయించి మంచి జన్మ ఎత్తినవారికే కలుగును.

ఎంతటివాడైనా మనిషి అన్న తరువాత లోటుపాట్లు ఉండకపోవు.

వివేకవంతులకు సుఖంగా బ్రతకడానికి ఎక్కువ సాధనసంపత్తి అవసరంలేదు. అవివేకులకు ఎంతటిసాధనసంపత్తి చేతికందినా సుఖం మాత్రం దూరంగానే వుంటుంది.

సత్యం యెదుట ఎలాంటివాళ్ళు ఒక్క అంతస్తులోనే ఉంటారు.

మనిషికి ఎలా కావలసివుంటే అలాంటి బుద్ధేపుడుతుంది. అలాంటి పూనికే కలుగుతుంది. సాయంకూడా అలాగే సమకూరుతుంది.

మద్యపానం చెయ్యడం ఒకవ్యసనమే. తాగుబోతు ఏపనిచెయ్యలేడు. కనకవాడు ఒకమనిషి అనిపించుకోవడానికే తగడు. ఆవ్యసనములో తగులుకున్నవాడు సమయా సమయాలు గుర్తించలేడు. కనక ద్రవ్యసంబంధమైన పనిల్లో తాగుబోతుకి ప్రవేశం నిషేదం.

డంబము, గర్వము, దురభిమానము, క్రోధము, కాఠిన్యము, పరుసదనము, అజ్ఞానము, ఈస్వభావములు, అసురసంపద నాశ్రయించిన జన్మము లెత్తినవారికి కలుగును.

స్త్రీ లౌల్యం ఒకవ్యసనమే. విషయాసకుడికీ — అంటే స్త్రీలోలుడికీ కార్యాలోచనకూ చాలాదూరం. తనరాజ్యం బాగుపడాలనీ, వృద్ధికావాలనీ అనికోరుకునే రాజు కాముకుడు కాగూడదు.

దైవసంపద మోక్షమునకును, అసురసంపద సంసారబంధము నకును హేతువులై వున్నవి.

మనలోపెద్ద తప్పులు లేవని నిరూపించడానికి చిన్నతప్పుల్ని బహిరంగంగా అంగీకరిస్తాము.

ఆత్మపరమైన నిరుత్సాహమును పోగొట్టడంకంటె శైలిలోని దోషాలను, నిర్మాణంలోని బలహీనతలను, యితరసాహిత్యం లోపాలను పోగొట్టుకొనడం సులభమే.

ఆత్మస్తుతి మంచిదికాదు. కాని — ఒక్కొక్కప్పుడు—ఒక్కొక్క చోట అదేచాలా అవసరం అవుతూవుంటుంది.

దైవసంపదయనియు అసురసంపదయనియు రెండువిధములైన సృష్టి ఈకర్మలోకమందు ప్రాణులకు నేర్పడియున్నది,

నిలుచుండిమాత్రమే లేచివున్నవారు కూడా సేవచేస్తున్నారు.

ఈ కాలం ఎలాంటిది? నామిత్రులెలాంటివారు? నాదేశం ఎలాంటిది? నారాబడి ఎంత? ఖర్చెంత? అసలు నేనెవణ్ణి? నాశక్తి ఏపాటిది? — మనిషయినవాడు ఈ సంగతులెప్పుడూ చర్చించుకుంటూనే వుండాలి.

పరుషంగా మాట్లాడ్డం, మనస్సుకి నొప్పికలిగేటట్టు మాట్లాడడం పుల్లవిరిచినట్టు మాట్లాడం నిప్పుతోకాల్చడంకంటె బాధ కలిగిస్తుంది. మధురంగా, మృదువుగా మాట్లాడాలి.

అసుర సంపదగలవాడు వైదిక ధర్మములందు ప్రవృత్తినిగాని, నివృత్తినిగాని, లేనివారలై కర్మములకు అనర్హులై శౌచాచార హీనులై అసత్యవంతులై యుందురు.

పొగడ్తచెల్లని నాణెమువంటిది. కళ్ళులేనివారి దగ్గరే అది చెల్లు తుంది.

ఏకవచన ప్రయోగం అంటే నౌకరిలోవుండేవారి నాలుక యెంత యినా నేర్పుచూపించగలదు. కాని చెవులుమాత్రం ఓర్పు కనపరచలేవు.

వాన నీటివంటి నీరులేదు. ఆత్మబలంవంటి బలంలేదు. కన్ను వంటి తేజస్సులేదు. అన్నంవంటి ఇష్టవస్తువున్నూలేధు.

అసుర సంపదకలవారు యీజగత్తును అసత్యమని పలుకు దురు. ధర్మాధర్మ ప్రతిష్టారహితంబని వాదింతురు. ఈశ్వరునిచే నియ మింపబడనిదియని చెప్పుదురు. కామోద్రేకమునే కారణముగా కలిగిన స్త్రీ పురుషుల యన్యోన్య సంయోగమే సృష్టికి హేతువుగానిలేదు. కార ణము ఏమియు లేదని చెప్పుదురు.

దినదినానికి జీవన ప్రమాణము అధికమైపోతున్న యీరోజులలో మధ్యతరగతి సంసారంలో ఎన్నియిబ్బందులువున్నా గృహిణి ఉన్నం తలో శుభ్రముగా ఉంటూ, కళకళలాడుతువుండాలి. ఆనాడే యింటికి నిండుతనం. పిల్లలకు పెద్దలకు సుఖశాంతులూను.

రాజుకి ప్రజలను దండించే అధికారంవుంది. కాని అతికఠినంగా మాత్రం శిక్షించకూడ దెప్పుడూ. రాజు దోషులను దండించవలసిందే కాని కాఠిన్యంమాత్రం పనికిరాదు. రాజు ప్రజలు తనని ద్వేషించే టంతగా ఎవరిని శిక్షింపగూడదు.

డబ్బు దుబారాచేసేరాజును లక్ష్మి విడిచిపెట్టి వెళ్ళిపోతుంది. డబ్బెప్పుడు ఖర్చుపెట్టాలో, ఎంత ఖర్చుపెట్టాలో, ఎప్పుడు ఖర్చు గూడదో అలాంటి విచారణ చేసుకోలేనిరాజు దరిద్రుడయి యెందుకూ పనికిరాకుండా పోతాడు.

మూఢులు నష్టాత్ములును, అల్పబుద్ధులునై హింసాది యుగ్ర కర్మల నాచరించుచు లోకనాశనమునకు కారణభూతులగుదురు.

గొప్ప అదృష్టాలు మనిషిలోని మంచిచెడ్డలును రెంటిని పదింతలు చేసి చూపెట్టగలవు.

గతం పరిశోధించుకునీ, వర్తమానం సమన్వయించుకునీ, భవిష్యత్తు నిర్ధారణంగా రూపించుకోవడం, అందుకుతగ్గ ఒక ప్రణాళిక వేసుకొని జాతిని ఆమార్గాన నడిపించడమూ — ఇదీ నాయకుని ముఖ్య విధులు.

అసురసంపద కలవారు అపరిమిత కోరికలుకలవారై అజ్ఞానముచే అసత్పరిగ్రహములను గ్రహించి ధనమాన మదాన్వితులై నిషిద్ధ కర్మములందు ప్రవర్తించుచుందురు.

గతించిపోయిన గంటలు మానవునికోసం తిరిగికొట్టమని ఎవ్వరూ గడియారాన్ని శాసించలేరు.

జ్ఞానం చిట్టచివరి అంచుఏదో, అజ్ఞానంమొదలు ఏదో విడమరిచి చెప్పగలిగేదే గొప్పజ్ఞానం.

రచయిత వినోదంకోసం, పేరుప్రతిష్టలకోసం వ్రాయడు. ప్రజలను బాగుచేయాలని, జీవితాన్ని మరింత వున్నతపథాలకు నడపాలని రచయిత భావించుతాడు. ఈ పోరాటంలో పుస్తకాలను ఒకనైతికఆయుధంగా అతను ఎంచుకున్నాడు.

వేశ్య డబ్బులేనివాణ్ణి చేరనివ్వకూడదు. ప్రజలు అసమర్థుడైన రాజును తోసిపారెయ్యాలి. పక్షులు పళ్ళులేనిచెట్లు విడిచిపోవాలి. అభ్యాగతుడైనవాడు భోజనంకాగానే తిన్నయిల్లు విడిచిపెట్టి వెళ్ళిపోవాలి.

మూఢులకోరికలు అపరిమితములై యుండును. వానిని సాధించుట కొరకు ప్రాకృత ప్రళయము వరకు చింతించినను సాధ్యముకాకుండును. అట్టిచింతను ఆశ్రయించి కామోద్దీపభోగమే పురుషార్థముగా దలచి యింతకన్న ఉత్తమ సుఖములేదని నిశ్చయించుకుందురు.

ఏదైనా ఒకకార్యము తలపెట్టినవారికి ఉపాయం సహాయం. ఉపాయమే కార్యసాధనానికి ప్రాణము.

మన లోపాల్ని కప్పిపుచ్చుకోవడానికి మనం చేసే ప్రయత్నమే గర్వంగా పుట్టి పెరుగుతుంది.

చదువు, కామధేనువు వంటిది. అకాలంలో కూడ మంచిఫలితాలు నిస్తుంది.

అసురసంపద కలవారు ఆశాపాశములచే నిబద్ధులై కామక్రోధ పరాయణులై పరద్రవ్యాపహరణాది అన్యాయమార్గముచే విషయానుభవ పూర్తికొరకు ధనసమూహము కొరకు నిశ్చయింతురు.

రాజు దుష్టులను శిక్షించాలి. శిష్టులను రక్షించాలి. ప్రజాపాలనం అంటే యిలావుండాలి. దండనీతిని అనుసరిస్తేనే యిదిసాధ్యం.

దృష్టికుశాగ్ర సూక్ష్మం కావడానికీ, చూపు నిశితం కావడానికీ, ప్రతి నవనవోన్మిషితం కావడానికి ఆశయాలు మహోన్నతాలు కావడాని ఆరంభాలు, నిస్వార్థాలు కావడానికి నగర జీవితం తోడ్పడుతుంది.

మానవుడు తలపెట్టిన ఏదైనాపని నెరవేరాలంటే అదృష్టం వుండాలి. అంటే దైవయోగం వుండాలి. ప్రయత్నం సాధనమాత్రమే. సిద్ధి స్వతంత్రంకాదు. దైవం అనుకూలిస్తేనే పని అతువుంది.

మూఢులు యింతమాత్రము ధనము సంపాదించితిమి, యీమనో రథమును పొందబోవుచున్నాము. ఇంతధనము వున్నది, యింత ధనము రాబోవుచున్నది, అని తలంచు చుందురు.

కాలాన్ని అర్థంచేసుకున్న మనిషి జీవితాన్ని అపార్థం చేసుకోలేడు.

సోమరితనం మనుష్యుని శరీరాన్ని తొలిచివేయగల చెదపురుగు. అన్ని దుర్గుణాలకూ మూలకందం. అనేక పాపాలకు ప్రేరణ. పిశాచాలు ముచ్చటలాడే విశ్రాంతి మందిరం. విషాదాలను భికించే ఊటబావి.

పసిపాపను ప్రేమించలేనివాడు భగవంతుణ్ణికూడా ప్రేమించలేడు.

అసురసంపదకలవాడు బలశాలినై యీ శత్రువును చంపితిని. ఇక యితర శత్రువులను గూడ చంపగలను నేనే యీశ్వరుడను. నేనే భోగిని. సంపన్నుడను, బలవంతుడను, సుఖిని అని పలుకుదురు.

దురదృష్టమన్న వజ్రపు పొడితో భగవంతుడు తన నగలను కున్న వ్యక్తులకు మెరుగుపెట్టుకుంటాడు.

సాంఘిక పరిసరాలు రచయిత భావాలను, జీవితాన్ని, రచనలను నిర్ణయించుతాయి. తన పరిసరాలకు, తనసమాజానికి దూరమైతే రచయిత స్వజనాత్మక కళవిషయంలో శుష్కించి చనిపోతాడు.

రోజుకోశ్లోకమైనా చదవాలి. పూర్తికాకపోయినా కొంతైనా చివరకో అక్షరమైనా చదవాలి. ఏదీ చదవకుండా వుండకూడదు. ఏదోటి ఎవరికో ఒకరికియిస్తూవుండాలి.

మూఢుడు ధనవంతుడనియు సత్కులజాతుండనియు, తనసరివాడు ఒక్కడూలేడనియు తలంచును. యజ్ఞముచేసెదనని నటవిటులకు

దానమిచ్చి సంతోషింతుననియు పలుకుదురు. అజ్ఞానముచే మోహితులై యుందురు.

పిల్లల విశుద్ధమనం; పలకాలమీద మొదట మహాపురుషుల రూపాలు అంకితంచెయ్యాలి. కాకీ, కుక్కల క్షుద్రరూపాలు కావు. విద్యాభ్యాసం ప్రారంభించిన కొత్తలో మధురము, సులభమూ, లలితమూ, రసబంధురము అయిన భాషగలగ్రంథాలు చదివించటమూ, వల్లింప చెయ్యటమూ మిక్కిలి అగత్యం.

మేధావిఅంటేఎవరు? స్పష్టంగా చూడగలిగిన మనిషి.

మనుషులు మసలుతున్న గృహంకంటె పాడుపడిన కొంప తొందరగా పాడైపోతుంది.

అసురసంపదకలవాడు అజ్ఞానమోహితులగుచు నానావిధ చిత్త విభ్రాంతములనుండి మోహజాలమందు చిక్కికామభోగాశక్తుడై ఘోరమైన నరకమును బొందుదురు.

ప్రేమాభిమానాలు — కోరికలు — ఆశలు — ఈ ఉద్వేగాలు హద్దు మీరితే మనుష్యుల్ని జయిస్తాయంటారు. కాని సోమరితనం ముదిరిన నాడు అది మనిషిలోని చైతన్యాన్నే హరిస్తుంది.

ఏ వుద్యమానికైనా జయం సంపాదించుకోవాలంటే యువకులనే కూర్చుకోవాలి. విజయ కీలకమైన రహస్యం యిది.

మనస్సులో అనుకున్నదెపుడూ పైకి చెప్పకూడదు. అది పరమ రహస్యంగానే వుంచుకోవాలి. అంతేకాదు. అనుకున్న పని వెంటనే చెయ్యాలికూడాను.

మూఢులు తమ్ముతామే గౌరవించుకొనుచు పెద్దలయందు వినయం

జాచరించక, ధనమాన మదాన్వితులై అశాస్త్రీయ యజ్ఞములను నామ మాత్రము చేయు చుందురు.

బాగా బ్రతకగలం అనేది మాలోవున్నవాళ్ళ రెండు రకాలు. ఒకటి దనికవర్గం, రెండు అవినీతివర్గం. కాలం సవాల్ చేస్తున్న పుడు మాత్రం ఏవర్గం అయినా లొంగిపోక తప్పదు.

దైవం అనుకూలించాలి; నిజమే. అయితే ప్రయత్నంకూడా వుండాలి. కార్యసిద్ధికి ప్రయత్నంచాలా అవసరం.

నీతి విచక్షణా, ధర్మపరాయణత్వమూ, ప్రజలయెడల వాత్స ల్యమూ, బలవంతుడై వుండడమూ — యిలాంటి యోగ్యతలుగల రాజే దండనీతితో అంతా భద్రంగా నడుపుకుంటూ తననీ ప్రజలనూ కూడా రక్షించగలడు.

అసుర సంపద కలవాడు నహంకార మమకార దర్పాన్వితులై కామక్రోధయుక్తులై సర్వాంతర్యామియైన భగవంతునియందు యసూయ లొందుచు సన్మార్గమునందుండెడి పెద్దల సద్గుణములకు ఓర్వజాలక దోషములను కల్పింతురు.

శ్రమజీవుల మానవతావాదం మానవజాతికి పటాటోపాలతో, వాచాలత్వంతో గూడిన తీపిమాటల్లో అందివ్వదు! దాని లక్ష్యం అల్లా ప్రపంచకష్టజీవులందర్నీ సిగ్గుమాలిన క్రూరమైన ఉన్మాదపూరితమైన పెట్టుబడిదారీ విధానపుచ్చులనుంచి విముక్తిచేయడం. తద్వారా మాన వులు తాము క్రయవిక్రయాలకు లోనయ్యే వస్తువులుకాదని గుర్తింప చేసేట్టు పాఠాలు చెప్పడమూ...... శ్రమజీవుల మానవత్వం లక్ష్యం — ప్రేమనుగూర్చిన భావకవిత్వం ప్రకటనలుకాదు. తమ జీవితాన్ని తామే మార్చుకోగల అధికారాన్ని సాధించేహక్కును, ఆ చరిత్రాత్మక కర్త వ్యాన్ని ప్రతికార్మికుడూ గుర్తించాలని శ్రామిక మానవత్వం డిమాండ్

చేస్తుంది. బాధల్ని సృష్టించే కారణాలన్నింటినీ ద్వేషించాలని కోట్లాది ప్రజలు కష్టాలమీదా వారిశ్రమఫలితంమీదా జీవించేవారిని ద్వేషించాలనీ శ్రామిక మానవత్వం కోరుతుంది.

భగవంతుని ద్వేషించినవారిని, నరాధములను తిరిగి సంసారమందు అసుర జన్మములందే నిరంతరము పుట్టునట్లుగా భగవంతుడు చేయుచున్నాడు.

పురుషుని జీవితంలో ప్రేమ ఒక సంఘటనమాత్రమే. కాని స్త్రీలో ప్రేమ ఆమె సంపూర్ణజీవితచరిత్ర.

వయసు పెరిగినంత మాత్రాన పెద్దతనంరాదు ముసలితనం వస్తుంది.

కొన్ని గ్రంథాలను రుచిచూచి వదలిపెట్టాలి, కొన్నింటిని అమాంతం మింగివేయాలి. మరికొన్నింటిని బాగా నమిలి జాగ్రత్తగా జీర్ణంచేసుకోవాలి. ప్రతివిద్యార్థి ఏగ్రంథాన్ని ఎలాపఠించాలో తెలుసుకోవాలి.

ఏపోట్లాటకైనా యిరుపక్షాలవారూ బాధ్యులే.

ఎక్కువకాలం బ్రతకడానికి జీవితానుభవం గడించడానికి సంబంధంలేదు.

మంచి అభిప్రాయాలు ఆలోచనలు వుండగానేసరిపోదు. వాటిని ఆచరణలో పెట్టగలగాలి.

అసుర యోనులయందు జనించినమూఢులు ప్రతిజన్మమునందును భగవంతుని పొందకయే విపరీతజ్ఞానము నాశ్రయించి యింతకన్న నీచతరమైన జన్మములను బొందుదురు.

విద్యావంతురాలైన స్త్రీ యింటికి, సంఘానికి చాలామేరకు వెలుగు. స్త్రీలు విద్యావతులు కానిదే సమాజం అభివృద్ధిజెందదు. స్త్రీజనాభ్యుదయము స్త్రీ విద్యతో సన్నిహితంగా పెనవేసుకొని పోయి వున్నది.

సముద్రంలో నదీనదాలన్నీ కరగి అదృశ్యమైనట్లు స్వార్థంలో తక్కిన మంచిగుణాలన్నీ కరగి మాయమై పోతాయి.

కామక్రోధ లోభములను మూడును నరకమును బొందుటకు ద్వారములు. ఇవి జీవునికి నాశహేతువు లయినవి. కనుక ఆ మూటిని మానవుడు త్యజించవలయును.

తమ మంచితనాన్ని ఆధారం చేసుకొని యితరులు తమను మోసం చేస్తారని భయపడేవాళ్ళు నిర్భయంగా నిశ్చితంగా బ్రతకలేరు.

సహజంగానే రచయిత వివరాలను గమనించే శక్తిగలిగి వుండాలి. ప్రతిదానిని అతడు వర్ణించలేని మాట నిజమే. వివరాలు తెలిసి వుండడంవల్ల అతడు తాను సృజించే పాత్రలను, వాటి పరిసరాలను, జీవితాన్ని విస్పష్టంగా చిత్రించగలడు.

రసికుల కానందానుభూతి కలిగించడానికి రచన చేస్తాడు కవి. జనులకు శీలసంపద అలవర్చడానికి ధర్మ నిర్ణయం చేస్తాడు కవి. జాతిని సన్మార్గాన నడిపించడానికి శాసనం చేస్తాడు కవి.

కామక్రోధ లోభములను విడిచిన పురుషుడు పురుషార్థ సాధనము నాచరించి ఉత్తమ గతిని బొందును.

ఈ ప్రపంచంలో కుతూహలంలేనివారు సాధారణ జన సమాజానికి కొంచెం పెడగా వుంటారు. సామాన్య ప్రజలలో వారు కలసి మెలసి వుండలేరు. సాధారుణుల అభిప్రాయాలతో వీరి అభిప్రాయాలు కలియవు.

ఊపిరి పీల్చడం జీవించడం కాదు. నీశక్తియుక్తుల్ని సక్రమంగా సమర్థవంతంగా వినియోగించుకోవడం.

స్వర్గాన్ని దగ్గరగా చూపించే దూరదర్శినివంటివి కన్నీళ్ళు.

శాస్త్ర విధిని నతిక్రమించి యిష్టప్రకారము ప్రవర్తించెడి పురుషుడు పరలోక హేతువులైన సిద్ధినిగాని, సుఖమునుగాని, ఉత్తమగతినిగాని, పొందడు.

సుదీర్ఘానుభావలనుంచి కుదించబడిన వాక్యాలే సామెతలు.

సౌఖ్యానికి తప్పుదారి మోసం. దుర్లవాట్లద్వారా మనంపొందే సుఖాల్ని మనం ముట్టుకోగానే అంతర్ధాన మయే మాయపూలగుత్తుల వంటివి.

ప్రమాదం ఎదుట పడేవరకు అందరూ ధైర్యవంతులే.

పాండిత్యము, కవిత్వం, చందశ్శిల్పం — యివ్వన్నీ పుష్కలంగా వుంటేనే పద్యం; లేకపోతే అదిముళ్ళడొంక లేక చేపలబుట్ట,

ఈ ప్రపంచంలో అనుకున్నవి యెప్పుడూకావు. అనుకోని సంఘటనలే హఠాత్తుగా జరిగిపోతూ వుంటవి.

ధర్మాధర్మములనెరుంగుటకు శాస్త్రమే మానవునకు ప్రమాణము. శాస్త్రవిహిత కర్మల నెరింగి వర్ణాశ్రమోచిత కర్మలను చేయుటకు మానవుడు అర్హుడై యున్నాడు,

పని మొదలు పెట్టడానికి ముందే బాగా ఆలోచించుకోవాలి. ఇదిగో! చెయ్యవలసినపని యిది. ఇది యిలాచేద్దాం. లా పూర్తి కావచ్చు! నని బాగా ఆలోచించిముందు నిశ్చయం చేసుకోవాలి.

రాజు దుర్బలుడేకావచ్చు, చేతగానివాడును కావచ్చు. అతణ్ణి రక్షించుకోవాలి. ఆదరించుకోవాలి. గౌరవించుకోవాలి. పూజించు

కోవాలి. అతనియాజ్ఞ శిరసావహించాలి. అతనిమాట కెవరూ అడ్డు చెప్పకూడదు.

వర్తమానానికి, భవిష్యత్తుకు పునాది గతించినకాలం.

శరీరానికి ఆరోగ్యం కావాలి. మనస్సుకు వివేకంకావాలి.

శ్రద్ధ అనునది ప్రాణులకు ప్రాచీనకర్మవాసనల ననుసరించి ఆయావస్తువునందలి ప్రీతిచేత కలిగినది. అది సాత్త్వికమనియు, రాజసమనియు, తామసమనియు, గుణభేదములచే మూడువిధములై యుండును.

గ్రామాలలోని స్త్రీలు మూఢాచారాలమధ్య నలిగి అవిద్యావతులుగా దుర్భరముగా జీవిస్తున్నారు. స్త్రీ విద్యావతి కానిదే సాంఘిక దురన్యాయాలను ఆచారాల పేరిట అమలులోవున్న పాక్షికమైన నీతులను, ధర్మాలను ప్రతిఘటించి తనసమాధిక్యతను సమాజంలో నిలబెట్టుకొనలేరు.

ప్రజల కరతాళధ్వనులందుకొన్నంతమాత్రాన ఆమనిషి గొప్పవాడని ఋజువైనట్లు కాదు.

పూర్వకవులపద్యాలలో వున్న జిగిబిగువు ఇప్పటివారి రచనల్లో ఏక్కడోకాని కనబడవు.

ఆడదాని అందానికి సార్థకతమగవాని ఆరాధనలోనే వున్నది.

డబ్బుకావాలంటే వృత్తులుండాలి. అదే డబ్బుకి మూలం.

సర్వప్రాణులకును వారివారి యంతఃకరణాను గుణముగా శ్రద్ధ కలుగుచున్నది. శ్రద్ధయొక్క పరిణామమే యీ పురుషుడు. వీడు పూర్వజన్మమునందు ఏ శ్రద్ధకలవాడై యుండునో ఆ శ్రద్ధయే వర్తమాన జన్మమునందును కలిగియుండును.

ఒకవ్యక్తి ప్రవర్తనను నిర్ణయించే మానసిక పరిస్థితిని రచయిత చూస్తాడనడం సరియైనదే. ఇతరులు ఆవ్యక్తిలో గమనించనిదీ, ఆ వ్యక్తియే అసలు ఒకానొకప్పుడు గ్రహించని విషయాలను రచయిత గమనించుతాడు. ఇది నవలారచయితలు సజీవపాత్రలను సృష్టించడానికి తోడ్పడుతుంది. అలాంటి పాత్రలతో పుస్తకాలువ్రాసి ప్రజలకు అతడు అందించగలడు.

మానవుడు మహాకవి అయినప్పుడు అతీంద్రియ జ్ఞానంతో పని చేస్తాడు. అప్పుడతని వాక్కు ఆదిమధ్యాంతరహితమవుతుంది.

జితేంద్రియులై నియమంగా నడచుకునే వారిని కార్య సాధనలో చిన్నచిన్న అంతరాయాలు ఏమీచేయలేవు.

సత్త్వగుణ శ్రద్ధగలవాడు దేవతలను, రాజసశ్రద్ధగలవారు యక్షరక్షోగణములను, తమోగుణ నిష్ఠులు భూతప్రేత గణములను పూజింతురు.

ప్రస్తుతపరిస్థితుల్లో చేబదుళ్ళు (వస్తురుణాలు) క్లిష్టసమస్యగా తయారయ్యాయి. ఇలాంటి అలవాట్లు మనుషులమధ్య మోహమాటాల్ని, స్నేహాల్ని నాశనంచేస్తాయి. సాధ్యమైనంతవరకూ వీటికి దూరంగా వుంటేనేమంచిది.

సత్యమైనసాహసానికి మరణంఎంతటి బాధాకరమైనదో, పిరికితనానికి భయం అంతకంటె ఎక్కువ బాధాకరమైనది.

భగవంతుడు బిడ్డల్ని ప్రసాదించేది కేవలం జనాభాను పెంచడానికి మాత్రమేకాదు. ఆర్ద్రత, అనురాగం, వాత్సల్యం, త్యాగం — ఈగుణాలను హృదయంలో కదిలించడానికి.

సౌందర్యం, సౌభాగ్యం, శక్తియుక్తులు, అధికారప్రాభవాలూ—ఇవన్నీ ఒకమనిషికి వరాలు కావచ్చు. మరొకమనిషికి శాపాలుకావచ్చు.

ఎవరు డంభాహంకార యుక్తులును కామరాగ బలాన్వితులునులై ఆశాస్త్రీయములైన ఘోరతపంబుల నాచరించి, తమ శరీరములందున్న యింద్రియ సమూహమును ఉపాసనాదులచే పీడించి వివేకముచెడి శరీరాంతర్యామియైన భగవంతుని గూడుటకు కృశింప చేయుచున్నారో వారలు అసుర ప్రకృతి సంభూతులని ఎరుంగవలయును.

ప్రభువైన యేసుక్రీస్తు రక్షకుడై మానవుల దోషములెల్లను క్షమించితుడిచివేయగలడు. మానవులు తమపాపములను ఒప్పుకొనిన యెడల ఆయన నమ్మతగినవాడును, నీతిమంతుడును గనుక ఆయన మానవుల పాపములను క్షమించి సమస్త దుర్నీతినుండి మానవులను పవిత్రులునుగా చేయును.

ఈప్రపంచంలో డబ్బున్నవాడు డబ్బులేనట్లు నటిస్తాడు. డబ్బులేనివాడు వున్నట్లుగా వేషాలు వేస్తాడు.

ముఖస్తుతి చేసేవారందరూ స్నేహితులుకారు. కష్టాలలో సహాయం చేసినవాడే స్నేహితుడు.

పూవులకు సూర్యరశ్మి ఎలాగో—మనిషికి నవ్వుఅలా అవసరం. నవ్వు ఆభరణమై మనిషి అందాన్ని పెంచుతుంది.

అందరకును ఆహారము సత్త్వరజస్తమోగుణములచే వారివారికి తగినట్లు ప్రియంబైయున్నది. యజ్ఞమును తపోదానములును ఆ ప్రకారమే త్రిగుణాత్మకములుగా నుండును.

స్త్రీవిద్య అవశ్యకతను సమాజం గుర్తించాలి. దానిఅమలుకు తగిన వాతావరణం సమాజంలో వుండాలి. విద్యాభివృద్ధికి కావలసిన

సదుపాయాలు లభించాలి. ఈమూడూ సమకూరితేగాని స్త్రీవిద్యాభివృద్ధి ప్రణాళికలు విజయవంతం కాజాలవు.

దరిద్రుడికి కొన్నికోరికలుంటాయి. విలాస పురుషుడికి చాలా కోరికలుంటాయి. లోభికన్నీ కోరికలే. లభించిన వాటిని అనుభవించటా నికి కాదు. ఇనప్పెట్టిలో పెట్టి దాచుకుంటానికి.

డబ్బు సంపాదించడానికి మనిషి పడుతున్న శ్రమ — వ్యర్థం చేస్తున్న కాలం — అతను సంపాదించిన ధనంకంటె విలువైనది.

వాచాలత, క్రూరత్వం, మూఢనమ్మకం — ఈమూడు మనం దూరంగా నెట్టివేయవలసిన లక్షణాలు. ఈమూడింటినుంచీ వైదొలగితే గాని దేవుని ప్రేమమయతత్వం మనహృదయం చేరువకురాదు.

ఆయుర్వృద్ధికరంబును చిత్తస్థైర్యకరంబును, రసవంతంబును, స్నేహయుక్తంబును, స్థిరంబును, నైన మనోహరంబులగు ఆహార ములు సాత్త్వికులకు ప్రియంబులైనవి.

ప్రమిద వెలిగించబోయేముందు తైలమూ, వత్తితోపాటు దాంట్లో యింకో పూచికపుల్లకూడా వేస్తారు. దీపశిఖ తగ్గిపోయేటప్పుడు ఈచిన్న పుడక చాలాఅవసరం ఎగద్రోయడానికి. అదిలేకపోతే తైలమూ, వత్తీ వున్నప్పటికీ దీపంవెలగదు.

ఇది ప్రజాసామ్యయుగం అని అందరూ అంగీకరించినా ప్రగతి నిరోధక తత్త్వానికే ప్రస్తుతంమట్టుకు పైచేయిగా కన్పిస్తుంది.

కోరిక — అసూయ ఈ రెండూ కవల పిల్లలు.

అధికమైన కారమును పులుపును ఉప్పును గలిగి మిక్కిలి తీక్షణంబును రూక్షప్రదంబును తాపకరంబునునై దుఃఖశోక రోగ ములు గలుగ చేసెడి ఆహారములు రజోగుణవంతుల కిష్టమై యుండును.

చేతికి అందిన డబ్బు అలావుద్దీన్ లాంతరు వంటిది.

కవ్వంతో చిలికితేగాని పెరుగులోంచి వెన్నరాదు. అలాగే కష్టాలను ఎదుర్కొంటేగాని మనిషికి కీర్తిరాదు.

జీవితమంటే ఏమిటి? అది ఒకశిక్షణ, ఒకఅవకాశం. నాఆత్మ శక్తిని పరీక్షించుకునే వేదిక.

ప్రపంచంలో సంబంధం లేకుండా బ్రతకగలననుకునే మనిషి మూర్ఖుడు. తానులేకుండా ప్రపంచము బ్రతకలేదనుకునే మనిషి అంత కంటే మూర్ఖుడు.

ఏదోగొప్పపని చేస్తున్నామనే పేరుతో చిన్నచిన్న నిత్య కృత్యాలను అజాగ్రత్తగా వదిలి వేయకూడదు. చిన్నదయినా. పెద్ద దయినా నీప్రతిపనినీ ఉచితమయిన రీతిని ఆచరించాలి.

రచయిత కౌశల్యం అంటే మాటలకోసం ఆవేదనాకాదు, కల్పనాశక్తికూడా వుండాలి. సృజనకు కల్పనాశక్తి పునాది అని వేరే చెప్పనక్కరలేదు.

యామము గడిచినదియును, రసరహితంబును, దుర్గంధయుతం బును ముందుదినము వండినదియును ఉచ్చిష్టంబును అపరిశుద్ధంబును నైన ఆహారము తామసగుణులకు ప్రియము.

వేసిన దారంట వెళ్ళిపోవడం సులభం. అంతేకాదు. పదిలం. నలుగురికీ తెలిసిందీ. చిరకాలంనుంచి నలిగిందీ ఒకదారి. సిద్ధంగా సుప్రసిద్ధంగా వుంటూనే వున్నపుడు వేరే ఒక కొత్తదారి వెదకడం అవి వేకం, ప్రమాదం అని అంటారు కొందరు. కాని పురోగమనానికి కొత్త దారులే రాచబాటలు. అలుపులేని అన్వేషణగ తాను గతికత్వాన్ని

సహించలేదు. కాలిబాటలోనే మానవుడు తృప్తిపడిపోయి వుంటే వ్యోమ యానాలు సాధ్యమై వుండేవి కావు.

యాగముచేయుట వేదహితంబని మనస్సును దృఢంబుగావించి ఫలాశక్తిలేకయే యాచరించబడెడి యజ్ఞము సాత్త్విక యజ్ఞంబగును.

చదువుకున్న స్త్రీ గృహానికి అలంకార ప్రాయమైపోరాదు. ఆమె చదువు సంఘానికి వినియోగపడినపుడే ఆచదువుకు సార్థత. బాలికలకు విద్యతోబాటు ఉపాధికలిగించే వృత్తి విద్యలను గరపటం చాలా అవశ్యకం.

ఎవరికైనా సహాయంచేస్తే జ్ఞాపకం ఉంచుకోకు. కాని నీకెవరైనా సహాయంచేస్తే ఎప్పుడూ మరచిపోకు.

జిజ్ఞాస పలువిధాలుగా వుంటుంది. ఒకటి స్వార్థఫలం అది మనకు లాభదాయకమైన విషయాన్ని తెల్సుకోమని ప్రేరేపిస్తుంది. రెండోది అహంభావ ప్రతిఫలం. ఇతరులకు తెలియని విషయాల్ని తెల్సుకోవాలనే కోరికయే దానికి పునాది.

ఫలమునుకోరి డంభమునకు చేయు యజ్ఞము రాజసయజ్ఞమనబడును.

కాల ప్రవాహంలో కరిగిపోని విలువల్ని బిడ్డలకు ప్రసాదించడమే విద్యకు లక్ష్యం కావాలి.

తేలికగా దొరికే వస్తువు విలువకూడా తేలికగానే వుంటుంది.

సంగీతమునందేమి, చిత్రలేఖనమునందేమి, కవిత్వమునందేమి ద్వివిధములు కలవు. నయనములకో శ్రుతి, పుటములకో యానందం కలుగచేయునవి కొన్ని — హృదయమును దన్మయత్వములో ముంచి వేయునవి కొన్ని.

ఛందస్సు గుఱ్ఱం వంటిది. గుఱ్ఱం ఎటుతీసుకుపోతే అటల్లా వెళ్ళిపోయేవాడు అశ్వికుడు కానట్లే ఛందస్సు లాగుకు పోయినట్లు వ్రాసేవాడు సంవిధానజ్ఞుడు కాడు.

మోసం అనేది చాలీచాలని దుప్పటిలాంటిది. ముఖం కప్పు కుందామనుకుంటే కాళ్ళు కనపడతాయి.

విధిహీనముగాను, ద్రవ్యహీనముగాను, మంత్రహీనముగాను, దక్షిణహీనముగాను, శ్రద్ధారహితంబుగాను చేసెడి యజ్ఞము తామస మనబడును.

చాలాసుఖాలు దొంగనోట్లు.వాటివిలువ తెలుసుకునేవరకు మాత్రమే చెలామణీలో వుంటాయి.

నిన్ను నీవు జయించు, లేకపోతే నీకేనీవు బానిసవైపోతావు. బానిసత్వం బలహీనతకు చిహ్నం.

మాట మనిషివంటిది. పాట పక్షివంటిది. మాట నడుస్తుంది. పిలుస్తుంది. పలుకుతుంది. గానం అంతరిక్షాల్లోకి వెళ్ళిపోతుంది. గానం అందుకోలేని ఎత్తులులేవు.

దేవతార్చన, బ్రాహ్మణారాధన, ఆచార్యశుశ్రూష, ప్రాజ్ఞ, సన్మానము, శౌచము, ఋజుత్వము, బ్రహ్మచర్యము, అహింస యివి యన్నియును శరీరసంబంధములయిన తపస్సులనబడును.

మృత్యు తిమిరం సాయం సంధ్యవంటిది. చనిపోతున్నవానికి అన్ని వస్తువులనూ అది సుందరంగా కనిపింపచేస్తుంది.

ఇతరులతో వ్యవహరించడంలో ఎంతోమెలకువగా, మర్యాదగా, సానుభూతిగావుండాలి. నీకు యెంత స్వేచ్ఛ – విశ్రాంతిఉండడం అవ

సరం అనుకుంటావో అంతస్వేచ్ఛ, విరామం యితరులకు కూడా నీవు కలిగించాలి. నీపని మాత్రమే నీకు ముఖ్యంకారాదు.

అధునికకాలంలో కవితాచైతన్యం సర్వత్రా వ్యాపించింది. కవిని బిండెలలో పెట్టి నలగగొట్టి వాటిలో అతడు సాముగరిడీలు చేస్తూవుంటే చూస్తూ ఆనందించే ప్రేక్షకులుకారు నేటిరసికులు. వారుకోరుకొనే అతని జన్మహక్కయిన స్వేచ్ఛను అంగీకరిస్తారు. కవిని కొత్తనియమాలు నిర్మించుకోనిస్తారు.

అనుద్వేగకరంబును, యదార్థమును, ప్రియంబును, హితంబును నైన మాటలను పలుకుచు, వేదాధ్యయనంబుగా గావించుచుండుట వాఙ్మయంబైన తపస్సు.

ముందు అసలు నువ్వు మంచిగా వుండాలని నిశ్చయించుకుని అలా వుండడానికి ప్రారంభించు. అతరువాత నువ్వు ఎంతమంచి వాడుగానైనా సరేమనవచ్చు.

ప్రతిఒక్కరూ తమజ్ఞాపకశక్తిని గూర్చినిందారోపణ చేసుకుంటారు. కాని తమతీర్పును గురించి యెన్నడూ విమర్శించుకోటానికి ప్రయత్నించరు.

అంతరాంతరాళాలలో ప్రతివాడూ అస్తికుడే నిత్యజీవితంలో నాస్తికునిలా ప్రవర్తించినా.

కవిత్వమునకు కావలసినది భావనా స్ఫోరకత్వము, హృదయాకర్షణము, రసోజ్జృంభణము.

మనఃప్రసాదమును, సౌమ్యమును, మౌనంబును, చిత్తవృత్తి నిరోధమును, భావశుద్ధియును మానసికంబైన తపస్సు.

సాలరాతి శిల్పం ఎటువంటిదో మనిషికి విద్యాభ్యాసం అటువంటిది. భూగర్భంలో దాగిన రాతిబండల్లా మరుగున పడివున్న మనుష్యుల్ని వెలికితీసి మహాపండితులుగా వీరాధివీరులుగా, తత్వవేత్తలుగా తీర్చి దిద్దగలిగేశక్తి విద్యాసంస్కారాలకు మాత్రమే వుంది.

ఒక మంచిపనిని అది మంచిపని కనుకనే చేయాలిగాని దానివల్ల యేదో పారితోషికం వస్తుందనీ, పదిమంది మెచ్చుకుంటారని చేయరాదు.

తమ కథలను, కార్యాలను పాఠకుల స్మృతిలో సుషుప్తిలో, జాగృతిలో శాశ్వతంగా సుస్థిరం చెయ్యగల శక్తి రచయితలకు వుండాలి.

మహాకవు లెవ్వరికినీ నియమాలు బంధించలేవు. అలాగని నియమాలను ఉల్లంఘించి మహాకవి పదవి నర్థించడం పరిహాసాస్పదము.

చాలామంది సంతోషసమయాల్లో ఆనందంగా వుండకుండా ఆ సమయం పోతుందని బాధపడతారు.

ఇతరుల తన్ను సత్కరించుటకును, బహుమానించుటకును, పూజించుటకును డంబార్థముగా నాచరించెడి తపస్సు చంచలంబును అస్థిరంబునునై రాజసంబని చెప్పబడును.

ప్రభువైన యేసుక్రీస్తు వాగ్దానము "నీపాపాలు రక్తంలా ఎర్రగా వున్నా హిమంలా తెల్లగా చేస్తాను. నాచెంతకు చేరు." యేసునిన్ను ఆదరించి అక్కున చేర్చుకుని స్వర్గానికి మార్గము చూపుతాడు.

అరాజకం మానవజాతి అధికారంపై తిరుగుబాటు, నాస్తికత్వం

పరమేశ్వరుని అధికారముపై తిరుగుబాటు. ఇవి ఒకే నాణానికి రెండు వైపులు.

మానవుడు తను చేసిన పొరపాట్లు తనుగుర్తించుటయే నిజమైన విజ్ఞాన లక్షణం.

కాలమనేది సారవంతమైన భూమి. కష్టపడి వ్యవసాయంచేస్తే పుష్కలంగా ఫలసాయం లభిస్తుంది.

కష్టం — సుఖం. ఈరెండూ యింటికి రెండు తలుపులువంటివి. ఒకటి మూసుకుంటే రెండవది తెరుచుకుంటుంది.

అవివేకమైన పట్టుదలచేతగాని శుష్కోపవాసాదికములచేత తన శరీరమును కష్టపరుచు కొనుటచేతగాని పశువులకు నాశము గల్గించుటకు గాని చేసెడి తపస్సు తామసంబనబడును.

ఇప్పటి యాత్రిక కోటిలో విశ్వాసంతోపాటు మానవుని అసహాయత కనపడుతుంది. అప్పటియాత్రిక కోటిలో విశ్వాసంతోపాటు గాఢ శ్రద్ధా అకుంఠిత దీక్షా, పరమపదం చేరుకుని తీరుతాను అనే సంకల్పం గోచరించేవేమో.

స్వర్గమనీ, నరకమనీ వేరేవేరే లోకాలులేవు. నీపాపం-నీనరకం. నీపుణ్యం - నీస్వర్గం.

కళ్ళతోనే మంచి చిత్రించగలిగితే ఎంతబాగుండును. కళ్ళద్వారా చేతిద్వారా పెన్సిలులోకి వచ్చేటప్పటికి జీవితంఎంతో చెయ్యిజారిపోతుంది.

ప్రత్యుపకారము నపేక్షింపక, సత్పాత్రులకొసంగుటయే కర్తవ్యమని నిశ్చయించి పుణ్యకాలమునందును చేసెడిదానము సాత్వికంబగును.

ఆరోగ్యవంతమయిన శరీరము ఆత్మయొక్క అతిథిగృహమయితే అనారోగ్యమయిన శరీరము ఆత్మకు జైలువంటిది.

మానవుల్లో ఒకరినొకరు మోసం చేసుకోనియెడల ఈమానవసృష్టి ముందుకు పురోగమించలేదు.

ఆరోగ్యాన్ని పాడుచేసుకునే అధికారం నాకులేదు. నైతికంగా, సాంఘికంగా అది నామొదటిభాధ్యత. అనారోగ్యవంతుడు ప్రపంచానికి భారం. తనకుతానే భారం.

వెనుకటివన్నీ మంచివీ, యిప్పటివన్నీ చెడ్డవి అనుకోడం పొరపాటు. వెనుకటి వాటిలో జీవంవున్నవి తప్పకుండా నిలబడతాయి. జీవం వున్నవి గనకే కొత్తవి పుట్టుకొస్తున్నాయి. జీవంవున్న అన్నిటితోనూ కవికి సంబంధం వుంది.

ప్రత్యుపకారంగాని ఫలముగాని యపేక్షించి మనఃక్లేశముతో చేసెడి దానము రాజస దానంబగును.

గొప్పతనాన్ని గౌరవించడానికి గొప్పహృదయంకావాలి – నీచులూ, అసూయాపరులూ, ఎదుటవారి ఔన్నత్యాన్ని హర్షించలేరు. ఒకగ్రంథాన్ని, ఒక కళాఖాండాన్ని, ఒకమనిషిని అభిమానించడానికి కారణం మన అభిరుచులే. ఒకరికి మహోదాత్తంగా కనిపించే వస్తువులో మరొకరికి ఏప్రత్యేకతా కనిపించకపోవచ్చు.

ఎవరిపనిని వారిని చేయనివ్వు. నీవు అనవసరమయిన జోక్యం కలిగించుకోకు. అడిగినపుడే సలహాయివ్వు.

దేవాదిదేవులుకూడా పురోగమనశీలమైన కాలాన్ని వెనక్కి మళ్ళించలేరు.

శిల్పి ఒకానొక కట్టుకథలో పసిపిల్లవాడివంటివాడు. అతని ప్రతి కన్నీటిబిందువు ముత్యమే! కాని పాపం ప్రపంచం అతని సవతితల్లి. ఇంకా ఎన్నో ముత్యాలు రాల్చమని మాటిమాటికీ బాదగొడుతూంటుంది.

మూర్ఖునితో ఏమి మాట్లాడుతావు? దుష్టునితో ఎలావుంటావు! అది బాణముతో బండపైకొట్టినట్లే చివరకు "వాడిబాణము" కొన మొక్కపోతుందంతే.

నికృష్టదేశములో సకాలమునందు అపాత్రులకు తిరస్కారావమానములతో నొసంగెడి దానము తామసదానమనబడును.

సంసారమునకు భార్యాభర్తలు యిద్దరూ బాధ్యులమనే విశాలభావము కలిగియున్నపుడే సుఖజీవనముపొంది, ఏలాంటి సమస్యలనైనా ఎదుర్కొగలుగుతారు.

ధనాన్ని ఏవగించుకోవడం సింహాసనమునుంచి రాజును దించడంతో సమానం.

తను చేయవలసినపనిని సరిగా నిర్ణయించుకునే వానికి "అదృష్టం" సహాయంచేస్తుంది.

మంచికీ–చెడుకీ ఒక్క క్షణమైనా రాజీలేదు. ఎప్పటికీ నష్టంరానిపెట్టుబడి మంచి ఒక్కటే.

అదృష్టం అగ్నివంటిది – ఆత్మావిశ్వాసాన్ని దురభిమానంగా, దురభిమానాన్ని సోమరితనంగా, సోమరితనాన్ని నిర్లక్ష్యంగా, నిర్లక్ష్యాన్ని పతనహేతువుగా మార్చేశక్తి దానికుంది.

చదువువలనకలిగే ప్రయోజనాలు రెండువిధాలు. ప్రపంచానికి ఉపయోగపడేచదువు మొదటిది. రెండవది మనజీవితాలను సంస్కరించేది. ఇదే చాలాముఖ్యమైనది. నీసహకారం లేకుండా ఎంతటి మహామహోపాధ్యాయులైనా నీకు చదువు చెప్పలేరు. నిన్ను సంస్కరించనూ లేరు.

పరబ్రహ్మవాచక శబ్దములైన ఓం-తత్-సత్. అను నీమూడు విధములగు నామోచ్చరణములును, బ్రాహ్మణాదులునూ, వేదములునూ, యజ్ఞములునూ అనునవి యన్నియు పూర్వమే నిర్ణింపబడి యున్నవి.

ప్రేమకాదు. ఏఅనుభవమైనా అనుభవించినంతసేపే ఆకర్షణ. కాని ఆతర్వాత యాతనే అనుకోండి.

ఒక కళాఖండాన్ని గురించి తీర్పుచెప్పేటపుడు దానిలోపాల వైపు చూడకు.

నిలకడతోనే అన్ని పనులు అవుతాయి. అకాలంలో తోటమాలి చెట్లకు నూరుకడవల నీరుపోసినా పళ్ళుకాస్తాయా? ఆకాలం రావాలి? ఆపళ్ళుకాయాలి.

సత్యంకోసం దేనినైనా త్యాగం చేయవచ్చు. కాని సత్యాన్ని దేనికోసమైనా సరే త్యాగం చేయకూడదు.

బహ్మవాదులు వేదోక్తములైన యజ్ఞదానతపః క్రియలయందు ప్రణవోత్సారణ పూర్వకముగానే సదా ప్రవర్తించు చుందురు.

కలలుకన్న బంగారులోకాన్ని నిర్మించుకునేదాక ఆశ మనహృదయానికి శ్వాస.

నీడవల్లనే వెలుగు తెలుస్తుంది. కష్టంవల్లనే సుఖాన్ని గుర్తించ గలము. శ్రమించి పనిచేసినవాడే విశ్రాంతిని అనుభవించగలడు.

మనుష్యుల్ని గురించి తొందరగా అభిప్రాయాలేర్పాటు చేసుకుని వారివిలువలకు అంచనా కట్టబోకు — ఆశాభంగాలకు, ఆశ్చర్యాలకూ లోను కావలసి వస్తుంది.

తక్కువవాడు తక్కువ మోసంచేస్తే అది దారుణమైన నేరం. ప్రభుత్వాలూ, ప్రముఖులూచేస్తే అది రాజకీయతంత్రం. మంత్రాంగం.

ఒకనవల ప్రథమాధ్యాయం ప్రారంభించేముందు నెలలకొలది, సంవత్సరాలకొలది సన్నాహం చేయాలి. నోట్సు మొదటిప్లాను వగైరా సిద్ధంచేసుకోవాలి.

ముముక్షువులు, తత్ — అనెడి బ్రహ్మాభిదానంబున నుచ్చరించి ఫలాపేక్ష లేకయే యజ్ఞదాన తపః క్రియల నాచరింతురు.

ముఖ్యం - అముఖ్యం అనేవిషయాన్ని వివేకంతో ఆలోచించి తెలుసుకోవాలి. ముఖ్యమయిన విషయములో స్థిరమైన ధోరణిలో పని చేయాలి. తప్పుఒప్పుల విషయం వచ్చినప్పుడు ఒకవైపు శిలాహృదయంతో నిలవాలి. అముఖ్యమైన విషయాలలో పట్టింపులు పెట్టుకు కూర్చోకూడదు.

ఉషస్సంధ్యలు రెండూ ఒకేలాగవున్నా వెలుతురికీ చీకటికీ భేదం వుంది. నరకంఅంటే అశాంతి. స్వర్గంఅనగా ప్రశాంతి.

ఈశ్వరరక్షితు నెవరూ శిక్షింపలేరు. ప్రపంచమంతా ఎదురు తిరిగినా అతని తలపువ్వయినా వాడదు.

మానవులు చనిపోవచ్చు. దేశాలకుదేశాలే నాశనమవచ్చు. కాని ఒక ఆదర్శభావం ఎప్పుడూ సజీవంగానే ఉంటుంది.

సద్భావమునకు సాధుభావమునకు సంజ్ఞయైన సత్ — అనెడి శబ్దము ప్రశస్తమైన శుభకర్మములందు ప్రయోజనము కలదియై యుండును.

బెల్లంఉందని చీమలకు చెప్పక్కర్లేదు. వాటంతటవే వెతుక్కుంటూ బయలుదేరివస్తాయి.

సాహసించే నైజముకలవాడు పచ్చి అబద్ధాలను, నిజాలను చెప్ప కలుగుతాడు.

ఇతరులమీద పెత్తనం చెలాయించడం కన్నా మానవునికి అత్యంత తృప్తికరమైన దేదీలేదు.

అవినీతి వృక్షమువంటిది. దానికొమ్మలను వెయ్యిమంది తెగ నరుకుతుండవచ్చు. కాని వారికంటె వ్రేళ్ళవద్ద నరికేఒక్కడే గొప్ప వాడు.

ఔన్నత్యం – అల్పత్వం యీరెండింటికీ కారణం మరొక దానితో పోల్చిచూడగలగటమే.

వైదికులకేయజ్ఞదాన తపఃకార్యములందుగల నిష్ఠ సత్ – అని చెప్పబడుచున్నది. కనుక భగవత్ సమ్మతములైన కర్మలన్నియు సత్- అని ఉపదేశింపబడును.

కోపంతో ఒకమనిషి నిన్నునిందించినప్పుడు – ఆమాటల్ని గురించి బాగా ఆలోచించి ఆత్మపరీక్షచేసుకో.

దరిద్రుల దగ్గరను, శ్రమజీవుల సమీపానను — అక్కడ మాత్రమేకాదు; భగవంతుని వసతి. లోకం బహిష్కరించిన వాళ్ళ మధ్యను, పతితులనడుమకూడా భగవంతుడుంటాడు. వాళ్ళను వదల లేడు.

ఒకస్థలమే ఒకకాలంలో స్వర్గంలా కనబడుతుంది. అదే యింకొక సమయంలో నరకమైపోతుంది.

తప్పుచేసినవారికెప్పుడు శిక్షవుంది. దానినెవరూ తప్పించుకో లేరు. అయితే జ్ఞానము కలవాడు తెలిసిఅనుభవిస్తే, మూర్ఖుడు ఏడుస్తూ అనుభవిస్తాడు.

శాస్త్రీయములైన శ్రద్ధలేని హోమదాన తపస్సు లన్నియు

"ఆసత్" అనంబరగు చున్నవి. కనుక యివి యిహపరములు రెంటికి నుపయోగము కాకపోవుచున్నవి.

అందరు చెప్పినది వినండి. మీరు మాత్రం నోరుమెదపకండి. మానవుడు చేసిన మంచిపని ఎప్పుడు తప్పనిసరిగా మంచిఫలితాన్నే యిస్తుంది.

పాతకోటు వేసుకో? కొత్తపుస్తకం కొనుక్కో.

తాము నమ్మిన లక్ష్యంకోసం జీవితాలను ధారపోసినవారే మహా పురుషులయ్యారు.

ఆకాశంలోంచి వస్తున్న వెలుగు ఏనక్షత్రానిదని చెప్పగలము. అదృష్టాలవల్ల లభించే సుఖంకూడా అంతే.

అన్నిరకాల అహంకారాలలోను పెద్దదేదంటే ధర్మసంబంధమైనది. నీతిసంబంధమైనది. అంటే "నాయంతభక్తుడు లేడు. నాయంతటి ఋజువర్తనుడులేడు." అనుకోవడంయిట్టిఅహంకారులు భగవంతునికి మరింత దూరంగా వున్నారు.

స్వార్థము, నిస్వార్థము — యీరెంటిని మెలుకువగా యెరగడం అసరం. స్వార్థం ఒకరూపంనుండి యింకొక రూపానికి బదలాయింపు అవుతూ వుంటుంది. ఒకరూపంలో దానిని జయించామనుకుంటే వేరొక రూపంలో శత్రువుగా నిలబడుతూ వుంటుంది. అందుచేతనే యెక్కువ మెలకువ అవసరం.

కామ్యకర్మ త్యాగమేక ర్మసన్యాసమని విద్వాంసులును, సర్వకర్మ ఫలత్యాగమే త్యాగమని జ్ఞానులును గ్రహించియున్నారు.

స్త్రీఅభ్యుదయానికి మనసమాజప్రోత్సాహం యెంతైనాఅవసరం.

నైతికప్రపంచ శిధిలాలు సమూహమే నరకము. అందుకు ప్రధాన సూత్రధారే పాపం.

నిజమైన శాంతికి అర్ధం ఉద్రిక్తలు లేకపోవడంకాదు. న్యాయం, సౌభ్రాత్రుత్వంతో కూడినపుడే అదినిజమైన శాంతి అవుతుంది.

మాయావులైన దుష్టులను మాయోపాయము చేతనే లొంగదీసి కోవాలి. వారికదేమందు.

కొందరు పెద్దలు సమస్తమయిన కర్మలను దోషయుక్తమైన బంధ హేతువులైన వానిగానెంచి పరిత్యజింప వలయునని చెప్పుదురు. మరి కొందరు శాస్త్రీయములైన యజ్ఞదాన తపం కర్మలను పరిత్యజింప కూడదని పలుకుదురు.

దురదృష్టం ఆవహిస్తే కష్టాలు ఒకదానిమీద ఒకటి విరుచుకు పడతాయి. అలాగే అదృష్టం వరిస్తే మనిషిని చప్పుచప్పున పైపైకి తీసుకుపోతుంది.

నడిచినా పరుగెత్తినా నౌకలో వెళ్ళినా ఎవరుమాత్రం ఎక్కడకు పోగలరు? ఎవరూ తమ స్వభావాలనుంచి ఎడముగా పోలేరు.

అధికారివయితే నీవొక్కొక్కపుడు కళ్ళుమూసుకో, సేవకుడ వైతే అప్పుడప్పుడు చెవుడు అలవరుచుకో.

కూర్చున్న చోటునుంచి కదలకుండా దూరములెక్కిస్తే లాభ మేమిటి? నడుస్తుండాలి. ఒక్కోసారి కిందపడినా తప్పేమిలేదు.

శాంతిలేకుండా సుఖములేదు. అది బయటప్రపంచంలో కనిపించేది కాదు. నీలోనే దాగివుంటుంది.

తనలో తాను తృప్తి కనుగొనలేని మానవుడు బయట తృప్తి కొరకు వెతకటం వ్యర్థం.

స్వర్గసౌందర్యం నక్షత్రాల్లో మెరుస్తుంది చూడు.

యజ్ఞదాన తపః కర్మములన్నియు నుపాసకులకు బ్రహ్మ ప్రాప్తికి ప్రతిబంధకములయిన పూర్వజన్మకర్మ నివర్తకములై యుండుట వలన వానిని అవస్యం బాచరింపపలయునేకాని పరిత్యజించకూడదు.

మనసులో మలుచుకున్న మమతకు జీవంపోయడానికి సహృదయుడు ప్రయత్నిస్తాడు. తనప్రయత్నానికి ప్రచారంయివ్వక పోవడమే అతని హృద యౌన్నత్యం.

నీరయితే నిమ్నానికి ప్రవహిస్తుంది. కాని ధనం మాత్రం ఉన్నత క్షేత్రాలకు తప్ప యింకోచోటికి పారదు.

పుష్పాలకు సువాసన అబ్బినట్లే సున్నితహృదయాలకు నమ్రత అలవడుతుంది.

యజ్ఞాదికర్మలను గూడ పరాశక్తి లేకయే ఆచరించ వలయునని భగవంతుని ఉత్తమ సిద్ధాంతం.

దుర్జనుని మాటకత్తిలాంటిది. సత్పురుషుడు దానిని ఓర్చుకుంటాడు. సముద్రంలో పిడుగుపడినా అదియేమీ చేయలేదు.

ఒకళ్ళదగ్గర అణకువగా వున్నపుడే మరొక దగ్గర అధికారం చెలాయించే హక్కువస్తుంది.

స్వాతంత్ర్యాభిలాష చచ్చిదాస్యం రుచిస్తే జాతికి కాని, వ్యక్తికి కాని, యిక మోక్షంలేదు.

లక్ష్యాన్ని సాధించినంతమాత్రాన నువ్వనుసరించిన మార్గం సరియైనదని అర్థంకాదు.

కోర్టుల్లో కొంతవరకు సంభాషణ తెలుగుని జరుగుతుంది. అది

ఆంగ్లములో పెడితేగాని తెలుగుఫిర్యాదీ హృదయబాధ న్యాయమూర్తి గారి తలకెక్కదు.

పాపాన్ని క్షమించలేకపోవడం పాపమే.

అవశ్యములైన నిత్యనైమిత్తికాది కర్మలను పరిత్యజించకూడదు. అజ్ఞానముచే బంధహేతువులని తలంచి వానిని పరిత్యజించినచో అది తామసత్యాగమగును.

పొరపాట్లు ఒకపక్షమే అయితే ఘర్షణలు ఎక్కువకాలం కొనసాగవు.

కళ్ళుమనిషి జీవితానికి ద్వారాలు, ప్రేమాభిమానాలు అసూయలూ అహంకారాగలూ-రాద్వేషాలూ - అన్నీ ధారాళంగాలోనికి బయటకు ప్రయాణంసాగించే ముఖ్యద్వారాలు.

అందరి స్నేహాన్ని సంపాదించాలి అనుకునేవాడు ఎవరికీ స్నేహితుడుకాలేడు.

బిడ్డలు ఎంతపెద్దవాళ్ళైనా, గొప్పవాళ్ళైనా వారు తల్లికి ఎపుడూ పసివాళ్ళ వారిలాగే కనిపిస్తారు.

నేటిజీవితపు ఉష్ణోగ్రతని కొలవడానికి థర్మామీటరు ధనం. ఈలోకంలో అన్నీ అమ్ముడు పోతూనే వున్నాయి. చదువు, సౌందర్యం, కళ, సాహిత్యం, శాస్త్రం, శ్రమ-అన్నీ ప్రయాణం, పెళ్ళి, యుద్ధం-యేదిచెయ్యాలన్నా డబ్బే ప్రధానం.

తన్నుతాను ఆకాశానికే ఎత్తివేసుకోవడం అధఃపాతాళానికి తొక్కివేసు కోవడం — రెండూ తప్పే.

శరీరమునకు శ్రమము కలుగునని భీతినొంది కష్టసాధ్యములని

యెంచి కర్మలను పరిత్యజించినచో అది రాజసత్యాగం బగును. అట్టి త్యాగికి జ్ఞానపూర్వకమైన ఫలము సిద్ధింపదు.

ప్రతీ స్త్రీ పురోభివృద్ధికి కృషిసలిపినపుడే మనము మనదేశము ఆర్థికంగానూ, నైతికంగానూ, వైజ్ఞానికంగానూ, రాజకీయంగానూ అభివృద్ధి గాంచుతుందనటంలో ఎట్టి సందేహం లేదు.

దైవాన్ని గుర్తించుకో గలిగినవాడు మిగిలినవాటి నన్నింటిని మరచిపోగలుగుతాడు. దైవాన్ని మరచి మిగిలినవాటి నన్నిటిని గుర్తుపెట్టుకోగలిగిన వానికి నిజంగా ఏదీ గుర్తుండదు.

మనసు జ్ఞానానికి కట్టుబడుతుంది. అయితే మనస్సులేకపోతే జ్ఞానమేలేదు. నీరు కడవలోనే వుంటుంది. నీరులేకపోతే కడవ ప్రయోజనమేలేదు.

సుగుణాలు వృద్ధిపరచుకొని దుర్గుణాలు పోగొట్టుకోవడమే జన్మ పరమార్థం.

నిత్యనైమిత్తిక కర్మలను స్వయంప్రయోజన రూపముగాన భరింపదగినవియని తలంచి యాచరించి వానియందు మమకారమును, ఫలాశక్తియును త్యజించినచో అది స్వాత్త్విక త్యాగమగును.

వివేకవంతులైనవారు జరిగిపోయిన దానిని గూర్చిగాని, జరగబోవుదానిని గూర్చిగాని యెక్కువగా బాధపడరు.

సౌందర్యములో భగవంతునిచేవ్రాలు కనిపిస్తుంది చూడు.

అసలు సమాజమనేదే మిధ్య — ఒక్కొక్క వ్యక్తిశరీరం అనే కారాగృహంలో ఒక్కొక్క ఖైదీ శిక్ష అనుభవిస్తూ చివరకు మృత్యువుతో విడుదలకు ఎదురుచూడడం తప్ప మానవుడు చెయ్యగలిగింది మరొకటి ఏదీలేదు.

బుద్ధిమంతుడును, సంశయ రహితుండును అయిన సాత్త్వికత్యాగికి మమకార ఫలాశక్తులు లేకుండుటచేత అతడు క్లేశకర్మలను గురించి ద్వేషముగాని కుశలకర్మలనుగురించి ప్రీతిగాని వహింపకుండును

మనం కోరుకోవటం వరకే కాని అది నెరవేరతుందా లేదాఅనేది కాలమాన పరిస్థితుల ప్రభావంపై ఆధారపడి వుంటుంది. నెరవేరితే సంతోషించటం లేదా విచారించటం తప్ప చేసేదేమీలేదు మనం.

నీతి పరిస్థితినిబట్టి మారుతుంది గాని నిబంధనలనుబట్టి కాదు.

పడవలో యెక్కువైన నీటివలన, యింట్లోయెక్కువగా వున్న ధనమువలన ముప్పువస్తుంది. అందుకే వాటిని రెండుచేతులతోనూ వెదజల్లాలి.

దానంచేయడం, యితరులకు సహాయపడటం, సత్యవ్రతాన్ని ఆచరింపటం, అహింసామార్గంలో నడవడం యీనాలుగూ సమానమే. అయినా వీటిలో అహింస అన్నింటికంటె ఎక్కువది.

శిరస్సు ఎల్లప్పుడూ హృదయ ప్రతిరూపమై విరాజిల్లుతుంది.

శరీరమును ధరించినవాడు నిశ్శేషముగా కర్మపరిత్యాగంబు గావించుట కసాధ్యం కనుక శాస్త్రీయకర్మల నాచరించి కర్మఫలములను మాత్రము పరిత్యజించువాడే కర్మత్యాగి యనిచెప్పబడును.

ధర్మానికి వ్యవస్థలేదు. అదిదేశకాల పాత్రలనుబట్టి వుంటుంది. ధర్మం చాలకాలం క్రిందటనే పెడదారిపట్టింది.

ప్రమాదాలను ఎదుర్కొనడంకంటె నివారించడం మంచిది. చికిత్సకంటె నివారణమంచిది.

ఒకపుస్తకంలో అక్కడక్కడ యేరిన కొన్నివాక్యాలు మట్టుకు చదివి తృప్తిపడడముకన్న శోచనీయమైన విషయమేలేదు. పెద్దపెద్ద

పుస్తకాలు సంపూర్ణంగా చదవడానికి కావలసిన వ్యవధిఉంది. యువకు లకు అలాగే గొప్పవస్తువులు చేపట్టడానికి కావలసిన అవకాశాలు కూడా వారికి వున్నవి.

కర్మఫలత్యాగముచేయనివానికి జన్మాంతరమందు స్వర్గనరక మర్త్యలోకములో ఇష్టానిష్టమిశ్రమములను కర్మఫలములు మూడువిధ ములై యుండును. సాత్త్వికత్యాగముచేసిన ముముక్షువునకు అట్టిఫల ములు ఒకప్పుడు అంటవు.

మనసు నిర్మలంగా శరీరం ఆరోగ్యంగా వుండాలనుకుంటే తాగుడుమాట తలపెట్టకు.

పవిత్రమైనదయితే గడ్డిపూచనుకూడా నిందించకు. అదియెగిరి కన్నులలో పడితే చాలానొప్పి కలుగుతుంది.

ప్రతివిషయాన్ని తెలుసుకోవాలని జిజ్ఞాసకలిగించు కోవాలి. ఎందుకంటె ధనం సంపాదించేకొద్దీ యింకా సంపాదించాలనీ ఎలా వుంటుందో అలాగే విషయాలు తెలుసుకొనే కొద్దీ యింకా తెలుసు కోవాలకుతుహలం బాగా పెరుగుతుంది.

మానవబుద్ధిస్వల్పం. మానవుడు సంకుచిత పరిస్థితుల్లో వున్న మాటవాసవం.

అధిష్టానంబైన శరీరము, కర్తయగు జీవుడు, యింద్రియవ్యాపా రము, పంచప్రాణములు, అధిదేవతలు యీ అయిదునూ కర్మలకు హేతువులగుచున్నవి.

సాధారణంగా పురుషులు అప్పుచెయ్యడానికి కారణం స్వార్థం. స్త్రీలు నేరాలుచెయ్యడానికి బలహీనత ముఖ్యకారణ మవుతుంది.

స్వార్థం కొందరిని అంధులను చేస్తుంది మరికొందరికి కళ్ళను తెరిపిస్తుంది.

''కృషి'' నా ధ్యేయము. నేను పుట్టినది, జీవించునది "కృషి" కోసమే. నా కాళ్ళ బలము పరిమితి నాకు తెలుసు. నా కండ్లలోని శక్తి పరిమితి నే నెరుగుదును. కాని నేను చేయవలసినపని పరిమితి యెంతో నాకు తెలియదు.

ఒకరితో స్నేహం చేసేటప్పుడు నెమ్మదిగా ప్రారంభించడం మంచిది. స్నేహం కలిసిన తరువాత సుస్థిరత అలవరచుకో! మరి విడిచి పెట్టకు.

కర్మవిషయములలో అహంకార మమకారములు లేనివాడై కర్మఫలములయందాసక్తి రహితుడైయుండువాడు యుద్ధమందు లోక మంతటిని సంహరించినను సంహరించినవాడుకాడు. కర్మబద్ధుండును కాడు.

మనసులో మలినాన్ని తీసివేయకుండా ఎన్నినదులలో మునిగి శరీరాన్ని శుభ్రపరచుకున్నా ప్రయోజనం ఏమిటి? చేప ఎప్పుడూ నీటిలోనే వుంటుంది. కడిగినా కూడా దానికంపుపోదు.

తీరుబడి అనేది చాలా అందమైన వస్తువు. అంతకంటె ఖరీదైన బట్టలజత వంటిది. అందుచేతనే దానిని రోజూ వాడకూడదు.

భాగ్యమూ, దారిద్రమూ ఉగ్గంవంటిది. రెండూ సక్రమంగా ఉపయోగించుకుంటే మానవునిగట్టు చేరుస్తవి.

పవనాలూ, సముద్ర తరంగాలూ ఎప్పుడూ సమర్థుడైన నావికుణ్ణే ప్రేమిస్తాయి. అసమర్థుణ్ణి ద్వేషించి నాశనము చేస్తాయి.

శరీరానికి ఆరోగ్యం ఎంతముఖ్యమో మనుష్యునికి విజ్ఞానం అంతముఖ్యం.

కర్మవిధులు జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాతయని మూడు విధములై యుండును. కర్మయును ఆమూటి నపేక్షించి కరణము, కర్మ, కర్త యని మూడురూపములుగా సంగ్రహింపబడి యుండును.

స్నేహితులు కలిసినప్పుడు గొప్పతెలుగువాళ్ళ తెలుగులో మాట్లాడుకోరు. ఫక్తు యింగ్లీషు చేతకాక—పరభాష పరభాషేమరీ— అందులోనూ మాట్లాడుకోలేరు. అది యిది యేదీకాని ''ఎంగిలీషు''లో ముచ్చటించుకుంటారు.

స్నేహాన్ని యెపుడూ మరమ్మత్తు చేస్తూవుండాలి.

ఇల్లుచిన్నదైనా ఆర్థిక స్థితిగతులననుసరించి యింటిని తీర్చి దిద్దుకోవడం ప్రతి యిల్లాలి భాద్యత. మనల్నిచూచి మనపిల్లలు నేర్చుకుంటారు. అన్నింటికన్నా ముఖ్యం ఏమిటంటే యింతపనిచేసి ఆ ఇల్లాలు తానుకూడా చక్కగా ముస్తాబయి చిరునవ్వుముఖంతో కళకళలాడుతూ కనిపించాలి. అపుడే ''యింటికిదీపం యిల్లాలు'' అని అనిపిస్తుంది.

సాంఖ్యశాస్త్రమును పరామర్శించినచో సత్త్వాది గుణభేదములచేత జ్ఞానము, కర్మ, కర్త అను నీమూడును ఒక్కొక్కటియు మూడు విధములుగానే యుండును.

కర్మమీద నమ్మకంవున్న మానవుడు యెంతటి కష్టాన్నైనా నిట్టూర్పులతో భరించటానికే యత్నిస్తాడు.

ఆకలిబాధలు పొట్టను పూర్తిగా నింపుకోవడంతో తొలగవు.

ఓషధప్రాయంగా స్వల్పాహారం భుజించి సంతృప్తి చెందడంలో వాటిని నివారించుకో కలుగుతాము.

విద్య, చరిత్ర – యివి మత పురోభివృద్ధికి పరమ శత్రువులు.

పాప ప్రక్షాళనకు దానం ఉపకరించినంత శక్తివంతంగా మానవులముందునమ్రత ఉపయోగిస్తుంది.

సత్యాన్ని ఎవరూ నమ్మరు. అసత్యాన్నే ప్రపంచం నమ్ముతుంది. పాలు సందులు, గొందులు తిరిగి అమ్ముకోవాలి. కల్లు మట్టుక్కి కదలకే అమ్ముడుపోతుంది.

ఆత్మయనెడి భావపదార్థము భేదముగల వస్తువుల యందుండినను, దానిని సర్వభూతములయందును అభిభక్తముగాను, వికారరహితముగాను, జ్ఞానైకకారణముగలదిగాను ఏజ్ఞానిచూచునో ఆజ్ఞానమును సాత్త్వికజ్ఞానమని యెఱుంగవలయును.

ఆత్మకు మృత్యువులేదని నమ్మినట్లే వివాహాలు శాశ్వితమని విశ్వశించాలి.

చెప్పేదొకటి, చేసేదొకటి అయిన మనుషులసేవలు ఒకమానవునికే గాక జాతులన్నిటికి ముప్పుకలిగిస్తాయి.

స్త్రీలవిద్యకు సంబంధించి మతానికి మంచిప్రాముఖ్యం వుంది. ఒకవిషయముపై నమ్మకము యెలాకలిగి వుండాలో స్త్రీలకుచెప్పాలి. కాని ఆవిషయముగూర్చి తర్కించడము వాళ్ళకు భోదించరాదు.

విషణ్ణహృదయాలకు ఆశమినహా మరొకమందులేదు.

హిందూ సంఘమంతా పునర్నిర్మాణం కావలసిందనే నాఅభిప్రాయం.

పృథగ్విధములుగా నుండెడి శరీరములందు పృథక్కులుగా నుండెడి ఆత్మలను పృథగ్భేధములు గలవానిగా నెరింగెడి జ్ఞానము-రాజసజ్ఞానము.

ఆలోచనలను దూరంగా వుంచాలంటే ఏదో ఒకపనిని కల్పించుకుని మనసును అందులో లగ్నపరచాలి. అప్పుడే మనిషికి మనశ్శాంతి అంటూ చిక్కుతుంది.

ఉపదేశములిచ్చుట మాని ఆచరణయందు మనస్సును నిలుపు. నీరు త్రాగకున్నచో దాహమెన్నటికీ తీరదు.

ఒకవ్యక్తిలో యెంచవలసిన లక్షణాలేవైనా కన్పించినప్పుడే మనం అతనివయస్సును ఎంచుతాం.

తృప్తికలిగిన వాడెన్నడూ దరిద్రుడుకాడు. తృప్తిలేనివాడెన్నడూ-యెంతటి సిరులున్న భాగ్యవంతుడుకాడు.

ఉగ్గుపాలతోటే తెలుగువాడికి పరభాషచెబితే పరభాష తనదే అనుకోడం తనతల్లిభాషని నిరశించడం, పరమతం, పరజ్ఞానం వగైరా బాగున్నాయనుకోడం తనఅసలుమతం. అసలుజ్ఞానం నాశికరం అనుకోడం, పరదేశం తనదనుకోడం వాడికి సహజం అయిపోయి వాడు మరి తెలుగుతెలుగంటూ ఏడవడు.

దేహమందున్న జీవుని దేహపరిణామముగల వానిగాగాని ప్రతిమాదులయందున్న ఈశ్వరుని ప్రతిమాదిపరిణామముగల వానిగాగాని తలచి అంతకన్న వేరుకాదని ఎరుంగుట యుక్తిహీనమును యదార్థము కానిదియును అల్పఫల ప్రదంబునునైన తామసజ్ఞానము.

కాలానికి ఎవరిమీదకరుణ వుండదు. పక్షపాతం అంతకంటె వుండదు. తనవిద్యుక్త ధర్మాన్నినెరవేర్చడమే దానిఏకైక లక్ష్యం.

ప్రేమఅనేది సోమరికోరుకునే వృత్తి, సైనికునికది చికాకు కలిగించే అవాంతరము. పాలకుని విషయములో అది అతని మార్గమున కడ్డుగావున్న బండవంటిది.

పొదుపుగా సుఖంగా జీవించాలంటే నీకువచ్చే ఆదాయానికి రవంత తక్కువగా ఖర్చుచేసుకో.

వర్ణాశ్రమములకు దగినదినియును, కర్తృత్వాది అభిమానము లేనిదియును, రాగద్వేషరహితమైనదియునునై ఫలాపేక్షలేకయే ఆచరింపబడిన కర్మము సాత్త్వికకర్మము.

ఒకమహోన్నత మైనలక్ష్యం కలిగినవారి భార్యల జీవితాలంత సుఖంగా వుండవు.

జననమరణములు అందరికీ ఉండగా యింకనాకొక్కడికీ భయమెందుకు?

చరిత్రప్రసిద్ధిగాంచిన వారందరూ సిద్ధనులే.

ప్రత్యేకవ్యక్తుల జయాపజయాలకు ధర్మవిజయంతో సంబంధం లేదు.

హృదయానికి బుద్ధిపై యెంతో అధికారముంటే ఎంతతెలివి కలవాడైనా—అందుకనే హృదయోద్వేగాన్ని అదుపులో పెట్టుకోవాలంటాడు.

అనర్హులను పొగడటం వారిని వెటకారంచెయ్యడమే.

ఫలములను కోరువానిచేగాని నేనే కర్తయని అహంకారముతో గూడిన వానిచేగాని యాచరించబడిన విశేష ప్రయాసకరమగు కర్మము రాజస కర్మము.

జీవితంతో రాజీపడి సీళ్ళ నములుతూ కాలంగడిపితే ఆశయాలు తీరని ఆశలవలె కరిగిపోయి, జీవితం యధావిధిగా గతుకుల బాట లోనే నడుస్తుంది.

దుబారా మనిషికి దారిద్ర్యం తప్పదు. ఆదారిద్ర్యం మనిషి వ్యక్తిత్వాన్ని హరించే నేరస్థుణ్ణిగా తయారు చేస్తుంది.

నేడు మనచుట్టూవున్న సంస్థలలో ఒకపెద్దలోపం వున్నది. అది మానవులలోని మానసిక సంచలనానికి దోహదం కావడం లేదు. మానసిక సంచలనములేని మానవుడు పశువుతో సమానము.

కర్మమువలన గలిగెడి శుభాశుభములు ఫలనాశము. పరులకు కలిగెడి హింస తమ సామర్థ్యం మొదలగువాని విమర్శింపకయే కేవల మజ్ఞానముచే ఆచరింపబడెడి కర్మము తామస కర్మమనబడును.

తల్లిదండ్రులు పిల్లల మనస్సులను అర్థంచేసుకుని మంచిమాట లతో సరియైన త్రోవలో నడిపిస్తే వారికి జీవితంపట్ల ఉన్నతమైన భవిష్యత్తుపట్ల ఆశక్తి, శ్రద్ధ యేర్పడుతాయి. పెద్దల ప్రోత్సాహముతో సహకారంతో తామెన్నుకున్న చదువులో, వృత్తిలో, యిష్టమైన కళలో రాణిస్తారు. బాధ్యతకలిగిన ఉద్యోగులై, కళాకారులై ఆయావృత్తులు రంగాలు అభివృద్ధి కావడానికి ఉత్సాహంతో కృషిచేస్తారు. తెలివి తేటలకు పదునుపెట్టుకుంటూ, అభిరుచులకు మెరుగులు దిద్దుకుంటూ, సంతో షంతో పనిచేసే యువతరంవలన దేశానికి మేలుచేకూరుతుంది.

45 ఏళ్ళుదాటాక ఎప్పుడూ యిల్లుకట్టకు. అయిదేళ్ళ ఆదాయం చేతిలోవుంటేతప్ప పునాది వెయ్యకు. అంచనా వేసినదానికంటె రెట్టింపు ఖర్చవుతుందని తెలుసుకో.

ఫలమునందు నపేక్షలేనివాడై కర్తృత్వమందు అభిమాన

రహితుడై ధైర్యోత్సాహములు కలిగి కర్మము నెరవేరిననూ నెరవేరక పోయిననూ మనోవికారము చెందనివాడు సాత్త్విక కర్త యనబడును.

ఆలోచనలకు ఆశయాలకు కాస్త ఆవేశాన్ని జోడించి ఎప్పటి కప్పుడు తనను తన పరిచరాలను బేరీజు వేసుకుంటూపోతే మార్పు వచ్చి తీరుతుంది.

చూడటానికి హంస, కొంగ ఒకలాగే వుంటాయి. రెండూ చెఱువులోనే వుంటాయికూడా. పాలు, నీరు కలిపి యిచ్చినపుడు కొంగ బయట తడుతుంది.

హెచ్చుతగ్గులను మరచిపోవటం, మానవులందరూ సమానులే నన్న సత్యాన్ని గ్రహించటంకంటె పెద్ద త్యాగం నేడు మరొకటిలేదు.

మానవులు అంకెలవంటివారు. అంకెలు ఎలా అవి ఉన్నస్థాన మును బట్టి విలువను పొందుతాయో మానవుడుకూడా సంఘములో తను ఉన్నస్థానముబట్టి విలువను పొందుతాడు.

కీర్తిని కోరువాడై ఫలమునపేక్షించి లుబ్ధుండును, ఆచారహీనుం డునునై లాభాలాభములందు మోదభేదముల నొందనివాడు రాజసకర్త యనబడును.

ఇల్లు అలుకగానే పండగకాదన్న విషయం మానవుడైన ప్రతీ వ్యక్తి నేర్చుకోతగ్గ విషయం.

నూరు తుపాకులకన్న నాకు మూడు పత్రికలంటే భయం.

అందరూ శబ్దమూ, శబ్దమూ అంటారు. శబ్దమునకు కాళ్ళులేవు, చేతులులేవు. ఒకశబ్దము మందులా పనిచేస్తేమరొకటి మనస్సునిగాయ పరుస్తుంది.

ఒక చిత్రాన్ని తగినంత వెలుతురులో పెట్టిచూచినట్లే ఒక వ్యక్తిని కూడా తగినంత జ్ఞానంతో [illegible] మన అభిప్రాయం చెప్పాలి.

పాపములు ఒక్కరిని బాధిస్తవి. మరికొన్ని లోకకంటకాలుగా వుండి అనేకులను బాధిస్తవి.

అవధులు దాటిన నాగరికత క్రమంగా అనాగరికతగా మారిపో తుంది.

భాగ్యవంతులం గావడం మనచేతులలో లేదుగాని నీతిమంతులం గావటం మన చేతిలోపని.

కర్మలకు యోగ్యతలు లేనివాడును జ్ఞానశూన్యుండును సోమరియును, వంచకుడును, అభిచారాదులయందు ఆశకలవాడును, మందుండును, దుఃఖియును, అలస్యముగా కర్మముచేయువాడునునైన కర్త తామసకర్తయనబడును.

విద్య, వ్యవసాయమే. వ్యవసాయములో వున్నలావాదేవీలు యావత్తు విద్యకే అహారించాయి. రెండిటల్లోను ముల్లుకర్ర పుచ్చుకోవాలి.

నాగరికుడైన ప్రతిమానవుడు ''తనదేశమును ప్రేమించుట" అన్నది గొప్పసుగుణముగా భావిస్తాడు.

ఏకాగ్రతతో ఒకటిసాధిస్తే మిగిలినవన్నీ సిద్ధిస్తాయి. అన్నీ ఒకేసారి సాధించబోతే ఏదీసిద్ధించదు. చెట్టుమొదలికి సేవలుచేస్తే అది పువ్వులుపూస్తుంది. పళ్ళనూకాస్తుంది.

సృష్టిలోని గొప్పవస్తువులలో అతిసుందరమైనది మైత్రి.

ఏబుద్ధిప్రవృత్తి సాధనమార్గములు, మోక్షసాధన మార్గములు, కార్యాకార్యములు, భయాభయములు, బంధమోక్షములు మొదలైనవానిని ఎరుగునో ఆబుద్ధిసాత్త్వికబుద్ధి యగును.

కాలానికిలొంగని విలువల్నిగురించి పట్టించుకునేవాడు తనకాలానికి ముడిపడ్డ ప్రయోజనాన్ని సాధించి తీరుతాడు.

ధర్మవిజయము ఎప్పుడూ బలికోరుతుంటుంది. ధర్మనిర్వహణానికైసోక్రటీసు విషంగ్రహించాడు. క్రీస్తు శిలువనెక్కాడు. అమరుడు శిరచ్ఛేదం పొందినాడు. తిలక్ మహాశయుడు నిరంతర కారాగార బద్ధుడైనాడు.

చిరునవ్వు ఆరోగ్యానికి లక్షణం. నవ్వడంచేతగాని మనిషిమలిన సిక్తమైన ఊపిరిపీలుస్తూ, జీర్ణంకాని ఆహారాన్ని భుజిస్తూ దురలవాట్లతో జీవిస్తున్నాడని అర్థం.

పేరులో ఏముంది? గులాబిని ఏ పేరుతో పిల్చినా అది సువాసన వెదజల్లుతుంది.

ధర్మాధర్మములను కార్యాకార్యములను యదార్థముగా నెరుంగని బుద్ధి రాజసబుద్ధియగును.

కేవలం తెలుగు కాకుండా మరొకభాషగాని, విషయంగాని తెలిసి వుంటేతప్ప ఉద్యోగం, డబ్బూలేని ఒకతెలుగువాణ్ణి ఆంధ్రేతరులూ, ఆంధ్రులూకూడా ఒక పండితమాత్రుణ్ణిగానేనా కట్టడం మానేశారు.

ఏసుజన్మకు పురుష సహాయమవసరంలేకపోతే స్త్రీసహాయ మేల అవసరమైంది? మరియమ్మ దేవుడిభార్య కాదుగదా!

ఆలోచనఅంటే నీతోనీవు సాగిస్తున్న చర్చ.

ఎంతటివాడైనా మానవజాతి అంతటి గొప్పవాడు కాజాలడు.

అపకారవాద రాజకీయ నాయకులు ముందుదేశాన్ని నాశనం చేస్తారు. తర్వాత తమ్ముతాము నాశనం చేసుకుంటారు.

అజ్ఞానముచేత అధర్మమును ధర్మముగాను, ధర్మము అధర్మముగాను ఆప్రకారమే సమస్తవిషయములను విపరీతముగాను గ్రహించెడి బుద్ధితామస బుద్ధియగును.

ఒకరిని సుఖపెట్ట గలిగినవారే తాము సుఖపడగలరు.

శ్రమలేకుండా కులాసాగా చదివిపారేసే గ్రంథమే మనపై స్థిరమైన ప్రభావాన్ని మోపుతుంది.

ఎత్తు ప్రదేశములో నీరు నిలువదు. పల్లములో నిలుస్తుంది. నమ్రతతో వంగినవాడు నీరుతాగుతాడు. గర్వముతో నిక్కినవాడు దప్పికతోనే వుంటాడు.

మనకు సత్యం అంటే భయం. సంపదంటే భయం. మరణమంటే భయం. ఒకరంటే ఒకరికి భయం.

నిచ్చెన స్వర్గానికి వేయవచ్చు. నరకానికి వేయవచ్చు. పైకిపోయే మెట్లు స్వర్గానికి, దిగువకుపోయే మెట్లు నరకానికి దారితీస్తవి.

ప్రేమించడం, వివాహం చేసుకోవడం రెండూ ఒక్కటే.

మనోవ్యాపారములు, ప్రాణవ్యాపారములు ఇంద్రియాది వ్యాపారములు యివి మొదలగు వానిని చిత్తైకాగ్రతచేత నిలువబెట్టెడి ధైర్యము సాత్త్విక ధైర్యము.

గతాన్ని పదేపదే మననం చేసుకున్నందువల్ల మనసు పాడవడమే గాని మరోవుపయోగం వుండదు.

నీవు జీవితాన్ని ప్రేమిస్తున్నావా? అయితే కాలాన్ని వ్యర్థం చేయకు. కాలం వలననే జీవితం తయారయింది కదా.

ఒక అసత్యాన్ని కప్పిపుచ్చుకుంటానికి పది అబద్ధాలు చెప్పాలి.

దౌర్జన్యం ద్వేషాన్ని రెచ్చగొడుతుంది. ద్వేషభావాలు కలవాడు దేశాన్ని ముందుకు తీసుకు పోలేడు.

పసిపిల్లల పసిడిపలుకులుకన్నా యింపయినవీ, వారిబోసినవ్వులు కన్నా సొంపయినవీ, వారి మృదు స్పర్శకన్నా హితకరమయినదీ ఈ సృష్టిలో వేరేఏవీలేవు.

ప్రపంచములో ప్రతిగొప్పపనినీ చేయించేది ఏదో ఒక ఉత్సాహమే.

ధర్మార్థకామముల నభిలషించుచు అభిమానముచేత ఫలములనాశ్రయించు చుండెడి ధైర్యము రాజసధైర్యము.

ధైర్యము లేనివాళ్ళు ప్రేమకు అనర్హులు. ప్రేమించగలవారు 'ప్రేమ' అంటూ విలపించరు.

నవల్లోని సన్నివేశాలు, పాత్రలూ, చేష్టలూ, ఉద్రేకాలూ—వీటి ద్వారా జీవితాన్ని గూర్చిన మనపరిజ్ఞానం పెరుగుతుందనుకోవడం కల్ల. నవలలద్వారా మనకి లభించిన పరిజ్ఞానం యితరులద్వారా మనం తెలుసుకున్నదేగాని మన స్వంతంకాదు. ఇవన్నీ జీవితాన్ని గూర్చిగానీ జీవితం కాదు.

మొత్తంమీద చూస్తే ఐహికం ఆముష్మికానికి మెట్టులాగ కనబడుతుంది. ఈ మెట్టును ఉపయోగించుకోవడంలోవుంది.

ఔన్నత్యాన్ని సాధించిన కొలదీ వంటరితనం కూడా పెరుగుతుంది. మహోన్నత శిఖరాలు నిర్మానుష్యాలుగదా!

స్వప్నభయ శోకవిషాదములను విడువని కుత్సితబుద్ధిగలవాని ధైర్యము తామస ధైర్యము.

పెద్దమేష్టరీ ట్రయినింగు ఉంది. ఆపరీక్షకి చదివినకొద్దీ మతి పోతుంది. పరీక్షా పోతుంది. చదవనివాడికి నచ్చే పరీక్ష అది.

ఈకాలపు ప్రభుత్వాల్లో ధనవంతులే ప్రభువులు.

నీసంతృప్తికోసం భుజించు. ఇతరుల సంతృప్తికోసం దుస్తులు ధరించు.

సోషలిజం అనేది ఒక జీవిత విధానంగాని, కేవలం ప్రభుత్వ వ్యవస్థ కాదు. ఎంతోమంది పూరిగుడిసెల్లో కటిక చీకటిలో మ్రగ్గుతుండగా రాజధానిలో ఎత్తైనవిశాల భవనాలు లేవడం సోషలిజం కాదు. సోషలిజం అంటే కొద్దిమందికి అధిక అవకాశాలుకాదు. పేదప్రజలబాధలను, దారిద్ర్యాన్ని అందరూ పంచుకోవడం. అట్టిసానుభూతితో కూడిన త్యాగం ద్వారానే సోషలిజము, సమృద్ధిఏర్పడతాయి.

ఏసుఖము యోగాభ్యాసకాలమందు మొదట విషమువలె తోచినదై పిదప పరిపాకకాలమునందు అమృతతుల్యమైనదిగా దోచునో ఆత్మజ్ఞాననైర్మల్యము వలన జనించినయాసుఖము సాత్వికసుఖమనబడును.

ఆవేశపరులకు బ్రతుకొక ట్రాజెడీ. ఆలోచించే వారికది ఒక కామెడీ.

ఏకాకిగా ఉన్న ఒక రచయిత పూర్తిగా అర్థమవడు. గతించిన కవులమధ్య అతని స్థానం తెలుసుకున్నపుడే. అతని కవిత్వానికి ప్రయోజనం ఏర్పడుతుంది. ఒక కొత్త రచన వెలువడగానే వెనకటిరచనల విలువలన్నీమారి మరొకక్రమం ఏర్పడుతుంది.

గొప్పవాడి గర్వాన్ని అణచడానికి ఐశ్వర్యంకన్నా ఆయుధం లేదు.

ఏమతమైనా ఒక మహాత్ముడు చెప్పిన నీతే.

ఆకాశంలో ఉన్నమామిడిపండును కొట్టడానికి వుపాయం ఆలోచించడం దేనికి !

ఆగ్రహావేశాలు అవధులు దాటినప్పుడే నీపతనం ప్రారంభమవుతుంది. పశ్చాత్తాపముతో ఆకథముగిసి పోతుంది.

"గొప్పతెలుగువాడు తెలుగుటాకి" బాగుండదని ముందే తెలుసుకొని దానికి వెళ్ళడు. అందుకని టాకీ విషయములో హిందీగాని, యింగ్లీషుగాని రావాలి.

తలలో మట్టిముద్దవున్నా ధనముంటే సరి — వాడే మహానుభావుడు.

విషయములు, యింద్రియములు యివి కలిసి యుండుటచేత ఏసుఖము మొట్టమొదట అమృతముగాదోచి పిదప అంత్యమందు విషముగా దోచునో ఆ సుఖము రాజసమనం బరుగును.

ఆకలి, దారిద్ర్యం మనలో న్యూనతాభావాన్ని ప్రవేశపెట్టాయి. అందరం పరస్పర సహకారంతో వీటి నిర్మూలనకు పూనుకున్ననాడే కొత్తవెలుగు ప్రసరించి, క్రొత్త ఆశలు చిగురిస్తాయి.

దృఢసంకల్పం, కార్యదీక్ష, న్యాయదృష్టి, వాక్శుద్ధి, ప్రపంచజ్ఞానం, సత్ప్రవర్తన, హృదయవైశాల్యం, కాలస్థానాల విలువ. ఆకర్షణీయమైన, నిగ్రహం కలవాడు రాయబారిగా రాణించగలడు.

ఏసుఖము ప్రారంభమునందును, పరిపాకకాలమందును, నిద్రా

లన్య ప్రామాదికములను కలిగించి తనకు మోహనకరంబై తోచునో అది తామస సుఖమనం బరుగును.

మనంశోధించలేని అంతరంగ అధోలోకంలో దాగిన అనుభూతుల ప్రతినిధులు జ్ఞాపకాలు. గతించిన ఉద్రేకాలకు సాంకేతిక చిహ్నాలు. మనం ఉద్వేగముతో జీవించిన మధురక్షణాలు, మాసిపోయిన ఛాయాచిత్రాలుగా చరిత్రనుండి తొంగిచూస్తాయి.

భౌతికశక్తికంటె అధ్యాత్మికశక్తి గొప్పదని, ప్రపంచాన్ని పాలించేవి మనోభావాలని గుర్తించేవారే మహాపురుషులు.

అగ్నితనంతట తాను కనిపిస్తూ తనచుట్టూవున్న వస్తువులను కూడా కనిపింప చేస్తుంది.

గడచిన స్మృతుల్ని నెమరువేసుకోవటం అంటే గతజీవితాన్ని తిరిగి అనుభవించడం లాంటిది.

"విద్య" అన్నా "చదువు" అన్నా "పాండిత్యం" అన్నా ఆదిని సంస్కృతంలోనే అనిన్ని పదపడి యిప్పట్లో ఇంగ్లీషుతోనే అనిన్నీ అనుకుంటేంత వ్యామోహం తెలుగువాళ్ళలో ప్రబలింది.

నాదిఅనే అహం బయలుదేరి నప్పటినుంచి ప్రపంచదుస్థితి ప్రారంభమయింది.

బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులనెడి నాలుగుజాతుల వారికిని తమ స్వభావముపలన గలిగిన సత్వాది గుణముల ననుసరించి శాస్త్రీయము లైన కర్మలు విభాగింపబడి యున్నవి.

తాను స్త్రీననీ అనుక్షణం గుర్తించే స్త్రీ మమతలు పండించుకోగలదు.

అభివృద్ధిచెందిన దేశాలు సంపన్నమయినవంటే ఆ ప్రజలు తమ దేశంకొరకు, మొత్తం ప్రజలకొరకు స్వీయసుఖాలను, స్వీయలాభాలను త్యాగంచేసారు. నేడు మనదేశంలో అలాంటివారు తగ్గిపోయారు. యెక్కడైనావుంటే వారిని చులకనగాచూచి గేలిచేస్తున్నాం. కాని వారే మనరక్షకులు అని మనం గుర్తించాలి. అధికారం, ధనం, ఆడంబరాల వ్యామోహంనుంచి బయటపడి త్యాగం ప్రదర్శిస్తేనే మనం అభివృద్ధి చెందగలిగేది.

శమము, దమము, తపము, శుచిత్వము, క్షమ, ఋజుత్వము, జ్ఞానవిజ్ఞానములు, ఆస్తిక్యము యివి అన్నియును బ్రాహ్మణుని స్వభావ సిద్ధమయిన కర్మములు.

దుర్భరమయిన పరిస్థితుల్లోకూడా మానవుడు సున్నితంగా నవ్వు కునే సంఘటనలు జరుగుతుంటాయి. అది తాత్కాలికమే అయిన వాటి పరిణామం విషాదభరితమే. అయినా ఆకొద్దిసేపు మానవుడు తనకష్టాన్ని మరచిపోగలుగుతాడనే చెప్పాలి.

మనుషులం అయినందుకు మనంమంచో చెడో ఏదో ఒకటిచెయ్యాలి. ఏవిధంగా ఏమీచెయ్యక పోవడంకంటె చెడుచెయ్యడమే మంచిదని పిస్తుంది. ఏదోచెయ్యడంవల్ల మనం సజీవులమయినట్లు తెలుస్తుంది. ముక్తి పొందటంలోవుంది మానవుని ఘనత; వినాశనం చెందటంలోను అంతటి ఘనతా వుందేమో ?

మిత్రుడు తప్పుచేసిన శాంతంగాతీసుకుని కోపించుకోకుండా, మునుపటిలా ఆదరించగలిగేవాడే నిజమైన స్నేహితుడు. అది అమూల్య మైన స్నేహం.

కార్యము, తేజస్సు, దక్షత, యుద్ధమునందు పారిపోకుండుట,

దానము, పరిపాలనాసామర్థ్యము యివి అన్నియును క్షత్రియునకు స్వభావసిద్ధకర్మలు.

మనసులోబాధ యితరులతో చెప్పుకుంటె మనసుకు కొంతయిన ఉపశమనం కలుగుతుంది.

మనిషి కాదల్చుకున్నవాడు మూఢవిశ్వాసాలను ఎదిరించాలి.

పిల్లల పరిస్థితులనుబట్టి వారిని ట్రీట్ చెయ్యాలిమనం. అవసరమయినపుడు మన పద్ధతుల్ని మార్చుకుంటూవుండాలి. వారి మనస్తత్వాన్ని క్షుణ్ణంగా పరిశీలిస్తూ మనకార్యక్రమాన్ని ఏర్పాటు చేసుకుంటే భవిష్యత్తులో వాళ్ళనిచూచి మనం గర్వపడగలం.

నాముగింపు నాప్రారంభంలోనేవుంది.

కరువు, మహమ్మారి, శత్రువులదాడిలేని రాజ్యమే నిజమయిన రాజ్యము. అలాంటిరాజ్యాన్ని సృష్టించుకోగలిన ప్రజలే సమర్థులయిన ప్రజలు.

వైశ్యునికి కృషిగోరక్షణ, వాణిజ్యములును, శూద్రునికి శుశ్రూషా స్వభావమును, స్వభావసిద్ధికర్మలు.

ఏకారణం వల్లనైనా నిద్రలేకుండా జాగరణచేయవలసివస్తే వరసగా రెండురోజులు జాగరణచేయవద్దు. ఒకరాత్రయినా కనీసం రెండు గంటలయినా నిద్రించడమవసరం.

సత్యం, ప్రేమ, దైవసేవ, మానవసేవ — యిదేనా మతం. తోటి సోదరులు శ్రేయస్సుయెడల శ్రద్ధలేనివారికి, తమహృదయ పాత్రలలో ప్రేమమృగ్యమయినవారికి, సోదరభావమంటే అర్థం తెలియని వారికి, ద్వేషానికి, ఈసడింపులకు స్థానమిచ్చేవారికి అసలు మతం అంటే ఏమిటో తెలియదు.

బానిసమెడకు ఉచ్చుతగిలిస్తే దానిరెండవ కొసనీకు తగులు తుంది.

అద్దంతీసుకొని అందులోచూచుకుంటున్నాము. అప్పుడు ప్రతి బింబము కనిపిస్తున్నది. నిజానికి ప్రతిబింబం వున్నదికాదు. అలాగే అహంకారం కూడా నిజమయినదికాదు. ప్రతిబింబమువలె ఉనికిలేనిది.

ఎన్నడో భౌతిక దేహాలను విసర్జించి కాలప్రవాహంలో కరిగి పోయిన మహాపురుషుల సహచర్యం ఉత్తమగ్రంథ పఠనం వల్లనే నాకు లభిస్తుంది.

పితాపుత్ర సంబంధంలో ఋణసంబంధంలేదు.

మానవులు తమతమ స్వకర్మములందు ఆశక్తిగల వారలై సం సిద్ధిని పొందుదురు.

హింసకంటె నిశ్శందేహంగా ఉన్నతమైందిఅహింస. హింసకు పాల్పడే వ్యక్తికి వుండే శక్తికంటె అహింసాయుధధారిశక్తి యెప్పుడు అధికమైనది.

గొప్పతప్పిదాలు ఎన్నెన్నోచెయ్యకుండా ఎవడూ గొప్పవాడు, మంచివాడు కాలేడు.

నేడునాపోరాటం ఒకేఒకపోరాటం. అదినిరంకుశత్వానికి, దమన నీతికి వ్యతిరేకంగా జరిగే పోరాటం.

ప్రేమరహితమైన జ్ఞానం చవిటినేలవంటిది.

యెవనివలన ప్రాణులకు ఉత్పత్తిమొదలగునవి కలుగుచున్నవో యీలోకమంతయు నెవనిచే వ్యాప్తంబై యున్నదో ఆపరమపురుషుని మానవులు తమవర్ణాశ్రమ కర్మలచేత ఆరాధించి పరమగతిని పొందు చున్నారు.

అనుభవాలు జీవితానికి సోపానాలు.

పాలకులు ఏనమ్మకాలని స్వీకరిస్తున్నారన్నది ముఖ్యంకాదు. ఏనమ్మకాలని స్వీకరించవలసి వచ్చింది అన్నది ముఖ్యం.

మంచితనం అనే నిధిని భగవంతుడు మనకు ప్రసాదించినపుడు దారిద్ర్యాన్ని మాత్రం ఏనాటికీ అవమానకరంగా భావించకూడదు.

ప్రమాదకరమైన పరిస్థితి ఏర్పడినపుడు త్వరగా ఏదో ఒకటి చేయడమే భద్రం.

ఎటువంటి దుర్భర పరిస్థితులలోనూ ఆశ మనిషిని విడిచిపెట్టి పోలేదు.

జీవితపరీక్షకు ఎప్పుడో తయారు అవుతానులే అనటంకాక ఎప్పటికప్పుడు తయారగా ఉండడం మానవుడి విధి.

దేవుడనే వాడొకడుంటే జనమంతా ఆయనమీద తిరగబడి సన్మార్గవర్తిని చేయడమవసరం.

అసత్యం చెప్పటం పిరికితనానికి చిహ్నం.

కులధర్మము సంపూర్ణ గుణము లేనిదైనను విశేషగుణము కలిగి చక్కగా నాచరింపబడ్డిన పరధర్మముకన్న శ్రేష్ఠమైనది. కనుక వారి వారికులానుగుణమైన కర్మను ఆచరించెడివారికి పాపముసంభవింపదు.

తామందరము సోదరులని భావించి సామరస్యంగా జీవించేజాతి మాత్రమే విప్లవమువల్ల లాభము పొందుతుంది. అలాసిద్ధంగాలేనిజాతికి విప్లవం నాశనకారి అవుతుంది.

కొత్తచిత్త ప్రవృత్తులు కనుక్కోవడం కవి పనికాదు. యదార్థమైనవుద్రేకములోని చిత్తప్రవృత్తులను వ్యక్తంచేసి కవితలోనికి అవత

రింపజేయడం మట్టుకే అతనిపని. తానునిత్యజీవితంలో పొందవి అను భూతులుకూడ యిందుకుపకరిస్తాయి.

భూమిపై జన్మించే ప్రతి ఒక్కరూ తల్లిగర్భమునుంచే జన్మి స్తారు. అయితే వారు గడించే కీర్తి ప్రతిష్టలు మాత్రం వారు జీవించే పద్ధతిపై ఆధారపడి వుంటాయి.

వెలుగూ చీకటీ ప్రతిధ్వంద్వులు.

తనజాతికి సహజసిద్ధంబయిన కర్మదోషముండినను దానిని త్యజించగూడదు. అగ్నికి పొగకప్పుకొని యుండురీతిగా సమస్తకర్మ లును దోషముచేత ఆవరింపబడియుండును.

తప్పుచేసారని ప్రతి ఒక్కరిని ద్వేషించుకుంటూపోతే ప్రేమించ డానికి ఎవరూ మిగలరు.

''నీకు సంతోషము యివ్వగలను లేదా అధికారం యివ్వగలను ఏదో ఒకటే కోరుకో రెండూ యివ్వలేను.'' అని దేవుడు మానవునితో అన్నాడు.

తమ సుఖాన్ని మరొకరితో పంచుకోవాలనే తపన మంచి మనిషికి మంచిలక్షణం. అంతేకాదు ఒకరితో పంచుకున్న సుఖం రెండింతలై పెరుగుతుంది.

పరీక్షలకోసం, మార్కులకోసం మాత్రమే బాధపడేవాడికి విద్య అంటదు. విద్యకోసంపాటుపడే వాడికి పరీక్షవల్ల బాధేవుండదు.

ఆసుపత్రులు వుద్యోగుల జీతాలు ముట్టడంకోసం పుట్టినవేకాని రోగుల వ్యాధులు కుదర్చటానికి కాదు.

ఫలానికి ముందు పుష్పించినట్లే సత్కార్యాల ముందు నమ్మిక వికసిస్తుంది.

సమస్త విషయములందును ఆశక్తిని విడిచి జితేంద్రియుడై నిస్పృహుండై ఫలత్యాగము గావించి కర్మల నాచరించువాడు నైష్కర్మ్య సిద్ధిని పొందుచున్నాడు.

మనుష్యుడు న్యాయమార్గమున కష్టపడినపక్షమున తగినఫలము కలుగక పడినపాటెప్పుడును వ్యర్థంగాపోదు. సత్కార్యమునందు పడ్డ పాటెప్పుడైనను,లోకములోతప్పిదారి తత్కాలఫలమునొందకపోయినను, మనస్సునకు వివారము కలుగచేసినకృషి మంచిదైనను సంతోషము కలుగును. ఏపనిగాని పూని తుదముట్ట కష్టపడక నడుమ విడిచిపెట్టి నచో కృషి సఫలముకాదు.

వేలకొలది ఎలుకలుసైన్యంకట్టి సముద్రంలా ఘోషపెడితేమాత్రం ఏమిలాభం ! ఒక్క త్రాచుపాముబుసకే చెల్లాచెదరై పోతాయి.

మనసును పరిశుద్ధముగావించి ధైర్యంతో మనస్సును నియమించి శబ్దాది విషయములను పరిత్యజించి రాగద్వేషములను పరిహరింప వలయును.

ప్రతి మానవుడికి కావలసినవి రెండే, పని—ప్రేమా.

కళాకారుడు పరిపూర్ణుడైనకొద్ది అతనిలో బాధపడేవ్యక్తి సృష్టి చేసే మనస్సు విడిపోయి దూరంఅవుతాయి. ఈ యెడబాటువల్ల అతను సృష్టించిన రచనకి పుష్టి సమకూరుతుంది.

కటిక పేదవాడే చరిత్రలో మహోన్నతవ్యక్తి.

పచ్చని అద్దాలలోనుంచి చూస్తే లోకమంతా పచ్చగానేకనిపిస్తుంది. నీలంగావున్న అద్దాల్లోంచిచూస్తే లోకంమంతా నీలంగానే కనిపిస్తుంది. కాని నిజానికి ఆ రెండూ అసత్యాలే. నిజమైనకళ్ళకు కనిపించేదే సత్యము.

నిరంతరం ఎదుటివారిని సంతోషపెట్టాలనే ప్రయత్నం చాలా గొప్పది. ఎటుతిరిగి దానికి కారణం స్వార్థంకాకూడదు

పామరులకు లోసంగతులు తెలియవు. ప్యాసయినవాడు మహానుభావుడని, ఫెయిలయినవాడు తెలివితక్కువ వాడేగాక తుంటరికూడానని భ్రమిస్తారు. కొంతకాలం అయినతరువాత పుస్తకాలు మళ్ళీ చూడక పోతే వారువీరూ ఒకటే అనితెలుస్తుంది.

విజనప్రదేశము నాశ్రయించి మితభోజనము కలవాడై మనోవాక్కాయములను నియమించి ధ్యానయోగము నాశ్రయించి ఎల్లప్పుడును వైరాగ్యయుక్తుండై యుండవలయును

ప్రేమించగల హృదయంగల వ్యక్తియెన్నడూ యితరులను ద్వేషించడు. ద్వేషించేవాడు అసలు ప్రేంచడానికే అనర్హుడు.

ఇతరులకు కించత్తుసహాయము చేయ్యనేరని శ్రీమంతుడు, వూరిమధ్యలో వేరూరి వ్యాపించిన విషవృక్షములాంటి వాడు.

కాళీసీసాలు ఎక్కువ చప్పుడిచేస్తాయి. మనుషులూఅంతే.

అహంకారమును, బలమును, దర్పమును, కామక్రోధములను, బాహ్యవస్తుపరిగ్రహమును, మమకారమును విడిచి ఆత్మానుభవానందుడై యుండవలయును. ఇట్టిజ్ఞాననిష్టగలవాడు బ్రహ్మభావనకు అర్హుడగుచున్నాడు.

నిజమెప్పేడూ కటువే, సత్యమెప్పుడూ నిష్ఠురమే.

సమస్తజనులలోను సోమరితనం నంతకంతకు విస్తారమగుచున్నట్లుకనబడుచున్నది. వ్వరియందునున్నను సోమరితనపనిచేయవలసినపని చేయకమానడు. త్రుప్పు వాడుకచేయని తాళంచెవులను తినివేసి

దుర్బలముచేసినట్లే పనిపాటలు లేకపోవుటయు మనుష్యుల సారము తీసివేశి వారిని బలహీనులగాను, అల్పాయుష్కులగాను చేయుచున్నది.

అనుక్షణము ఆత్మత్యాగం చెయ్యడంలో తనవ్యక్తిత్వాన్ని అంతమొందించడంలో వుంది కళాకారుడి పురోగమనం. ప్రత్యేకమయిన తనవ్యక్తిత్వం విచ్ఛిన్నమైననాడు అతని రచన సంప్రదాయంలో ఒక భాగంగా స్థిరపడిపోతుంది. ఆస్థితిలో కళకూడా విజ్ఞాన శాస్త్రానికున్న హోదాను తెచ్చుకుంటుంది.

రాగము, ద్వేషము, మోహము — క్లేశాలని చెప్పబడుతూవున్నవి. అయితేయివి సంకల్పమువల్ల పుట్టినవి. బ్రహ్మభావన గలవాడు ప్రసన్నాత్ముడై నష్టమైనవానిని గురించి శోకింపకయు, దానివస్తువుల గురించి యపేక్షింపకయు, సమస్తభూతములందు సమదృష్టి వహించిన వాడై భగవంతునియందు పరమభక్తిని నిలుపుచుండును.

ప్రపంచాన్నంతా సౌందర్యంకోసం నీవుఎంతవెదికినా అది స్వయంగా నీలోవున్నపుడు దానిని నీవు చూడలేవు.

మృగాదులవలె దనసౌఖ్యమును మాత్రమే చూచుకొనువాడుగాక, మనుష్యుడెప్పుడునూ పరులసౌఖ్యమును కూడా ముఖ్యముగా చూడవలసినవాడుగా నున్నాడనుట యించు మించుగా నెల్లవారు నెరుగుదురు. అందుచేతనే మనుష్యుడెంత స్వప్రయోజన పరుడైన నంత నీచుడనియు, యెంతపరోపకారశీలుడైన నంతయుత్తముడనియు పామరజనులు సహితము నమ్ముచున్నారు.

మతాన్నిబుద్ధిబలంతో అంగీకరించి గౌరవించాలి.

పరమ భక్తివలన మానవుడు భగవంతుని యొక్క స్వరూప స్వభావగుణవిభూతులను విచారించి భగవంతుడెంతటి వాడైయుండు ననియు తత్త్వముగా నెరింగి పిమ్మట భగవంతుని యందుప్రవేశించును.

పుట్టితే నవాబై పుట్టాలి. లేదా గరీబై పుట్టాలి.

పండే భూమి ఎల్లపుడూ వర్షాన్ని గుండెల్లో పొరిసలితెచ్చే మబ్బుల కోసం ఎదురు చూస్తుంటుంది. అలాగే ప్రజలెప్పుడూ సుఖశాంతులతో కూడి తమకు రక్షణనివ్వగలినటువంటి ప్రభుత్వాన్నే ఆశిస్తారు.

దేవుడు సృష్టించిన ప్రతీదానిలో ఏదో లోపం వుంటుంది.

ఇంద్రియాలవల్ల లభించిన విషయరూపాన్నాధారం చేసుకొని మనసు గతించినదాన్ని ఊహించుకుంటూ అదే సుఖం అనుకుంటుంది.

పాండిత్యాన్ని పెంపొందించే దానికంటె శీలాన్ని తీర్చిదిద్ద గలిగిందే నిజమైన చదువు.

"తెలుగులో అపూర్వ మేధావంతులు చేసిన స్వతంత్ర రచన మనం నేర్చుకుని మన్నించ తగ్గదిలేదు" అని ప్రతి గొప్ప తెలుగువాడికీ విశ్వాసం. తాను తక్కిన తెలుగుమూకకంటె గొప్పవాడవడంచేతనే అల్లాంటి విశ్వాసం కుదుర్చుకో గలిగానని వాడివూహ.

భూమికోసం ధర్మరాజూ, భీష్ముడూ పోట్లాడి అక్షౌహిణులను చంపితే యల్లయ్యచౌదరీ పుల్లయ్యరెడ్డి భూమికోసం ఎందుకు చంపుకో కూడదు?

సమస్త కర్మలను నిష్కామముగా నెల్లపుడు నాచరించువాడు దేవునియందు నియమింపబడిన మనస్సుగలవాడై భగవంతునియను గ్రహమువలన నిత్యమైనదియును శాశ్వతమైనదియునగు భగవంతుని యొక్క ప్రాప్యస్థానమును పొందుచున్నాడు.

జ్ఞానహీనులకంటె జ్ఞానాధికులైన వారికి విధిగానుండు కృత్యము లధికముగానుండుననుట సమస్త వివేకి జనాదృతమైన నిర్వివాదాంశము.

భగవంతుడు మన కవయవములనుగాని, బుద్ధినిగాని, జ్ఞానమునుగాని, నిష్ప్రయోజనముగా నిచ్చియుండలేదు. మనకాయన ప్రసాదించిన ప్రతి సాధనమును మనము క్రమముగా నుపయోగించి దాని వలన ఫలములను మనము పొందుటయేగాక, లోకమునకుకూడా కలుగ చేయుట మనకు ముఖ్యకర్తవ్యము.

ఏమార్పునైనా అంగీకరించే టంతటి దుస్థితి పడితే తప్ప సమాజంలో మార్పుతేవాలంటే అబద్ధాలతో నచ్చచెప్పాలి.

దుర్మార్గుల్ని దండించడంవల్ల పంటపొలాల్లోంచి కలుపు మొక్కల్ని తీసివేసినందువల్ల కలిగేటంత లాభంకలుగుతుంది.

జీవితంలో ఎవరికేం కావలసినాసరే ప్రయత్నమనే రుసుము చెల్లించి పొందవచ్చు.

పుడుతూనే వెలుగు చీకటిని నశింప చెయ్యలేదు.

కర్మల నన్నింటిని భగవంతునికి అర్పణము గావించి భగవంతునే పరమ ప్రయోజనముగా నుద్దేశించి అతని ధ్యానరూపమైన బుద్ధియోగము నాశ్రయించి ఎల్లప్పుడును భగవంతునియందు చిత్తము గలవాడవు కమ్ము..

మనగొప్పతనాన్ని మెచ్చుకునే మనిషికంటె మనబలహీనతలను చూచి జాలిపడి సలహా చెప్పేడివారు నిజమైన స్నేహితులు. కొందరు పరీక్షాధికార్లని హఠాత్తుగా కలుసుకుని జబ్బపట్టుకుని క్షూర్చోబెట్టి వాళ్ళిచ్చిన ప్రశ్నలే వాళ్ళకిస్తే ఫేలవుతారు.

చంపినవాడు ఏవిధముగాను బాగుపడడానికి అవకాశ మియ్యని పురిశిక్ష సర్వవిధాల నింద్యమే.

విద్యయందును, నాగరికతయందును, బుద్ధియందును, జన

సామాన్యము స్థితిబాగుపడిననే దేశాభివృద్ధి యనబడును. కాని యెవ్వరో కొందరు మహోన్నత దశనుపొంది తక్కినవారు హీనదశయందు ఉన్నంతవరకునూ దేశాభివృద్ధి కలుగుచున్నదని యెంతమాత్రమును చెప్పవల్లకాదు.

కోపం నవ్వును అణచివేస్తుంది. సంతోషాన్ని సర్వనాశనం చేస్తుంది.

మానవుడు భగవంతునియందు మనస్సును నిలిపినవాడైన అతని యనుగ్రహము వలన సమస్త దుఃఖములను దాటగలడు. అహంకారము వలన భగవంతుని మాటలు వినకపోయిన యెడల చెడిపోవును.

చేయవలసినదేదో సమయంలోచెయ్యడంఅవసరం. అంతా మించిపోయిన తరువాత యెంతచక్కటి పరిష్కారమార్గాన్ని కనుగొన్న అందువల్ల లభించేఫలితం చాలాతక్కువ.

మంచివసతి, దుస్తులు, తిండి సమకూర్చినా గుంపుగుంపే.

జాతి నిష్కారణంగా పతనంకాదు. ఆత్మహత్య చేసుకుంటేనే తప్ప.

మతవిషయంలో నిజమును తెలుసుకోవడం కష్టసాధ్యం. కనక ఉపేక్షించి మిన్నకుంటే మంచిది. మిన్నకుండడం పాపముకాదు. ద్వేషించడము పాపము.

ద్వేషించడము తెలియకపోవడం గొప్పతనంకాదు. ఆడంబరాలను, అసూయలను, అసహనాన్ని, అన్యాయాలను ద్వేషించలేనివాడు మనిషికాలేడు. కాని ఆద్వేషం స్వరూపంవేరు. అందులో సానుభూతి వుండాలి.

ఒకప్పుడు స్త్రీచేత రచింపబడితేసరి పుస్తకం అచ్చు పూవుడే. అందు కనే కొందరుపురుషులు తమరే పుస్తకాలువ్రాసి అవిపైవారు ఆమోదం పొందవేమోఅని భయం నివారించుకునేందుకు స్త్రీలపేరిట అచ్చువేస్తూ ఉంటారు.

యంత్రరూపమైన శరీరములపైనున్న సమస్తభూతములను సర్వేశ్వరుడు తనయొక్క త్రిగుణాత్మకమగుమాయచేత పరిభ్రమింపచేయుచు సర్వభూతముల యొక్క హృదయ ప్రదేశమందు విలసిల్లుచున్నాడు.

అధికారం చేతిలోవున్నావాడల్లా దొంగే అవుతాడు.

సర్వజనాదరణీయములగు పరమార్థములను మనసులకు నాటునట్లుగా సులభ గ్రంథరూపమున దేశభాషలయందు బోధించుచు వచ్చినచో మనుష్యులు మృగప్రాయులగుటమాని యొకదేవత గుడిగుమ్మము వద్దనుండి మరియొక దేవతవాద్యములతో పోగూడదని వెర్రిభ్రమయందు పడక వివేకముగల వారివలె నడుచుకొందురు.

హృదయ కమలము నందుండెడి సర్వేశ్వరునే సర్వప్రాకారములుగా మానవుడు శరణము పొందవలెను. అట్టిభగవంతుడి అనుగ్రహము వలన ఉత్తమమైనదియు శాంతికలిగి శాశ్వతమైన మోక్షమును పొందును.

చరిత్రలేని ప్రజకాలాన్నించి విముక్తిచెందదు. కాలంఅనేది అమాయకంగా ఎవర్నీపట్టించుకోనట్టు సాగిపోతుందికాని కదిలే ప్రతిక్షణమూ, ప్రతిమనిషి జీవితాన్ని రంపంలాగా కోస్తూ అరగదీస్తుంటుంది.

జీవితమే ఒకప్రయోగం. నీవుఎన్ని ప్రయోగాలు చేస్తే అంత మంచిది.

అడిగినా అడగకున్నా, సత్పురుషులకు ఉచితరీతిగా సత్కారములుచెయ్యాలి.

మంచితనానికి శత్రువు ఒకటే — అదే దుర్మార్గం. కాని దుర్మార్గానికి శత్రువులురెండు. ఒకటి తనకు తానేశత్రువు, రెండవది మంచితనం.

టెక్స్టుబుక్కు అనగా ఒకతద్దినం. అదితప్ప కడంవి అన్నీ బాగుంటాయంటాడు కుర్రాడు.

పశువులుగా ఉంచినంతకాలం వాళ్ళనణచడానికి కర్రేసాధనం. కానివాండ్లకు జ్ఞానవృద్ధిచేస్తే మాటలతోనే అదుపులోవుంచవచ్చు.

ఒక ఆలోచనకు ఒకవస్తువు మధ్యవర్తివంటి చిత్రపటం.

కర్మజ్ఞాన భక్తిస్వరూపములును, మోక్షసాధనములను, భగవంతుని యారాధన రూపములును నైన సమస్తకర్మలను పరిత్యజించి ప్రాప్యుండైన భగవంతుని శరణము పొందుము. శరణము పొందిభగవంతునికి ప్రసన్నుండవైన మోక్షవిరోధములైన పాపము అనంతములై యుండినను ఆసర్వపాపములనుండి భగవంతుడు మానవుని విడిపించగలడు.

చక్కనిదేశభాషా గ్రంథములు పుట్టువరకునూ భాషవృద్ధి చెందుచున్నదని చెప్ప వలనుపడదు. భాషాభివృద్ధినిబట్టియే జనుల నాగరికతయు నభివృద్ధి చెందుచుండును.

మనకు ఆరోగ్యం బాగవాలంటే వ్యాధి ముదరాలి. ఈలోకం నాశనమయిన కోటీశ్వరుడు కట్టించిన ఆసుపత్రి. ఇక్కడ మనం బాగుంటే ఆపేక్షతో ఉక్కిరిబిక్కిరై చస్తాము.

అక్షరాలు, అంకెలు యివి ప్రతిమనిషికి ఉండవలసిన రెండు దివ్యనేత్రాలు.

శ్రీకృష్ణ పరమాత్ముడు అర్జునునికి ఉపదేశించిన గీతాశాస్త్రమును తపస్సులేనివాడు, భక్తిహీనుడు, శుశ్రూషలు చేయనివాడు, భగవంతుని దూషించెడివాడు అగువారలకు ఉపదేశించకూడదు.

లేమి అనేది నేరంకాకపోయినా లేమితో కుమిలేవాళ్ళను చూస్తే అందరికి అలుసేమరి. అందుకే కొందరు లేమిని పైకి కనబరచరు. అయితే వాళ్ళనుచూచిలోకం "యింట్లో యీగలుమోత" అనకుండా వుండలేదు.

మనల్ని ఉక్కిరిబిక్కిరిపడేటట్లుచేసిన భావాలతో మనకు పరిచయమయిన రోజును జీవితంలోకల్లా ముఖ్యమైనవిగా పరిగణించాలి.

శిక్షావిధానంలో మరణదండన వుండరాదు.

వయసులోవున్నపుడు, ఆతర్వాత సుఖంగా బ్రతకడానికికావలసి నంతసాధన సంపత్తి సమకూర్చుకొనే యత్నంలో కాలాన్ని వ్యర్థం చేసుకుంటాము. ఆతరవాత అనుకున్నట్లు బ్రతకటానికి కాలంమించి పోయిందని తెలుసుకుంటాము.

మనసు కంటికి కన్పించదు. అలాంటి మనసులో ఏమన్నా అంశముగాని, వృత్తాంతముగాని వుంటే అవి అంతకంటె కనబడవు.

ఫలాపేక్షలేకపోతే పాపకర్మలు చేయడానికి ప్రోత్సాహమేలేదు.

పరమ రహస్యంబయిన గీతాశాస్త్రమును ఎవడు భగవంతుని భక్తులకుపదేశించునో అతడు భగవంతునియందు పరమభక్తి గలవాడై నిశ్శంశయముగా భగవంతునే పొందుచున్నాడు.

విద్యావంతులు దేశమునకు జేయవలసిన కృత్యములను చెప్పుటకు ముందు నిజముగా విద్యావంతులనగా నెట్టివారో పరిశీలించవలసి

యున్నది. చదువునకును, జ్ఞానమునకును మిక్కిలి భేదమున్న
ఎందునకుం బనికిరాని పురాణగాథలతో, సత్యమునకు చాలా దూర
లగు విరుద్ధ కల్పనములతోను, పిట్టకథలతోను మనస్సులను ని
మాత్రాన జనులెప్పుడునూ జ్ఞానవంతులు కానేరరు.

ధర్మోపేతంబైన కృష్ణార్జునుల సంవాద రూపమైన గీతా
మును పారాయణము చేయువాడు భగవంతుని జ్ఞానయజ్ఞముచేత
ధించువాడగుచున్నాడు.

వర్తమానం, గతం భవిష్యత్తులోనే యిమిడివున్నాయి.

మంచీ అనే మేలి ముసుగులో దాక్కొని చెడుచేసేవాడు ప
పొదలో దాక్కొని పక్షులకై వలపన్నే విషమకుసుమము లాంటివాడు

హృధయంపల్లనే వ్యక్తులంతా కవులవుచున్నారు.

చెడ్డవాళ్ళను మంచితోవను పెట్టడమే రాజు అనే వాడు చే
వలసినపని. ఆవుద్దేశముతోనే రాజు చెడ్డవాళ్ళకు శిక్షవిధించాలి.
కారబుద్ధితో, అధికారంతో, అహంకారంతో శిక్షవిధించకూడదు

భగవంతుని దృష్టిలో నిజాయితీగల మనిషి మణికి
వంటివాడు.

వయోభ్యాసాన్నిబట్టి, జ్ఞానైశ్వర్యాన్నిబట్టి, మానవులకి అభిరు
వుంటాయి.

పరలోకంలో అందరికీ స్వర్గమిస్తామని చెప్పినా యీ లోక
కూడా అందరూ భాగ్యంకావలెనంటారు. కాని బీదరికం కా
ఎవరూ అనరు.

ఆగ్రహం చాలా ఖరీదు అయిన విలాస వస్తువు. ఎక్క
రాబడివున్నవారే ఆగ్రహపూరితులు కావచ్చు.

ఏపురుషుడు శ్రద్ధకలిగి అసూయా రహితుండై గీతాశాస్త్రం
ఏచున్నాడో వాడు సమస్త పాపములనుండి విముక్తుడై పుణ్యవంతు
డెడి శుభకరమైన లోకమును పొందును.

ఆ నొప్పింపక తానొవ్వక తప్పించుకు తిరుగువాడు ధన్యుడు.

ఆ కాలాతీతమైన అద్భుత క్షణాల సమీకరణ చరిత్ర.

ష ఆత్మకు ఆభరణంలాంటి ప్రేమహృదయంలో కరువైనపుడు
ఒంచే అందాలు ఎన్నున్నా ప్రయోజనం లేదు.

రే దేవదూతలకు కూడా గర్వం నష్టం కలిగిస్తుంది.

బాధలోంచి తీసిన పాఠమే అనుభవం.

విద్యాధిలాభములు మనుష్యున కెంతఎక్కువగా నుండునో
తఎక్కువగా నతడు దేశాభివృద్ధికై పాటుపడవలసి యుండును.
ంచములోని సమస్త జంతువులును తమసుఖమునకై మాత్రం పని
ంచుండుటయు మనుష్యడొక్కడునుమాత్రం తనసుఖము నిమిత్తమే
యితరుల సుఖము నిమిత్తము కూడా పాటుపడవలయుటయు
ఆన్మతము.

కృష్ణార్జునుల సంవాద రూపమయిన గీతాశాస్త్రము మిక్కిలి
్చర్యకరమయినది. తలచునప్పుడెల్ల పులకరింతను కలుగచేయును.
పృతమైనది. పావనంబైనది. దీనిని స్మరించి, స్మరించిన యెడల
నవు డుప్పొంగును. ఆశ్చర్యకరమైన విశ్వరూపమును తలచి తలచి
నవుడు పులకాంకితుడగును.

శుభం శుభం శుభం

జనగణమన అధినాయక జయహే
భారత భాగ్యవిధాతా!
పంజాబ, సింధు, గుజరాత, మరాఠా,
ద్రావిడ, ఉత్కళ, వంగా!
వింధ్య, హిమాచల, యమునా, గంగా,
ఉచ్ఛల జలధి తరంగా!
తవశుభ నామే జాగే!
తవ శుభ ఆశిషమాగే
గాహే తవ జయ గాథా!
జనగణ మంగళ దాయక జయహే
భారత భాగ్యవిధాతా!
జయహే! జయహే! జయహే!
జయ జయ జయ జయహే!

# పరిశుద్ధ జీవితము

మలిన, విపత్కర, పాపభూయిష్టమయిన పరిస్థితులలో కొట్టుమిట్టాడుతున్న ప్రపంచములో పరిశుద్ధజీవితము గడపడం కష్టమయినా ఈ క్రింది ప్రకారము మును కొంతవరకైనా పవిత్రముగా గడపడం అవసరం.

"యిందుగలడందులేడని ఎందెందు వెదకిచూసిన అందందేకలడు" అని గణించిన భగవంతుని ఎవరికేర్పరచిన ధర్మాలప్రకారము వారు నిత్యమూ సారైనా నిశ్చలమనస్సుతో ప్రార్థించుచూ, తల్లిదండ్రులను దైవసమానులుగా స్తూ, జీవితము తమకప్పగించిన వృత్తివ్యాపారాదులను ధర్మముగా, నీతిగా ర్తిస్తూ, తనకున్న శక్తిమేరలో దానధర్మాలు చేస్తూ, యిరుగుపొరుగు వారికి పర పరిస్థితులలో తోడుపడుతూ, అన్నిమతాలను సమానదృష్టితో అవలోకిస్తూ, దయాల్ని విశాలభావాలతో నింపి తోటివారిని ఆదరిస్తూ, మాతృభూమి రక్షణా తోచినంత పరిధిలో చేయూతనిస్తూ జీవితాన్ని సాధ్యమయినంత వరకూ మముగా గడుపుతూయున్న మానవులు సుఖసంపదలతో విరాజిల్లడమే కాకుండా క్షమును సాధించుటకు వీలగుతుంది. అట్టివారు ఈ జన్మలో ఆ అవకాశము లేక నా వచ్చేజన్మలోనయినా మోక్షము సాధించి ఆముక్తులగుటకు సావకాశ ముంది.

ఎ. వి. సత్యనారాయణరాజు